# పడవ మునక

(నవల)

రవీంద్రనాథ టాగూరు



శ్రీ నిత్యకళ్యాణి పబ్లిషర్స్
విజయవాడ-2

2

ముద్రణ :

62, అక్టోబరు

సోమేశ్వర ప్రింటింగ్ ప్రెస్,

విజయవాడ-2.

వెల : **5-00**

అనుసరణ :

# కమలాసనుడు

# ఒక మాట

మనకు చాలమంది మహోత్తమ కవులు, కథకులు, నాటకకర్తలు, నవలాకారులు, గాయకులు, శిల్పులు, సంఘ సంస్కర్తలు, తాత్వికులు, మానవసేవా పరాయణులు వున్నారు. అయినా వారు ఒక్కొక్క రంగంలో పరిమిత మైన ప్రతిభనేగాక అపారమైన విశేషాన్ని ప్రకటించి అగ్రగణ్యులైనారు. కాని యివి జీవితంలో దేనికదిగా భాగమేకాని సర్వంకాదు. అలా సర్వ సమగ్ర జీవితంలో అన్నిటామేటిగా పేరొందిన మహాపురుషుడు రవీంద్రనాథ ఠాగూరు, వారి ప్రతి రచనలో నవలకానీండి, కథకానీండి ప్రతిదానిలో పాత క్రొత్తల మేలికలయిక విశ్వమానవతా వాదాన్ని తెలియజేస్తుంది. ఈ 'పడవమునక' నవల 1910 లో రచించారు.

మా ప్రచురణలకు చేయుతనిస్తున్న సోదర ప్రచురణ కర్తలకు, పుస్తకవిక్రేతలకు, మా ప్రచురణలను ఆదరిస్తున్న ఆంధ్రప్రజావళికి మా నమోవాకాలు.

ఇట్లు

ప్రచురణకర్తలు

# రవీంద్రుని జీవిత ఘటనలు

రవీంద్రుడు క్రీ॥ శ॥ 7 మే 1861 లో జన్మించారు. తండ్రి మహర్షి దేవేంద్రనాథ ఠాగూర్, తల్లి శారదాదేవి, వీరిసంతానం మొత్తం పదిహేనుమంది. రవీంద్రుడు వీరిలో 14 వ బిడ్డ, 8 వ పుత్రుడు.

1873 వ సంవత్సరమునుండియే నాటకములు, పద్యములు వ్రాయుచుండెను. ప్రథమ పద్యకావ్యము 1878 వ సంవత్సరములో రచించెను. ఈ 'పడవమునక' నవలను 1910 వ సంవత్సరములో రచించెను.

డిశంబరు 1883వ సంవత్సరములో మృణాలినీదేవితో వివాహము జరిగెను. ఈమె నవంబరు 1902 సంవత్సరములో స్వర్గస్థులైరి.

డిశంబరు 1901వ సంవత్సరములో శాంతినికేతనముస్థాపించెను.

నవంబరు 1913లో గీతాంజలికి స్వీడిష్ నోబుల్ బహుమానము (లక్ష యిరవై వేలు రూపాయలు) వచ్చెను.

డిశంబరు 1921లో విశ్వభారతి స్థాపించెను.

7 ఆగష్టు 1941 లో నిర్యాణం.

—(0)—

5

# 1

రమేష్ లాపరీక్ష ప్యాస్ అవటాన్ని గురించి ఎవరికి ఎలాంటి సందేహమూ లేదు. చదువులతల్లి తన బంగారు పద్మంలోనుంచి అతనిపైకి పుష్పవృష్టి కురిపిస్తుంది. అతనికి మెడల్స్, స్కాలర్‌షిప్పులు ప్రసాదిస్తుంది.

ఈ పరీక్షలు అయిపోయిన తరువాత రమేష్ యింటికి వెళ్ళవలసివుంది. అయితే అతనికి యీ ప్రయాణంలో అంత ఉత్సాహం వున్నట్టులేదు. ఇంకా పెట్టేబేడా సర్దుకోలేదు. అతని నాన్నగారు "తక్షణం బయలుదేరి రమ్మని" ఉత్తరాల వర్షం కురిపించారు. దానికి రమేష్ పరీక్షాఫలితాలు తెలిసిన వెంటనే తప్పకుండా వస్తున్నానని జవాబు వ్రాశాడు.

ఆనందబాబుగారి కుమారుడు జోగేంద్ర, రమేష్‌కు సహాధ్యాయి. వాళ్ళ యిద్దరి ఇళ్ళూ దగ్గరనే వున్నాయి. ఆనందబాబు బ్రహ్మసమాజానికి చెందినవాడు. ఆయన కుమార్తె హేమాలిని యిటీవలనే మొదటిపరీక్షకు కూర్చుంది. రమేష్ వాళ్ళఇంటిని విడవకుండా వెడుతూ వుండేవాడు. ప్రతి రోజూ 'టీ' సమయానికి తయారవుతూవుండేవాడు. తతిమ్మా సమయాల్లోకూడా గంటలకొద్దీ అక్కడే కనిపిస్తూ వుండేవాడు. కనుక, టీ ఒక్కటే ఆకర్షణ అని చెప్పటానికి వీల్లేదు.

హేమాలిని స్నానంచేసిన తర్వాత జుట్టు ఆరబెట్టు కుంటూ డాబామీద పచార్లుచేస్తూ వుండేది. అలా పచార్లు

చేస్తూనే చదువుకుంటూ వుండేది. రమేష్‌కూడా అదే మోస్తరుగా పుస్తకంచేతపుచ్చుకొని మెట్లవరసమీద కూర్చునే వాడు. ఒంటరిగా చదువుకుంటూండేవాడు. అటువంటిచోటు ప్రశాంతంగా చదువుకోవటానికి చాలామంచిదే. కాని, కొద్దిగా ఆలోచించిచూస్తే అక్కడకూడా కొన్ని చిక్కులు కనిపిస్తాయి.

ఇంతవరకు ఇరుపక్షాలనుండికూడా వివాహప్రస్తావన లంటూ యేమీ జరగలేదు ఆనందబాబు యీ విషయం ఎత్తకుండా వుండటానికి ఒక కారణం వుంది. ఆయనకు ఎరిగిన యువకుడు ఇంగ్లండులో "లా" చదవటానికి వెళ్ళాడు. ముసలాయన ఆ యువకుడే తనకు అల్లుడు అవవచ్చునని అంచనా వేసుకుంటున్నాడు.

ఒకనాడు మధ్యాహ్నం టీ సమయంలో పెండ్లిమాటలు వచ్చాయి 'అక్షయ' పరీక్షలు ప్యాస్ అవడంలో అంత తెలివైనవాడు కాడు గాని, మాటలు విసరడంలో మటుకు దిట్ట. అందుకని అతనుకూడా తరుచు హేమనళిని వాళ్ళ ఇంటికి తయారవుతూ వుండేవాడు. అత నొకసారి మగవాడి బుద్ధి బాకులాంటిదనీ, ఆడదాని బుద్ధి పేనాకత్తి వంటిది మటుకేననీ అందుకనే దానివల్ల యేమీ ప్రమాదం లేదనీ వాదించాడు.

హేమనళిని అక్షయబాబు వాదనకు ఏమీ మాట్లాడ లేదు కాని, ఆమె అన్న జోగేంద్రమటుకు ఆడవాళ్ళ బుద్ధిని కించపరుస్తూ మాట్లాడసాగాడు. దాంతో రమేష్‌కు కోపం వచ్చింది. ఆడవాళ్ళ సద్గుణాలన్నీ ఒక్కబిగిని కీర్తించాడు.

ఇలా ఆడవాళ్ళను గురించి శ్లాఘిస్తూ రమేష్ మరో రెండు కప్పుల టీ కూడా త్రాగాడు. ఇంతలో అతనికో ఉత్తరం అందించాడు నౌకరు. ఆ ఉత్తరం చదువుకుని తండ్రిగారి దగ్గర్నుంచి వచ్చిందని తెలుసుకుని, వాద ప్రతి వాదాలు యింకా మధ్యలోనే వున్నా తనుమాత్రం ఓటమిని స్వీకరించి వెళ్ళిపోవటానికి పైకి లేచాడు. అతనలా వెళ్ళిపోవ టానికి వీల్లేదని స్నేహితులంతా ముక్తకంఠంతో గొడవ పెట్టారు. అప్పుడతను, తండ్రిగారు యిప్పుడే తమ ఊరునుంచి వచ్చారని, వెంటనే తనను రమ్మని చీటి పంపారనీ చెప్పాల్సి వచ్చింది.

హేమాలిని జోగేంద్రతో "రమేష్‌నాన్నగారిని మన ఇంటికే రమ్మను. ఓకప్పు టీ తీసుకు వెడతారు..." అంది.

"ఎందుకు అనవసరంగా మీకు శ్రమ. నేనిప్పుడు వెడుతూనే వున్నాగదా!" అన్నాడు రమేష్ మధ్యలోనే అందుకుని.

అక్షయ మనసులో సంతోషించాడు. "ఆ ముసలాయన యిక్కడ యేమీ పుచ్చుకోడు" అన్నాడు.

ఆనందబాబు బ్రహ్మసమాజకుడు, రమేష్‌నాన్నగారు సనాతన బ్రాహ్మణుడూ కదామరి!

రమేష్ తండ్రి, వ్రజమోహనబాబు కొడుకుతో "రేపు ఉదయం రైలుబండిలో నువ్వు నాతోపాటు యింటికి రావాలి!" అన్నాడు.

రమేష్ తలగోక్కున్నాడు. "ఏమిటంత తొందరపని?" అన్నాడు.

"ప్రత్యేకించి యేమీ లేదులే" అన్నాడు బ్రజమోహన బాబు.

రమేష్ తండ్రివంక కారణం యేమయివుంటుందా అని ఆదుర్దాగా చూచాడు. కాని తండ్రికి కుమారుడి ఉత్సుకతను సంతృప్తిపరచడం అంత అవసరం అనిపించినట్టు లేదు.

సాయంత్రం తండ్రిగారు తన కలకత్తా స్నేహితులను చూడటానికి వెళ్ళినమీదట, రమేష్ ఆయనకో ఉత్తరం వ్రాయనారంభించాడు. "మహారాజశ్రీ తండ్రిగారి పాదపద్మములకు—" అని ఆచారం ప్రకారం వ్రాసిన తరువాత, అక్షరమొక్కటయినా ముందుకు నడిచింది కాదు. హేమాలినికీ, తనకూ యింకా అక్షరరూపం దాల్చని అనుబంధం వున్నదనీ, దీన్ని యింకా తండ్రిముందు దాచి ప్రయోజనం లేదనీ, ఎంత గట్టిగా అనుకున్నా, కాగితంమీద కలం పెడితే ముందుకు జరగడమే కష్టమైపోయింది. రకరకాలుగా అనేక ఉత్తరాలు ఊహించి వ్రాశాడు. కాని చివరకు వాటన్నిటినీ చింపి పారేశాడు.

బ్రజమోహన్ భోజనానంతరం హాయిగా నిద్రపోయాడు, రమేష్ డాబామీదికి ఎక్కి పక్కయింటిమీదికే దృష్టి నిలిపాడు. తొమ్మిదిగంటలకు అక్షయబాబు వెళ్ళిపోయాడు. తొమ్మిదిన్నరకు వీధిగుమ్మం తాళంవేశారు. పదిగంటలకు ఆనందబాబుగారి యింటి ముందుగదిలో దీపం ఆరిపోయింది. పదిన్నరకల్లా ఇల్లంతా గాఢంగా నిద్రపోతోంది.

రమేష్ మరునాడు ఉదయమే తప్పనిసరిగా కలకత్తా

వదిలి వెళ్ళవలసివచ్చింది. వ్రజమోహనబాబు అతనికి శైలు అంగకుండాపోయే ఆఖరు అవకాశాన్నికూడా కల్పించ కుండా జాగ్రత్తపడ్డాడు.

## 2

ఇంటికి వచ్చిన తరువాత రమేష్‌కు, తనకోసం ఒక పెళ్ళికూతురు సిద్ధంగా వున్నదనీ, తన పెళ్లిముహూర్తంకూడా స్థిరపడిపోయిందనీ తెలిసింది. వ్రజమోహన్ తన యౌవ్వనంలో కొన్ని చెడుమార్గాలలో పడిపోయాడు. తరువాతయినా, ఆయన బాగుకు కారణం ఈషన్ అనే ప్లీడరు. ఈయన వ్రజమోహన్‌కు చిన్ననాటి స్నేహితుడు. ఈషన్‌కు అకాలమృత్యువు దాపురించింది. ఆయన చనిపోయిన తర్వాత లెక్కచూస్తే, ఆస్తికంటే అప్పులే ఎక్కువ వున్నాయి. అతని విధవభార్య, ఏకైకపుత్రిక దిక్కుమాలిన వాళ్ళయినారు. ఈ అమ్మాయికి యిప్పటికే పెళ్ళియీడువచ్చింది. వ్రజమోహన్ రమేష్‌కోసం ఎంచివుంచిన పెళ్ళికూతురు యీ అమ్మాయే. రమేష్ శ్రేయోభిలాషులు కొందరు యీ సంబంధానికి అభ్యంతరం చెప్పారు. కారణం తాము విన్న వార్తలనుబట్టి అమ్మాయి అనాకారంగా వుంటుందని. ఇలాంటి విమర్శలకు వ్రజమోహన్ ఒకటే జవాబు చెబుతాడు: "ఆకారాన్నిబట్టి పుష్పాలను, సీతాకోక చిలుకలను ఎంచవచ్చునుగాని మనుష్యులను మాత్రముకాదు. ఈ అమ్మాయి తల్లిపోలికలో మంచి ఇల్లాలే అయి, ఇంటి పనులన్నీ చక్కగా చేసుకోగలిగితే, రమేష్‌కు యింతకంటే అదృష్టం

యింకేం కావాలి?

ఈ పెళ్లివిషయం విన్నప్పటినుంచి రమేష్ హృదయం చెదిరిపోయింది. పిచ్చెక్కినవాడిలాగా ఊరంతా తిరగటం మొదలెట్టాడు. ఈ పెళ్ళి తప్పించుకోవటానికి యేదో మార్గం కనిపెట్టాలనుకున్నాడు. కాని యేదీ సుగమంగా తోచడంలేదు. చివరకు ధైర్యం కూడగట్టుకుని "నాన్నగారూ! ఈ అమ్మాయిని నేను వివాహం చేసుకోలేను. నేను యిదివరకే యింకొకరికి వాగ్దానం చేసివున్నాను" అన్నాడు.

"అదేం కుదరదు. మీ కిద్దరికీ యిదివరలో ప్రధానం అవలేదుగద!" అన్నారు తండ్రిగారు.

"అవలేదనుకోండి అయినా..."

"పిల్ల తల్లిదండ్రులతో మాట్లాడావా? ఏమయినా స్థిరం అయిందా?"

"మాట్లాడలేదు. కాని..."

"సరే! ఇక దాన్నిగురించి బెంగపడాల్సిందేముంది? ఇంతవరకేమీ మాట జారలేదుగద! ఆ విషయం మరచిపోవడమే మంచిది'' అన్నాడు తండ్రి.

కొద్దిసేపు ఆలోచించి, రమేష్ చివరి అవకాశంగా తండ్రితో యిలా అన్నాడు: "మరో అమ్మాయిని వివాహం చేసుకుంటే, ఆ అమ్మాయికి అన్యాయం చేసినవాడినవుతాను."

వ్రజమోహన్ ''నేను కుదిర్చిన అమ్మాయిని చేసుకోకపోతే, మరింత అన్యాయం చేసినవాడివవుతావుగా!' అన్నాడు.

రమేష్ యింకేమీ మాట్లాడలేకపోయాడు. మరో అవకాశం వుంది. ఏదో యాదృచ్ఛికంగా ఒక సంఘటన జరిగి యీ వివాహం జరగకుండా వుండాలి.

జ్యోతిష్కులు చెప్పిన మాటలప్రకారం, యీ వివాహ ముహూర్తం గడిచినమీదట మరో సంవత్సరకాలంవరకూ ముహూర్తాలనేవేలేవు. అందుచేత ఎలాగయినాసరే యీ ముహూర్తం దాటుకుంటే, మళ్ళీ సంవత్సరంవరకు తినరు యిబ్బందిలేదు అనుకున్నాడు రమేష్.

వధువు చాల దూరప్రాంతంలో వుంటుంది. అక్కడికి వెళ్ళాలంటే నదులు దాటి వెళ్ళాలి. ప్రయాణం ఎంత సూక్ష్మంగా చూసుకున్నా మూడునాలుగు రోజులు పడు తుంది. ప్రయాణంలో వున్న యీ యిబ్బందిసబ్బందులన్నీ దృష్టిలో వుంచుకునే—వ్రజమోహన్ యింకా ముహూర్తం సరీగా వారంరోజులు ముందు వుండగానే, ఒక మంచివేళ చూచుకుని ప్రయాణసన్నాహం చేయించాడు. గాలి కూడా వాళ్ళకు అనుకూలంగానే వుండడంచేత మూడురోజులలోపు లోనే 'సిముల్ఘటా' చేరుకున్నారు. అంటే వివాహానికి యింకా నాలుగురోజుల పూర్తివిరామం వున్నదన్నమాట. అదీగాక యింతముందుగా రావడానికి మరో కారణంకూడా వుంది. పెళ్ళికూతురు తల్లి పరిస్థితి యీ కుగ్రామంలో యేమంత మెరుగ్గాలేదు. అందుచేత యిక్కడున్న కొద్దిపాటి ఆ స్థిరవిక్రయంచేసేసి ఆమెనుకూడా తనతోపాటు పట్టణానికి తీసుకువెళ్ళి జీవితాంతంవరకూ సంరక్షకుడుగా వుండి, తన చిన్ననాటి స్నేహితుడి ఋణం తీర్చుకుందామని వ్రజ

మోహనుడి ఆశ. తమకు సంబంధబాంధవ్యాలు యేర్పడకుండానే యీ ప్రతిపాదన తీసుకురావడం అసమంజసం. అందుచేత వ్రజమోహన్ యింతవరకూ యీ విషయాన్ని మనసులోనే వుంచుకున్నాడు. ఇప్పుడు వివాహసంబంధం నిశ్చయమైనతర్వాత ఆమెతో తన మనసులోని మాట చెప్పి అందుకు అంగీకారం పొందాడు. ఆమెకయినా యీ భూమి మీద మిగిలింది యీ ఒక్క అమ్మాయే కనుక ఆమె యిందుకు తక్షణం ఒప్పుకుంది. తన కుమార్తెకు తల్లిగా, తల్లిలేని అల్లుడికి పెద్దదిక్కుగా అక్కడే వుండటానికి అంగీకరించింది.

ఈ ప్రకారం వ్రజమోహనుడు వివాహానికి ముందు వున్న విరామాన్ని ఆవిడ యింటితాలూకు చిన్న చిన్న వస్తువులను కొత్త యింటికి బదలాయించటానికి వినియోగించాడు. పెళ్ళివారితో పాటు ఆమెకూడా తన యింటికే రావడానికి అంగీకరించిందికనుక, ఆమెకు సహాయంగా వుండటానికి కొంతమంది స్త్రీజనాన్నికూడా తీసుకువచ్చాడు

వివాహం సలక్షణంగా జరిగింది. కాని రమేష్ వివాహమంత్రాలు స్వచ్ఛంగా ఉచ్చరించలేదు. పెళ్ళికుమార్తెవంక చూడకుండా కళ్ళు మూసుకున్నాడు. అతని ముఖంలో ఏ శోభాన కళాకాంతులు లేవు. రాత్రి పడకగదిలో అమ్మాయివైపు వీపుపెట్టి గాఢంగా నిద్రపోయాడు. తెల్లవారుఝామునే ఆ గదిలోంచి బయటపడిపోయాడు.

అన్ని వేడుకలు అయినతరువాత, పెళ్ళివారు ప్రయాణమైనారు. ఒక పడవలో ఆడవాళ్ళు ఎక్కారు. పెద్దవాళ్ళ

మరో పడవలో ఏకాకాస. మూడో పడవలో యువకులు, నాలుగవ పడవలో వివాహంలో పాల్గొన్న మేళగాళ్ళు, సంగీతవాద్యగాళ్ళు ఎక్కారు.

పగలంతా తీవ్రమైన ఎండ. ఆకాశంలో మేఘాలు లేవు. దిశ్చక్రంలో దట్టమైన పొగమంచు పట్టింది. నదీతీరాన వున్న చెట్లఆకులు అణుమాత్రమైన కదలడంలేదు. పడవ నడిపేవాళ్ళు చెమటలో స్నానం చేస్తున్నారు. సూర్యుడు యింకా పశ్చిమాద్రికి చేరుకోకముందే పడవవాళ్ళు వ్రజ మోహనుడితో "అయ్యా! ఇక్కడే పడవలు లంగరు వేయాలి. ఇంకా కొన్నిమైళ్ళ దాకా పడవలు ఆపుకునే రేవు లేదు."

కాని వ్రజమోహనుడు సాధ్యమైనంత త్వరగా ఇంటికి చేరుకోవాలనే తాపత్రయంలో వున్నాడు.

"ఇక్కడెలా ఆగుతాం? రాత్రి సగంవరకూ వెన్నెల వుంటుందిగదా! ఏకంగా "బాలుహాటా" చేరుకున్నాక లంగరు వేద్దురుగాని, అలా కానివ్వండి" అన్నాడు.

పడవ నడుస్తోంది. ఒకవైపు ఇసుకతిన్నెలు, మరోవైపు నదీతలం. పొగమంచులోనుంచి చందమామ బయటకు వచ్చాడు. తాగినవాడి కళ్ళలాగ చంద్రుడి ప్రకాశం మంద మందంగా వుంది. ఆకాశంలో యిప్పటికీ మేఘాలు లేవు. అయితే అకస్మాత్తుగా యీ స్తబ్దవాతావరణమంతా ఒక్క మారు గర్జించింది. ఉరుములు బయలుదేరాయి. వెనక్కు తిరిగిచూస్తే ప్రయాణీకులకు నదీతలం అతి ఉధృతంగా వున్నట్లు అగుపించింది.

పడవలోని జనం రకరకాలయిన ఆక్రందనలు చేశారు.

మరుక్షణంలో యేమయిందో ఎవరికీ తెలియదు.

ఒక సుడిగాలి పడవలను చుట్టుముట్టింది. ఎత్తికుదేశింది. అడ్డంవచ్చిన ప్రతిదాన్నీ తల్లక్రిందులు చేసేస్తోంది. అందరూ నిస్సహాయులై పోయారు.

# 3

ఆఖరకు వాతావరణంలో గందరగోళం ముగిసింది. తెల్లని చంద్రుని వెలుతురు యిసుక తెన్నెలమీద ప్రకాశిస్తోంది. నదీతలంమీద ఒక పడవగాని, ఆఖరుకు ఒక్కవిరిగిన చెక్కముక్కగాని కనిపించడంలేదు. అంతా ప్రశాంతంగా వుంది.

రమేష్‌కు తెలివివచ్చి చూచేసరికి అతనొక యిసుక తెన్నెమీద పడివున్నాడు. ఇంతవరకూ జరిగిందేమిటో నెమరువేసుకోవటానికి కొంత సమయంపట్టింది. అంతా కలలా మదిలో మెదిలింది. ఒక్కసారుగా చివాలున లేచి కూర్చున్నాడు. తనతండ్రి, బంధువులు, మిత్రులు అందరూ యేమయినారా అనేది మొదటిబెంగ. ఒక్కసారు చుట్టూ కలయజూచాడు. ఎక్కడా నరమానవుడువున్న ఆనవాలు అగుపించడంలేదు. నీటిపొడుగునా పరిశీలించి చూచాడుగాని యేమీ ప్రయోజనం లేకుండా పోయింది గంగానదికి ఉపనది అయిన ఈ పద్మనది రెండుపాయలనడుమ గాగ యిసుక తిన్నె తల్లిఒడిలో పిల్లలా అనిపిస్తోంది. రమేష్ యీ ద్వీపాన్ని ఒకపక్క వెదికిచూచాడు. తరువాత రెండవపక్కకు తిరిగాడు. అక్కడ యేదో ఎర్రని గుడ్డపేలికగా ఆనవాలు

కట్టింది. వడివడిగా అడుగులువేసిచూచాడు. అక్కడ—పెళ్ళి కూతురు మస్తాబులోవున్న ఒకఅమ్మాయి దాదాపు నిర్జీవంగా పడివుంది. యిసుకపైన నీళ్ళుతాగిన వాళ్ళకు ప్రథమ చికిత్స చేసి ఎట్లా ప్రాణం తిరిగి తెప్పించాలో రమేష్‌కు తెలుసు. ఎలాగయితేనేం అతికష్టంమీద ఆ అమ్మాయి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ప్రారంభించి, కళ్ళు తెరిచి చూచింది.

ఈసరికి రమేష్‌కు పూర్తిఅలసట వచ్చేసింది. కొన్ని నిమిషాలపాటు అచేతనంగా తయారయిపోయాడు. ఆ అమ్మాయిని ఏదయినా ప్రశ్నలువేసే వోపికకూడా లేదతనికి. ఆమె పరిస్థితిగూడా అంతగా సేవ్రుంది. ఆమెకు పూర్తిగా స్పృహరాలేదు. ఇట్లా కళ్ళు తెరిచిందో లేదో మళ్ళీ అలసటగా కళ్లు మూసుకుంది. రమేష్ ఆమెను మళ్ళీ పరీక్షించి ఊపిరి పీలుస్తూనే వున్నదని నిర్ధారణ చేసుకున్నాడు. ధవళమైన చంద్ర కాంతిలో రమేష్ ఆమెను అలా చాలాసేపు చూస్తూ కూర్చున్నాడు. వాళ్లు యిలా మొదటిసారి కలుసుకున్న సన్నివేశం ఎంతో విచిత్రంగా వుంది. ప్రాణానికీ మరణానికీ మధ్యనా అన్నట్లు – నదీమధ్యాన యిసుకతిన్నెమీద, యిక్కడే మొదటిసారిగా ఆమెను చూడడం ఎంత విచిత్రమైన విశిష్టమైన సన్నివేశం.

సుశీల చూడటానికి బాగుండదని అన్నదెవరు? రమేష్ సర్వమూ మరచిపోయాడు. అతనిలా అనుకున్నాడు. "పెళ్లి హడావడిలో నేను యీమెవంక చూడకుండా వుండడం కూడా మంచిదే అయింది. ఇప్పుడు యిక్కడ చూస్తున్న విధంగా, చూడటానికి అవకాశం వుండేదికాదు! ఆమెను

పునరుజ్జీవింపజేసి నాకు నేనే సరికొత్తజీవనం తెచ్చుకొంటు న్నాను. వివాహమంత్రాల బంధంవల్లకంటే యీ బంధం మా యిద్దరికీ మరింత ఆప్యాయత, పూర్ణప్రేమ యేర్పడు తాయి. ఆ తతంగాలన్నీ పెద్దలకోసంమటుకే. ఇప్పుడు యీమె నాకు సృష్టి ప్రసాదితంగా భావిస్తాను."

ఆ అమ్మాయి పూర్తిగా కోలుకుని లేచి కూర్చుంది. చీర సవరించుకుని తలమీదికి ముసుగు లాక్కుంది.

"పడవలో తతిమ్మావాళ్లు యేమయ్యారో నీకు తెలుసా?" అనడిగాడు రమేష్.

ఆమె యేమీ మాట్లాడకుండా తల ఊపింది.

'ఇలాగే కూచునివుండు. నేనిప్పుడే అలా పైకివెళ్లి యింకెవరన్నా వున్నారేమో చూచివస్తాను' అని రమేష్ పైకి నడిచాడు. ఆ అమ్మాయి జవాబేమీ చెప్పలేదుగాని ఆమె వణకుతున్న శరీరం "నన్ను ఒంటిగావిడిచి వెళ్ళకుమా!" అని చెప్పక చెప్తోంది.

రమేష్ ఆమెభావం అర్థంచేసుకున్నాడు. అక్కడే నిలబడి ఒకసారి దూరదృష్టి పరిపిచూశాడు. మిలమిల మెరుస్తున్న ఆ యిసుకతిప్పలమీద యింకే ప్రాణీ వున్నట్లు అగుపించడంలేదు తన స్నేహితులందరినీ పేరుపేరున పిలి చాడు. గొంతెత్తి అరిచాడు. కాని జవాబు శూన్యం.

తనశ్రమ అంతా నిష్ప్రయోజనం అయిన తరువాత రమేష్ కూలబడ్డాడు. అమ్మాయిముఖం చేతుల్లో దాచుకుని యేడుపు ఆపుకోడానికి ప్రయత్నిస్తోంది ఆమె ఎద్దుర్రొమ్ము, వెక్కి వెక్కి యేడుస్తున్నందువల్ల ముందుకూ వెనక్కూ

అనుకుతూంది. ఊరికే మాటలతో ఓదార్చటంవల్ల యేమీ లాభంలేదని అతనికి అనిపించినట్లుంది. రమేష్ ఆమె సరసనే కూర్చుని ఆమెతలను, మెడను మృదువుగా నిమిరాడు. ఆమె తనదుఃఖాన్ని ఆపుకోలేక పోయింది. హృదయం బద్దలయి పోయినట్లు బిగ్గరగా యేడ్చింది.

వాళ్ళు అలా తమ హృదయాలు కాళీ అయేంత వరకూ యేడ్చారు. అప్పటికి తెల్లవారవచ్చింది. అక్కడక్కడా వెలుతురు రేఖలు అగుపిస్తున్నాయి.

భయంతో వొణికిపోతున్న ఆమె చేతులను, రమేష్ తనచేతులలోనికి తీసుకున్నాడు. ఆమె అభ్యంతరం చెప్పలేదు. మానవ సహవాసంతప్ప ఆమెకు యితర భయాల సంగతి అంతగా అనిపిస్తున్నట్లులేదు. అందుచేత నిస్సందేహంగా అతని కౌగిలిలో యిమిడిపోయింది.

ఉదయతార కావడంలో ఆకాశం ఎర్రబడింది. రమేష్ యిసుకలోనే మెత్తగా పడుకుని నిద్రపోసాగాడు. పళ్ళికూతురు అతనిరొమ్ము దిండుచేసుకుని హాయిగా అతని సరసనే పడుకుంది. ఉదయతార వారి కళ్ళమీద వెచ్చగా కిరణాలు ప్రసరింపజేసింది. ఇద్దరూ నిద్రనుంచి మేల్కొంచారు. ఒక్కక్షణం ఇద్దరూ పరస్పరం విడ్డూరంగా చూచుకున్నారు. తరువాత హఠాత్తుగా యిద్దరికీ తమ నిజస్థితి గుర్తువచ్చింది.

*

ఇప్పుడు నదిమీద పడవలు నడుస్తున్నాయి. రమేష్ ఒకపడవ మాట్లాడి ఇంటికి ప్రయాణం కట్టాడు. అలా

బయలుదేరటానికి ముందు, తప్పిపోయిన తన మిత్రజాలం అందరినిగురించి, పోలీసులకు, వెదికే నిమిత్తం ఫిర్యాదుకూడా యిచ్చాడు.

ఈ పడవ రమేష్ గ్రామానికి చేరేసరికే, అతనికి పోలీసువాళ్ళు తన తండ్రి, అత్తగార్ల శవాలు, మరికొందరి బంధువుల శవాలు కనుగొన్నట్లు తెలిసింది కొందరు పడవ వాళ్ళుమటుకు ప్రాణాలతో మిగిలారు. తతిమ్మా వాళ్ళంతా స్వర్గస్తులయినట్లే—

రమేష్ ముసలి నాయనమ్మ మటుకు యింటిదగ్గరే వుంది. ఆమె వధూవరులిద్దరినీ పుట్టెడు దుఃఖంతో యింట్లోకి తీసుకువెళ్ళింది. ఈ పెళ్ళికి బంధువులు తరలివెళ్లిన అన్ని ఇళ్ళలోనూ దుఃఖం తాండవించింది. వధూవరులకు ఇంత కంటె గొప్పస్వాగతం లేదు. ఎవరూ కొత్తకోడలును పలుకరించలేదు. ఆమెదర్శనమే కొందరికి కంటకప్రాయమయింది.

అంత్యక్రియలు పూర్తవడంతోటే రమేష్ తనభార్యతో యీ గ్రామం వదలివెళ్ళి పోదాం అనుకున్నాడు. అయితే తనతండ్రి వ్యవహారాలన్నీ పూర్తిచేసేంతవరకూ కదలటానికి వీల్లేకుండా వచ్చింది. తన కుటుంబంలో కొంతమంది—మగ వాళ్ళు చనిపోయిన స్త్రీలు—తీర్థయాత్రలకు వెళ్తా మన్నారు. అందుకు యేర్పాట్లుచేయడంతో కొన్నిరోజులు గడచిపోయాయి.

ఈ హడావుడి పనులలో మునిగిపోయి రమేష్‌కు భార్యతో సరాగాలకే తీరిక లేకపోయింది. వివాహానికి ముందు తను విన్నవిధంగా, పెళ్ళికూతురు చిన్నపిల్లేమీ కాదు.

కాగా యిప్పుడు చూచినవాళ్ళంతా పిల్లకు పెళ్ళీడు ఎప్పుడో పోయిందంటున్నారు. రమేష్‌కు తన కాలేజీచదువు భార్యను ప్రేమించటానికి పాఠాలు నేర్పలేకపోయింది.

తన జీవన సహధర్మచారిణి యీమె—అనుకుంటూ రమేష్ ఆమెనుగురించి ఆలోచించసాగాడు. ఆమె అతనికి ఎన్నో దశలలో కనిపించసాగింది తన స్నేహితురాలు, ఇల్లాలు, పిల్లలతల్లి...ఇలా అతనికళ్ళు కలలలో తేలియాడు తున్నాయి. చిత్రకారుడు గీయబోయే బొమ్మను, కవి రాయబోయే పద్యాన్ని హృదయంలో ఊహించుకుంటూ పులకరించేవిధంగా రమేష్ ఆమెనుగురించి ఎన్నెన్నో తీయని కలలుకంటున్నాడు. తనకు సంతోషప్రదాయిని, ఇంటికి సౌభాగ్యప్రదాయిని ఆమెనుగురించి హృదయం సంతోషంతో కొట్టుమిట్టులాడుతోంది.

5

తండ్రిగారి వ్యవహారాలన్నీ సర్దుబాటుచేసుకోవటానికి, వృద్ధస్త్రీల తీర్థయాత్రలకు యేర్పాట్లు చేయడానికి రమేష్‌కు మూడునెలలు పట్టింది. ఈసరికి ఇరుగుపొరుగువాళ్ళు కొంత వరకు కొత్తపెళ్ళికూతురుతో పరిచయపూర్వకంగా మాట్లా డడం సాగించారు. ఆమెకూ, రమేష్‌కూ ప్రేమానుబంధం రోజులు గడిచినకొద్దీ గాఢతరం అవజొచ్చింది.

నవదంపతులు డాబామీద చాపలువేసుకు పడుకుని, సాయంత్రంపూటలు చల్లగా గడపటానికి అలవాటుపడ్డారు. రమేష్ యిప్పుడిప్పుడే ఆమెతో చనువుగా వ్యవహరిస్తున్నాడు.

వెనకనించీ వీపుమీద కొట్టడం, కళ్ళు మూయడం, ఆమె తలను తన గుండెలో దాచుకోవడం...ఇటువంటి పనులు చేస్తున్నాడు. ఆమె సాయంత్రంపూట నిద్ర ప్రారంభించి భోజనం వేళకూడా లేవకపోతే రమేష్ ఆమెను లేపి ఆమెతో చీవాట్లు తినేవాడు. ఒకనాడు సాయంత్రం సరదాగా ఆమె జుట్టు ముడిపట్టుకు ఊపి, "సుశీలా! ఈరకంగా ముడివేసుకోవడం నాకు అందంగా కనిపించడం లేదు" అన్నాడు.

ఆమె లేచికూచుంది. "చూడండి. ఎన్నిమార్లు చెప్పినా నన్ను యిలా సుశీలా సుశీలా అని పిలుస్తారేం-" అని అడిగింది. రమేష్ ఆమెవంక ఆశ్చర్యంగా చూచాడు. ఈ ప్రశ్న అతనికి అర్థంకాలేదు. ఆమె యింకా యిలా అంది: "పేరు మార్చినంతమాత్రాన నా అదృష్టం మారుతుందనుకున్నారా? చిన్నప్పటినుంచీ నేను దురదృష్టజాతకురాలనే! జీవితాంతంవరకూ యింతే!"

రమేష్ హృదయం కదలబారింది అతని ముఖకవళికలు మారిపోయాయి ఎక్కడో పొరపాటు జరిగింది. ఇదేమిటి—అనే ప్రశ్న అతనికి పొడసూపింది.

"ఎందుకలా దురదృష్టవంతురాలను అని అనుకుంటావు?" అన్నాడు.

"నేను పుట్టకముందే మా నాన్నగారు చనిపోయారు. మా అమ్మ చనిపోయేసరికి నాకు నిండా ఆరునెలలు కూడా లేవు. మా మామయ్య ఇంట్లో దాదాపు అనాథలాగ బ్రతికాను. ఉన్నట్లుండి ఎక్కడినుంచో మీరు వచ్చారు. నేనంటే ఆప్యాయత కనబరిచారు. మనకు రెండురోజుల్రక్రితమే వివాహం

అయింది. ఆ పైన యేం జరిగిందో మీ కే తెలుసు.''

రమేష్ నిస్సహాయంగా దిండుమీద తలవాల్చాడు. చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. కాని ఆ కిరణాలలో కాంతి లేదు. మరో ప్రశ్న వేయాలంటే భయం వేసింది. తను విన్న దంతా కల అవాలని కోరుకున్నాడు. నిద్ర మేల్కొంటున్న మనిషి ఆవలింతలాగ పడమటిగాలి వీస్తోంది. పక్కనే ఓడల రేవులో పడవవాళ్ళ పాటలు హుషారుగా వినిపిస్తున్నాయి. తను పక్కనున్నానన్న విషయమే మరిచిపోయి పరధ్యాసగా పడివున్న రమేష్‌ను చూచి ఆమె ''నిద్రపోతున్నారా?'' అని అడిగింది.

''లేదు—'' అన్నాడు రమేష్. అంతే. తరువాత ఆమె కూడా నిద్రపోసాగింది. రమేష్ లేచికూర్చుని ఆమెవంక తేరిపారచూచాడు. విధి ఆమె నుదుటిమీద రహస్యమేమీ వ్రాసినట్లు కనిపించలేదు.

ఈ కష్టాలగాథకు సుందరమైన మేలిముసుగు వుండడం ఎంత విచిత్రమైన విధి పరిణామం!

6

రమేష్‌కు యీ అమ్మాయి తాను పెండ్లాడిన స్త్రీ కాదని తెలిసి వచ్చింది. కాని యీమె ఎవరి భార్య అన్న విషయం తెలుసుకోవడం యేమంత తేలికపని కాదు. ఒక సారి అతను యుక్తిగా యిలా అడిగాడు: 'నన్ను మొదటి సారిగా చూచినప్పుడు యేమనుకున్నావు?' అని.

'నేను మిమ్మల్ని చూడనే లేదు. నేను తలయెత్తనే

లేదు' అన్నదామె.

'నా పేరుకూడా వినలేదా ?'

'వివాహం రేపనగా మీ పేరు మొదటి సారిగా విన్నాను. మా అత్తకు నన్ను ఎంత త్వరగా వదిలించుకోం దామా అన్న గొడవతప్ప యింకేం లేదు. ఆమె మీ పేర యినా చెప్పిందికాదు' అంది.

'అన్నట్లు, నీకు వ్రాయడం, చదవడం వచ్చని చెప్పారు. నీ పేరు వ్రాసి చూపించు చూద్దాం' అన్నాడు రమేష్ ఆమెకు కాగితం, కలం అందిస్తూ.

ఆ అమ్మాయి హుషారుగా నవ్వుతూ 'నా పేరు వ్రాయ డమే నాకు రాదంటారా యేమిటి?' అంటూ కాగితంమీద పెద్ద అక్షరాలలో 'శ్రీమతి కమలా దేవి' అని వ్రాసింది.

'సరే, యిప్పుడు మీ మామ పేరు వ్రాయి' అన్నాడు రమేష్.

కమల 'శ్రీయుత తరణీచరణ చటోపాధ్యాయ' అని వ్రాసింది.

'ఏం తప్పురాశానా ?' అనడిగింది.

'లేదు. మీ ఊరిపేరుకూడా వ్రాయి' అన్నాడు రమేష్.

ఆమె 'దోచాపుకూర్' అని వ్రాసింది.

ఇటువంటి యుక్తియుక్తమైన పనులవలన రమేష్ ఆమె పూర్వ చరిత్రను గురించి ఎన్నో అంశాలు తెలుసుకోగలి గాడు. అయితే అతనికి కావలసిన వివరాలు మాత్రం తెలియలేదు.

ఇకముందు యేం చేయాలా అనే ఆలోచనలో పడి పోయాడు రమేష్. ఆమె భర్త పడవ ప్రమాదంలో మునిగి పోయివుంటాడు. ఆమె భర్తతాలూకు బంధువులు ఎక్కడున్నారో కనుగొని ఆమె నక్కడికి పంపడంకూడా అంత భావ్యంకాదు, పోతే ఆమెను యిక తిరిగి మామగారి ఇంటికి పంపడంలో అర్థంలేదు పరాయి మగవాడి దగ్గర అతని భార్యగా ఇన్నాళ్లూ గడిపిందని తెలుసుకుంటే లోకం ఆమెను ఎలా చూస్తుంది! ఇక ఆమెకు జీవిత గమ్యస్థానం యేది? ఒకవేళ ఆమె భర్త బ్రతికేవున్నప్పటికీ ఆమెను యీ స్థితిలో స్వీకరించగలడా? తన భార్య కాకపోయిన తరువాత, ఆమెను తనదగ్గరేవుండ నివ్వడంలో అర్థంలేదు. మరెవరికీ వప్పగించి తన బాధ్యత నెరవేర్చా ననుకోవడానికి వీల్లేకుండా వచ్చింది! ఇద్దరూ భార్యాభర్తల్లా కాపురం చేయడానికి వీల్లేదు ఇంతకుముందు తన మనస్సులో ఊహించుకు మురిసిపోయినట్లుగా తన భావిజీవిత భాగస్వామిని ఈ మధుర మూర్తే అనుకోవడానికి అవకాశం లేదు.

ఈ కుగ్రామంలోనే వుండడం అంటే విసుగు పుడుతోంది. కలకత్తానగరం వెడితే ఎందరో జనం కనిపిస్తారు. అక్కడ జీవితం హడావడిగా వుంటుంది. యిక్కడిమాదిరిగా ఒంటరిగా అనిపించదు. అక్కడికి వెళ్ళిన తరువాత యేదో మార్గం ఆలోచించవచ్చును. ఈ ఆలోచనతో రమేష్, కమలను తీసుకుని కలకత్తా వెళ్ళాడు. అక్కడ పూర్వం తాను వుంటూవచ్చిన ఇంటికి చాలాదూరంగా ఒక యిల్లు అద్దెకు తీసుకున్నాడు.

కమలకు యీ అనుభవం ఎంతో విసుగ్గా వుంది. ఈ ఇంట్లో చేరిం తర్వాత ఆమె కిటికీదగ్గర స్థావరం యేర్పరచుకుంది. అక్కడ కూర్చుంటే రోడ్డుమీంద పోతున్న జనం కనిపిస్తారు. రోడ్డుమీద ఎడ తెరిపి లేకుండా జనం నడుస్తున్నారు. వాళ్ళు ఒక పనిమనిషిని కుదుర్చుకున్నారు. ఈ పనిమనిషికి కలకత్తానగరం కొత్తదికాదు. కమల ఇలా జనాన్ని విచిత్రంగా చూస్తూ కూర్చోవడం ఆ పనిమనిషికి వింతగా వుంది.

“అక్కడ చూడాల్సిందేముంటుంది. స్నానంచేయరా యేమిటి? ఇప్పటికే చాలా ఆలస్యం అయిందీ!'' అన్నది పనిమనిషి.

ఈ పనిమనిషి పగలుమాత్రం ఇక్కడే పనిచేసి సాయంత్రం అయేసరికి తన ఇంటికి వెడుతుంది. రాత్రిళ్ళు ఇక్కడేవుండే పనిమనిషి దొరకటం చాలాకష్టం, అసాధ్యం.

“ఇంక నాకు కమలతో ఒంటరిగా వుండడం, రాత్రిళ్ళు సాధ్యంకాదు! అయితే కొత్తచోట్ల ఆమె ఒంటరిగా ఎలా నిద్రపోతుంది?'' అనుకున్నాడు రమేష్.

భోజనాలయింతర్వాత పనిమనిషి వెళ్ళిపోయింది. రమేష్ కమలకు ఎక్కడ పడుకోవాలో చూపి, “ఇక వెళ్ళి పడుకో. నేను చదువుకోడం పూర్తిచేసి వస్తాను'' అన్నాడు.

పుస్తకం తెరిచి చదవడం నటించాడు. కమల అలిసి పోయి నిద్రపోయింది.

ఇలా మొదటిరాత్రి గడిచింది. మరుసటిరాత్రి కూడా రమేష్ కమలను ఒంటరిగా నిద్రపోనిద్దామనుకున్నాడు. ఆ రోజు ఎండ ఎక్కువగా వుంది. రమేష్ బాల్కనీ బయట

పక్కపరుచుకుని రాత్రంతా అక్కడే గడిపాడు. చాలసేపు అలా ఆలోచిస్తూ విసురుకుంటూ పడుకున్నాడు. దాదాపు అర్థరాత్రి సమయంలో నిద్రకు పడ్డాడు.

తెల్లవారుజామున రెండుమూడు గంటలప్రాంతాన అతనికి తన పక్కన మరెవరో వున్నట్లు అనిపించింది. ఎవరో తనకు నింపాదిగా విసురుతున్నారు. ఇంకా పూర్తిగా మెలుకువ రాక ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. "వెళ్ళి పడుకో, సుశీలా, నువ్విలా నాకు విసరకూడదు" అన్నాడు నిద్ర మగతలో. చీకటికి భయపడి కమల అతని చేతుల్లోకి వొరిగిపోయి, అక్కడే ప్రశాంతంగా నిద్రపోయింది.

రమేష్ పొద్దున్నే లేచాడు. ఒక్కసారి చుట్టూ కలయజూచాడు. కమల ఇంకా నిద్రపోతోంది. ఆమె కుడిచేయి తన మెడచుట్టూ వుంది. ఆమె తన ఎదుర్రొమ్ముమీద తలపెట్టుకుని నిద్రపోతోంది. అలా నిద్రపోతున్న అనూయకమైన కమలను చూచేసరికి అతని కళ్ళలో నీళ్ళు నిండాయి. సున్నితమైన ఆమెచేతిని తన మెడమీదినించి ఎలా తీసిపారవేయడం? అర్థరాత్రి తనకు విసిరే మిషమీద ఆమె తన దగ్గరకు వచ్చి పడుకోవడం రమేష్‌కు గుర్తువచ్చింది.

ఒక్కసారి గాఢంగా నిట్టూర్చి అతను ఎలాగో ఆమె బాహుబంధనంలోనుంచి తప్పించుకుని లేచాడు.

ఎంతోసేపు ఆలోచించి అతనొక నిశ్చయానికి వచ్చాడు. అదేమిటంటే, కమలను ఆడపిల్లల బోర్డింగ్ స్కూలుకు పంపడం! ఆమెతో యీ ప్రస్తావన ఇలా ఆరంభించాడు.

"నీకు చదువుకుందామని వుందా, కమలా ?"

"అంటే యేమిటి ? నా కర్థంకావటం లేదు" అందామె.

రమేష్ చదువుకున్నందువల్ల ఎన్ని ప్రయోజనాలో ఆమెకు విశదీకరించాడు. అంతా విని, కమల ఇలా అంది: "అయితే మీరే పాఠాలు చెప్పండి" అంది.

"నువ్వు స్కూలుకు వెళ్ళాలి" అన్నాడు రమేష్.

"స్కూలుకా ? నాఅంత పెద్దఅమ్మాయిని చేర్చుకుంటారా ?" అంది కమల.

రమేష్ గట్టిగా నవ్వి, "నీకంటే పెద్దవాళ్ళు కూడా స్కూలుకు వెడుతూవుంటారు" అన్నాడు.

కమలకు ఇంతకన్నా ఇంకేమీ అనవలసింది కనిపించ లేదు. రమేష్ ఆమెను ఒకరోజు బడికి తీసుకువెళ్ళాడు. అది చాలా పెద్ద భవనం అక్కడ కమలకంటే పెద్దవాళ్ళు, చిన్న వాళ్ళు ఎందరో వున్నారు.

రమేష్ ఆమెను హెడ్‌మిస్ట్రెస్‌కు అప్పగించాడు. ఇక తాను వెళ్ళిపోదామనుకున్నాడు. కమలకూడా వస్తానని వెంటపడింది.

"నీ వెక్కడికి ? ఇక్కడే వుండాలి" అన్నాడు రమేష్.

"మరి మీరు వుండడంలేదా ?" అనడిగింది వణుకుతున్న కంఠంతో కమల.

"ఉండను."

"అయితే నేనూ ఉండను. నన్నూ మీతోనే తీసుకువెళ్ళండి" అంది కమల అతని చేయిపుచ్చుకుని.

రమేష్ ఆమెచెయ్యి విదిలించికుని "కమలా ఇలా

గోలచేయకు" అన్నాడు.

కమల ఇంకేం మాట్లాడలేకపోయింది. నిస్తబ్ధంగా నిల్చుండిపోయింది. రమేష్ గాయపడిన హృదయంతో ముందుకు నడిచాడు. దూరం వెళ్ళాకుగాని ఆమె ముఖం మటుకు అతనికి కనిపించకుండా వుండడంలేదు. భయంతో నిస్సహాయంగావున్న ఆ ముఖం అతనికి మరుపుకు రావడం లేదు.

# 7

రమేష్ కలకత్తాలోని ఆలపూర్ కోర్టులలో ప్రాక్టీసు ప్రారంభిద్దామనుకున్నాడు. కాని నిస్పృత్తువ అతన్ని పూర్తిగా లోగొన్నది. పనిమీద శ్రద్ధ, లక్ష్యం యేర్పడకుండా పోతు న్నాయి. హౌరాబ్రిడ్జి మీదనో, కాలేజీస్క్వేర్ చుట్టూనో యేమీ తోచక షికార్లు తిరుగుతూవుండేవాడు. ఇంతలో ఆనందబాబుదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. ఆ ముసలాయన ఇలా వ్రాశాడు:

"ఈరోజే నీవు పరీక్షప్యాసయినట్లు గెజిట్లో చూచాను. కాని యీ సంతోషవార్త నీ నోటిమీదుగానే వినలేనందుకు విచారంగా ఉంది. నీ దగ్గర్నుంచి సమాచారాలు తెలిసి చాలాకాలం అయింది. నీవు ఎలా వున్నావో, ఎప్పుడు కలకత్తా వస్తున్నావో తెలియపర్చి నీ పాత స్నేహితుల ఆదుర్దా తగ్గించు."

ఇక్కడ ఒకవిషయం చెప్పవలసివుంది. అదేమిటంటే ఆనందబాబుగారు తనకు అల్లుడవుతాడని ఆశలు పెట్టుకున్న

అతను ఇంగ్లండునుంచి తిరిగివచ్చాడు, మరో అమ్మాయితో వివాహ ప్రస్తావనలు జరుపుతున్నాడుకూడా! ఆ అమ్మాయి శ్రీమంతుని కూతురట!

రమేష్ ఒక క్షణం ఆలోచనలోపడ్డాడు. ఇంత గొడవ జరిగిన తర్వాత, తిరిగి తాను హేమాలినితో పూర్వం మాదిరి గానే సంబంధం పెట్టుకోవడం ఎంత సబబా అని! ప్రస్తుతానికి యేది ఏమైనా తనకు కమలతో ఉన్న సంబంధం ఎవరికి చెప్పదలచుకోలేదు ఏమంటే అందువల్ల ఆ అమ్మాయిని సాంఘిక దురవస్థలకు పాలుజేయడం అవుతుంది. ఐనప్పటికీ హేమాలినితో పూర్వ సంబంధాలు పునరుక్తం చేసుకోవడం అంటే ఈ గొడవంతా ముందు పోదుల్చుకోవాలిగద!

ఏమైనా, ఆనందబాబుగారి ఉత్తరానికి జవాబు వ్రాశాడు: "మిమ్మల్ని వచ్చి చూడనందుకు క్షమించండి. ఐతే కొన్ని పరిస్థితుల ప్రాబల్యంవల్ల నేను మిమ్మల్ని ఇప్పుడప్పుడే కలుసుకోలేను. ఈ పరిస్థితులను సడలించడం నాచేత కాదు." ఐతే రమేష్ ఈ ఉత్తరంతో పాటు తన కొత్త చిరునామా ఇవ్వలేదు

ఈ ఉత్తరం పోస్టు చేసిన మరునాడు, రమేష్ ప్లీడర్ దుస్తులు ధరించి మొదటిసారిగా ఆలపూర్ కోర్టుకు వెళ్ళాడు.

ఒకరోజు కోర్టునుంచి ఇంటికి తిరిగివస్తూ, బగ్గీదొరుకుతుందేమోనని వెదుకుతున్నాడు. వెనకనుంచి ఎరిగిన కంఠం వినిపించింది. "అదుగో నాన్నా. రమేష్‌బాబు అక్కడున్నాడు" అని ఒక స్త్రీ గొంతు, ఆపైన "డ్రైవర్-కారుఆపు"

అని మరో మగగొంతు. రమేష్‌కు పక్కనే కారు ఆగింది. ఆనందబాబు, అమ్మాయి ఆలప్పూర్ జూకు పిక్‌నిక్‌కు వచ్చారు. అదే ఈ అనుకోని సమావేశానికి కారణం!

రమేష్ హేమాలినివంక చూచాడు. అతని శరీరానికి ఒకవిధమైన విద్యుద్ఘాతం తగిలినట్లనిపించింది. హేమాలిని చిరునవ్వు చిందిస్తోంది. ఆమె దుస్తులు, తలకట్టు మామూలు ప్రత్యేకం వుండాగా వున్నాయి. చేతిగాజులు, బంగారు ఆభరణాలు మిలమిల మెరుస్తున్నాయి.

"రమేష్! ఈ విధంగా నిన్ను కలుసుకోవడం ఎంత అదృష్టం మాకు. ఉత్తరాలు వ్రాయడమే మానివేశావేం? రాసినా చిరునామా ఇవ్వవు. ఇప్పుడెక్కడికి వెడుతున్నావు. ప్రత్యేకించి యేమీ పనిలేదుగా!" అన్నాడు ఆనందబాబు.

"లేదు. ఇప్పుడే కోర్టునుంచి తిరిగి వెడుతున్నాడు" అన్నాడు రమేష్.

"అయితే ఇంటిదాకా రా. టీ తాగి వెడుదువుగాని"

రమేష్ హృదయం పరిపూర్ణంగా వుంది. అందులో యేమీ సందేహానికి తావు లేదు. కారులో కూర్చున్నాడు. హేమాలినిని ఎలా వున్నావని అడిగాడు; తన బెరుకుతనాన్ని అతి ప్రయత్నంమీద జయించింది.

"పరీక్ష ప్యాస్ అయినట్లయినా తెలియపరచలేదేం?" అనడిగింది హేమాలిని అతని ప్రశ్నకు జవాబు చెప్పకుండానే.

రమేష్‌కు యేం బదులు చెప్పాలో తోచలేదు. అందుచేత సూక్ష్మంగా 'నువ్వుకూడా పాస్‌అయావు. చూచాను' అన్నాడు.

హేమాలిని నవ్వి, 'అయితే మమ్మల్ని పూర్తిగా మర్చిపోలేదన్నమాట! అదే పదివేలు' అంది.

'ఇప్పుడు ఎక్కడ మకాం పెట్టావు?' అనడిగాడు ఆనందబాబు.

"దర్జీపరాలో" అన్నాడు రమేష్.

'కలుటోలాలో నీ పూర్వపు మకాం బాగానే వుండే దిగా!' అన్నాడు ముసలాయన.

హేమాలిని రమేష్‌వంక చూచింది. అతనేం జవాబు చెపుతాడా అని ఆమె ఆదుర్దా.

రమేష్ ఆమెచూపును గమనించకపోలేదు. అందులో వున్న నిందకూడా అతనికి తెలుసు.

'అవును. అక్కడికే మారదాం అనుకుంటున్నాను' అన్నాడు. హేమాలిని తన నిజస్వరూపం కనిపెట్టేసిందని గ్రహించాడు రమేష్. ఈ ఆలోచనే అతనికి మనశ్శాంతి లేకుండాచేసింది. మరి వేరేమార్గం లేదు. ఏకళనున్నదో హేమాలిని ఇంక అడ్డుప్రశ్నలు వేయకుండా రోడ్డువంక చూడసాగింది.

నిశ్శబ్దం భరించరానిది అయ్యాక రమేష్ తనంత తానే ఇలా అన్నాడు: 'మా బంధువు ఒకాయన హెదువాలో వుంటున్నాడు అతని దగ్గరగా వుంటాననే ఉద్దేశ్యంతో దర్జీపరాలో మకాం పెట్టాను.'

ఇది పూర్తిగా అబద్ధం కాదు. అయినా చెప్పే పద్ధతిని బట్టి అలా అనిపిస్తుంది.

హేమాలిని రోడ్డువంక చూస్తూనేవుంది. రమేష్

ఇంకేం మాట్లాడదామా అని వెదుకుతున్నాడు. కొద్దిసేపు అయినతరువాత "జోగేంద్ర ఎలా వున్నాడు?" అనడిగాడు.

ఆనందబాబు జవాబు చెప్పాడు: "వాడు లా పరీక్ష తప్పాడు. గాలి మార్పుకోసం యాత్రలు చేస్తున్నాడు."

కారు గమ్యస్థానం చేరుకుంది. పరిచితమైన గదులు, ఫర్నీచరు రమేష్‌కు ఆహ్లాదాన్ని కలిగించాయి. విరామము, విషాదము మిళితమైన నిట్టూర్పు ఒకటి విడిచి ఒక్క ముక్కయినా అనకుండా కుర్చీలో కూలబడ్డాడు.

"ఇంటిదగ్గరే ఇన్నాళ్ళూ వుండిపోయావేం?" అనడిగాడు ఆనందబాబు.

"మా నాన్నగారు పోయారు..." అంటూ ఆరంభించబోయాడు, రమేష్.

"అయ్యో, చెప్పవేం! అలాగా! ఎప్పుడు?" అన్నాడు ఆదుర్దాగా ఆనందబాబు.

"పద్మానదిమీదుగా పడవలో వస్తున్నారు. అకస్మాత్తుగా తుఫాను చెలరేగింది. బోటు తల్లకిందులైంది. ఆయన మునిగిపోయారు."

విసురైనగాలులు వీచి మేఘావృతమైన ఆకాశాన్ని నిర్మలంచేసే విధంగా ఆకస్మికమైన ఈ వృత్తాంతం రమేష్‌కు హేమాలినికీ మధ్య వున్న దురభిప్రాయాలను తొలగించింది. హేమాలిని తనలో తాను ఇలా విచారించింది: "నేను రమేష్‌బాబుకు అన్యాయంచేశాను. తండ్రిగారు పోయినందువల్ల ఆ విచారంలో మునిగిపోయాడతను. ఇంకా ఆ విచారం అతన్ని పూర్తిగా విడిచివుండదు. నేనతన్ని

తప్పుపట్టాను. అతని కుటుంబ తాపత్రయాలు అర్థం చేసుకోకుండా ఏదో దురూహాలలో పడిపోయాను." ఇలా అనుకుని ఆమె తండ్రిలేని యువకుడిపట్ల అత్యంత శ్రద్ధాసక్తులు చూపసాగింది.

రమేష్‌కు ఆకలిగా లేదు. ఐనా హేమాలిని అతన్ని ఎక్కువగా పుచ్చుకోమని బలవంతంచేసింది.

"నీ పద్ధతేం బాగుండలేదు. నీ ఆరోగ్యాన్ని అశ్రద్ధ చేస్తున్నావు" అంటూ తండ్రివంక తిరిగి "రమేష్‌బాబును ఇవాళ రాత్రికి ఇక్కడే వుండిపొమ్మందాం భోజనానికి!" అంది.

"తప్పకుండా!" అన్నాడు ఆ వృద్ధుడు.

సరిగ్గా ఈ సమయంలో అక్షయబాబు ప్రవేశించాడు. కొన్నాళ్ళుగా అతనికి ఆనందబాబుగారి టీ టేబుల్ దగ్గర ప్రత్యర్థి లేడు. ఇప్పుడు అకస్మాత్తుగా రమేష్ కనిపించడం అతనికి గొప్ప దెబ్బ తగిలినట్లు అనిపించింది. మొత్తంమీద తనను తాను సంబాళించుకుని "ఏం రమేష్‌బాబు! ఎప్పుడు వచ్చావ్? మమ్మల్ని గురించి పూర్తిగా మరిచిపోయినట్లున్నావ్?" అన్నాడు.

రమేష్ తేలిగ్గా నవ్వాడు. అక్షయ ఇంకా ఇలా అన్నాడు. "ఆవేళ మీనాన్నగారు నిన్ను గుంజుకువెళ్ళడం చూచి, ఆయన నీ మెడకో గంతను కట్టేంతవరకూ ఎక్కడికీ కదలనివ్వడనే అనుకున్నాను. ఆ గొడవంతా వదిలించుకుని వచ్చేవా ఏమిటి?"

హేమాలిని వారిస్తున్నట్లు చూడడంతో అక్షయ నోరు మూతపడింది.

"రమేష్ తండ్రిగారు చనిపోయారట అక్షయబాబూ!" అన్నాడు ఆనందబాబు.

రమేష్ యీ విచారసన్నివేశాన్ని తట్టుకోలేక తల కిందికి దించుకున్నాడు. ఈ పరిస్థితిలో అతన్ని ఎక్కువసేపు వుంచడం యిష్టంలేక హేమాలిని "నా కొత్తఆల్బం నీ కింకా చూపనేలేదుకదూ!" అంటూ ఆ ఆల్బం తీసుకువచ్చి అతని కెదురుగావుంచి, అందులోని బొమ్మలను గురించి చర్చించ సాగింది. ఆ సంభాషణలోనే మెల్లిగా "అయితే యిప్పుడా కొత్తఇంట్లో ఒంటరిగానే వుంటున్నావా ? అనడిగింది.

"అవును. ఒంటరిగానే !"

"వీలయినంత త్వరగా యీ పక్కయింటికి వచ్చేస్తావు కదూ ?"

"అలాగే ! వచ్చే సోమవారమే వస్తాను,"

"ఇప్పుడు - చదువులో కూడా నాకు నీ సహాయం కావాలి" అంది హేమాలిని. ఈ సమావేశానికి రమేష్ చాలా సంతోషించాడు.

## 8

రమేష్ తన పూర్వపుబసకు మారాడు. హేమాలినితో తన సంబంధాలకు పట్టిన మసక మబ్బులన్నీ విడిపోయాయి. కనీసం వాటి జాలూరు గుర్తయినా మిగిలిలేదు. అతనిప్పుడు ఆ యింటివాడుగానే మెలుగుతున్నాడు. ఇంటి కులాసా సంభాషణలలో పాల్గొంటున్నాడు. పండుగలకు పబ్బాలకు భోజనంకూడా యిక్కడే !

చదువువల్ల ఒత్తిడి ఎక్కువైనందువల్ల హేమాలిని యిప్పుడు కొద్దిగా చిక్కిపోయి గట్టిగా గాలివీస్తే ఎగిరి పోయేట్లుగా వుంది ఆమె ప్రకృతికూడా మారిపోయింది. ఇప్పుడు అమిత గంభీరంగా నిశ్శబ్దంగా వుంటుంది. స్నేహితులు ఆమెతో చనువుగా మాట్లాడటానికికూడా భయపడుతున్నారు.

ఇలా కొన్నిరోజులు గడిచాక ఆమె ఆకృతిలోను, ప్రకృతిలోనూకూడా ఆశ్చర్యకరమైన మార్పులు వచ్చాయి. ఆమె చెక్కిళ్ళు నునుపుదేలాయి. ప్రతిమాటకూ ఆమెకళ్ళు సంతోషంతో నాట్యంచేస్తున్నాయి. ఒకప్పుడు ఆమె తన దుస్తులశోభకు అంత ప్రాధాన్యం యిచ్చేదికాదు. ఆమె అభిప్రాయాలు యిప్పుడు అవలీలగా ఎలా మారిపోయాయో అర్థంకాకుండా వుంది.

రమేష్ మటుకు అతను, ఇలాగే వుంటున్నాడు. బాధ్యతలు అతని మనసును శరీరాన్నికూడా శ్రమ పెడుతున్నాయి. నక్షత్రాలు తమపథంలో స్వేచ్ఛగా నడుస్తూ వుంటాయి, కాని చూచేవాళ్ళకళ్ళు ఎప్పుడూ ఒకేరకంగా వుండాలి. అలాగే రమేష్ ప్రపంచ పరిభ్రమణంలో ఇరుక్కుపోయికూడా తన పుస్తకాలు, వాటి వేదాంతంలో మునిగి తేలుతున్నాడు. ఇప్పుడు అతనిలో ఒక నూతన వికాసం బయలుదేరింది. మానసికంగా, శారీరకంగాకూడా అతనిలో చురుకుదనం చలాకీదనం ఏర్పడినాయి.

# 9

యువక ప్రేమికులకు అనువైనదంటూ కవులు చెప్పే వాతావరణమేదీ కలకత్తాలో లేదు. నగరమంతా హడావుడి గందరగోళాలతో నిండి వుంటుంది.

రమేష్ హేమాలినిల ప్రణయం రోజు రోజుకూ సన్నిహితమవుతోంది. వారి ప్రణయస్థలం, ఆనందబాబుగారి టీ టేబుల్. అంతేగాని పద్మాలతో నిండిన కొలను కాదు.

తనధ్యాసంతా చదువుమీదే కేంద్రీకరించవలసి వచ్చినప్పుడు, హేమాలిని కుట్టుపనిని అవతలపెడుతూ వచ్చేది. ఆమె కుట్టుపని పాఠాలు ఒక స్నేహితురాలి దగ్గర నేర్చుకుంటుంది. రమేష్ యీ కుట్టుపనినిగురించి బహునిర్లక్ష్యంగా మాట్లాడేవాడు. అతను, హేమాలిని సాహిత్యం...ఇటువంటి మంచివిషయాలను గురించి ఎంతసేపయినా చర్చించుకోగలరుగాని, కుట్టుపనిగురించి చర్చవచ్చిందంటే రమేష్ వెనక్కు వెళ్ళి కూర్చోవలసిందే.

"ఎందుకలా అస్తమానం సూదీ దారంతో గొడవపడుతూ వుంటావు. ఇలాంటివన్నీ యేమీ పనిలేనివాళ్ళు, యేమీ చేతగానివాళ్ళు చేయాలి" అంటూ వుండేవాడు. హేమాలిని కేవలం ఒకనవ్వువిసిరి, తనపని చేసుకుపోతూ వుండేది.

అక్షయ ఒకమారు ఎకసక్కెంగా ఇలా అన్నాడు. "ప్రపంచంలో పనికి వచ్చేదంటే యేదివుంటే దాన్నల్లా రమేష్‌బాబు చౌకచేసేస్తాడు. బహుశ యిదంతా గొప్ప

వేదాంతధోరణి కవిత్వధోరణి కానచ్చుగా. ఇందువల్ల ఏమీ ప్రయోజనం లేదు.''

రమేష్‌కు యీ మాటలతో పౌరుషం వచ్చింది. వాదనను ఉపక్రమిస్తూ తొడచరుచుకున్నాడు.

హేమాలిని మధ్యలో జోక్యం కలిగించుకుంది. ''ఎందుకు రమేష్ అలా జవాబు చెప్పటానికి ప్రయత్నిస్తావు ప్రపంచంలో ఇంతకంటే నిష్ప్రయోజనమైన వాదన వుండదు గదా !'' అంది. ఈ మాటలు అనేసి ఆమె తనకుట్టుపనిలో మునిగిపోయింది.

ఒకరోజు రమేష్ చదువుకుందామని గదిలోకి వెళ్ళాడు. అక్కడ బల్లమీద సిల్కుబైండుచేసిన పుస్తకం అగుపించింది. దాని అట్టమీద ఎంబ్రాయిడరీపని అగుపించింది. ఒకమూల "ర" అనే అక్షరం మరోమూల బంగారుదారంతో పద్మం చిత్రం కనుపించాయి. రమేష్‌కు యీ బహూకరణ ఎవరు చేసిందీ, ఇందులోని ఔదార్యము అంతా ఒక్క క్షణంలో మెరుపులా మదిలో మెదిలాయి. అతని హృదయం స్పందించింది. కుట్టుపని అంటే ఇంతవరకు వుంటూవచ్చిన అసహ్యమంతా ఒక్కమారుగా తొలగిపోయింది. పైగా దీన్ని గురించి ఎవరితోనైనా సరే యెదురుమాడటానికి సిద్ధంగా వున్నాడు కూడ. ఆ పుస్తకాన్ని తన హృదయానికి హత్తుకున్నాడు. అక్షయ అతన్ని యీక్షణంలో చూచివుంటే తన పొరపాటు సవరించుకునేవాడే.

పుస్తకాన్ని తెరచి ఒక కాయితం తీసుకుని యిలా వ్రాశాడు.

"నేను కవినైనట్లయితే నా వ్రాసినగీతాలు నీకు కానుకగా సమర్పించేవాడిని. కాని యిప్పుడు అలాంటిదేమీ లేదు. నాకు యిప్పుడు బహుమతులు స్వీకరించేశక్తేగాని, ఇవ్వగల శక్తిలేదు. ఈ అనుకోని కానుక నాకు ప్రాణప్రదం. ఈ బహుమానాన్నయితే చూడగలంగాని, ఇందుకు గాను నేను తెలిపే కృతజ్ఞతకు ఆకారంలేదు భాషలేదు. సదా నీకు ఋణపడివున్న—రమేష్."

హేమాలిని యీ చీటీని అందుకుంది. వారిలో ఎవరూ గూడా దీన్ని గురించి మాటలసందర్భంలో ప్రస్తావించుకోలేదు.

వర్షాకాలం ప్రవేశించింది. వానలనేవి సాధారణంగా పల్లెల్లోనే కావాలిగాని, బస్తీలలో వారికి యివి కలగాపులగమైన దీవెనలు. ఇళ్ళలో వున్నవాళ్ళు దట్టమైన దుస్తులు ధరిస్తారు. కిటికీలు మూసివేస్తారు. రోడ్లమీద వెళ్ళేవాళ్ళు గొడుగులు ధరిస్తారు. కాళ్ళకు రబ్బరుబూట్లు వేసుకుంటారు. నది, పర్వతం, అడవి, పొలం—యివన్నీ దాటి వర్షజలాలు స్నేహితుడి స్వాగతంలో రొదచేస్తూ ప్రవేశిస్తాయి. వాటి ప్రకృత పరిస్థితులలో వర్షాలంటే ఏమిటో మనకు గోచరమవుతుంది.

యువకప్రేమికులు పర్వతాలవంటివారు. కుండపోతగా వర్షాలు కురవడంవల్ల ఆనందబాష్ప ఆరోగ్యం అల్లకల్లోలం అయింది. రమేష్ హేమాలినిలకు చుటుకు అలాకాదు. వారి భావనలను ఈ వాన తడిచేయలేక పోయింది. రోజు రోజుకూ వర్షం ఎక్కువవుతోంది. హేమాలిని ఆదుర్దాగా "ఏం రమేష్, ఇలాంటి వాతావరణంలో ఎలా బయటికి వెడతావు"

అంటూంది.

రమేష్ "అదేం ఆదుర్దాపడవలసిన విషయంకాదు. ఎలాగో అలా యింటికి చేసుకుంటానులే" అనేవాడు.

"ఊరికే బయటకు వెళ్ళి చలిలో తడిసి జలుబు తెచ్చుకుని ఏం లాభం ? ఇక్కడేవుండు. అందరం కలిసి భోజనం చేద్దాం" అనేది హేమాలిని.

రమేష్‌కు తన ఆరోగ్యాన్ని గురించి బెంగలేదు. అతనికి అంత తేలికగా జలుబు చేయడమనేదిలేదు. అయినా చాలరోజుల్లో హేమాలిని చెప్పినట్లు నడుచుకునే వాడు. వాళ్ళ ఇంటినుంచి తన ఇంటివరకు నడిచివెళ్ళడమైనా నేరంగా పరిగణించేది ఆమె. ఆకాశం మామూలుకంటే ఎక్కడ దట్టంగా మేఘావృతమైవుంటే రమేష్‌ను హేమాలిని ఇక్కడే భోజనానికి వుంచేసేది. అతని ఆరోగ్యాన్ని గురించి ఆమెకు వున్నఆదుర్దాలో, అతనికి అజీర్తి చేస్తుందేమోననే అనుమానమైనా అనిపించేదికాదు.

ఈ విధంగా యువతీయువకులు రోజులు గడిపేస్తున్నారు. వాళ్ళ ఉద్దేశాలు ఒక దరికి చేసుకుంటున్నాయి. దీనివల్ల చివరకు జరిగేదేమిటి—అంటే ఈ ప్రశ్న రమేష్‌కు ఎప్పుడూ స్ఫురించలేదు. అయితే ఆనందబాబు దీనికి జవాబు సిద్ధంచేసి పెట్టుకున్నాడు. స్నేహితులందరికీ యిది మంచి ఇష్టాగోష్టి.

# 10

అక్షయ కంఠస్వరం మధ్యరకంగా వుంటుంది. అంత బాగుండదు — బాగుండకపోదు. కాని అతను గానచేస్తాం

తనే వయొలిన్ మీద అనుసరిస్తావుంటే, ఎంతో మంది సంగీత విద్యాపారంగతులు తప్పక అతనికి 'వన్స్‌మోర్' కొట్టక మానరు. ఆనందబాబుకు సంగీతమంటే అంత యిష్టం లేదు. అయినా యీ విషయం యెప్పుడూ ఒప్పుకునేవాడు కాదు. సంగీతప్రియులు తమకు యిష్టంవచ్చిన రీతిగానే పాడుకుంటారు—అనుకుంటూ వుండేవాడు. ఇలాంటివే అతనికి కొన్ని విచిత్రమైన అభిప్రాయాలు వున్నాయి.

ఎవరయినా అక్షయను "ఆ గీతం తిరిగి పాడండి" అని కోరినప్పుడు, ఆనందబాబు కలుగజేసుకుని "మీరలా అడగకూడదు. కేవలం పాడగలడు గనుకనే అతన్ని ఎందు కలా హింసిస్తారు?" అనేవాడు.

అక్షయ మటుకు కోపంగా జవాబు చెప్పేవాడు. "ఈ విషయంలో మీరేం గొడవపడకండి. ఇప్పుడు ప్రశ్నల్లా హింసపడేది ఎవరు, హింసపెట్టేది ఎవరు అనే!"

మొదట ఆ గీతం తిరిగి పాడమని కోరినవారు "మీరు మళ్ళీ పాడినతర్వాత, ఆ ప్రశ్న నిర్ణయించుదాంలెండి" అనేవాళ్ళు.

ఒకరోజు మధ్యాహ్నం, ఆకాశం మబ్బులతో దట్టంగా అలుముకుంది. రాత్రి సమీపిస్తున్నప్పటికీ వానలో ఏమీ మార్పురాలేదు. ఇంకా కుండపోతగా కురుస్తూనేవుంది. అక్షయ యిక్కడే చిక్కుపడిపోయాడు. హేమాలిని అతన్ని సంగీత ఆలపించమని చెప్పి తాను హార్మోనియం శృతివేయసాగింది.

అక్షయ తన వయొలిన్ శృతిచేసుకుని హిందూస్థాని పాట ఒకటి అందుకున్నాడు.

"బావాలు బహీగాన్ ఫ్యూర్బయినా—

నిదా నాహీగ్ బిన్ సంయినా—" అని.

ఈ పాటలోని భాష వినేవారికి అర్థంకాదు. అయితేనేం రాగభరితమైన పాటలోని భాషతో యెవరికీ నిమిత్తం లేదు. అందులోని భావం మటుకు చూచాయగా తెలుస్తోంది. "వానకురుస్తోంది. నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. ప్రేమికుడు తన తనప్రియురాలిని హృదయానికి హత్తుకుంటున్నాడు" అని.

అక్షయ తన హృదయంలో అట్టడుగున దాచుకున్న కొన్ని తీయని భావాలను యీ పాటద్వారా పలికించాలనుకున్నాడు. కాని యీ కీర్తన వింటున్న వారి యిద్దరి భావాలను స్పందించగలిగింది. అంతేగాని మరేంకాదు. రెండు హృదయాలు ప్రేమతో జ్వలించాయి. పాటలో, ఆ సంగీతంలో లీనమయి పోయినాయి. ఏదీ ఇప్పుడు సాధారణంగా సామాన్యంగా అగుపించడంలేదు. ప్రపంచమంతా రోజా మబ్బులో కనిపిస్తోంది. మానవ హృదయాలలోని కోరికలన్నీ గుదిగుచ్చి ఈ యిద్దరు ప్రేమికులమీాద వర్షించినట్లుంది. ఈ కోరికలన్నీ వారిలో కదల బారినాయి.

ఇటు వానలోగాని, అటు పాటలోగాని యేమీా విరామం లేదు. హేమమాలిని మటుకు ఇలా అంది: "అక్షయ బాబూ! పాట ఆపకు. మరో పాట అందుకో." అలాగే అక్షయబాబు పాటల తోరణం అందుకున్నాడు. అందరూ సంగీతార్ణవంలో మునిగిపోయారు. మానవ హృదయాలు వికసించి పరిమళించేది అక్కడే.

ఆ రాత్రి అక్షయబాబు ఇంటికి చేరుకునేసరికి చాలా ఆలస్యం అయింది. సెలవుతీసుకుంటూ ఒకమారు హేమాలిని వంక చూచాడు. హేమాలిని కూడా అతనివంక సంగీత తప్త హృదయంతో చూచింది.

వర్షం కొద్దిసేపు ఆగింది. రమేష్ ఇంటికి వెళ్ళాడు. తరువాత మళ్ళీవర్షం ధారాపాతంగా కురవసాగింది. ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు. హేమాలినికూడా ఇలాగే నిద్రపట్టక చాలసేపు చీకట్లో కూర్చుని వర్షధారల చప్పుళ్ళు వింటూ గడిపింది. అదీగాక అక్షయ పాడిన హిందూస్తానీ గీతం ఇంకా ఆమె మదిలో మెదులుతూనేవుంది.

మరునాడు ఉదయం రమేష్ తనలో తాను ఇలా అనుకున్నాడు. "నేను గూడా పాడగలిగితే యెంత బాగుండును. సంగీతాన్ని మించిన మాధుర్యం ఇంకేమీలేదు." అయితే ఇక తాను సంగీతపాటగాడు అవగల అవకాశంలేదు. ఏదయినా వాద్యం నేర్చుకోవాలి. ఆనందబాబుగారి ఇంట్లో ఒంటరిగా వున్నప్పుడు ఒకసారి రమేష్ ఫిడేలు తీగలమీని కమానుతో గీతలు గీశాడు. సంగీతనాదం కర్కశంగా వినిపించింది. అప్పటినుంచి వయిలెన్ ముట్టుకోవడమంటే భయం వేసింది. అందుచేత ఒక హార్మోనియంపెట్టె కొన్నాడు. దాన్ని తన గదిలోకి తీసుకువెళ్ళి తలుపులుమూసి వాయించసాగాడు. హార్మోనియం కూడా వయొలిన్ మాదిరిగానే ఎక్కువ చప్పుడుచేసే వాద్యం అని తెలుసుకోవటానికి అతనికి ఎక్కువకాలం పట్టలేదు.

మర్నాడు ఆనందబాబుగారి ఇంటికి వెళ్ళినప్పుడు

హేమాలిని ఇలా అడిగింది: "రాత్రి నీ గదిలో ఎవరో హార్మోనియం వాయించినట్లు వినిపించిందే!"

రమేష్ తన గది తలుపులు మూయడంవల్ల శబ్దం గాలు బయటకుపోవని భ్రమించాడు. అయితే కొంతమంది మూసిన గదుల్లో జరుగుతున్న సమాచారంకూడా కనిపెట్టగలరు. అందుచేత అతనికి నిజాన్ని వొప్పుకోవడం తప్ప ఇంకేం మార్గం అగుపించలేదు. హేమాలిని అతను చెప్పిందంతా విని ఇలా అంది: "అలా అయితే నీ గదిలో తలుపులు మూసుకుని స్వంతంగా సాధకంచేసి లాభంలేదు. నీకు నిజంగా నేర్చుకోవాలని వుంటే ఇక్కడికి వచ్చి సాధకంచేయి నాకూ హార్మోనియం వాయించడం కొద్దిగా వచ్చునుక, నీకుసహాయ కారిగా వుంటాను."

"నాకు బొత్తిగా రాదు. నీకు శ్రమ ఎక్కువవుతుంది" అన్నాడు రమేష్.

"నీకు యేమీ రాకపోయినా ఫరవాలేదు. నేను మొదటినుంచీ నేర్పుతానుగా." అన్నది హేమాలిని.

తనకు బొత్తిగా రాదని చెప్పడంతో రమేష్ పొరపాటు చేశాడని యిప్పుడు బోధపడింది. ఏమంటే ఎంత చక్కగా నేర్పగలవాళ్ళు వున్నప్పటికీ సంగీతవిద్య తనబుర్రలో ప్రవేశించదు. ఈతరానివాడు నీళ్ళలోపడి ఊరికే కాళ్ళూచేతులూ కొట్టుకుంటూ వుంటాడు. రమేష్ పరిస్థితి దాదాపు ఇంతేగా వుంది. అయితే నీళ్ళు మోకాళ్ళ లోతులోనే వున్నాయి. అతనికి యేవేలు రోజు మీటమీద నొక్కాలో తెలియదు. అందుచేత శృతి, అపశృతి అతనికి ఒక్కలాగానే అనిపిస్తు

న్నాయి. హేమాలిని "అదేమిటి అలా చేస్తున్నావు. అది తప్పు" అని అరుస్తూ వుండేది. ఈ హెచ్చరికవల్ల అతను ఈ తప్పు సవరించుకోవడానికి మరో తప్పు చేస్తూవుండేవాడు. తప్పులు వస్తున్నాయికనుక యీ విద్యను యింతటితో వొదిలి పెడదాం అన్న మనస్తత్వంవాడు కాడు రమేష్. అతనలా కృషి సాగిస్తూనే వున్నాడు.

హేమాలిని అతని తప్పుల్ని తలచుకుని నవ్వుతూ వుండేది. అతనుకూడా అలాగే నవ్వేవాడు. అతను పనికట్టుకుని తప్పులు మెల్లమెల్లగా తగ్గిస్తూ వుండడం, హేమాలినికి మరింత నవ్వు తెప్పిస్తోంది. తప్పులు, అపశృతులు, అసమర్థతయిటువంటి వాటివల్లకూడా సుఖాన్ని ప్రసాదించగల శక్తి ప్రేమకు వుంది. తల్లిప్రేమ నడక నేర్చుకున్నప్పుడు చంటి కుర్రవాడు వేసే తప్పటడుగుతో యినుమడింపబడుతుంది; రమేష్‌కు సంగీతాభిలాష కించిత్తయినా లేకపోవడం, హేమాలినికి ఆంతరంగిక సంతోషం.

రమేష్ ఒకటిరెండుసార్లు యిలాఅన్నాడు: "నన్ను చూచి నవ్వుతున్నావు బాగానేవుంది. కాని నీవు నేర్చుకున్నప్పుడు యిలాగే తప్పులు చేయలేదా యేం?"

"చేశాను. కాని నిజంచెప్పాలంటే రమేష్‌బాబూ, నీవు చేసినలాంటి తప్పులు చేయలేదు" అని హేమాలిని బదులుచెప్పేది.

రమేష్ భయపడలేదు. తన కృషి కొనసాగించాడు. హేమాలిని మాటలకు నవ్వుతూ సాధకం తిరిగి ప్రారంభించేవాడు. ఆనందబాబు, సంగీతంలో యెంతమాత్రం అభిరుచిలేని

వాడయినప్పటికీ, అప్పుడప్పుడూ రమేష్ వాద్యంవిని "నీవే మయినా చెప్పుఅమ్మాయి, రమేష్ ప్రజ్ఞ సంపాదిస్తున్నాడు" అంటూాండేవాడు.

"అపశృతులలో ప్రజ్ఞా?" అనేది హేమాలిని కొంటెగా.

"లేదు లేదు. మొదటిరోజుల కంటే యిప్పుడు బాగా అభివృద్ధి చేశాడు. యిలాగే కొన్నిరోజులు సాధకం చేశా డంటే తప్పకుండా పేరులోకి వస్తాడు. దేనికైనా అభ్యాసం అనేది కావాలి. అంతే. ఒకసారి ట్యూన్ కంఠతాపడితే తరు వాత యిక యిబ్బంది వుండదు."

సరే, యిటువంటి మాటలకు సాధారణంగా జవాబు వుండదు. ఆయన ధర్మసూత్రాలు చెబుతూ కూచుంటే యింట్లోవాళ్ళంతా చెవులు నిక్కబొడుచుకుని శ్రద్ధగా విన వలసిందేగాని మరేంకాదు.

## 11

బెంగాల్‌లో "పూజ" సెలవులు ఇంగ్లీషువాళ్ళ "క్రిస్ట మస్''సమయంలోనే వస్తాయి. పదిరోజులపాటు అందరికీ సెల వులు యిచ్చేస్తారు. కుటుంబంలో వున్నవాళ్ళందరూ కులా సాగా కలుసుకుంటారు.

దాదాపు ప్రతిసెలవులకు, ఆనందబాబు, హేమాలిని రైలువాళ్ళు యిచ్చే కన్‌సెషన్ తిరుగుప్రయాణపు టికెట్లు కొనుక్కుని గాలిమార్పుకోసం జబల్పూర్ వెళ్ళిరావడం అలవాటువుంది. అక్కడ ఆనందబాబు సోదరి భర్త గవర్న మెంటుసర్వీసులో వున్నాడు. ఆనందబాబు సంవత్సరాని కొక

మారు చేసే ఈ ప్రయాణాన్ని తన అజీర్తిరోగానికి తగిన మందుగా భావిస్తూవుంటాడు.

ఇప్పుడు సెప్టెంబరు నెల ప్రారంభం. సెలవులు యింకా ఎంతో దూరంలో లేవు. ఆనందబాబు ప్రయాణ సన్నాహాలతో సతమతమవుతున్నాడు. హేమాలిని ఊళ్ళో వుండకపోతే హార్మోనియం పాఠాలకు నాగాపడుతుంది. ఒకరోజు మామూలు మాటలసందర్భంలో హేమాలిని "యేం రమేష్, నీవుకూడా గాలిమార్పుకోసం కలకత్తా కొన్నిరోజులపాటు వదిలివేయడం మంచిదనుకుంటాను, ఏమంటావు ?" అన్నది. ఈ విషయమే తండ్రితో కూడా చెప్పింది. ఆయన యీ ప్రతిపాదన నింపాదిగా విని ఆమోదించాడు. రమేష్ తండ్రిగారు యిటీవలనే పోయివారుగద ! అందుచేత అతనా విచారంలో కృంగిపోయాడు. ఈ గాలిమార్పు అతని మానసిక స్థితిని మెరుగుపరచటానికి బాగా నేవుంటుంది. ఇలా ఆలోచించుకుని ఆయన "కొద్దిరోజుల గాలిమార్పు నిజంగా యెంతో ఆరోగ్యకరమైనది. రమేష్, ఏనయినా కొత్తఊరికి వెళ్ళామంటే ఆ కొత్తదనం మొదటి ఒకవారం రోజులవరకే వుంటుంది. తరువాత అంతా అలవాటయిపోతుంది. అందుచేత గాలిమార్పుకోసం ఎక్కడికి వెళ్ళినా వారంరోజులే వుండి తిరిగి వస్తూవుంటాను" అన్నాడు.

హేమాలిని "రమేష్‌బాబు, నీ వెప్పుడయినా నర్మద చూచావా ?" అనడిగింది.

"లేదు. ఎప్పుడూ అక్కడికి వెళ్ళలేదు."

"నీవు తప్పకుండా చూడవలసిన చోటు కాదూ,

నాన్నగారు ?"

"అవును. తప్పకుండా చూడాలి. ఏం రమేష్ మాతో పాటు రారాదూ! గాలిమార్పు వుంటుంది. ఆ ప్రదేశం చూచి నట్లూ అవుతుంది."

రమేష్ యీమాటలు కాదనలేదు; ఆమోదించి ఊరు కున్నాడు.

ఆరోజు అతని శరీరమంతా గాలిలో తేలియాడు తున్నట్లు వుంది. తన హృదయతాపాన్ని ఆపుకోవటానికి, తలుపులు వేసుకుని హార్మోనియం వాయించాడు. హేమా లినినుంచి వియోగం అంటే అతని హృదయం పరితాపంతో విలపిస్తోంది. ఇప్పుడు యీ వియోగం యేర్పడకుండా పోతోంది గనుక సంతోషంతో అతను యిష్టం వచ్చినట్లల్లా హార్మోనియం వాయిస్తున్నాడు.

ఇంతలో ఎవరో తలుపుతట్టారు. "రమేష్ బాబు ? ఏం చేస్తున్నావురువ్వా. వాయిద్యం ఆపుచెయ్యి. భగవాన్ !" అని కేకలుకూడా వినిపించాయి.

రమేష్ ఖంగారుగా ఎర్రబారిన ముఖంతో తలుపు తెరిచాడు. అక్షయలోనికి వచ్చాడు. వస్తూనే ఇలా అన్నాడు: యేం రమేష్ ? నీవు చేస్తున్న యీ గందరగోళంవల్ల, నీ కోర్టు లోనే నీమీద నేరం మోపుతారేమో !"

రమేష్ నవ్వుతూ "నేరం వొప్పుకుంటాను" అన్నాడు.

"సరే. రమేష్‌బాబు, ఇప్పుడు నీతో కొంతసేపు మాట్లాడదామని వచ్చాను. యేమంటావు ?" అన్నాడు.

ఇతను యేంగొడవ తెచ్చిపెడతాడాలని ఆలోచిస్తూ

రమేష్ శ్రద్ధగా ఆలకించటానికి తయారుగా కూర్చున్నాడు.

"ఈసరి. నీకు యీవిషయం తెలిసే వుంటుంది. హేమాలినిక్షేమం నాకు అలక్ష్యం చేయవలసిన విషయం కాదు."

రమేష్ అవునని గాని కాదనిగాని చెప్పలేదు. అక్షయ మాటలు వినడానికి మటుకు సిద్ధంగా కూర్చున్నాడు.

"ఆనందబాబు స్నేహితుడి హోదాలో, హేమాలినితో నీ సంబంధం యేమిటో అడుగుదామని వచ్చాను" అన్నాడు అక్షయబాబు.

రమేష్ ఆ మాటలను కంఠస్వరాన్నికూడా అసహ్యించుకున్నాడు. అయితే జవాబు చెప్పడానికికూడా అతనికి ఉత్సాహము, ఓపిక లేవు. అతి ప్రయత్నంమీద నింపాదిగా యిలా అన్నాడు. "నాకు యేదైనా దురభిప్రాయాలు, దురూహాలూ ఉన్నట్లునీకు అనుమానంగావున్నదా యేమిటి?"

"శ్రద్ధగా విను. నీవు సనాతన హిందూ కుటుంబానికి చెందినవాడివి. నీ తండ్రి హిందువు. నీవు యే బ్రహ్మసమాజపు అమ్మాయినో వివాహం చేసుకుంటావనే భయంతోనే నిన్ను ఆరోజు మీనాన్న ఊరికి లాక్కు వెళ్ళాడు. ఈ విషయం నాకు బాగా తెలుసు."

—ఈ విషయం అక్షయకు తెలియడంలో యేమీ ఆశ్చర్యంలేదు. ఏమంటే ఆ ముసలాయనకు యీ విషయం చేరవేసిందే అతను, కొన్నిక్షణాలపాటు రమేష్ అక్షయ ముఖంలోకి సరాసరి చూడలేకపోయినాడు.

"మీనాన్నగారు అకస్మాత్తుగా చనిపోయినారుకనుక

యిక నీ ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించ వచ్చుననుకుంటున్నావా? కాని ఆమెను కోరిక-"అంటూ అక్షయ తిరిగి ఆరంభించాడు.

రమేష్ మధ్యలోనే అందుకుని "అక్షయ బాబూ, యింకే విషయంలోనైనా నీ సలహా యివ్వదలచుకుంటే తక్షణం యివ్వు, పాటిస్తాను. అంతేకాని మా తండ్రి కొడుకుల సంబంధవిషయంలో మటుకు నీ ప్రమేయం యేమీ అక్కర్లేదు సుమా!" అన్నాడు.

"అలాగే! అయితే ఆ విభాగం అలా వదిలేద్దాం. కాని నాకో విషయం తెలుసుకోవాలని వుంది. అదేమిటంటే నీవు హేమాలినిని వివాహం చేసుకుందామనుకుంటున్నావా? నీవు ఆ స్థితిలో, అందుకు తగ్గ స్థాయిలో, వున్నాననుకుంటు న్నావా?"

రమేష్ ప్రశాంత స్వభావానికి యీ దుడుకు ప్రశ్నలు, అందున వడివడిగా వచ్చిన ప్రశ్నలు పట్టవు.

"అక్షయ బాబూ! నీవు ఆనందబాబుకు స్నేహితుడి వయితే కావచ్చును. కాని నీకూ నాకూ అంత పరిచయం, స్నేహం లేవు. అందుచేత యీవిషయాలు మనం చర్చించుకో నవసరం లేదు. దయచేసి యీ చర్చ ఇంతతో ఆపు" అన్నాడు రమేష్.

"అలాగే ఆపుతాను. కాని ఈ ఆపడంవల్ల ఫలితం, నీ విలాగే జీవితాన్ని విలాసవంతంగా గడుపుకుంటూ కులా సాగా వుండటమే అయితే, చివరకు రాగల ఫలితాన్ని గురించి నీ కేమీ ప్రమేయం లేకపోయేటట్లయితే— అలాగే కానీ. ఇక నేను చెప్పవలసింది కూడా యేమీ

వుండదు. అయితే యీ సమాజం, నీబోటి కులాసా పురుషులు తేలియాడే విహార రంగం కాదు. ఇక్కడ ప్రతి "చర్య" కూ "ప్రతిచర్య" వుంటుంది. బహుశ నీ ఆశయాలు మహోన్నతమైనవే కావచ్చు. ప్రపంచాన్ని గురించి నీకేం నిమిత్తం లేకపోవచ్చు. కాని హేమాలినివంటి సాంఘిక స్థాయిలోవున్న అమ్మాయితో యిప్పుడు ఊరికే ఆటలాడితే, ముందు ఒకరోజు దానికి సంజాయిషీ యివ్వవలసివుంటుంది. ఈ సంజాయిషీ కోరువారు కొందరు వుంటారు. నీవు గౌరవించే వ్యక్తులను ప్రపంచం అగౌరవంగా చూడడం నీకు యిష్టమే అయితే, సరే. నీ పద్ధతిలోనే నడువు. నేనేం చెప్పలేను ?"

"నీ సలహాకు ఎన్నో వందనాలు. నేనుకూడా యీ విషయాన్ని గురించి ఆలోచించి త్వరలోనే, ఒక నిర్ణయానికి వస్తాను ఆ నిర్ణయాన్ని తు. చ. తప్పకుండా అమలు పరుస్తాను. ఈ విషయంలో యింక నువ్వేమీ ఆదుర్దాపడకు. యిక ముందు యీ విషయం మనం చర్చించ నవసరంలేదు కూడా !" అన్నాడు రమేష్.

"నీవలా అనడం నాకు సంతోషంగావుంది ! యిప్పటికయినా యీ విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తాననీ, నిర్ణయానికి వస్తాననీ, ఆ నిర్ణయానికి కట్టుబడివుంటానని హామీ యిచ్చావు అంతేచాలు ! పోతే నీ పేపనంతా యింతకుముందే చేసివుండవలసింది. ఏమయినా, యీ విషయం నీతో చర్చించడం నాకు యిష్టంలేదు సరే, నీ సంగీతాధ్యయనానికి అడ్డువచ్చినందుకు క్షమించు. నీ సాధకం కానివ్వు. ఇక అడ్డురానులే" అంటూ అక్షయ హడావడిగా

వెళ్ళిపోయాడు.

రమేష్‌కు యిక సంగీతంమీద ధ్యాసపోలేదు.

తలకింద చేతులు పెట్టుకుని చాపమీద పడుకుని దొర్లాడు. ఇలా గంటలు గడిచిపోయాయి. అకస్మాత్తుగా గడియారం అయిదుగంటలు కొట్టింది. రమేష్ తటాలున లేచి కూర్చున్నాడు. అతనేమి నిశ్చయానికి వచ్చాడో ఆ భగవం తుడికే తెలియాలి. కాని అతని తత్క్షణకర్తవ్యం పక్కయింటికి వెళ్ళి రెండు కప్పుల టీ సేవించడం.

హేమాలిని యితన్ని చూడగానే "యేం, రమేష్, సుస్తీగా వున్నదా?" అనడిగింది.

"అబ్బే, యేమీ లేదు."

"అజీర్తి చేసివుంటుంది. అంతకంటె యింకేం లేదు. నేను వాడే మాత్ర ఒకటి నీవు కూడ ప్రయోగించి చూడు-" అన్నాడు ఆనందబాబు.

హేమాలిని చిరునవ్వు నవ్వి "యేం, నాన్నగారూ! స్నేహితులందర్నీ మీ మాత్రలే వాడమంటారేం? వాటిలో యేసుగుణమూ వున్నట్లు నాకు కనిపించదే!" అన్నది.

"ఈ మాత్రలను మించింది యీ భూప్రపంచంమీద మరొకటి లేదు. నేను అనుభవంమీద చెబుతున్నాను" అన్నాడు ఆనందబాబు.

"క్రొత్తమాత్రలు యేవి మొదలుపెట్టినా, మొదటి నాలుగు రోజులు యింతకంటే బ్రహ్మాండమైనవి యింకేమీ లేవు అంటూనే వుంటారు!"

"మీరు ఎవరూ నేనుచెప్పే మాటలు వినిపించుకోరు.

పోనీ అక్షయబాబును అడిగిచూస్తాను, నా మాత్రలు అతనికి పనిచేసినవో లేదో!''

హేమాలిని ఆ విషయాన్ని అంతటితో ఆపుచేసింది. ఆమె భయం మేమంటే యిప్పుడు తండ్రిగారు అక్షయబాబును పిలుచుకువచ్చి సాక్ష్యం యిప్పిస్తారేమోనని.

సాక్షి ఎలాగూ ఆసమయానికి రానేవచ్చాడు. అతను వస్తూనే ఎవరూ అడగకుండానే మాత్రలకో యోగ్యతాపత్రం పడేశాడు. ఆనందబాబుతో ఇలా అన్నాడు. ''మీమాత్రలు మరొక డోసు యివ్వండి. నిన్న యిచ్చినవి మాబాగా పనిచేశాయి. యివాళ ఎంతో కులాసాగా వుంది !''

ఆనందబాబు విజయగర్వంతో కూతురివంక చూచాడు.

# 12

ఆనందబాబు మాత్ర తీసుకోవడంతోటే అక్షయను పంపివేద్దామనుకున్నాడు. కాని అక్షయకు అంత తొందరగా వెళ్ళవలసిన పనేమీ వున్నట్లులేదు. అంచేత అక్కడే వుండి పోయి ఓరకంట రమేష్‌వంక చూస్తున్నాడు. రమేష్ ఇతన్ని ప్రత్యేకంగా గమనించడంలేదు. అయినా అక్షయ తనవైపు అయిష్టంగా చూడడం గమనించకపోలేదు.

జబల్పూరు వెళ్ళవలసిన సమయం ఆసన్నమవుతోంది. అందువల్ల హేమాలిని యీ యేర్పాట్లలో సతమతమవుతోంది. రమేష్ యీసారి వచ్చినప్పుడు సెలవుల్లో చదువవలసిన పుస్తకాలజాబితా తయారుచేయాలనుకుంది. అందుకని అతన్ని కాస్త పెందరాళే రమ్మనికూడా చెప్పింది. ఏమంటే

టీ కైమముదాకా ఆలస్యంచేస్తే అత్తయగాని, మరెవరయినా స్నేహితులుగానీ వచ్చి మాటలగోడవ పెట్టుకు కూర్చుంటారు. అందువల్ల ఆ సమయం మంచిదికాదు.

కాని ఆ రోజు రమేష్ మామూలుకంటే ఆలస్యంగా వచ్చాడు. ఆ రావడంకూడా యేదో ఆలోచిస్తూ పరధ్యాసగా వచ్చాడు. హేమాలిని ఉత్సాహం అడుగంటిపోయింది. నింపాదిగా అతనితో యిలా అంది : "ఈ రోజు చాలా ఆలస్యంగా వచ్చావుకదూ ?"

రమేష్ మనస్సు యింకెక్కడో వుంది.

"అవునవును. ఆలస్యం అయింది'' అన్నాడు ఒక క్షణం ఆగి.

హేమాలిని సకాలానికి తయారై కూర్చుందామనుకుంది. ఆమె మధ్యాహ్నమే తలదువ్వుకుని దుస్తులు మార్చుకుని కూర్చుంది. కూర్చున్నదగ్గరనుంచీ కళ్ళు గడియారంమీదే వున్నాయి.

చాలాసేపటివరకు బహుశ రమేష్ గడియారం నింపాదిగా నడుస్తోందేమోనని సముదాయించుకుంది. ఏ క్షణంలోనైనా అతను వస్తాడని ఎదురుచూస్తూకూర్చుంది. కాని ఎంతసేపు అలా కూర్చున్నా లాభంలేకుండాపోయింది. విసుగుపుట్టి కిటికీదగ్గర కూర్చుని కుట్టుపని ఆరంభించింది. తన అశాంతిని జయించడానికి యిదే మార్గం. అన్నిటికంటే ఎక్కువ రమేష్ వచ్చినతరువాత, అతని పరధ్యానం చూచి ఆమెకు మరీ యిదనిపించింది. అతను తొందరగా వస్తానని చెప్పిన విషయమే మరిచిపోయినట్లున్నాడు !

ఆ రోజు 'టీ' వేళ హేమాలినికి పరీక్షా సమయంలా రూపొందింది. ఆ లాంఛనం అయినతరువాత, ఆమె రమేష్ ధ్యాసను తనవైపు మళ్ళించాలని ప్రయత్నించింది. గోడకు ఆనుకునివున్న బల్లమీద కొన్ని పుస్తకాలు వున్నాయి. ఆమె వాటిని పక్కగదిలోకి తీసుకువెళ్ళటానికి కన్నట్లుగా సర్దుతోంది. ఈ చర్య రమేష్‌ను యథాస్థితికి తీసుకువచ్చినట్లయింది.

"ఎక్కడికి తీసుకువెడుతున్నావు?" అనడిగాడు.

"మనం మనతో పాటు తీసుకువెళ్ళవలసిన పుస్తకాలను యెంచుకుందాం అనుకున్నది యివాళనేగా!" అంది హేమాలిని.

హేమాలిని పెదిమలు వణుకుతున్నాయి. అతికష్టం మీద అశ్రువులను ఆపుకుంది. ఆమె కళ్ళుమటుకు నీళ్ళతో నిండినాయి.

గద్గదస్వరంతో "పోనీలే, యిప్పుడానిని కదరదిక—" అంటూ ఆ పుస్తకాలను తీసుకుని మేడమీదికి హడావడిగా వెళ్ళిపోయింది.

ఆమె అలా వెళ్ళిపోవడం రమేష్‌కు కష్టం కలిగించింది.

"నీ వివాళ కులాసాగా వున్నట్లు లేవే!" అన్నాడు అక్షయ ఎగతాళిగా నవ్వుతూ. రమేష్ యేదో జవాబు చెప్పాడుగాని ఎవరికీ వినబడలేదు. అర్థంకాలేదు. ఆనంద బాబు మాత్రం అందుకుని "అవును. నేనుకూడా చూడగానే యీ మాట చెప్పాను" అన్నాడు.

అక్షయ యింకా యిలా కొనసాగించాడు: "రమేష్

వంటివారు ఆరోగ్యాన్ని గురించి అంత లక్ష్యపెట్టకపోవటం గొప్ప విషయంగా భావిస్తారు. వారు మేధావులు. అందుచేత ఎంతసేపూ మానసికంగానే ఆలోచిస్తారు గాని, శారీరక యిబ్బంది సబ్బందులను గురించి లక్ష్యపెట్టరు. అవి కేవలం అల్పమైన విషయాలు."

ఆనందబాబు, మనిషన్నవాడికి జీర్ణశక్తి సటిష్టంగా వుండితీరాలన్న విషయాన్ని గురించి చెప్పుకుపోసాగాడు. రమేష్ యీ మాటలన్నీ భరిస్తూ నిశ్శబ్దంగా అక్కడే కూర్చున్నాడు.

చివరకు అక్షయబాబు "ఇంతకూ నీకు నేను యివ్వబోయే సలహా యేమిటంటే, లక్షణంగా ఆనందబాబుగారి దగ్గర మాత్రలు తీసుకువేసుకుని, యీ రాత్రికి లక్షణంగా నిద్రపో!" అని ముగించాడు.

"నేను ఆనందబాబుగారితో కొన్ని విషయాలు మాట్లాడాలి. అందుకు అవకాశంకోసం కాచుకునివున్నాను" అన్నాడు రమేష్.

అక్షయ వెంటనే కుర్చీలోంచి లేచాడు. ఆ విషయం కాస్తముందుగానే చెప్పకపోయినావా ! రమేష్ ఎప్పుడైనా ఒక విషయాన్ని గురించి గంట తరబడి ఆలోచించి, చివరకు బాగా ఆలస్యం అయాక ఎవరినైనా కొట్టేస్తాడు —" అక్షయబాబు ఆనందబాబుదగ్గర సెలవుతీసుకుని వెళ్లాడు.

అతని బుర్రలవంక తదేకంగా చూస్తూ రమేష్ యిలా ప్రారంభించాడు: "ఆనందబాబు, నాకు మీ యింట్లో యిచ్చిన స్థానానికి మీకు ఎంతగానో కృతజ్ఞుడిని. నన్ను

కాదాపు మీ స్వజనంలో ఒకడిగా భావిస్తున్నారు అందుకు నాకెంతో సంతోషంగా వుంది."

"అది సరే, దానికేముంది ? నీవు మహా జోగేశ్ కు స్నేహితుడవు. అందుచేత నిన్ను వాడి సోదరుడుగానే చూడటం మా కనీస కర్తవ్యం" అన్నాడు ఆనందబాబు.

రమేష్ పరిస్థితి, నృత్యంచేయడానికి నిలబడి అడుగు వేయలేకపోయిన రీతిగా వుంది.

అతనికి దారి సుగమంచేస్తూ ఆనందబాబు యింకా యిలా అన్నాడు: "నిజానికి, నీబోటివారు తరచు మా యింటికి వచ్చి వెడుతున్నందుకు మేమే ఎంతో కృతజ్ఞులమై వుండాలి."

రమేష్ యికమీదటకూడా మాట్లాడలేక పోయాడు. ఆనందబాబే యిలా అన్నాడు "చూచావా! గ్రామమధ్య హేమాలిని, నిన్నుగురించి" ఎన్నో గుసగుసలు జనం లుదేసు తున్నాయి. ఏమంటే, ఈరోజుల్లో అమ్మాయిలకు పెళ్ళి యీడు వచ్చిందంటే, చుట్టుపక్కలవాళ్ళను గురించి ఎంతో జాగ్రత్తగా వుండాలి నేను మాత్రం అందరికీ—రమేష్‌లో నాకు పూర్ణవిశ్వాసం వుంది అతను మమ్మల్ని అమర్యాద పాలుచేయడు—అని చెబుతూవస్తున్నాను."

"ఆనందబాబూ! మీకు నన్నుగురించి అంతా తెలుసు కదా! మీకుయిష్టం అయితే—హేమాలినిని నేను వివాహం చేసుకుంటాను"

"యింకేమీ చెప్పక్కర్లేదు. ఈ విషయంలో నేను యిదివరకే నిర్ణయానికి వచ్చేశాను. ఇంకా నీవు మీ తండ్రి

గాను పోయిన విచారంలో వున్నావు గనుక, యింకా నీతో మాట మాత్రంగా అనలేదు, సరే. యిక ఆ క్షణాన్ని వాయిదా వేయవలసిన అవసరం లేదు. జనం ఊరాడు, రకరకాలుగా అనుకుంటారు. మనం వాటినన్నిటినీ అరికట్టివేయాలి. నీకు అంగీకారమే కదూ ?"

"మీ యిష్టం ఎలాగో అలాగే. ఇంతకూ ముందు అడగవలసింది మీ అమ్మాయిని కదా!" అన్నాడు రమేష్.

"నిజమే. కాని నాకు ఆమె కేదియిష్టమో తెలుసు. ఏమయినా, రేపు ఉదయం యీ విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వద్దాం."

"చాలా ఆలస్యంఅయినట్లుంది. మిమ్మల్ని మాటల్లో పెట్టివుంచాను, సరే, సెలవు."

"ఒక్క నిమిషం. నా ఉద్దేశ్యం, మనం జబల్పూరు వెళ్ళడానికి ముందే యీ వివాహం జరిపితే మంచిదేమో!"

"తొందరలోనే ?"

"అవును. పదిరోజులే విరామం. వచ్చే ఆదివారం నాడే వివాహం జరగవచ్చు. అంటే అప్పటికి మన ప్రయాణానికి రెండు మూడు రోజులు టైం వుంటుంది. ఊరికే నిన్ను తొందర పెడుతున్నాననుకోకు. నా ఆరోగ్యం మంచిదికాదు. అందుకని చెబుతున్నాను."

రమేష్ అంగీకరించాడు. ఆనందబాబుగారిదగ్గర ఒక మాత్ర తీసుకొని తన బసకు వెళ్ళాడు.

8]

# 13

కమల పాఠశాల కొద్దిరోజులలోనే మూసివేస్తారు. అయితే రమేష్ హెడ్ మిస్ట్రెస్‌తో మాట్లాడి కమల సెలవుల్లో కూడా అక్కడే వుండగల యేర్పాటు చేశాడు.

ఆరోజు ఉదయం ఆనందబాబుతో వివాహాన్ని గురించి మాట్లాడినమీదట, రమేష్ ఒంటరిగా కొంతసేపు నడక సాగించాడు. వివాహానికి ముందుగానే హేమాలినికి కమల విషయం పూర్తిగా చెప్పివేద్దాం అనుకున్నాడు. తరువాత యీ విషయమంతా కమలకు విపులంగా చెప్పవచ్చును. అప్పుడు యిక వేరుఅర్థాలు తీసుకొనడానికి అవకాశంవుండదు. కమల హేమాలినితో హాయిగా స్నేహం చేస్తుంది. అప్పుడు ముగ్గురూ కలిసి ఒకయింటిలోనే వుండవచ్చు. తన వాళ్ళతోనే వుంటే ఏమయినా గొడవలు జరగటానికి అవకాశంవుంది కనుక, రమేష్ హజారిబాగ్‌కు బసమార్చి అక్కడే ప్రాక్టీసుగూడా పెడదామనుకున్నాడు.

షికారునుంచి తిరిగివస్తూ రమేష్ ఆనందబాబు యింటి వైపు చూచాడు. మెట్లమీద హేమాలిని అగుపించింది. సాధారణ పరిస్థితుల్లోఅయితే అటువంటి సమావేశం, కొంత కులాసా సంభాషణకు దోహదం చేసేది. కాని ఇప్పుడు హేమాలిని సిగ్గుపడింది. ప్రభాతకాంతిలాంటి నవ్వు ఆమె ముఖంమీద ఒకక్షణం ఆవరించింది. తరువాత తల కిందికి దించుకుంది.

రమేష్ తన బసకు తిరిగివచ్చి హార్మోనియంమీద హేమాలిని నేర్పిన సంగీతసరళి వాయించసాగాడు. కాని రోజంతా ఒకేసరళి వాయిస్తూవుండడం అసాధ్యమైన పనికద! అందుచేత కవిత్వం పుస్తకం ఒకటి తిరగేశాడు. కాని కవిత్వం తన ప్రేమ అంత ఎత్తును చేరుకోలేదనిపించింది.

హేమాలినికూడా ఆ వుదయం గాలిలో తేలిపోయింది. మధ్యాహ్ననికల్లా ఆమె యింటిపనంతా అయిపోయింది. గదిలోకివెళ్ళి తలుపులు బిగించుకుంది. కుట్టుపని చూచుకుం టోంది. ఆమెమనసు ఆనందంలో ఓలలాడుతోంది. తన జీవిత మంతా యీ మధురక్షణంచుట్టూ వలవన్నినట్లుంది.

మామూలు టీ వేళకంటే కొంచెం ముందుగానే, రమేష్ పుస్తకము- హార్మోనియం పక్కకుపెట్టి ఆనందబాబు ఇంటికి వెళ్ళాడు. మామూలురోజుల్లో ఐతే హేమాలినిగదిని చక్కగా అమర్చి అతనిరాకకోసరం ఎదురుచూస్తూ వుండేది. కాని ఇవాళ గది కాళీగావుంది. మేడమీద ముందుగదిలో కూడా ఎవరూలేరు. హేమాలిని ఇంకా తనగదిలోనే వుంది. ఆనందబాబు సరీగా సమయానికి వచ్చి టీ బల్లముందు కూర్చున్నాడు. రమేష్ నీరసంగా తలుపువంకచూస్తూ కూర్చున్నాడు.

పదసవ్వడి వినబడింది. కాని వచ్చినది అక్షయబాబు. అతను రమేష్‌ను అత్యంత స్నేహపాత్రంగా పలకరించాడు. "హల్లో రమేష్. యిప్పుడే నీ గదికివెళ్ళి వస్తున్నాను–"

రమేష్ యీ మాటలు చికాగ్గా విన్నాడు.

అక్షయునవ్వి ముందుకు సాగిపోయాడు. "మరేం భయ

పడకు రమేష్‌బాబు, నేనిప్పుడు అతిస్వల్పమైన విషయం మీద వచ్చాను. ఈ శుభవార్త విన్నమీదట నీస్నేహితులు నిన్ను తప్పకుండా అభినందించాలి. నేను అందుకనే వచ్చాను ''

ఈ మాటలతో ఆనందబాబుకు హేమాలిని లేక పోవడం స్ఫురించినట్లయింది. ఆమెను పిలిచాడు. జవాబు రాలేదు. అందుచేత తానే స్వయంగా మేడమీదికి వెళ్ళి "యేమిటిది హేమా! యింకా నీ కుట్టుపనిలోనే వున్నావా? టీవేళ అయింది. రమేష్, అక్షయ వచ్చారు" అన్నాడు.

"కుట్టు మధ్యలో వున్నాను. నా టీ ఇక్కడికే పంపించండి నాన్నా" అంది హేమ.

"నీ పద్ధతే ఇంత హేమా! ఒకపని మొదలెట్టావంటే అది పూర్తయేవరకు మరోధ్యాస పెట్టుకోవు, ముఖంపైకెత్తవు, పరీక్షలకు చదివేటప్పుడు, పుస్తకం ముందునుంచి లేవవు. ఇప్పుడీ కుట్టుపని పెట్టుకుని ఇందులోనే సతమతమవుదామనుకుంటున్నావా? అదేం కుదరదు. కిందికివచ్చి మా అందరితో పాటు టీ తీసుకుందువుగాని, రా" అంటూ ఆయన నిజానికి కూతుర్ని కిందికి లాక్కువచ్చాడు. ఆమె సరాసరి కిందికి వచ్చేసి కప్పుల్లో టీ పోసింది. అతిథులను పలకరించటానికి కళ్ళెత్తయినా పైకిచూడలేదు.

"అదేమిటి హేమా! నాకప్పులో పంచదార వేస్తున్నావు. నేను వేసుకోనుగా!" అన్నాడు ఆనందబాబు. అక్షయ అందుకుని "హేమాలిని ఇవాళ తన ఔదార్యాన్ని దాచుకోలేక పోతోంది. అందరికి తీపి పంచిపెడుతోంది."

అక్షయ ఇలా అయినదానికీ, కానిదానికీ కల్పించుకుని తామిద్దరినీ ఎత్తిపొడుస్తూవుండటం రమేష్ సంబాళించుకో లేకపోయాడు. తమ వివాహం అయితే అతనినోరు కట్టుపడు తుంది. అప్పుడతన్ని తమ స్నేహితుల జాబితాలోనుంచి కొట్టివేయవచ్చుగూడా......

కొన్నిరోజులు గడిచాక, వాళ్ళునలుగురూ టేబుల్ దగ్గర కూర్చొని వున్నప్పుడే— అక్షయ యిలా అన్నాడు. "రమేష్‌బాబు! నీపేరు మార్చుకోవడం మంచిది."

అక్షయ హాస్యధోరణి రమేష్‌కు కంటకంగా వుంది అయిష్టం ఎక్కువవుతోంది. "ఎందుకని?" అన్నాడు.

"ఇదుగో యీ పేపర్లోచూడు. రమేష్ అనే విద్యార్థి తనబదులు మరొకుర్రవాడిని పరీక్షకు కూర్చోబెట్టాడు. అలా చేసి పరీక్ష ప్యాసయాడు, కాని చివరకు పట్టుబడిపోయాడు."

రమేష్‌కు వెంటనే మాటతిప్పికొట్టటం చేతగాదని హేమాలిని ఎరుగును. వెంటనే ఆమె అందుకుని "అలా అయితే జైళ్ళన్నీ అక్షయలతో నిండిపోతాయి." అంది.

అక్షయ "నేను ఊరికే సరదాగాఅంటే, అలా కోప్పడ తావేం? సరే, నీకు కథంతా పూర్తిగా చెబుతాను విను. నా చెల్లెలు "సరత్" తెలుసుగదూ? నిన్నసాయంత్రం ఉన్న ట్లుండి నా దగ్గరకువచ్చి— అన్నయ్యా, మీ రమేష్‌బాబు భార్య మా బళ్లో చదువుతోంది అంది

"నేను— పిచ్చిదానా! ప్రపంచంలో రమేష్‌బాబు అంటే నా స్నేహితుడు ఒక్కడే ననుకున్నావా యేమిటీ." అన్నాను. అందుకు నా చెల్లెలు—''అతను ఎవరయితేనేంగాని

మొత్తానికి నిర్దయుడు. అందరు అమ్మాయిలూ సెలవులకు సరదాగా యిళ్ళకు తిరిగి వెడతారు. కాని, అతను ఆ అమ్మాయిని స్కూల్లోనేవుండేట్లు యేర్పాటుచేశాట్ట! ఆ అమ్మాయి పాపం భోరున యేడుస్తోంది."

"అప్పుడు నేను అనుకున్నాను. ఇంకెవరయినా నా చెల్లెలులా పొరపాటు చేయకుండా, రమేష్ తన పేరు మార్చుకుంటే మంచిదని!"

ఆనందబాబు విరగబడి నవ్వసాగాడు. "అక్షయ, నీకు పిచ్చెక్కింది. ఎవడో రమేష్ తనపెళ్ళాన్ని సెలవుల్లో బళ్ళోనే అట్టేబెడితే, మనరమేష్ తనపేరెందుకు మార్చుకోవాలి?" అన్నాడు. కాని రమేష్ ముఖం తెల్లగా పాలిపోయింది. గది వదలి బయటకు వెళ్ళిపోయాడు.

"అదేమిటి రమేష్‌బాబు! ఎందుకలా వెళ్ళిపోతావు? నీకుకోపం తెప్పించానా? నేను నిన్నేం అనుమానించడం లేదు, తెలుసా?" అంటూ అక్షయ రమేష్ వెంట వెళ్ళాడు.

"ఏమిటో గొడవంతా!" అంటూ ఆశ్చర్యపోయాడు ఆనందబాబు. ఆయన ఆశ్చర్యానికితోడు హేమాలిని యేడుపు సాగించింది. "ఎందుకు హేమా! ఏడుస్తున్నావు?"

"నాన్నా! అక్షయ అలా మాట్లాడటం ఉచితంకాదు. మనయింట్లో మనఅతిథిని అలా అవమానిస్తాడా?" అంది వెక్కుతూ.

"అక్షయ ఊరికే తమాషాకు అన్నాడు. దానికి అంతగా బాధపడడం ఎందుకు?"

"నాకు యిలాంటి తమాషాలు పడవు." అంటూ

ఆమె మేడమీదికి పరుగెత్తింది.

కలకత్తా తిరిగివచ్చిందిలగాయతు రమేష్ కమలభర్తను కనుగొనడంకోసం నిమిషమైనా వృథాచేయకుండా శ్రమ పడుతున్నాడు. అతికష్టంమీద "ధోబాప్రకూర్" గ్రామం ఎక్కడో కనిపెట్టి, కమల మామగారైన తరణీచరణ్‌కు ఉత్తరం వ్రాశాడు. పైచెప్పిన ఉదంతం జరిగిన మరునాడే యీ ఉత్తరానికి జవాబువచ్చింది. తరణీచరణ్, తన మేన గోడలు భర్తఅయిన నళినాక్ష గురించి అంతకు వెనుక తనకేం తెలియదనీ, నళినాక్ష రంగపురంలో ప్రాక్టీసుచేస్తున్న డాక్ట రనీ వ్రాశాడు తరణీచరణ్‌కూడా అతన్నిగురించి కొంత దర్యాప్తుచేశాడట. కాని ఎవరూ తాము యెరుగమని అన్నా రట. అంతేకమించి నళినాక్ష స్వగ్రామంయేదో తనకు తెలి యదనికూడా వ్రాశాడు.

దీనితో రమేష్ కమలభర్తఇంకా సజీవుడై వున్నాడన్న నమ్మకాన్ని కోల్పోయాడు. ఆరోజు పోస్టులోనే మరికొన్ని ఉత్తరాలు వచ్చాయి. అతనిమిత్రులు చాలమంది తన వివా హాన్ని గురించి తెలుసుకుని అభినందిస్తూ వ్రాశారు. కొంత మంది డిన్నరు కావాలన్నారు. మరికొంతరు యిన్నాళ్ళా యీ విషయంగుప్తంగా వుంచినందుకు నిష్ఠూరాలాడారు. అతనీ ఉత్తరాలు చదువుకుంటూ వుండగా ఆనందబాబు నౌకరు అతనికో చీటీ తీసుకువచ్చాడు. ఆ దస్తూరీ చూడగానే అతనిగుండె దద్దరిల్లింది. అది హేమాలినినుంచి. "అక్షయు మాటలనుబట్టి ఆమె నన్ను అనుమానించి వుంటుంది. అది నిర్ధారణ చేసుకోవటానికి యీ చీటీ వ్రాసివుంటుంది" అను

కున్నాడు.

చీటీ విప్పిచూచాడు. చాలా చిన్నఉత్తరం. "నిన్న అక్షయ నీపట్ల అతిదారుణంగా ప్రవర్తించాడు. నాళ ఉదయం టీకి రాలేదేం? నీకోసం ఎదురుచూచాను. అక్షయబాబు మాటలను లక్ష్యపెట్టడం ఎందుకు? అతని వాగుడు ధోరణిని నేనేం లెక్క పెట్టనని తెలుసుగా! ఈరోజు తొందరగా రావాలి. నేనేం కుట్టుపనిలో కూచోనులే?"

ఈ చిన్న ఉత్తరం చదవగానే రమేష్‌కు హేమాలిని హృదయం ఎంతబాధపడిందో ఎంతపరితపించిందో అర్థం అయింది. అతని కళ్ళవెంట నీళ్ళువచ్చాయి. నిన్నసాయంత్రం నుంచి ఆమె తనకు తగిలిన గాయానికి మందు రాయాలని నిరీక్షిస్తోంది. రాత్రి, ఉదయం యీ చింతను భరించలేక ఎంతగానో బాధపడివుంటుంది. అందుకనే ఇప్పుడీ చిన్న ఉత్తరం వ్రాసింది—— అనుకున్నాడు రమేష్.

నిన్న సాయంత్రంనుంచి రమేష్, అసలు కథల సంగతంతా హేమాలినికి నివేదించాలనుకున్నాడు. కాని, యీ జరిగిన గందరగోళంమీదట, ఆపని కష్టమైంది. ఇప్పుడా కథచెబుతే, తప్పుచేసినదాన్ని సమర్థించుకోవటానికి ప్రయత్నిస్తున్నాడనుకుంటారు. పైగా యిది అక్షయకు ఘనవిజయం. దీన్నిగురించి ఆలోచించడమే సమంజసంగా తోచలేదు.

అక్షయబాబుగూడా ఆ రమేష్ వేరే ఎవరో అనే అనుకుని వుంటాడు. లేకపోతే అలా నవ్వులతో పోనిచ్చేవాడుకాదు. తన పరిశోధనను గురించి యింటికప్పు ఎగిరిపోయేట్లుగా అరిచి వుండేవాడు. ఈ ఆలోచనలన్నీ వచ్చి,

రమేష్ యీ గొడవనుంచి ఎలాగో యుక్తిగా తప్పించుకోవడం ఒక టేమార్గం అనుకున్నాడు.

పోస్టులోవచ్చిన మరో ఉత్తరం స్కూలు అధికారుల నుంచి. దానిలో సంగతి యేమిటంటే. కమల సెలవుల్లో స్కూలులోనే వుండటానికి సుతరామూ యిష్టపడడంలేదు. గనుక, ఆమెను శనివారంనాడు—అనగా సెలవుల ప్రారంభంరోజున రమేష్ యింటికి పంపుతున్నామని. అంటే కమల శనివారంనాడు వస్తుందన్నమాట. ఆదివారంనాడు తన వివాహం!

ఈ ఉత్తరం చదువుతుండగనే అక్షయబాబు తనగదిలోకి వచ్చాడు. "రమేష్ నన్ను క్షమించాలి. నిన్న సాయంత్రం నిన్ను గాయపరిచినట్లున్నాను. అయితే నేను యేమన్నానని? రోజూ సరదాగా అంటూవుండే మాటలేగా? అందులో యేమన్నా నిజం వున్నదికనకనా నువ్విలా కోపగించుకోవడానికి? అన్నదబాబు నన్ను కోప్పడుతున్నాడు. హేమాలిని నాతో మాట్లాడటమే మానివేసింది. నేను వాళ్ళను చూడ్డానికి యివాళ ఉదయం వెళ్లాను. నన్ను చూచి హేమ లోపలకు వెళ్ళిపోయింది. నేనంటే మీకందరికీ ఎందుకింత కోపం?" అన్నాడు.

"ఇప్పుడు నీతో మాట్లాడుతూ కూర్చోడానికి నాకు తీరుబడిలేదు. పనిలో వున్నాను. మరొకసారి కలుసుకుందాం" అన్నాడు రమేష్.

"ఓహో, వివాహానికి సన్నాహాలా? మేళగాళ్ళు అడ్వాన్సు కావాలంటారు; సరే నువ్వు చాలా యేర్పాట్లు

చేసుకోవాలిగా. నేను వెళ్ళివస్తాను. సెలవు."

అక్షయబాబు వెళ్ళిపోగానే రమేష్ త్వరత్వరగా ఆనందబాబు యింటికి వెళ్ళాడు. హేమాలిని అతనికోసమే ఎదురుచూస్తూ ముందుగదిలోనే కూర్చుంది. ఆమె కుట్టుపని సామాగ్రి బల్లమీద ఒకపక్కగా పడివుంది. ఆమె పక్కనే హార్మోనియంకూడా వుంది.

రమేష్ గదిలోకి రావడంతో ఆమె పెదవులమీద లేత చిరునవ్వు అవతరించింది. "మీనాన్నగారేరీ" అనడగటంతో ఆనవ్వుకాస్తా అంతరించింది.

"ఆయన గదిలోనే ఉన్నారు. ఎందుకు? యిప్పుడే కిందికి వస్తారుగా!"

"వెంటనే ఆయన్ను చూడాలి. చాలా అర్జెంటు."

"సరే. ఆయన గదిలోకి వెళ్ళు."

రమేష్ వెళ్ళాడు.

ఏమిటా అర్జంటు? అన్నీ దానికి లొంగిపోవలసిందే. ప్రేమకూడా అలా ఆగివుండవలసిందే. హేమాలిని తన కుర్చీని హార్మోనియంకు దూరంగా జరుపుకుని, కుట్టుపని చేతిలోకి తీసుకుంది. కాని ఆమె హృదయాన్ని ఓ కనిపించని ముల్లు బాధపెడుతోంది. రమేష్ ముఖ్యవ్యవహారం మరికొంత టైం పట్టేట్టుంది. ప్రేమ యింకా యాచనాస్థితిలో వుంది.

# 14

ఆనందబాబు, రమేష్ ప్రవేశించేసరికి, కుర్చీలో జోగుతూ పేపరుచదువుతున్నాడు. రమేష్ పొడిదగ్గు దగ్గాడు.

ఆనందబాబు పేపరుమీాదనుంచి ముఖంపైకెత్తి, నగరంలో కలరావల్ల చనిపోతున్నవారి సంఖ్య రోజురోజుకూ ఎక్కువవుతోంది అన్నవిషయాన్ని ప్రస్తావించాడు. రమేష్ సరాసరి అసలువిషయానికి వచ్చాడు.

"ఈ వివాహాన్ని కొద్దిరోజులు వాయిదావేయాలి. నాకు కొన్ని అర్జంటు పనులున్నాయి" అన్నాడు.

పిడుగులాంటి ఈ మాటతో ఆనందబాబుదృష్టి కలరా పీడితుల సంఖ్యనించి మరలింది. రమేష్‌వంక తేరిపార జూచాడు.

"యేమిటి రమేష్! ఆహ్వానాలుకూడా వెళ్ళిపోయినాయ్!"

"ఇవాళ ఉత్తరాలురాయవచ్చుగా!"

"రమేష్! నాఊపిరి ఆగిపోయేట్లుంది. ఇదేం కోర్టులో అడిగే వాయిదాలవంటిది కాదుసుమా! యేమిటా ముఖ్యమైనపనులు. అంత అర్జంటేమిటి?"

"చాలా అర్జంటు. వాటిని వాయిదా వేయడానికి వీల్లేదు" అన్నాడు రమేష్.

మొదలు విరిగిన చెట్టులా ఆనందబాబు కుర్చీలో కూలబడిపోయాడు.

"ఉహు. వాయిదావేయడానికి లాభంలేదు. సరే, నీ ఆలోచనబాగానేవుంది. నీ ఇష్టంవచ్చినట్లుచేయి, అయితే ఆహ్వానితులందరికి సర్ది చెప్పవలసిన భారం నీది. ఎవరైనా నన్ను అడిగితే నాకేం తెలియదు. అందరూ పెళ్ళికొడుకునే అడగండని చెబుతాను."

రమేష్ నేలవంక చూస్తున్నాడు. "హేమాలినితో చెప్పావా యీ విషయం?" అనడిగాడు ఆనందబాబు.

"లేదు."

"చెప్పొద్దుమరి! ఇది నీ వొక్కడి పెళ్ళే కాదుగా."

"ముందు మీాకే చెప్పాలనుకున్నాను."

"హేమా! హేమా!-?" అని పిలిచాడు ఆనందబాబు.

"ఏమిటినాన్నా" అంటూ హేమాలిని ప్రవేశించింది.

"రమేష్ కేదో అర్జంటు పనులున్నాయట. ఇప్పుడు పెళ్ళి చేసుకోటానికి తీరదంటున్నాడు."

హేమాలిని నిశ్చేష్టురాలైపోయింది. రమేష్ ముఖంవంక చూచింది. నేరంచేస్తూ చిక్కుపడిపోయిన మనిషిలా వున్నాడు రమేష్

నిజాన్ని ఇంతకంటే మార్పు చేయగలదేం లేదు. రమేష్‌కు అర్జెంటుపనులున్నాయి. వివాహానికి వాయిదా కావాలి. ఆ అర్జంటు పనులేమిటో చెప్పడు. అంతే!

ఆనందబాబు హేమాలినితో "సరే మీాఇష్టం. మీా ఇద్దరూ యేం జరగాలో నిర్ణయించండి."

"నాకేం తెలీదునాన్నా" అంటూ హేమాలిని బయటికి వెళ్ళిపోయింది. ఆనందబాబు పేపరు చదువుతున్నట్లు నటిస్తున్నాడు. కాని ఆయన తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. రమేష్ ఒకటి రెండునిమిషాలు మెదలకుండా కూర్చున్నాడు. తరువాత హఠాత్తుగా లేచి వెళ్ళిపోయాడు.

కిందిగదిలో, రమేష్‌కు హేమాలిని కిటికీదగ్గర నిలుచుని వీధివంకచూస్తూ అగుపించింది. రమేష్ ఆమె సరసనే

నిలుచోటానికి సందేహించాడు. కొద్దిసేపు ఆమెవంక చూచాడు. మెల్లిగా ఆమెను సమీపించాడు. ఆమె ఇతని రాకను గమనించినట్లులేదు. ఇంకా వీధివంకే చూస్తోంది. అతను గద్గదస్వరంతో నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ ఇలాఅన్నాడు: "నీతో చిన్నవిషయం ఒకటి చెప్పాలి."

హేమాలిని అతని కంఠస్వరంలోని బాధను గుర్తించింది. అతనివంక తిరిగింది.

"నాలో విశ్వాసం వొదులుకోకు. నాపై అపనమ్మకం పెట్టుకోనని వాగ్దానం చెయ్యి. నీ నమ్మకాన్ని, విశ్వాసాన్ని ద్రోహంచెయ్యనని భగవంతుడి సాక్షిగా చెబుతున్నాను."

ఇంతకంటే ఇంకేం చెప్పలేకపోయాడు. అతని కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

హేమాలిని జాలిగా తలపైకెత్తి చూచింది. అతని ముఖంవంక తేరిపార చూచింది. ఆమె మనసంతా కరిగి నట్లయింది. కన్నీళ్ళు జలజలా చెంపలమీాదికి కారినాయి. ప్రేమికుల నేత్రాలు కలుసుకున్నాయి. మాటలు రాక పోయినా, పవిత్రమైన శాంతిసందేశం వారిపై ప్రభవించింది.

రమేష్ గాఢంగా నిట్టూర్చాడు. మనసు తేలిక పడినట్లయింది. "మన వివాహాన్ని వారం రోజులపాటు వాయిదా వేయమని ఎందుకడిగానో తెలుసా?" అనడి గాడు. హేమాలిని తల ఊపింది. ఆమెకు కారణం తెలుసు కోవాలనిలేదు. "మన వివాహం అయిన తరువాత ఆ కథంతా నీకు చెబుతాను" అన్నాడు. వివాహం అన్న పేరు వినగానే ఆమె బుగ్గలు సిగ్గుతో ఎర్రవారినాయి.

మధ్యాహ్నం హేమాలిని రమేష్ రాకకోసం సన్నాహాలు చేస్తోంది. తమ భావి కార్యక్రమాన్ని మనసులో ఊహించుకొని మురిసిపోతోంది. కాని యింతలో యింత గందరగోళం జరుగుతుందనీ, తామిద్దరి నేత్రాలూ సజలం అవుతాయనీ ఆమె ఎరుగదు.

"వెంటనే నాన్న దగ్గరికి వెళ్ళాలి. ఆయన చిరాగ్గా వున్నట్టున్నారు" అంది.

రమేష్ హాయిగా వెళ్ళాడు. ప్రపంచం తనను పొడవటానికి ముందుకు వచ్చినా, ఎదురురొమ్ము విరిచి నిలిచేటంత ధీమాగా ఉత్సాహంగా ఉన్నాడు.

# 15

రమేష్ తిరిగి గదిలో ప్రవేశించేసరికి ఆనందబాబు ఆదుర్దాగా తలయెత్తాడు.

"అతిథుల జాబితాయిస్తే వారందరికీ వివాహం తేదీ మార్పు తెలియపరుస్తాను" అన్నాడు.

"అయితే నీవు అలాగే నిశ్చయించావన్నమాట!"

"ఆ మరోదారిలేదు."

"అయితే చూడు అబ్బాయీ, ఈ విషయం ఇక నాకేమీ సంబంధంలేదు. ఏర్పాట్లన్నీ నీవే చేసుకోవాలి. నన్ను గురించి అందరూ నవ్వడం ఇష్టంలేదు. వివాహం అంటే పిల్లవాళ్ళ ఆట అనుకుంటున్నావేమో! అలా అయితే నాలాంటి వృద్ధుడు అందులో జోక్యం కలిగించుకోడు. ఇదిగో అతిథుల జాబితా. నేను యిప్పటికే చాలా

డబ్బు ఖర్చుపెట్టాను. దానిలో చాలాభాగం వ్యర్థమయినట్లే. నాకు అలా డబ్బు వెదజల్లటానికి శక్తిలేదు.

రమేష్ అవగల ఖర్చులన్నీ తను భరిస్తాననీ, ఏర్పాట్లన్నీ చేసుకుంటాననీ అన్నాడు.

ఆతను బయటికి రావడానికని లేవబోవగా, ఆనంద బాబు ఇలా అన్నాడు: "అయితే వివాహం అయిన మీాదట, ఎక్కడ ప్రాక్టీసుపెట్టాలో నిర్ణయించుకున్నావా? కలకత్తాలో కాదుగదూ?"

"కాదు. ఎక్కడన్నా ఉత్తరప్రాంతంలో మంచిప్రదేశం ఎన్నుకుంటాను."

"ఉత్తర ప్రాంతంలోనా? ఆ ఉద్దేశ్యం బాగానేవుంది. ఎటావా .. మంచిప్రదేశమే. మనిషి ఆరోగ్యానికి ఎంతో మంచిది నేనోసారి నెలరోజులు అక్కడ మకాంవేశాను. నా జీర్ణశక్తి యింతోధికం అయింది. హాయిగా వుంది. చూచావు, నాకా వొక్కగా నొక్కకూతురు. మేం రెండు చోట్ల వుంటే నాకు మనశ్శాంతి వుండదు. అందుకనే నేను ఆరోగ్యవంతమైన ప్రదేశం యెంచుకుందామనుకుంటు న్నాను".

రమేష్‌బాబు తనకు కోపం తెప్పించాడు కనుక, ఆనందబాబు తనకోరికలు కొన్ని అతనిముందు వుంచుతూ మనుకున్నాడు. రమేష్ ప్రస్తుత పరిస్థితిలో—ఆయన, చెట్టూ వుంజిగాని, గారోకొండలుగాని అన్నట్లయితే వెంటనే వప్పు కునేవాడే. కాని ఆయన ఎటవా పేరు చెప్పాడు. రమేష్ "సరే, ఎటవా కోర్టులోనే చేస్తాను" అన్నాడు.

అతనలా బయటకు వెళ్ళగానే అక్షయ ప్రవేశించాడు. ఆనందబాబు రమేష్ వివాహాన్ని ఒక వారంరోజులపాటు వాయిదా వేశాడని చెప్పాడు. నిజం? ఎలా వాయిదా వేస్తాడు?"

"మామూలుగా అయితే వేయకూడదు. సాధారణంగా ఎవరూ ఇలాంటి పనిచేయరు. అయితే యీ రోజుల్లో యువకులు ఎంతపనయినా చేస్తారు."

అక్షయ బుర్ర తీవ్రంగా పనిచేయసాగింది. చివరకు యిలా అన్నాడు: "హేమాలినికి మంచి భర్తను కూర్చాం అనుకోగానే, ఇక మీదారిని మీరు కళ్ళుమూసుకు కూర్చుంటారు. వివాహం అంటే జీవితాంత సంబంధం కనుక, పిల్లను యిచ్చేటప్పుడు ఆ వ్యక్తినిగురించి పూర్తిగా ఆరాతీయాలి. స్వర్గంనుంచి దిగివచ్చిన దేవత అయినా సరే. మన పని చేయవలసిందే!"

"రమేష్‌లాంటి కుర్రవాడు అనుమానిస్తుంటే, యిక యీ ప్రపంచంలో ఎవరినీ నమ్మటానికి వీల్లేదు."

"అయితే వివాహం వాయిదా వేయటానికి ఏదైనా కారణం చెప్పాడా?"

ఆనందబాబు తలరుద్దుకుంటూ "ఏమీ చెప్పలేదు. ఏదో అర్జెంటుపనులు వున్నాయన్నాడు."

"బహుశ మీ అమ్మాయితో చెప్పివుంటాడు లెండి."

"కావచ్చు."

"ఆ విషయం అమ్మాయినికూడా పిలిచి కనుక్కుంటే మంచిదికదూ?"

"అవును" అంటూ ఆయన హేమాలినిని పిలిచాడు.

ఆమె లోపలికివచ్చి తండ్రివెనక నిలుచుంది. అక్షయకు ఆమె ముఖం కనిపించదు.

"రమేష్ యేమైనా కారణం చెప్పాడా?" అన్నాడు ఆనందబాబు.

"లేదు" అంది హేమాలిని.

"నీవు అడగలేదా ?"

"లేదు".

ఆనందబాబు "మొత్తానికి యిద్దరూ యిద్దరే! అతనేమో హడావుడిగా వచ్చి పెళ్ళిచేసుకోటానికి యిప్పుడు తీరుబడి లేదు అంటాడు నీవేమో సరేలే, ఎప్పుడో ఒకప్పుడు ఆ మూడుముళ్ళూ వేసుకుందాం అంటావు. ఇక అంతతో ఆ విషయం ఆఖరు !" అన్నాడు.

అక్షయ సామదానుకంగా "ఏ మనిషయినా, కారణాలు తనంత తాను చెప్పకపోతే, అతన్ని బలవంతపెట్టి లాభం లేదు. చెప్పటానికి యేమాత్రం వీలున్నా, అతనే చెప్పివుండేవాడుగా" అన్నాడు.

హేమాలిని కోపంగా "ఈ విషయంలో మూడో మనిషి వుద్దేశ్యం వింటూ కూర్చోడం నాకు యిష్టంలేదు. నామటుకు నేను పరిస్థితులన్నీ తృప్తిగానే వున్నాయనుకుంటున్నాను" అంది.

అక్షయకు కోపం వచ్చింది కాని బలవంతాన నవ్వు తెచ్చుకున్నాడు. "ప్రపంచం దారి యిది! ఎవరయినా మంచిమాట చెబితే దానికి ఫలితం కోపాలు, తాపాలు, చివాట్లు, చెప్పుదెబ్బలు. నిజమైన స్నేహం అంటే ఎంతో

విలువైనది. మీ స్నేహితుడి హోదాలో చెబుతున్నాను. రమేష్ అంటే నాకు అనుమానంగా వుంది. మీకు ఎంత కోపం వచ్చినాసరే, నా అభిప్రాయం యిది. మీకు ఏదైనా ఆపద వస్తుందంటే, నా మనస్సు పరిపరివిధాల పరితపిస్తుంది. పోనీ, యిది నా బలహీనతే అనుకోండి. సరే, ఏమైనా, రేపు జోగేంద్ర వస్తున్నాడుగా, ఈ కథంతా విన్నాక చెల్లెలు తరఫున అతనేం అనుర్దా వ్యక్తపరచకపోతే, యిక యీ విషయం నేను ఎత్తను."

"అక్షయ! నీకు రమేష్‌విషయంలో ఎందుకు అనుమానం వుందో అర్థంకావడంలేదు. ఏమీ ఋజువు లేనప్పుడు..."

అక్షయకు ఎంతో ఆత్మనిగ్రహం వుంది. కాని ఎడతెరిపి లేకుండా చివాట్లు తినడంతో ఆ నిగ్రహమంతా మంచులా కరిగిపోయింది. "చూడండి, ఆనందబాబు, నాకు ఎక్కడలేని పాపాలన్నీ అంటగడుతున్నారు. మీ కాబోయే అల్లుడిమీద నాకేం కోపం అనుకున్నారా? నేనేం అమాయకుడిని అనుమానిస్తున్నాననుకున్నారా? నాకు ఆడవాళ్ళకు వేదాంతం బోధించేటంత తెలివితేటలు లేకపోవచ్చు, కవిత్వ చర్చ చేసేటంత సామర్థ్యం లేకపోవచ్చు. కాని నేను మామూలు మనిషిని. మీ కుటుంబ శ్రేయోభిలాషిని. రమేష్‌బాబుతో పోటీకి వస్తున్నానని కాదుగాని, మీ దగ్గర యే విషయమూ దాచలేదు. నాకు చిరిగినగుడ్డలు కట్టుకుని మీదగ్గర ముష్టియెత్తుకునే ధైర్యం వుందిగాని, మీ యింటిని

దోచుకునే సామర్థ్యంలేదు. నా మాటల అర్థం ఏమిటో మీకు రేపు తెలుస్తుంది."

# 16

ఉత్తరాలన్నీ రాయకముందే చీకటిపడింది. రమేష్ విశ్రాంతి తీసుకుంటున్నాడు. అయితే నిద్రపట్టడంలేదు, అతని ఆలోచనలు రెండురకాలుగా ప్రసరిస్తున్నాయి. ఒక మార్గం స్పష్టంగావుంది. మరోమార్గం యిరుగ్గావుంది. గంగా యమునల సంగమంలావుంది. ఈ రెండు రకాల భావాలు అతని మెదడులో చేరి విశ్రాంతిలేకుండా చేస్తున్నాయి. కొంతసేపు పక్కమీద అటుఇటు దొర్లాడు. తరువాత దుప్పటి విసిరేసి లేచికూచున్నాడు.

కిటికీలోనుంచి బయటకు చూచాడు. సందులోని ఒక వరుసయిళ్ళు చీకటితెరల్లో వున్నాయి. రెండో వరస మీదికి చంద్రుని వెలుగు పడుతోంది. రమేష్ ఆలోచిస్తూ నిలుచున్నాడు. అతని ఆలోచనలలో యెన్నో విషయాలు బయటకు వస్తున్నాయి. జననం, మరణం — కష్టం, సుసుకు - ఆది, అంతు - ఇటువంటివన్నీ అతని ఆలోచనా తరంగాలలో వస్తున్నాయి. అంతా నిశ్శబ్దం. చీకటి, వెలుగు కానిస్థితి. ఇక్కడే స్త్రీ, పురుషుల ప్రేమ పెనవేసుకని యీ ప్రపంచపు నక్షత్ర కాంతిలో ప్రజ్వరిల్లుతుంది.

రమేష్ నింపాదిగా డాబామీదికి వెళ్ళాడు. ఆనంద బాబు ఇంటివైపు చూచాడు. నిశ్శబ్దాన్ని భంగపరిచే శబ్దమేదీ లేదు. చంద్రునికాంతి, నీడలు-ఇంటిగోడలమీద విచిత్రంగా

పడుతున్నాయి. ఆ ఇంటి నాలుగుగోడల మధ్య విద్యార్థిని రూపంలో ఒక విచిత్రమైన ప్రాణి నివసిస్తోంది.

పట్టణంలో రమేష్‌వంటివారు వున్నారు. ప్లీడర్లు, గ్రాడ్యుయేట్లు, విదేశీయులు, స్వదేశీయులు - ఇంతమందిలో మా రమేష్‌కే యెందుకీ ప్రత్యేకత? తనే ఆ అమ్మాయి సరసన ఎందుకు నిలబడాలి? ఏమిటీ సృష్టివైచిత్ర్యం? ఈ విచిత్రం అతని అంతరాత్మను జ్వలింపజేస్తోంది. ఆ అంతరాత్మ అతనిచుట్టూ ప్రపంచాన్ని వెలిగిస్తోంది.

రాత్రి చాలసేపటివరకు డాబామీద అటు ఇటు పచార్లు చేస్తూవున్నాడు. అకస్మాత్తుగా అతన్నొక భయం ఆవరించింది. గుండె గుప్పిట్లోకి వచ్చినట్లయింది. రేపు ఉదయమే, తన జీవితంలో మరో పోరాటానికి సంసిద్ధుడవాలి.

నిశి నిస్తబ్దత అలాగేవుంది. మానవజీవితం యీకష్టాల నన్నిటినీ యెదుర్కొనటానికే యేర్పడిందనిపిస్తుంది.

ఒకవైపు అనంతమైన ఆధ్యాత్మికశాంతి! మరోవైపు ప్రాపంచికమైన ఆధ్యాత్మిక పోరాటం! ఈ రెండూ ఒక ఒరలోనే యెలా యిముడతాయి? రమేష్ తన ఆలోచనలలో సతమతమవుతున్నాడు.

సృష్టిలోని అనంతప్రేమ అంతా అతనికి ప్రసాదింపబడింది. అతనీ ప్రేమను కౌగలించుకుని జీవితం తాకిడికి జోగుతున్నాడు. ఇందులో యేది సత్యమైనది? ఏది కేవలంభ్రమ?

# 17

జోగేంద్ర మరునాడు రైలులో యింటికి తిరిగివచ్చాడు. ఆరోజు శనివారం. ఆదివారంనాడు హేమాలిని వివాహం జరిగివుండవలసింది. అయితే యింట్లో ఎక్కడా హడావడే కనిపించడం లేదు. ఎక్కడా పెళ్ళి గందరగోళం కనిపించడం లేదు. వినిపించడం లేదు. ఇంటిగుమ్మానికి మామిడితోరణాలు లేవు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ యింటి వాతావరణంలో యేమీ మార్పు లేదు.

జోగేంద్ర లోనికివస్తూ యింట్లో ఎవర్కైనా సుస్తీగా వుందేమో అనుకున్నాడు.

ఇంటిలోపలకూడా వివాహ సంబంధమైన యేర్పాట్లేమీ జరగడం లేదు. అతనికి భోజనం సిద్ధమయింది. ఆనంద బాబు బల్లదగ్గర కూర్చుని పేపరు చూచుకుంటున్నాడు. ఆయనముందు సగం తాగిన టీకప్పు వుంది.

"హేము కులాసాగా వుందా?" అనడిగాడు జోగేంద్ర లోనికివస్తూనే.

"ఆ ! కులాసాయే."

"వివాహం యేమయినట్టు ?"

"రేపు కాక పై ఆదివారం."

"ఎందుకని వాయిదాపడింది ?"

"నీ స్నేహితుడినే అడుగు. ఏదో అర్జెంటుపనులున్నాయనిమటుకు చెప్పాడు. అంతే !"

జోగేంద్ర మనసులో తండ్రిని తిట్టుకున్నాడు. "నేను

యింట్లో లేకపోతే, మీరు అన్నీ యిలాగే చేస్తారు నాన్నా" అన్నాడు. "ఏవిటంత ముఖ్యమైన విషయాలు. అతనికతనే యజమాని. అతనికి బంధువులంటూ ఎవరూ లేరు. ఏదయినా వ్యాపారవిషయం అయితే మీ కందరికీ చెప్పటానికేం? ఎందుకు దాచివుంచాలి?"

"సరే. అతనేం పారిపోలేదుగా. వెళ్ళి అడగరాదూ, నీకే తెలుస్తుంది".

జోగేంద్ర ఓ కప్పు టీ తాగి బయటకు నడిచాడు. అతని వెనకాలే ఆనందబాబు యిలా అరిచాడు. "ఆగు జోగేంద్ర. యేమిటా తొందర. భోజనంచేసి వెళ్ళకూడదూ?" కాని జోగేంద్ర ఆగలేదు. అప్పుడే వినిపించనంత దూరం వెళ్ళిపోయాడు. పక్కయింటికి వెళ్ళి "రమేష్, రమేష్" అని బిగ్గరగా కేకవేశాడు. కాని రమేష్ వున్నట్లులేదు. పడకగది వెనకగది, డాబా... అన్నీ వెదికాడు, అంతా వెదికింతర్వాత నౌకరు కుర్రాడిని "యజమాని యేడీ" అని అడిగాడు. "ఉదయమే ఎక్కడికో వెళ్ళాడు" అని జవాబు.

'ఎప్పుడు తిరిగి వస్తాడు?'

అతను వెడుతూ బట్టలసంచీకూడా తీసుకు వెళ్ళారనీ, నాలుగయిదు రోజులదాకా తిరిగి రానన్నాడనీ నౌకరు చెప్పాడు. కాని ఎక్కడికి వెళ్ళిందీ తెలియదన్నాడు.

జోగేంద్ర ఇంటికి తిరిగివచ్చి కుర్చీలో కూలబడ్డాడు.

"యేం. దేమిటి కథ?" అనడిగాడు ఆనందబాబు.

"ఇంతకంటే యేమవుతుంది? అతను మీకు కాబోయే అల్లుడు. పక్క యింట్లోనేవుంటున్నా అతని వ్యవహారాలు

మీ కేమీ తెలియవు" అన్నాడు నిష్ఠూరంగా కొడుకు.

"ఏం! రాత్రి ఇక్కడే వున్నాడుగా"!

"అయితే ఉదయమే ఎక్కడికో వెడతాడని మీకు తెలియదన్నమాట. అతని నౌకరుకుకూడా ఎక్కడికి వెళ్ళాడో తెలియదు. ఏమిటో యిదంతా గొడవగా వుంది. నాకేం నచ్చలేదు. మీకు అంతా సవ్యంగానే వున్నట్లుంది కదూ?"

"అయితే ఏమంటావు?" అన్నాడు తండ్రి.

రాత్రి రమేష్‌ను ఆనందబాబు తేలిగ్గానే వదలిపెట్టాడు. కాని కుర్రవాడికి ఈ విషయాలన్నీ అర్థంకావు. ఏమంటే తన కేదో తొందర పనులున్నాయని చెప్పటంతో వారంరోజుల వరకూ తనకు పూర్ణస్వేచ్ఛ వచ్చేసిందనుకున్నాడు. తను యీ వారంరోజులూ యేమైపోయినా యెవరికీ సంబంధం లేదనుకున్నాడు.

జోగేంద్ర "హేమాలిని ఎక్కడ?" అనడిగాడు.

"పెందరాళే టీ త్రాగి మేడమీదికి వెళ్ళిపోయింది."

"పాపం! దానికి రమేష్ ప్రవర్తనకు సిగ్గనిపిస్తోంది కాబోలు. అందుకనే నా యెదుటికి రావడంలేదు" అనుకున్నాడు జోగేంద్ర. ఈ విచారంలోను, విషాదంలోను చెల్లెలిని ఓదార్చటానికి మేడమీదికి వెళ్ళాడు. జోగేంద్ర రావడం గమనించి, ఆమె చేతిలో కొక పుస్తకం తీసుకుని చదువు నటించ సాగింది. అతను లోనికిరాగానే పుస్తకం పక్కనపెట్టి, ఆదరంగా పలకరించింది. "ఎప్పుడొచ్చావు అన్నాయ్. ఏమిటలా వున్నావు?"

జోగేంద్ర కుర్చీలో కూలబడుతూ "యేం, ఎలా

వున్నాను? — సరే, ఆ విషయమంతా విన్నాను. హేమా, యిందుకు యేమీ బెంగపెట్టుకోకు. నేనిక్కడ లేనుగనుకనే యిలా జరిగింది, ఇహ వచ్చానుగా. అంతా సరిచేస్తాను. అన్నట్లు హేమా! రమేష్ నీకుకూడా యేమీ కారణం చెప్ప లేదటగా" అన్నాడు.

హేమాలిని సందిగ్ధంలోపడింది. అక్షయ జోగేంద్రుల అనుమానం ఒకపక్క, రమేష్ తనకు కారణం చెప్పలేదన్న విషయాన్ని జోగేంద్రతో చెప్పడం యిష్టంలేదు. అలాగని, బొత్తిగ అబద్ధం చెప్పటం మరీ యిష్టంలేదు.

"అతను చెప్పబోయాడు. కాని నేనే వద్దన్నాను" అంది.

'ఏమి అహం' అనుకున్నాడు జోగేంద్ర పైకిమటుకు.

"సరే. అలాగయితే ఏమీ ఆదుర్దాలేదు. ఇవాళే కారణం చెప్పిస్తా" అన్నాడు.

హేమాలిని ఒడిలోని పుస్తకం పుటలు తిరగేస్తూ, "కారణాలకోసం అతన్ని బలవంతపెట్టటం అంత మంచి పని కాదేమో?'' అంది.

"మళ్ళీ అహం" అనుకున్నాడు జోగేంద్ర.

"పోనీలే. నీవుమాత్రం యేం ఆదుర్దాపడకు" అని వెళ్ళ టానికని లేచాడు.

హేమాలినికూడా కుర్చీలోనుంచి లేచి, "చూడన్నాయ్! యీ విషయాన్ని గురించి అతనితో యేమీ మాట్లాడక్కర లేదు. మీరు మీరు యేమనుకున్నా-నాకు అతనంటే యేమీ అనుమానాలు లేవు" అంది.

ఇది మరీ అహం అనుకున్నాడు జోగేంద్ర. ఏమయినా చెల్లెలంటే వున్న అనురాగం, మమకారం అతన్ని లోగొన్నాయి. చిరునవ్వునవ్వాడు. మనసులో యిలాఅనుకున్నాడు. "ఈ చదువుకున్న ఆడవాళ్ళు, ప్రపంచజ్ఞానం బొత్తిగా లేని వాళ్ళు. ఎంతో చదువుకుంది. ఎన్నో విషయాలు తెలుసు. అయినా ప్రపంచం సంగతి, అనుమానాల వివరాలు వస్తే బొత్తిగా పసిపాప!" జోగేంద్ర హృదయం రమేష్ అంటే ఆక్రోశిస్తోంది. కారణాలు చెప్పమని బలవంతం చేయాలనుకున్నాడు మరోసారి. బయటకు వెడదామని లేచాడు. హేమాలిని యీసారి అతని చేయిపట్టుకుని ఆపి "రమేష్‌తో యీ విషయంగురించి ప్రస్తావించనని వాగ్దానంచేయి" అంది.

"అలాగే".

"అలాగే అంటే కుదరదు. వాగ్దానంచేయాలి. ఇందులో నువ్వు గందరగోళం పడవలసిందేమీలేదు. నాకోసం యీ చిన్న వాగ్దానంచేయి".

హేమాలిని యిలా బలవంతం చేయడం చూస్తే, జోగేంద్రకు రమేష్ ఆమెకు కారణాలు సవివరంగా చెప్పాడని తోచింది అయినా యీ వివరణ నిజమైనదో కాదో, తెలియదు. ఏదో కట్టుకథ చెప్పి ఆమెను మోసగించడం యేమంత కష్టమయిన పనికాదు. అందుకని యిలా అన్నాడు. "చూడు హేమా! యిందులో ఎవరినిగానీ నమ్మకుండావుండే ప్రశ్న లేదు. కాని అమ్మాయి వివాహవిషయంలో పోషకులకు కొన్ని విధులువుంటాయి. ఆతనేదో కారణాలు చెప్పివుండవచ్చు. వాటితో నీవు తృప్తికూడా పడివుండవచ్చు.

కాని అది చాలదు. అతను మాకుకూడా తెలియ పరచాలి. నిజంచెప్పాలంటే, యీ పరిస్థితుల్లో కారణాలు వినవలసిన అవసరం నీకంటే మాకు ఎక్కువవుంది. నీవివాహం అంటూ అయిపోతే యిక యీ విషయంలో మాకేం ప్రమేయం వుండదు." ఇలా చెప్పేసి అతను హడావడిగా బయటకు వెళ్ళిపోయాడు. జోగేంద్ర వెళ్ళింతరువాత హేమాలిని రోజంతా ఆలోచిస్తూ తనగదిలోనే వుండిపోయింది.

జోగేంద్ర బయటకువెళ్ళగానే అక్షయ అగుపించాడు. "హల్లో! వచ్చావా! విన్నావు కదూ ? ఏమిటి నీ వుద్దేశ్యం!" అన్నాడు.

"చాలాసేపు ఆలోచించాను. దాన్నిగురించి యింకా మాట్లాడి లాభంలేదు."

"మాటలతో నాకు నిమిత్తంలేదు. నేను కార్య వాదిని" అన్నాడు అక్షయ.

"సరే. అయితే రమేష్ ఎక్కడికి వెళ్ళాడో నీకు తెలుసా ?"

"ఆ !"

"ఎక్కడికి ?"

"చెప్పను. కాని యివాళ మూడుగంటలకి అతన్నీ, నిన్నూ సమావేశపరుస్తాను."

"అసలు గొడవేమిటో చెప్పరాదూ ? అలా నాలుగు రోజులు ఊరుదాటి వెళ్ళానోలేదో నానా గొడవలు తెచ్చి పెట్టారు !"

"సరే. చెబుతాను విను. ఇలా మంచిమాటలు చెప్ప

బట్టే నేను చెడ్డవాడినైనాను. నీ చెల్లెలు నా ముఖం వంక యినా చూడదు. మీనాన్న నన్ను తిడతాడు. రమేష్‌కు నే నంటే యిష్టంలేదు. పోతే యిక నువ్వొక్కడివి నే నంటే యిష్టపడతావు. నా మాదిరే నువ్వుకూడా వాదనలతో కాక కార్యసాధనకు ప్రయత్నిస్తావు."

జోగేంద్ర, "ఈ మాటలకేంగాని, నీవు చెప్పదలచు కున్నదేమిటో చెప్పు. ఊరికే ఎందుకు డొంకతిరుగుడుగా మాట్లాడుతావు? అసలు సంగతేమిటో చెప్పు" అన్నాడు.

"సరే విను. ఈ కథ మొదట్నించీ చెబుతాను. ఈకథ చాలావరకు నీకు సరిక్రొత్తగానేవుంటుంది." అంటూ ప్రారంభించాడు అక్షయబాబు.

## 18

దర్జీవరాలో రమేష్ యిదివరకు వుంటూవచ్చిన బస యింకా అతనికి అధీనంలోనేవుంది. ప్రస్తుతం తను అక్కడ వుండకపోయినా, దాన్ని మరెవరికయినా అద్దెకు యిచ్చే ఆలోచనే అతనికి రాలేదు. గడిచిన కొన్ని నెలలుగా అతను డబ్బును గురించి ఆలోచించవలసిన ప్రపంచంలో లేడు. కమల స్కూలు వదిలి వచ్చినతరువాత, ఆమె వుండటానికంటూ ఒక యిల్లు కావాలికదా. ఆ తెల్లవారుజామునే అతను ఆ బసకు వెళ్ళాడు. ఆ గదులన్నీ తుడిపించాడు. చాపలు, తెరలు వేయించాడు. ఇంట్లోకి కావలసిన సరంజామా అంతా తెప్పించాడు.

ఈ యేర్పాట్లన్నీ పూర్తికావడానికీ, కమల స్కూలు నుంచి రావడానికీ మధ్య కొంత విరామం మిగిలింది. ఈ విరా

మంలో అతను వొంటరిగా కూర్చుని తన భవితవ్యాన్ని గురించి ఆలోచించసాగాడు. అతను యింతకుముందు ఎటూవా వెళ్ళ లేదు. అక్కడి తన నివాసాన్ని గురించి ఆలోచించసాగాడు. కనుల పండువుగా ఒక బంగళా, చుట్టూ తోట, దూరంగా విరామప్రదేశం పక్షుల కిలకిలా రావాలు వినిపిస్తూ వుంటాయి. మధ్యాహ్నంపూట హేమాలిని యింట్లో వంట రిగా కూర్చుని యీ ప్రకృతిలో ఆనందిస్తూవుంటుంది. ఆమెతో కూడా కమల వుంటేనా!

వివాహం పూర్తయేవరకు రమేష్ కమలకు యేమీ చెప్పాలనుకోలేదు. అప్పుడు హేమాలిని మంచి అవకాశం చూచి, కమలను హృదయానికి హత్తుకుని, ఆమె నిజకథను వినిపిస్తుంది. కమల హృదయానికి యేమాత్రం బాధ కలగ కుండా అతి మృదువుగా, మెల్లిగా చెబుతుంది. అప్పుడు కమల తన విషయాన్ని తేలిగ్గా అర్థంచేసుకుని పరిస్థితులతో యిమిడిపోతుంది.

మధ్యాహ్న నిశ్శబ్దం ఆ వీథిని ఆవరించింది. పనివాళ్ళు తమపనులు వదిలి విరామానికి వెళ్ళారు. వాతావరణం మారుతోంది. రాబోయే శీతకాలపు చల్లదనం ఎండల స్థాయి తగ్గిస్తాయి.

ఏదో బండివస్తున్న చప్పుడయి, రమేష్ కలలన్నీ మాయమైనాయి. బండి తన యింటిముంపు ఆగింది. రమేష్‌కు యీ బండిలో కమల వస్తోందని తెలుసు. అతని గుండె దడదడ లాడుతోంది. కమలకు ఎలా స్వాగతం చెప్పాలి? ఏ విష యాలు ప్రస్తావించాలి? ఆమె తనపట్ల ఎలా ప్రవర్తిస్తుంది?

ఇవన్నీ మనసును చికాకుపరిచే ప్రశ్నలు. నౌకర్లు ఇద్దరూ కిందనే వేచివున్నారు. వాళ్ళే ముందుగా కమల ట్రంకుపెట్టె మోసుకుని లోనికివచ్చారు. కమల వాళ్ళ వెనకనే వచ్చి గుమ్మందగ్గర ఆగిపోయింది.

"లోపలికిరా కమలా!" అన్నాడు రమేష్. సందియా లన్నీ దిగవిడిచి కమల లోపలకు అడుగుపెట్టింది. రమేష్ ముందు ఆమెను సెలవులకు బడిలోనే వుంచాలనుకున్నాడు గదా! ఈ అనుభూతి ఆమెకు ఏడుపు తెప్పించింది. ఈ అనుభూతి, చాల రోజులుగా పొందిన వియోగభారం ఆమెలో ప్రత్యేక వాతావరణాన్ని కల్పించాయి. అందుచేత కమల గదిలోకి రావడంతోటే రమేష్‌వంక చూడకుండా, తెరిచివున్న గది తలుపులవంకనే చూస్తూ నిల్చుంది.

కమల యిలా కనిపించడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఆమెలో నూతనత్వం అగుపిస్తోంది. ఈ కొన్ని నెలల్లోనూ ఆమెలో చాలా మార్పు వచ్చింది. ఆమె చిన్న మొక్కలా తయారైంది. ఆమె ముఖంలో యవ్వనరేఖలు కానరావడంలేదు. ఆమె కవళికలు గంభీరంగా తయారయ్యాయి.

గదిలోనికి వచ్చి తల పక్కకు వాల్చి కిటికీదగ్గర నిలబడింది. మధ్యాహ్నపుటెండ ఆమె ముఖంమీద పడుతోంది. ఆమె తలలో పూలులేవు. జడకు ఎర్ర రిబ్బను కట్టుకుంది. రమేష్ ఆమెవంక కొన్నిక్షణాలు తదేకంగా చూచాడు.

కమల సౌందర్యం అతనికి లీలామాత్రంగానే గుర్తువుంది. ఆ సౌందర్యానికి యీ గంభీరత పరిపూర్ణతను ప్రసా

దిస్తోంది.

"కూచో కమలా" అన్నాడు.

ఆమె మాట్లాడకుండా కూర్చుంది.

"బడి ఎలా వుంది?"

"బాగానే వుంది."

రమేష్ యింకేం మాట్లాడదామా అని ఆలోచించ సాగాడు. అకస్మాత్తుగా అతనికో విషయం స్ఫురించింది.

"నువు భోజనంచేసి చాలాసేపయివుంటుంది. ఏదైనా ఫలహారం తీసుకురమ్మని చెప్పమంటావా?"

"లేదు, నా కిప్పుడు ఆకలిగా లేదు."

"ఏమిటా పుచ్చుకోవా! పోనీ, పళ్ళయినా తీసుకో."

కమల తల అడ్డంగా వూపింది.

రమేష్ మళ్ళీ ఆమె ముఖంవంక చూచాడు. ఆమె తన ఇంగ్లీషుపుస్తకంలో బొమ్మలు చూచుకుంటూంది.

రమేష్ లోపలకు వెళ్ళి పళ్ళెంలో ఆపిల్ తదితరపళ్ళు పెట్టుకువచ్చాడు.

"నీ కాకలిగా లేదంటున్నావు సరే. కాని నాకు మాత్రం కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి." కమల నవ్వింది. రమేష్ చాకుతో ఆపిల్ పండు కోస్తున్నాడు. అతను ఆత్రంగా అలా కోయడం చూస్తుంటే కమలకు విపరీతంగా నవ్వు వచ్చింది.

"ఓహో, నాకు కోయడం రాదని నవ్వుతున్నావా? నాకు కత్తితో కోయడం రాదని వొప్పుకుంటాను. నువ్వే కోసి చూపించు."

"కత్తిపీట తెప్పించండి."

నౌకరుచేత రమేష్ కత్తిపీట తెప్పించాడు. కమల కింద కూర్చుని పండ్లు కోసింది. రమేష్ ఆమెకు ఎదురుగా కూర్చుని పండ్లముక్కలు పళ్ళెంలో చేరుస్తున్నాడు.

"నీవుకూడా తినాలి సుమా!" అన్నాడు.

"వొద్దండీ."

"అయితే నేనూ తినను."

కమల అతనివంక చూచింది. "సరే. మీరు ముందు తీసుకోండి. తరువాత నేనూ తింటాను."

"తరువాత మాట దాటిపోవుగదా?"

"ఉహుఁ" అంది కమల అనునయంగా తలవూపుతూ.

రమేష్ పండుముక్క ఒకటి తీసుకుని నోట్లో వేసుకున్నాడు. సరిగ్గా ఆ సమయంలోనే అతని చేతిపట్టు తప్పిపోయింది. జోగేంద్ర, అక్షయ అతనికి ఎదురుగా గుమ్మందగ్గర నిలబడివున్నారు.

అక్షయ ముందు మాట్లాడాడు: "క్షమించు, రమేష్ బాబు. నీ వొక్కడివే వుంటావనుకున్నాం. జోగెన్, మనం ముందు చెప్పకుండా రావలసిందికాదు. రా, కిందికి వెళ్ళి వేచివుందాం."

కమల కత్తిపీటను అక్కడే వదిలేసి, లేచినిలుచుంది. గదిలోంచి బయటకు వెళ్ళాలంటే గుమ్మంలో వాళ్ళిద్దరూ అడ్డంగా నిలబడ్డారు. జోగేంద్ర ఒక ప్రక్కకు ఒదిగి, దారి వదిలాడు. అతని కళ్ళుమాత్రం కమలవంకే తీక్షణంగా

చూస్తున్నాయి. కమల కంగారుగా పరుగెత్తి పక్కగదిలోనికి వెళ్ళింది.

# 19

"రమేష్! ఈ అమ్మాయి ఎవరు?" అనడిగాడు జోగేంద్ర.

"నా బంధువు" అన్నాడు రమేష్.

"ఏమిటా బంధుత్వం! నీ బంధువులందరిని గురించి నాకు తెలిసేవుగా. ఎప్పుడూ యీమెనుగురించి చెప్పలేదే!"

"ఆగు. జోగేంద్ర, మగవాడికి స్నేహితులతో చెప్పకోరాని బంధువులుకూడా వుంటారు" అన్నాడు అక్షయ.

"అయితే రమేష్. యిదీ అటువంటి రహస్యమేనా?" అనడిగాడు జోగేంద్ర.

రమేష్ ముఖం కందగడ్డలా అయింది. "అవును. ఇది రహస్యమే. ఈ అమ్మాయిని గురించి మీతో చర్చించడం నాకు యిష్టంలేదు." అన్నాడు.

"కాని దురదృష్టవశాత్తు, నాకు ఆమెను గురించి నీతో చర్చించాలని వుంది. నీవు హేమాలినిని పెళ్ళిచేసుకోవటానికి సన్నాహాలు చేయకపోయినట్లయితే, నాకు యీ అవసరం వుండేదికాదు. అప్పుడు నీ రహస్యాలజోలికి నేను రానక్కర్లేక పోయేది."

"ఒక విషయంమటుకు రూఢి! హేమాలినితో నా వివాహానికి అడ్డంకిగా నిలిచే సంబంధం నేను ఇంతవరకు ఎవరితోనూ పెట్టుకోలేదు."

''నీ వుద్దేశ్యం అలాగే వుండవచ్చును. కాని హేమా లినితనపు బంధువుల విషయం యేమిటి ? నేను అడిగేది ఒక్కటే ప్రశ్న. ఆమె నీకు బంధువో కాదో వేరే విషయం. కాని ఆమెను ఇక్కడ రహస్యంగా ఎందుకు వుంచు తున్నావు ?''

"కారణం చెబితే నా రహస్యం బయటపడిపోతుంది. కారణాల గొడవ ఎత్తకుండా నేను చెప్పేమాటమీాద నమ్మకం వుంచలేవా ?"

''ఈ అమ్మాయిపేరు కమల ఏనా ? కాదా ?'' అనడి గాడు జోగేంద్ర.

''అవును''

''ఈమె నీభార్య అని స్కూల్లో చెప్పావుకదూ ?''

''అవును''

''అయితే నీలో ఎలా నమ్మకం వుంచమంటావు ? ఈమె నీ భార్యకాదని చెబుతానంటావు ? అందరికీ మటుకు యీామె నీ భార్య అనే చెబుతావు. ఏమిటీరగడ ? అనడిగాడు జోగేంద్ర.

''పరిస్థితులు అటువంటివి కాబోలు రమేష్‌బాబు చెప్పింది నిజమేమో !'' అన్నాడు అక్షయ.

"మీాకు ఇంతకంటే ఇంకేం చెప్పదలచుకోలేదు. నేను హేమాలినికి ఏమీా అన్యాయం చేయడంలేదు. ఆ విష యంమటుకు రూఢిగా చెప్పగలను. కమలవిషయం మీాతో చర్చించకుండా వుండటానికి నాకు బోలెడంత కారణం వుంది. నా శీలాన్ని గురించి మీారు ఎన్ని అనుమానాలు పెంచు

కున్నా, నేనుమాత్రం ఇప్పుడు కమలవిషయం మాట్లాడను. నా ఒక్కడి సుఖమే చూచుకుంటే యీ కథంతా యిప్పుడే మీకు చెప్పవచ్చు. కాని నాకు అంతకంటే ముఖ్యమైనవి చాలా వున్నాయి ఇతరుల సుఖాన్ని నాకోసం నాశనం చేయ లేను" అన్నాడు రమేష్.

'హేమాలినికి యిదంతా చెప్పావా ?'

'లేదు. వివాహం అయినాక చెబుతాను. ఆమెకు ఇష్టం అయితే ఇప్పుడే చెబుతాను.'

'ఈ విషయంలో కమలనుకూడా కొన్ని ప్రశ్నలు వేయవచ్చా ?'

'వీల్లేదు. నన్ను అనుమానిస్తే మీ యిష్టంవచ్చినట్లు అనుకోండి. తిట్టండి. అంతేగాని కమల అమాయకురాలు. ఆమెను అడ్డదిడ్డపు ప్రశ్నలకు గురిచేయలేను.'

'ఇంక ఎవరినీ అడగవలసిందేమీ లేదు. తెలుసుకో వలసినదంతా ముందుగానే తెలుసుకున్నాను ఇక్కడ ఋజువు కూడా దొరికింది. స్పష్టంగా చెబుతున్నాను. విను— ఈసారి మా ఇంటి గుమ్మంతొక్కావా, తీవ్రమైన అవమానానికి గురి అవుతావు.'

రమేష్ ముఖం పాలిపోయింది. కాని అతనేమీ అన లేదు. జోగేంద్ర ఇంకా ఇలా అన్నాడు. 'ఇంతకంటే యింకేం చేయాల్సింది లేదు. నీవిక హేమాలినికి ఉత్తరంకూడా వ్రాయనక్కరలేదు. బహిరంగంగా గాని రహస్యంగా గాని ఆమెతో ఏమీ ప్రమేయం పెట్టుకోనక్కర్లేదు. లేక యింకా సంబంధం పెట్టుకుందామని తాపత్రయపడ్డావో, నీ రహస్య

మంతా ఋజువులతో సహా బయట పెడతాను. హేమా లినితో నీ వివాహం ఎందుకు ఆగిపోయిందంటే, దానికి నేను అంగీకారం ఇవ్వలేను కనుక నని చెబుతాను. ఎవరన్నా అడిగితే, అంతేకాని నాఅంత నేను నిజమైనకారణం చెప్పను. కాని నీవు మాత్రం అజాగ్రత్తగా ప్రవర్తించావంటే, నీ రహస్య గాధంతా పైకివస్తుంది. నీయందు యింతదయగా ఎందుకు ప్రవర్తిస్తున్నానో తెలుసా ? నీమీదకాదు యీదయ దాక్షిణ్యం. నీవంటే నాకేం సానుభూతిలేదు. పోతే నాచెల్లెలు భవిష్యత్తు దీనితో ముడిపెట్టుకువున్నదిగనుక, నిన్ను యింత తేలిగ్గా వొదిలిపెడుతున్నాను. చివరిమాటగా చెబుతున్నాను. హేమాలినితో నీకు పరిచయం వున్నట్లు ఎక్కడా బహిరంగ పరచకూడదు. నీ దగ్గర్నించి వాగ్దానాలు తీసుకుని లాభం లేదు. ఈ మోసం చూచింతర్వాత ఇక నీలో నాకు నమ్మకం లేదు. నీకు సిగ్గు, భయం, లజ్జ అంటూవుంటే నాహెచ్చరికను గమనిస్తావు.'

అక్షయ జోగేంద్రతో 'ఏం నీకు రమేష్ అంటే అంత జాలిలేదా ? సానుభూతిలేదా ? చూడు, రమేష్ ఎంత ప్రశాంతంగావున్నాడో. సరే, ఇక వెడదాంపద. రమేష్, మరేంఅనుకోకు. మేం వెడుతున్నాం' అన్నాడు.

జోగేంద్ర, అక్షయ వెళ్ళిపోయారు. రమేష్ నిర్ఘాంత పోయి చాలసేపటివరకు నించున్న చోటునుంచి కదలలేక పోయాడు. తెలివివచ్చింతర్వాత, ఎక్కడికయినా ఒంటరిగా పరుగెత్తుకుపెళ్ళి చల్లగాలిలో యీ సమస్యను గురించి, ఆలోచించుకోవాలనుకున్నాడు. అయితే కమలను యిలా ఒంటరి

చోట వదంగూడ కనిపించింది.

పక్కగదిలోకి వెళ్ళాడు. కమల కిటికీదగ్గర నిలబడి వీధి వంక చూస్తోంది. రమేష్ రావడంతో ఆమె అతనివైపుతిరిగింది.

'ఎవరు వీళ్ళు? యివాళ ఉదయం స్కూలుకూడా వచ్చారు' అన్నది కమల.

"స్కూలుకు వచ్చారా!"

"అవును. సరే, యేమిటి అంటారు వాళ్ళు?"

'వాళ్ళు, నాకు నీవేమవుతావని అడుగుతున్నారు?'

కమల ఎప్పుడూ అత్తగారి పాదాలదగ్గర కూర్చుని మంచిభార్యగా ఎలా నడుచుకోవాలో పాఠాలు నేర్చుకోలేదు.

'నేను వాళ్ళకు, మనకేమీ బాంధవ్యం లేదని చెప్పాను'

ఆమెముఖం పక్కకు తిప్పుకొని 'చిలిపిగా మాట్లాడకండి' అంది.

రమేష్ ఈమెకు కథంతా చెప్పడం ఎలాగా అని ఆశ్చర్యపోయినాడు. ఇంతలో కమల 'అదుగో చూడండి. మీ ఆపిల్‌ముక్క కాకి ఎత్తుకుపోయింది.' అంది. ఆమె పక్కగదిలోకివెళ్ళి పండ్లముక్కలపళ్ళెం తీసుకవచ్చి 'కాసిని తీసుకోరూ?' అంది.

రమేష్‌కు ఇప్పుడు తిందామనిలేదు. కాని ఆమె శ్రద్ధకు అతను కరిగిపోయినాడు. "నీవుకూడా తిను కమలా!" అన్నాడు.

'ముందు మీరు' అంది, భార్యగా తాను ముందు తినగూడదనే సదుద్దేశ్యంతో. ఈ అమాయకురాలి ప్రవర్తన

చూస్తుంటే రమేష్‌కు కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి. నోట మాట రావడం లేదు. ఎలాగో తనను తాను సంబాళించుకుని ముక్కలు ఆరగించసాగాడు. చివరకు 'యివాళ రాత్రి మనం ఊరికి వెళ్ళిపోదాం కమలా ! అన్నాడు.

'వొద్దు.' అంది కమల.

'అయితే బడిలోనే వుండిపోతావా ? అన్నాడు.

'ఉహు. మళ్ళీ నన్ను బడికిమాత్రం పంపించకండి. అక్కడ వాళ్ళు మిమ్మల్నిగురించి ఎన్నో ప్రశ్నలు వేస్తారు. నాకు సిగ్గనిపిస్తుంది.'

'వాళ్ళ కేం చెప్పావేం ?'

'యేమీ చెప్పలేదు. ఈ సెలవుల్లో నన్ను బళ్ళోనే ఎందుకు ఉండిపొమ్మన్నారు—అని అడిగారు' నేను—' ఆమె వాక్యం పూర్తిచేయలేకపోయింది. ఆమె హృదయానికి తగిలిన గాయం తిరిగి రేగింది.

'నీకు నేనేం కానని వాళ్ళతో చెప్పలేకపోయావా ?

కమల అశాంతిగా అతనివంక చూచింది. ఓరకంటితో చూస్తూ 'అలా చిలిపిగా మాట్లాడకండి' అంది మళ్ళీ.

"నీకు నేనే మవుతానంటావు ?' అన్నాడు రమేష్. అతని రహస్యం యివతలకు రావడానికి పెనుగులాడుతోంది. ఎంతో బాధ, అతని మనస్సులో ఎన్నో ప్రశ్నలు. ఈ సరికి జోగేంద్ర హేమాలినికి ఏమేం చెప్పివుంటాడు ? ఈ వార్తలు హేమాలినిని ఎలా మారుస్తాయి ! ఆమెతో తను నిజం నివేదించడం ఎలా ? హేమాలినికి తనకూ వియోగం తటస్థిస్తే దాన్ని భరించడం ఎలా ? ఈ ప్రశ్నలకు జవాబులు దొరకక

అతను సతమతం అవుతున్నాడు.

ఒకవిషయం మాటుకు అతనికి తెలుసు. కమలతో తన సంబంధం, తన స్నేహితులకు విరోధులకుకూడా చర్చ నీయాంశం అయింది. కమలను తనభార్యగా చెప్పడం పొరపాటయింది. అది యీపాటికి ఊరంతా పాకివుంటుంది. మరు రోజు ఆమెతో ఈ ఊళ్ళో తల ఎత్తుకు తిరగడం అసాధ్యం.

అతనిలా ఆలోచనలతో సతమతం అవుతూవుంటే కమల "ఏమిటలా మథనపడుతున్నారు? మీకు నిజంగా యింటికి వెడదామని వుంటే నేనూ వస్తాను.' అంది.

ఆ అమ్మాయి తనకోసం కోరికలను అణుచుకోవడం రమేష్‌కు మరీ హృదయవిదారకంగా తోచింది. మళ్ళీ యిప్పుడు తనేంచేయాలా అని ఆలోచనలోపడ్డాడు. ఆలోచనల్లో తనను తానే మరిచిపోయాడు. ఆమెవంక చూస్తూ వుండిపోయాడు. కమల స్తబ్దుగా కూర్చోలేకపోయింది. 'నేను సెలవుల్లో బడిలోనే వుండనందుకా, మీరింతగా చీకాకుపడుతున్నారు. అందుకేనా?' అనడిగింది. "నిజం చెప్పండి, యిప్పుడయినా చెప్పండి'' అని ప్రాధేయపడింది.

"నిజం చెప్పాలంటే, నా చీకాకంతా నీమూలాన కాదు. నావల్లనే'' అన్నాడు రమేష్.

గొప్ప బలవంతంమీద అతను తన ఆలోచనలనుంచి తప్పించుకుని, కమలతో సంభాషణకు ఉపక్రమించాడు. 'చెప్పు కమల, బడిలో నీవేం నేర్చుకున్నావు?'

కమల తన చదువంతా వివరించసాగింది. భూమి గుండ్రంగా వుందని చెప్పి, తన విజ్ఞాన విశేషానికి రమేష్‌ను

ఆశ్చర్యపరచాలనుకుంది. రమేష్ తను యీ విషయాలేమీ ఎరగనట్లు నటిస్తూ 'భూమి గుండ్రంగా వుండడం ఎలా సాధ్యం!' అని ప్రశ్నించాడు. కమల కళ్ళు గుండ్రంగా తిప్పుతూ 'మా పుస్తకంలో అలావుంది. నేనిదంతా నేర్చుకున్నాను' అంది.

రమేష్ ఆశ్చర్యంనటిస్తూ 'అలాగేం? పుస్తకంలో వుందా? ఎంత పెద్దదేం ఆ పుస్తకం! అన్నాడు.

ఈ ప్రశ్నలకు కమల చంకలు ఎగురవేస్తూ "అంత పెద్ద పుస్తకం కాకపోయినా, అది అచ్చుపుస్తకం దాన్లో బొమ్మలు కూడా వున్నాయి?" ఈ ఋజువుకు రమేష్ లొంగిపోవలసి వచ్చింది.

కమల స్కూలునుగురించి, అక్కడి వ్యక్తులనుగురించి ఊరికే చెప్పుకుపోతోంది. రమేష్ పరధ్యానంగా వింటున్నాడు. ఆమె యీ విషయం కనిపెట్టి, "నేచెప్పేది మీరు వినడం లేదు!" అంటూ లేచింది.

"లేదు కమలా! అలా కోప్పడకు. ఇవాళ ఎందుచేతనో నాకు కులాసాగా లేదు" అన్నాడు.

"అలాగా! ఏం సంగతి?"

"కులాసాగా లేకపోవడం కాదనుకో. ఏదో...యిదిగా వుంది. ఊఁ. చెప్పు."

"నా జాగ్రఫీపుస్తకంలో బొమ్మలు చూస్తారా?"

ఆమె పుస్తకం తీసుకువచ్చి అతనికి గ్లోబును గురించి వివరించి చెప్పసాగింది. ఇలా వారు కలవున్లోని మొదటి సాయంత్రం గడిపారు.

# 20

జోగేంద్ర యీ ఆటంకాలన్నీ సరిచేస్తాడనీ పరిస్థితు లన్నీ ఒక్క కొలిక్కి తీసుకువచ్చి సవ్యంగా పరిష్కారం చేస్తాడని ఆనందబాబు ఆశిస్తున్నాడు. జోగేంద్ర, అక్షయ గదిలోకి ప్రవేశించేసరికి ఆయన నీరసంగా కూర్చునివున్నాడు.

"బావుంది నాన్నగారూ! రమేష్‌ను యింతదూరం పోనిస్తారని నేననుకోలేదు. అసలతన్ని తీసుకువచ్చి పరిచయం చేయడం నాదే తప్పనిపిస్తోంది. కాని యిదంతా యింతవరకు వస్తుందని నాకేం తెలుసు?" అన్నాడు జోగేంద్ర.

'నీవటువు నీవే రమేష్ హేమాలినిని వివాహమాడితే ఎంతో బాగుంటుందని నాతో ఎన్నో మాట్లు అన్నావు ఇప్పు డిదేంటి, ఇలా అంటావు...'

'ఇంకా యేమిటి?—అంటున్నారా?'

'అయితేయిటు తలివాడ్డు, కాకపోతే అవతలి వాడ్డు. అంతేగాని మధ్యేమార్గం లేదు.' అన్నాడు అనందబాబు.

'ఈ గొడవ యింకా సాగాలంటే –'

అక్షయ కలుగజేసుకొని 'కొన్నికొన్ని విషయాలు వాటంతట అవే ముందుకు నెడుతూవుంటాయి. ఎవరూ వాటిని ప్రత్యేకించి ముందుకు లాక్కుపోనక్కర్లేదు. విరిగి పోయేంతవరకూ పెరిగిపోతూనే వుంటాయి. అయినా, వాలికిపోయిన పాలను గురించి యింకా విచారించి యేం లాభం? పోతే— యికముందు చేయవలసిందేదో నిర్ణయించు కోవడం మంచిది.' అన్నాడు.

'మీరు రమేష్‌బాబును చూచారా?" అనడిగాడు ఆనందబాబు ఆసుర్దాగా.

'ఆహా! ఆయన సకుటుంబంగా వుండగానే చూచాం. ఆయన భార్యను ప్రత్యక్షంగా చూచాంకూడా!'

ఆనందబాబు ఉలిక్కిపడ్డాడు. 'ఆయన భార్యను చూచారా!' అంటూ రెట్టించి అడిగాడు.

'అవును రమేష్ భార్యనే!'

"నాకేం అర్థం కావడంలేదు. ఏ రమేష్ భార్య?"

'ఏ రమేషో కాదు. సాక్షాత్తు మన రమేషే! అప్పుడు ఊరికి వెళ్ళాడే, అప్పుడే పెళ్ళి చేసుకు వచ్చాడు—'

'తండ్రి పోయాడు కదూ?'

'శోకముండగానే యీ పెళ్ళి అయింది.'

ఆనందబాబు నోట మాటరాక అలాగే కూచుని వుండిపోయాడు. "అలా అయితే మన హేమను ఎలా వివాహం చేసుకుంటాడు?" అన్నాడు చివరకు.

"అందుకనే మేము—"

"సరే. నీ యిష్టంవచ్చినట్లు చేయి. కాని వున్న విషయం ఏమంటే, పెళ్ళికి అన్ని సన్నాహాలు పూర్తయినాయి. ఈ ఆదివారమే పెళ్ళి అని అందరికీ ఆహ్వానాలు పంపాము వచ్చే ఆదివారానికి వాయిదాపడిందనీ తెలియపరిచాము. ఇప్పుడు మళ్ళీ పెళ్ళి అనేదే వాయిదా పడిందని వ్రాయాలి కాబోలు!"

"ఈసారి వాయిదా వేయనక్కరలేదు. ఒకటేఒక్క మార్పుచేయాలి. తతిమ్మా ఏర్పాట్లన్నీ యథాతథంగా

అలానే వుంటాయి. అవేవీ వృధాకావు." అన్నాడు జోగేంద్ర.

ఆనందబాబు ఆశ్చర్యపోయి "ఏమిటి నువ్వు చేసే మార్పు ?'' అనడిగాడు.

"యింకా తెలియలేదా ? రమేష్‌బదులు మరోపెళ్ళి కొడుకును తీసుకురావాలి. వచ్చే ఆదివారం అనుకున్నట్లుగా శుభకార్యం జరిగి తీరాల్సిందే. లేకపోతే యిక మనం ముఖం పైకెత్తుకుని బజార్లో నడవలేం" అన్నాడు జోగేంద్ర. అక్షయ వంక చూచాడు. అతను సవినయంగా కళ్ళు కిందికి వాల్చుకున్నాడు.

"ఇంత తొందర్లో పెళ్ళికొడుకు కెక్కడ దొరుకుతాడు ?"

''ఆ విషయమేమీ యిబ్బంది లేదు !"

"కాని హేమ అంగీకారంకూడా కావాలిగా !"

"రమేష్ ప్రవర్తనగురించి విన్నదంటే హేమ తప్పకుండా వొప్పుకుంటుంది."

"సరే. నీవెలా ఆలోచిస్తే అలాగే! మొత్తంమీద యిదంతా గొడవే ! రమేష్ మంచివాడు, చదువుకున్నవాడు, స్థితిపరుడు. నిన్ననే మేం అతను ఎటావాలో ప్రాక్టీస్ పెట్టాలనికూడా నిర్ణయించాం. యింతలోనే యేమయిందో చూడు !"

'దాన్ని గురించి మనకు బెంగెందుకు ? కావాలనుకుంటే ఎటావా వెళ్ళి ప్రాక్టీసు చేసుకుంటాను. ఇప్పుడే హేమనుకూడా పిలిచి కనుక్కుంటాను. ఎక్కువ విరామం కూడా లేదుగా !"

అతను బయటకు వెళ్ళి ఒకటి రెండు నిముషాల్లో హేమతో సహా మళ్ళీ వచ్చాడు. అక్షయ ఒక పుస్తకాలబీరువా వెనక్కు వెళ్ళి నిల్చున్నాడు.

"కూర్చో హేమా, నీతో కొద్దిగా మాట్లాడాలి" అన్నాడు జోగేంద్ర.

హేమ యేమీ మాట్లాడకుండా ఒక కుర్చీలో కూలబడింది.

"రమేష్ ప్రవర్తనలో నీకు ఎలాంటిమార్పు కనిపించ లేదా ?" అని అడిగాడు జోగేంద్ర, యీ విషాదవార్త మెల్లిగా ఆమెకు వినిపించడానికి ఉపక్రమిస్తూ.

హేమాలిని ఊరికే తలఊపింది.

"వివాహాన్ని వారంరోజులపాటు వాయిదా వేయించాడు. కారణం యేమయివుంటుందనుకుంటావు?"

"ఏదో కారణం ఉండివుంటుంది" అంది హేమ తల పైకెత్తకుండానే.

"నిజం ! తప్పకుండా యేదోకారణం ఉండేవుంటుంది. కాని యిదే అనుమానానికి తావు యిస్తోంది కదా !"

హేమాలిని, తను అలా భావించడంలేదని సూచిస్తూ తల ఊపింది. తన బంధువులకు రమేష్‌పట్ల అంధవిశ్వాసం వుండడం, జోగేంద్రకు కోపం తెప్పించింది. ఇక విషయాన్ని నానుస్తూ నడిపితే ఏంలాభం లేదని సూటిగా యిలా అన్నాడు: "రమేష్ వాళ్ళనాన్నతో ఊరికి వెళ్ళాడు, గుర్తుందికదూ? చాల రోజులవరకు అతనిదగ్గర్నుంచి యేమీ సమాచారం తెలియలేదు. అప్పుడు మనకు ఎంతో ఆశ్చర్యం అనిపించింది.

పూర్వం అతను మన పక్కయింట్లో వుంటున్న రోజులలో రెండురోజుల కొకమాటు వచ్చి వెడుతూ వుండేవాడు. తరువాత, కలకత్తాకు వచ్చాక—మనకు కొన్ని మైళ్ళదూరంలో యిల్లు తీసుకున్నాడు. మనను చూడడానికి అయినా రాలేదు. అయినప్పటికీ మీ యిద్దరూ అతనిలో పూర్వపు విశ్వాసాన్నే వుంచారు. పూర్వంలాగానే అతన్ని ఆదరించారు. నేనేగనుక యిక్కడ వున్నట్లయితే అలా జరగనిచ్చేవాడిని కాదు."

హేమాలిని పెదివి కదపనయినా లేదు.

"అతని అసాధారణ ప్రవర్తనకు కారణం తెలుసుకుందామని మీ యిద్దరిలో ఒకరికీ అనిపించలేదా ? కనీసం, ఆసక్తి కోసమయినా తెలుసుకోవచ్చుకదా ! అతనిలో అంత గుడ్డి నమ్మకం యేమిటి మీకు ?"

హేమాలిని యిప్పటికీ నోరు విప్పలేదు.

"సరే. మంచిది. మీది సహజంగా ఎవరినీ అనుమానించే మనస్తత్వంకాదు. పోనీ, యిప్పుడు నేను చెప్పేదయినా నమ్మండి. నేను ఆడపిల్లల స్కూలుకు స్వయంగా వెళ్ళాను. అక్కడ రమేష్ భార్యను చూచాను. అక్కడ ఆమె చదువుకుంటూంది. అతను సెలవులలోకూడా ఆమెను అక్కడ వుంచుదామనుకున్నాడు. కాని హెడ్‌మిస్ట్రెస్ దగ్గర్నుంచి కమల అలా అంగీకరించడంలేదని జాబు వచ్చింది రెండు మూడు రోజులక్రితం. ఇవాళ స్కూలు మూశారు. కమలను స్కూలువాళ్ళు పూర్వపుబస దార్జీపరలో వదిలారు; మేం వెళ్ళేసరికి, కమల కత్తిపీటముందు కూర్చుని ఆపిల్‌పండు ముక్కలు కోస్తోంది. రమేష్ ఆమె కెదురుగా కూర్చుని,

ముక్కలు ఒక్కొక్కటే నోట్లో వేసుకుంటున్నాడు. నేను రమేష్‌ను సంజాయిషీ అడిగాను, అతనేమీ చెప్పలేకపోయి నాడు. అతను కమల తన భార్యకాదని మాట మాత్రంగా చెప్పినా, మేం అనుమానించేవాళ్ళంకాము. మాఅనుమానం ధృఢతరం కావడానికి అవకాశం ఉండేదికాదు. కాని అతను అవుననీ కాదనీ అనలేదు. ఈ గొడవ తరువాత కూడా రమేష్‌ను మనం నమ్మడానికి అవకాశం ఉన్నదా?'

జోగేంద్ర చెల్లెలివైపు చూస్తూ జవాబుకోసం వేచి వున్నాడు. ఆమెముఖం విచిత్రంగా, వివర్ణంగా తయారయింది. కుర్చీకి బలవంతంగా అంటిపెట్టుకు కూర్చుంది. తరువాత ఆమెతల ముందుకు పడింది. శరీరం స్వ్రహతప్పి, నేల మీదికి ఒరిగింది.

ఆనందబాబు విచారం వర్ణనాతీతం. కూతురి తల పైకెత్తి వొళ్ళోకి తీసుకుంటూ 'యిదేమిటే అమ్మాయీ-యిదేమిటి. వాళ్ళు చెప్పేదేదీ నమ్మకు. అంతా అబద్ధపు పుట్ట' అన్నాడు.

జోగేంద్ర తండ్రిని ప్రక్కకు నెట్టాడు. హేమాలినిని సోఫాలో పడుకోబెట్టాడు. చల్లని నీరు తెచ్చి అమె ముఖం మీద చిలకరించాడు' అక్షయ ఆమెకు విసనకర్రతో విసర సాగాడు.

హేమాలిని తొందరలోనే కళ్ళువిప్పి చూడగలిగింది. తండ్రి వంకతిరిగి ఏడుస్తూ 'నాన్నగారూ! నాన్నగారూ! అక్షయను వెళ్ళిపొమ్మని చెప్పండి..' అంది.

అక్షయ విసనకర్ర పక్కనే బల్లమీదపెట్టి, పక్కకు

తప్పుకున్నాడు. ఆనందబాబు సోఫాలో కూతురు సరసనే కూర్చున్నాడు ఆదరంగా ఆమె తల నిమురుతున్నాడు.

ఉన్నట్టుండి ఆమె కళ్ళు నీళ్ళతో నిండినాయి. ఆమె పైకి లేద్దామని ప్రయత్నం చేసింది. తండ్రి సముదాయిస్తూ, 'కదలకు. కాస్సేపు విశ్రాంతి తీసుకో. రమేష్‌ను మనం బాగా ఎఱుగుదుముకదా. అతను యిలాంటి పనిచేసి ఉండడు. జోగేంద్ర ఏదో పొరపాటుచేసి ఉంటాడు.

జోగేంద్ర ఓర్పు పరాకాష్ఠను అందుకొన్నది. 'నాన్న గారూ! అమ్మాయికి లేనిపోని ఆశలింకా ఎందుకుకల్పిస్తారు. దాన్నింకా ఎందుకు అధోగతికి తీసుకువెళ్తారు. హేమనే స్వయంగా కొంతసేపు ఆలోచించుకోనివ్వండి.'

హేమాలిని మెల్లిగా లేచికూర్చుంది. జోగేంద్ర ముఖంలోకిచూస్తూ "రమేష్ తన స్వంతనోటితే చెప్పితేతప్ప నేను ఇలాంటి కల్లిబొల్లి కబుర్లేవీ విననుు. నమ్మను' అంటూ పైకి లేవబోయింది. ఆనందబాబుకూడా లేచి ఆమెను కింద పడకుండా పట్టుకున్నాడు.

హేమాలిని తండ్రి ఆసరాతో తనగదిలోకి వెళ్ళింది. పక్కమీదికి చేరి 'కాసేపు నిద్రపోతాను నాన్నగారూ! నన్ను ఒంటరిగా వదలండి.'

ఆనందబాబు 'దాసీని పైకి పంపమంటావా అమ్మా?' అని అడిగాడు.

"అక్కర్లేదు. నేను వంటరిగానే ఉంటాను."

ఆనందబాబు పక్కనేఉన్న తనగదిలోకి వెళ్లాడు. హేమతల్లిని గుర్తు తెచ్చుకున్నాడు. ఆమె పిల్లదానికిమూడు

సంవత్సరాల వయస్సున్నప్పుడే గతించింది. ఆనందబాబు ఆమె ధ్యానాన్ని, ఓర్పును, సతత సంతోషాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు. ఇన్నాళ్ళూ తాను హేమకు తల్లిలేని లోటు కనపడకుండా చేస్తున్నాడు. తనకూతురుకువచ్చినకష్టాలన్నీ తొలగిపోవాలనీ, ఆమె తిరిగి సంతోషంగా తనకు కనిపించాలనీ దేవుడిని ప్రార్థించాడు.

జోగేంద్ర ఆడవాళ్ళ తెలివితేటలు ఎప్పుడూ చౌకబారుగానే ఉంటాయని అనుకొంటూ ఉండేవాడు. ఈనాటి సంఘటన దీన్ని ధృవపరిచిందిగూడా. ఎదురుగుండా కనిపిస్తున్న వాటినిగూడా నమ్మని ఈ ఆడవాళ్ళతో ఎలా వ్యవహరించటమో జోగేంద్ర అర్థం చేసుకోలేక పోయాడు. అక్షయను పిలిచాడు. అతను గదిలోకి వచ్చాడు. 'జరిగినదంతా చూచావుకదూ. ఇప్పుడేమంటావు.' అని అడిగాడు జోగేంద్ర.

"నన్నెందుకీ గొడవలోకి యీడుస్తావు. దీంతో నాకేమీ సంబంధంలేదు. ఇన్నాళ్ళూ నేను నోరుమూసుకునే ఉన్నానుగా. ఇప్పుడు నన్ను ఈ సాలెగూడులోకి లాగడం న్యాయమా."

"సరే నీ గొడవ తరువాత. ఈలోపల రమేష్‌ను హేమాలినితో ప్రత్యక్షంగా మాట్లాడేటట్లు చేస్తే?"

'నీకేమైనా వెర్రెత్తిందా ఏమిటి! ఏమగవాడైన అలా—'

"పోనీ మాట్లాడకపోతే వ్రాయమను. మరీ మంచిది. ఇటుపైన అదీ నీ ఉద్యోగం. నీవు వెంటనే కార్యరంగంలోకి

దూకాలి.''

''సరే నా శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తాను'' అన్నాడు అక్షయ.

# 21

ఆ రాత్రి తొమ్మిదిగంటలకు రమేష్ కమలను సీల్డా స్టేషనుకు తీసుకువెళ్ళాడు. అతను చెప్పినప్రకారం డ్రైవరు చుట్టూతిప్పి కాలుటోలా సందులమీదుగా తీసుకువెళ్లాడు. బగ్గీ ఒక ఇంటిముందుకు వచ్చినప్పుడు రమేష్ ఆత్రుతగా కిటికీలోనికి తల ఇవతలకుపెట్టి చూచాడు. ఆ యింటి వాతావరణంలో అతనికేమీ మార్పులు కనపడలేదు.

గాఢమైన నిట్టూర్పు విడిచాడు. కమల ఉలిక్కిపడి 'ఏమిటది ?' అని అడిగింది. 'ఏమీలేదు' అంటూ రమేష్ తన సీటులో కూర్చుండిపోయాడు. గమ్యస్థానం చేరుకునే వరకు తిరిగి అతనేమీ మాట్లాడలేదు. కమల కూర్చున్న చోటే కునికిపాట్లు పడుతోంది. రమేష్ తన ఆలోచనల్లోపడి పోయి సరసన ఆమెఉన్నదన్న విషయమే మరిచిపోయున్నాడు.

వాళ్ళు స్టేషనుకు పెందరాళే జేరుకున్నారు. ముందుగానే రిజర్వు చేసుకున్న రెండవతరగతి పెట్టెలోకి ఎక్కారు. రమేష్ కమలను కింది బెర్తుమీద పక్కవేశాడు. లైటుతగ్గించి కిటికీరెక్కలు మూసి 'నీవు నిద్రపోవలసిన సమయం దాటి పోయింది. ఇకనైనా కొంతసేపు నిద్రపో' అన్నాడు.

''రైలు కదిలేదాకా యిలాగే కూర్చుంటాను. తరువాత నిద్రపోతాను'' అంది ఆమె. రమేష్ 'సరే' నన్నాడు. కమల కిటికీదగ్గర కూర్చుని ప్లాట్ఫారంవంక చూస్తోంది.

రమేష్ పరధ్యానగా మధ్యవరసలో కూర్చున్నాడు. రైలు అప్పుడే కదులుతోంది. రమేష్‌కళ్ళు ఆలస్యంగా స్టేషనుకు చేరుకుని బండి అందుకోవడానికి పరిగెడుతున్న ఒక ప్రయాణీకుడిని కనిపెట్టాయి. అతన్నిచూస్తే తనకు పరిచితుడులాగానే కనిపిస్తున్నాడు.

మరుక్షణం కమల నవ్వసాగింది. రమేష్ కిటికీలోంచి ఆ ప్రయాణీకుడు తనను దింపబోతున్న రైలువాళ్ళతో తగాదాపడటం చూచాడు. చివరకు అతనే నెగ్గాడు. అతని శాలువ మటుకు రైలు అధికారిచేతిలో ఉండిపోయింది. అతను శాలువకోసం చేయిజాపుతూ ముఖం కిటికీలోంచి బయటికి పెట్టినప్పుడు రమేష్ అతన్ని అక్షయగా గుర్తించాడు.

ఈ గొడవంతా చూసి చాలసేపటివరకు కమల నవ్వు తూనే ఉంది. "ఇప్పుడు పదిన్నర అయింది. రైలు కదులు తోందికూడా. నువ్వింక నిద్రపో" అన్నాడు రమేష్. ఆమె అలాగేచేసింది. రమేష్ అక్షయను గురించి ఆలోచించ సాగాడు. అక్షయ ఊరు ఈ ప్రాంతంలోలేదు. కొన్ని తరాలుగా అతనికుటుంబం కలకత్తాలోనే స్థిరనివాసం ఏర్ప రచుకొంది. అయితే అతనంత పట్టుదలగా ఎందుకీ రైలుబండి నందుకున్నాడు. బహుశా తననో, కమలనో వెంటాడుతూ ఉంటాడు.

అక్షయ తన పల్లెటూరికివచ్చి అక్కడ తనను గురించి వాకబు చేస్తాడనుకోవడం రమేష్‌కు యిష్టంగా తోచ లేదు. ఈ వ్యవహారమంతా చాలా గడ్డుగాఉన్నట్లు తోచింది. పల్లెటూరులలో తనపేర అనేక వదంతులు పుడతాయి. కలకత్తా

వంటి మహానగరంలో అయితే ఎవరేంచేసినా గమనించే వాళ్ళుండరు. కాని పల్లెటూళ్ళ పద్ధతి అలా కాదు. అందుచేత రమేష్ ఆలోచించవలసివచ్చింది.

రైలు బరాక్‌పూర్ స్టేషనులో ఆగింది. రమేష్ బయటికి చూశాడు. అక్షయ కన్పించలేదు. నైహాతి స్టేషనులో ప్రయాణీలు ఎక్కడం, దిగడం రద్దీ ఎక్కువగా ఉంది. అక్షయ యీ స్టేషనులోకూడ కన్పడలేదు. అతను బోబూలా స్టేషనులోకూడ దిగలేదు.

రమేష్ బాగా అలసిపోయివున్నప్పటికి చాలా ఆలస్యంగా నిద్రపోయాడు. తెల్లవారేసరికి రైలు గోలుండా స్టేషన్ చేరుకుంది. తూర్పు బెంగాలుకు వెళ్ళవలసిన సైనికులు ఇక్కడే రైలు మారాలి. అక్షయ తలాముఖమూ కనపడకుండా శాలువ కప్పుకొని, చేతిసంచీతో నదివైపు పరుగెడుతున్నాడు. రమేష్ గ్రామానికి వెళ్ళే పడవ కొన్ని గంటల వరకూ బయలుదేరదు. మరో పడవకూడా విడిసివుంది.

"ఈ పడవ ఎక్కడికి వెళుతుంది?" అని అడిగాడు రమేష్.

"పడమరకు."

"ఎంతదూరం?"

"నదిలో నీరుంటే కాశీదాకా వెడుతుంది.

రమేష్ వెంటనే కమలను అందులో ఎక్కించి తను బియ్యం, కూరలూ, పాలూ, పండ్లూ యిటువంటి తినుబడి పదార్థాలు కొనడానికి హడావిడిగా వెళ్ళాడు. ఈలోపల

అక్షయ మొకటి పడవ ఎక్కికూర్చుని జనాన్ని తీరికగా పరిశీలిస్తున్నాడు. ప్రయాణీకులు పడవ ఎక్కడానికి హడా విడి పడడం లేదు. ఎందుకంటే దీనికి యింకా బోలెడంత విరామం ఉంది. వాళ్ళు తీరుబడిగా స్నానంచేస్తున్నారు. బట్టలు ఉతుక్కుంటున్నారు. మరికొందరు నదీతీరంలో వంటచేసుకొని భోజనం కూడా చేస్తున్నారు.

అక్షయ బహుశా రమేష్ కమలను భోజననిమిత్తం ఊళ్ళోని హోటలుకు తీసుకువెళ్ళివుంటాడని అనుకొన్నాడు. ఊళ్ళోకి వెళ్ళడానికి తనకు దారితెలియదు కనుక తాను యిక్కడ కూర్చోడమే క్షేమం అనుకొన్నాడు. చిట్టచివరకు పడవ కూతబెట్టింది. రమేష్ జాడలేదు. ప్రయాణీకులు హడావిడిపడుతున్నారు. ఎంతసేపటికీ రమేష్ కనబడలేదు. పడవ బయల్దేరింది. అక్షయ చివరకు విసుగుపుట్టి "నేను దిగిపోతాను" అన్నాడు. కాని అతనిమాట ఎవరూ వినిపించుకోలేదు. అతను నిస్సహాయుడై పడవలోనే ఉండిపోయాడు. తీరంవంక తేరిపారచూచాడు. కలకత్తా రైలుబండి అప్పుడే పొగవదిలి నడుస్తోంది. రమేష్ బహుశ తనను చూచివుంటాడని, తన ఉద్దేశ్యాన్ని గ్రహించివుంటాడని, అందుచేతనే స్వగ్రామం వెళ్ళకుండా తిరిగి ఉదయం రైలులో కలకత్తాకు తిరుగుప్రయాణం కట్టాడనీ అనుకున్నాడు అక్షయ. కలకత్తా వంటి మహానగరంలో ఒక మనిషిని పట్టుకోవడం అత్యంత కష్టసాధ్యం.

# 22

అక్షయ ఆరోజంతా గోలుండా స్టేషన్లో వృథాగా గడిపాడు. సాయంత్రం కలకత్తా వెళ్ళే రైలు అందుకున్నాడు. మర్నాడు ఉదయనే అక్కడికి చేరుకుని, ముందుగా దర్జీపర లోని రమేష్ గదులకు వెళ్ళాడు. ఇల్లు తాళం వేసివుంది. ఎవరూ లేరని జవాబు వచ్చింది.

తరువాత కాలుటోలా వెళ్ళాడు. అక్కడి ఇల్లుకూడా ఖాళీగానే వుంది. వెంటనే ఆనందబాబు యింటికి వెళ్ళాడు. జోగేంద్రతో "తప్పించుకు పారిపోయాడు. పట్టుకోలేకపోయి నాను" అన్నాడు.

"అసలేం జరిగిందో చెప్పు" అన్నాడు జోగేంద్ర.

అక్షయ తన అనుభవమంతా సవివరంగా చెప్పాడు. జోగేంద్ర అనుమానాలు మరింత సుస్థిరం అయినాయి. లేకపోతే, అక్షయను చూచిందే తడువుగా రమేష్ కమలతో సహా ఎందుకలా పారిపోతాడు. "ఇంత బలమైన ఆధారాలు వున్నప్పటికీ యివేవీ యిప్పుడు ఉపకరించవు. హేమాలిని ఒక్కతే కాకుండా నాన్నగారుకూడా రమేష్‌పట్ల విశ్వాసం సడలించుకోకుండా వున్నారు. రమేష్ స్వంతంగా చెబితే తప్ప నమ్మరు. ఈ రోజున రమేష్‌వచ్చి నేనేమీ చెప్పను అన్నప్పటికీ, నాన్నగారు పోనీలే అని హేమాలినిని యిచ్చి పెళ్ళిచేస్తారు. ఇటువంటి మనుషులతో వ్యవహరించడం ఎలా? హేమాలినికి మన్మథరసపరిస్థితి దాపవడం నేను చూడ లేను. రమేష్ వివాహితుడే అయినా, హేమాలిని అతన్నే

పెళ్ళిచేసుకుంటానని అన్నా, నాన్నగారు అలాగేలే అంటారు. ఏది యేమయినా మనం రమేష్‌నుంచి అసలు విషయమంతా రాబట్టుకోవాలి. మనం యీ సంగతి యింతతో వదల కూడదు. నేనేరంగంలోకి దిగుతాను. ఎలా ఉపక్రమించాలో తెలియడంలేదు. రమేష్‌తో కుస్తీకూడా చేయవలసి వస్తుం దేమో! సరే స్నానంచేయి కాస్త టీ తీసుకుందాం."

అక్షయ స్నానంచేసి వచ్చాడు. టీ బల్లదగ్గర కూర్చు న్నాడు. ఆలోచిస్తున్నాడు. ఆనందబాబు రావడంతో అతని ఆలోచనలకు అంతరాయం కలిగింది. కూతురిని కూడా తీసుకవచ్చాడు. అక్షయను చూడడంతోటే హేమాలిని వెనక్కు వెళ్ళడానికి తిరిగింది.

"హేమా యిలాచేయడం మంచిదిగాదు. ఈ విధమైన ప్రవర్తనను మీరు ప్రోత్సాహ పరచకూడదు నాన్నగారూ! ఆమెను రమ్మనండి-" అంటూ జోగేంద్ర తను కూడా "హేమా! హేమా!..." అని అరిచాడు. కాని హేమా లిని అప్పటికే మేడమీాదికి వెళ్ళిపోయింది.

అక్షయ జోక్యం కలిగించుకున్నాడు. "నా విష యాన్ని నువ్వు పాడుచేస్తున్నావనుకుంటాను జోగెన్. నన్ను గురించి ఆమెకు నువ్వేమీ చెప్పివుండవలసింది కాదు. నాలుగురోజులు పోతే అంతా సర్దుమణుగుతుంది. ఇప్పుడు హేమను బలవంతంచేస్తే యేదయినా అఘాయిత్యం చేస్తుం దేమో కూడా!"

అక్షయ టీ పూర్తిచేసి బయటకు వెళ్ళాడు. ఇతని శాంతము, ఓర్మి మెచ్చదగినవి. పరిస్థితులు తనకు అనను

కూలంగా వున్నప్పుడు మిన్నకుండటమే మంచిదని అతని మతం. తనను ఎవరయినా అవమానంచేస్తే కోపగించుకోడు. పోట్లాటకు దిగడు. ఎత్తిపొడుపులు, సూటిపోటి మాటలు యివేమీ అతన్ని కదిలించలేవు. అతన్ని స్నేహితులు ఎంత ఎగతాళి చేసినా, ఒక్క మాటయినా అనడు.

అతను వెళ్ళిపోవడంతోటే, ఆనందబాబు తిరిగి హేమాలినిని తీసుకవచ్చాడు. ఆమెముఖం కాంతి తగ్గివుంది. కళ్ళచుట్టూ నల్లటి ఉంగరాలు యేర్పడ్డాయి. ఆమె లోపలికి వస్తూ కళ్ళు పైకెత్తిచూడలేదు. ఎందుకంటే ఆమె జోగేంద్రను ముఖాముఖి చూడలేదు. అతనికీ రమేష్ అంటేను, తానంటేను యెంతో కోపంగా వున్నదనీ, తమను గురించి యీ నరికే కఠినోక్తులు ఎన్నో వాడివున్నాడు గనుకనూ ఆమె అతని దృష్టినుంచి తప్పించుకుందామని ప్రయత్నిస్తోంది.

హేమాలినికి రమేష్ పట్ల వున్నప్రేమ అతనిలో విశ్వాసాన్ని గూడా కలిగించింది. కాని కారణాకారణాలు కూడా విచారించుకున్న తరువాత మనసు అదోలా అనిపించింది. రెండురోజులక్రితం యీ గదిలోనే రమేష్ అంటే తనకు అచంచల విశ్వాసంవున్నదని జోగేంద్రకు ప్రకటించింది. కాని రోజులు గడుస్తున్నకొద్దీ, ఏకాంతంగా రాత్రిపూటలు ఆలోచించుకున్న కొద్దీ ఆమె విశ్వాసం సడలిపోతుంది.

రమేష్ యిలా అసాధారణంగా ప్రవర్తించడానికి ఆమెకేమీ చెప్పుకోదగ్గ కారణం కనిపించడం లేదు. ఆమె అనుమానాలను తన హృదయంలో ప్రవేశించకుండా చేయాలని ప్రయత్నించింది. అయినా ఎన్నో కిరణాలు తనకు తెలియ

కుండానే తనహృదయాన్ని ఆవరిస్తున్నాయి. బిడ్డను పొత్తిళ్ళలో అదుముకుని కాపాడే తల్లిలాగ రమేష్‌పట్ల తనవిశ్వాసాన్ని హృదయానికి హత్తుకుని కాపాడుకుంటుంది. కాని... ఆమెబలం సరిపోతుందా?

ఆనందబాబు హేమాలిని పక్కగదిలోనే పడుకున్నాడు. అందుచేత ఆమె యీరాత్రి నిద్రపోకుండా ఎలా అవస్థపడింది ఆయనకు తెలుసు. చాలాసార్లు ఆమెగదిలోకి వెళ్ళి యింకా మేలుకునే వుండడం చూచాడు. అతను యింకానిద్రపోలేదేం అని అడిగినప్పుడల్లా ఆమె ఇలా జవాబు చెబుతూ వచ్చింది: "ఇప్పుడే నిద్రపట్టబోతోంది, యింతలో మీరువచ్చారు. అయినా మీరుఇంకా నిద్రపోకపోవడమేం!"

ఆమె పెందలకడనే లేచి డాబామీద పచార్లు చేయసాగింది. రమేష్ యింటి తలుపులు, కిటికీలు అన్నీ మూసి వున్నాయి. సూర్యుడు క్రమేపీ ఆకసంలో పైకివస్తున్నాడు.

హేమాలినికి యీరోజు ఎంతో మత్తుగావుంది. అశాంతిగా అసౌఖ్యంగా వుంది. ఆమె డాబామీద ఒక మూల కూర్చుని ముఖాన్ని చేతులలో కప్పుకుని యేడ్వసాగింది. తన ప్రేమికుడిని చూడకుండానే రోజులు గడిచిపోతున్నాయి. సాయంత్రాలు నడిచిపోతున్నాయి. పక్కయింటిలోనే ఉన్నాడన్న సంతృప్తికూడా లేకుండాపోయింది.

కిందనుంచి తండ్రిగారి పిలుపువిని ఉలిక్కిపడింది, "హేమ! హేమ! —" హడావిడిగా కళ్ళుతుడుచుకుని తండ్రికి జవాబు చెప్పింది.

"ఇవాళ ఆలస్యంగా నిద్రలేచాను" అన్నాడు ఆనంద

బాబు. కూతురుకోసం ఆదుర్దా ఆయనకు విశ్రాంతి మిగల కుండా చేస్తోంది. తెల్లవారుజామువరకూ నిద్రపోయే ఆస్కారమే లేదు. సూర్యుడి ఎండ ముఖంమీదపడి మెలకువవచ్చింది. ముఖంకడుక్కొని కూతురుకోసం వెతుక్కుంటూ వచ్చాడు. ఆమెగదిలో చూచాడు. ఇల్లంతా వెదికాడు. ఎక్కడా కానక డాబామీదికి వచ్చాడు.

"కిందికివచ్చి టీ పుచ్చుకో, అమ్మాయ్" అన్నాడు.

టీకని కిందికి దిగితే జోగేంద్ర కనుపిస్తాడేమోనని వణికింది హేమాలిని. తన దినచర్యలో ఏమీ మార్పురాకుండా తండ్రిగారు చూస్తున్నారు. ఏమాత్రం మార్పు వచ్చినా ఆయన మనసంతా పాడుచేసుకుంటారు. అదీగాక కప్పులో టీ తను పోయడం, ఆయన తాగడం—యిదీ రోజూ అలవాటు. ఈ అలవాటును మరిచిపోవడం ఆమెకు యిష్టంలేదు.

కిందికివచ్చి గుమ్మందగ్గర నిలుచుని ఉండగా జోగేంద్ర ఎవరితోనో మాట్లాడుతున్నట్లు వినిపించింది. ఇంత పెందరాళే వచ్చేవాడు రమేష్‌తప్ప యింకెవరూ కాదనుకుంది హేమ. శరీరమంతా ఒణుకుతూవుండగా ఆమె గదిలోనికి అడుగు పెట్టింది అబ్బ!

ఎదురుగా అక్షయ! ఆమె వెనక్కు తిరిగి, పరుగెత్తింది. తండ్రిగారు మళ్ళీవెళ్ళి తీసుకువచ్చిన తరువాత, ఆయన కుర్చీకి అంటిపెట్టుకొని కూర్చుండిపోయి ముఖంపైకి ఎత్తకుండా టీ తయారుచేయడంలో మునిగిపోయింది.

ఆమె ప్రవర్తనకు జోగేంద్ర బాగా కోపం తెచ్చుకున్నాడు. రమేష్ కోసం ఆమె ఇంతగా దిగులుపడడం, కష్ట

పడడం అతనికి అసహ్యమనిపించింది. ఆనందబాబుగూడా ఆమె విచారంలో పాలు పంచుకోవడం చూస్తే అతనికి చికాకు ఎక్కువైపోయింది. ఆమె తండ్రి అనురాగాన్ని తనకు ప్రపంచానికి మధ్య తెఱగా వాడుకుంటూంది. అతను ఇలా అనుకున్నాడు: "మేమంతా నేరస్థులం. పాతకులం. ఆమె సుఖంకోసం తాపత్రయపడి పనిచేస్తున్నందుకు కృతజ్ఞత లేకపోగా ఏదో దొంగలను, తుచ్ఛులను నీచులను చూచినట్లు చూస్తోంది. నాన్నకు యీ వ్యవహారం ఎలానడపాలో సుతరామూ తెలియదు. ఆమెను ఓదార్చడంకంటే యీ సమయంలో కర్కశంగా మాట్లాడడమే మంచిపని! ఆమెకు బాధ కలిగించకూడదనే నెపంతో, నిజాన్ని ఆమెనుంచి దాస్తున్నాడు. ఆమెను మరీ అవస్థలపాలు చేస్తున్నాడు.

"ఏం జరిగిందో చూచారా, నాన్నగారూ?" అన్నాడు బిగ్గరగా.

"ఏమిటది?" అన్నాడు ఆనందబాబు, ఉత్సాహంగా.

'రమేష్ గోలుండా మెయిల్‌లో ఇంటికి వెళ్ళడానికి బయలుదేరాడు. సకుటుంబంగా బయలుదేరాడు. అక్షయను చూడడంతోటే తన పన్నాగం మార్చుకుని తిరిగి కలకత్తాకు వచ్చాడు!'

హేమాలినిచేయి వొణికింది. ఆమె కప్పులో పోస్తున్న టీ, బల్లమీద వొలికింది. నిస్సత్తువగా కుర్చీకి అంటిపెట్టుకు కూర్చుంది.

జోగేంద్ర ఆమెవంక ఓరకంటితో చూచాడు. "అక్షయకు అంతా తెలుసునని యెరిగికూడా అతనెందుకలా

పసిగట్టాలి? అంతకుముందు చేసిన పనేచాలు. అతని ప్రవర్తనను గురించి చెప్పడానికి. కాని యీసారి పోవడం ఎందుకు దొంగలాగ! నన్నడిగితే యిదంతా పెద్దకుట్ర అంటాను. హేమ ఏమనుకుంటుందోగాని, యీసారిపోవడం రమేష్ ప్రవర్తనను చెప్పక చెప్పుతూన్నదంటాను!'

నిలువెల్లా కంపించిపోతూ హేమాలిని లేచింది. అన్నతో "సెబుజువులు సాక్ష్యాలు నాకక్కర్లేదు. నీయిష్టం వచ్చినట్లు మాట్లాడుకో, అతన్నిగురించి ఏమనుకోడానికీ నాకు అధికారం లేదు" అంది.

"నిన్ను పెళ్ళిచేసుకోబోయేవాడు అతనితో మన కేం సంబంధమే లేదంటావా!"

నేను పెళ్ళినిగురించి యేమీ చెప్పడంలేదు. నీ యిష్ట ప్రకారం పెళ్ళి జరిపించతే జరిపించు, లేకపోతే లేదు. అంతే కాని నా నిశ్చయాన్ని మార్చలేవు."

ఆమె ఇంతకంటె ఇంకేమీ చెప్పలేకపోయింది. ఆనందబాబు ఆమెనుదగ్గరకు తీసుకున్నాడు. 'పద అమ్మాయీ పైకిపోదాం' అన్నాడు. అంతే!

# 23

రమేష్, కమల ఎక్కిన స్టీమరు సవ్యంగా 'గోలుండా'ను వదిలింది. మొదటి లేక రెండవ తరగతి ప్రయాణీకులు ఇంకె వరూలేరు. రమేష్ తన సామానులన్నీ పొందిగ్గా అమర్చాడు.

కమల ఆ ఉదయం కొద్దిగా పాలు తాగింది. కాబిన్ తలుపు తెరుచుకొని నిమిష నిమిషానికీ మారిపోతున్న నదీతల

దృశ్యాన్ని చూస్తూ కూర్చుంది.

"ఎక్కడికి వెడుతున్నామో తెలుసా కమలా ?"

"ఇంటికి" అంది కమల.

"నీకు యిష్టం లేదుగా, అందుకని మానేశాం ?"

"నాకోసం, మీ అభిప్రాయం మార్చుకున్నారా ?"

"అవును. నీకోసమే."

"అలా ఎందుకు చేశారు. నేనేదో ఊరికే అలా అన్నాను. మీకు కోపంవచ్చింది."

"నాకేం కోపంరాలేదు, నాకు ఇంటికి వెళ్ళాలని లేదు. అందుకని—"

"అయితే ఎక్కడికి వెడుతున్నాం యిప్పుడు ?" అనడిగింది ఆతురతగా కమల.

"పడమర దేశానికి వెడుతున్నాం."

కమల యీ మాటలు వింటూంది. కళ్ళువిప్పి ఇంటి దగ్గర పడివుండేవాళ్ళకు పడమర దేశం అంటే ఏం తెలుస్తుంది? పవిత్రమైన గుళ్ళు, గోపురాలు, హాయి అయిన గాలి, క్రొత్త ప్రదేశాలు, క్రొత్త దృశ్యాలు, పూర్వకాలపు రాజుల, సార్వభౌముల తాలూకు వైభవాలు, అత్యద్భుతమైన దేవాలయాలు, జానపద కథల్లోని తావులు, వీరోచితయుగంలోని కట్టుకథలు !

కమల సంతోషాతిశయంతో "మనం ఏయే ప్రదేశాలకు వెడుతున్నాం ?" అనడిగింది.

"ఏమో నే నింకా నిర్ణయించుకోలేదు. మోంఘిర్, పాట్నా, దినపోర్, బక్సార్, ఘజీపూర్, బెనారస్..."

యిమగో యిలాంటి ఊళ్ళు ఎన్నో చూస్తాం" అన్నాడు.

వీటిలో కొన్ని పేర్లు కమలకు తెలిసినవే. కొన్ని తెలియనివి. ఆమె ఊహాశక్తి ఒక్కసారిగా విచ్చుకున్నట్లయింది.

చప్పట్లు చరుస్తూ "ఏం విచిత్రంగా వుంది!" అంది.

"విచిత్రమంతా తరువాత. ముందు మన ఆహార విషయం చూచుకోవాలి. పడవవాళ్ళు పెట్టే భోజనం నీకు సరిపడదనుకుంటాను!" అన్నాడు రమేష్.

"హరి హరీ!" అని చెవులు మూసుకుంది కమల.

"అయితే యేం చేదామంటావు?"

"వంట చేస్తాను."

"నీకు వంట చేతనవునా?"

కమల విరగబడి నవ్వింది. "నన్ను గురించి యేమను కుంటున్నారేం? వంట చేతనవునా అంటారా? నన్నేం పసిపాప అనుకుంటున్నారా? మా మామ యింట్లో వంటపనంతా నాదేగా!"

రమేష్ క్షమించమన్నట్లుగా మాట్లాడాడు: "అలా అడిగివుండాల్సిందికాదు. సరే. అయితే మన యేర్పాట్లు చేసుకుందాం" అంటూ అతను బయటకువెళ్ళి, ఓ ఇనుప పొయ్యి తీసుకువచ్చాడు. అంతేకాదు. కమలకు వంటలో సహాయంగా వుండేందుకని ఉమేష్ అనే కుర్రవాడిని కూడా తీసుకువచ్చాడు. ఉమేష్ కాయస్థజాతికి చెందినవాడు. కాయస్థులంటే, బెంగాల్‌లో మటుకు బ్రాహ్మణులకంటే ఒక మెట్టు తక్కువజాతి. అతనికి బెనారెస్ తిరిగివెళ్ళటానికి డబ్బు

యివ్వడం ఒకటి, రోజుకు యింత వేతనం అని యివ్వడం ఒకటి—యివీ యేర్పాట్లు.

"కమలా ! అయితే మన భోజనానికి యేమేం చేసుకుందాం" అన్నాడు.

"బియ్యము, చిక్కుళ్లూ తెచ్చారు. వీటితో యేమేం చెయ్యమంటారు. అన్నమూ కూరా తప్ప ! ఇవాళిటికి దీనితోనే సరిపెట్టుకుందాం" అంది కమల.

కమల చెప్పిన ప్రకారం రమేష్ మరికొన్ని వస్తువులు సాధించి తెచ్చాడు.

"ఒక్క కూరతో యేంలాభం. ఏదయినా పచ్చడి కూడా చేయి" అన్నాడు.

"పచ్చడంటే మాటలతో అవుతుందా, దానికి రుబ్బురోలు, పాత్రం కావాలి" అంది కమల

రమేష్ అవి తేవడానికి వెళ్ళాడు. కొంతసేపు అయిన తరువాత, పడవవాళ్ళను అడిగి ఇనుప రుబ్బురోలు, పాత్రను సంపాదించాడు. కమలకు అటువంటిదానితో రుబ్బడంఅలవాటు లేదు. అందుచేత ఆమె కొంతసేపు యాతనపడవలసివచ్చింది. ముక్కలు పైకెగిరి అటూ ఇటూ పడిపోతున్నాయి. కమలకు నవ్వు ఆగిందికాదు. రమేష్ రుబ్బటానికి మరెవరినైనా పిలిపిస్తానన్నాడు. కమల వద్దంది. రమేష్ ఆమె యాతనకు తను కూడా నవ్వు కలిపాడు.

ఈ రుబ్బడం హడావడి అయినతరువాత, కమల తన చీరతో దడిలాగకట్టి వంటగది యేర్పాటుచేసుకుంది. కలకత్తా నుంచి స్వీట్లు పెట్టుకు తెచ్చిన పెద్దకుండ యిప్పుడు అన్నం

వండుకోవడానికి ఉపకరించింది. దీన్ని పొయ్యిమీదపెట్టి ఆమె రమేష్‌ను స్నానంచేసి రమ్మంది. స్నానంచేసి వచ్చేటప్పటికి వంట పూర్తయిపోతుందని చెప్పింది అతనలాగే చేశాడు. అతను వచ్చేటప్పటికి వంటకూడా పూర్తి అయింది. ఇక తరువాతి ప్రశ్న, అన్నం తినడానికి యే పళ్ళెం ఉపయోగించడం—అనేది !

రమేష్ డెక్కమీద వున్న మహమ్మదీయులను అడిగి వారిదగ్గర ఒక పళ్ళెం పట్టుకువస్తానన్నాడు. కమల యీ మాటలకు నిర్ఘాంతపోయింది ఇటువంటి పని తాను యిది వరకు చాలసార్లు చేశానని, హిందూధర్మశాస్త్రాలను చాల సార్లు ఉల్లంఘించాననీ అత నామెకు మెల్లిగా నచ్చచెప్పాడు. అయినప్పటికీ ఆమె అంగీకరించలేదు. పైగా యిలా అంది: "ఇప్పుడలా చేయడానికి వీల్లేదు. ఇకముందుకూడా మీ రెప్పుడూ అలా చేయకూడదు. నేనటువంటి అఘాయిత్యాన్ని భరించలేను" అంటూ ఆమె అన్నంకుండమీది మూతతీసి దాన్ని శుభ్రంగాకడిగిపెట్టింది. దాన్ని అతనిముందు వుంచి "ఇవాల్టికి యిదే ఉపయోగించాలి. వీలయినప్పుడు యింత కంటే మంచిది సంపాదిద్దాం" అంది.

రమేష్ నీళ్ళు తీసుకువచ్చాడు. కొంతమేర పడవను శుభ్రంచేసుకుని, భోజనానికి కూర్చున్నాడు. ధర్మశాస్త్రాలు, మతశాస్త్రాలు చెప్పే విధులన్నీ ఆచరించాడు.

ఒకటి రెండు ముద్దలు తిన్నాడో లేదో "అబ్బ! ఎంత చక్కగా వంటచేస్తావు కమలా నువ్వు!" అన్నాడు.

"మీరేం ఎగతాళి చేయనక్కరలేదులెండి" అంది

కమల కంగారుపడుతూ.

"నేనేం ఎగతాళిచేయడంలేదు. నీవేమూస్తావుగా !"

కుండలో వున్న అన్నమంతా తనకే గుమ్మరించ బోవడంచూచి "ఇదేమిటి ? నీవేంతింటావు ?" అన్నాడు.

"ఇంకా బోలెడంత వుంది. మీాకు ముందు తృప్తిగా భోజనం చేయండి."

రమేష్ హాయిగా భోజనంచేయడం కమలకు సంతృప్తి కలిగించింది.

"మరి నీ వెందులో భోజనంచేస్తావు ?" అనడిగాడు రమేష్ తన భోజనం ముగిస్తూ.

"ఏం యీా పళ్ళెంలోనే !" అని జవాబు చెప్పింది కమల, అతని భార్యగా తను యీా పళ్ళాన్నిమటుకే ఉపయో గించాలన్న దృఢవిశ్వాసంతో.

రమేష్ సంభ్రమంతో "నీ వలా చేయకూడదు" అన్నాడు.

"ఎందుకని ?" అంది కమల ఆశ్చర్యపోతూ.

"ఎప్పుడూ అలా చేయకూడదు."

"అలాగే చేయాలి. నాకు యేంచేయాలో, యేంచేయ కూడదో తెలుసులెండి...రమేష్, నువ్వు దేన్లో భోజనం చేస్తావు ?" అనడిగింది కమల.

"కింద మిఠాయిలమ్మే అబ్బిదగ్గర తామరాకులు వున్నాయి. ఒకటి అడిగి తెచ్చుకుంటాను"

"అయితే నీవు ఈ మూాటనే వుపయోగించేటట్లయితే- యిలాయివ్వు, శుభ్రంగా కడిగియిస్తాను" అన్నాడు రమేష్.

"ఎందుకు ఊరికే యేమీ లేనిదాన్ని గురించి గొడవ చేస్తారు" అన్నది కమల విసుక్కుంటున్నట్లు.

కొన్ని నిమిషాల అనంతరం ఆమె యిలా అంది: "మీరు తమలపాకులు తేలేదు. అందుకని మీకు నమలటానికి యేమీ లేవు."

రమేష్ "కింద ఒక అంగడివాడు అమ్ముతూనే వున్నాడు. తెస్తాను" అన్నాడు.

వాళ్ళకు కావలసినవన్నీ అమరాయి.

రమేష్ ఆలోచనలు మటుకు అతని మనస్సును గందరగోళ పెడుతూనే వున్నాయి. "మేమిద్దరం భార్యాభర్తలం కాము అన్న విషయం ఆమెకు విశదమయేలా చెప్పడం ఎలాగు?" అన్నది అతని సమస్య.

బయటివాళ్ళు ఎవరూ చెప్పనక్కరలేకుండా, ఎవరి సహాయ సహకారాలు అవసరం లేకుండా కమల యింటి యిల్లాలుగా పాత్రధరించడానికి సన్నద్ధం అవుతూనే వుంది. ఏమంటే, వాళ్ళ మామయింట్లో ఆమె జీవితమంతా వంటగదిలోనే గడిచింది. ఇంటిపనులతోనే మునిగి తేలింది. ఆమె శుభ్రత, చలాకీతనం, పనితనం, ఇవన్నీ చూచి రమేష్ మురిసిపోతున్నాడు. ఆశ్చర్యపోతున్నాడు కూడా! ఈ భావాలతో పాటు ఎన్నో ప్రశ్నలు అతన్ని బాధపెడుతూనే వున్నాయి. ముందుముందు తమ సంబంధ బాంధవ్యాలు ఎలావుంటాయి. ఆమెను తనతోనే వుండనీయడమా లేక వదలివేయడమా— రెండూ ఒకేరకంగా బాధాకరంగానే వున్నాయి అతనికి. దైనందిన కార్యకలాపాలలో ఆమెతో ఎక్కడ గిరిగీసి ప్రవ

_ర్తించాలి? హేమాలినికూడా తమతో వున్నట్లయితే యీ చిక్కులన్నీ వచ్చేవికావు. కాని అది అసాధ్యం. ఈ అనుబంధానికి వేరే విమోచనమార్గమేమీ కనిపించడంలేదు. చివరకతను యీ ముసుగు తొలగించుకోవడానికే నిశ్చయించుకొన్నాడు. కమలకు యదార్థ విషయాలన్నీ తెలియపరచవలసిందే ననుకున్నాడు.

## 24

మధ్యాహ్నసమయంలో స్టీమర్ యిసుక తిన్నెలో కూరుకుపోయింది. దాన్ని పైకి లేపుకువచ్చి నీళ్ళలో లేచేట్లు చేయడానికి చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయినాయి. సాయంత్రసమయానికి కూడా స్టీమరు అక్కడే కూరుకుపోయివుంది. ఈ యిసుక తిన్నెనించి నదీతీరంవరకూ అడుగుజాడలు అగుపిస్తూవున్నాయి.

సాయంత్రంపూట, నీళ్ళకడవలు నింపుకుపోవడానికి వచ్చిన ఆడపిల్లలు నదీతీరాననిలబడి యీ పడవవంక ఆశ్చర్యంగా చూడనారంభించారు. కొందరు మేలిముసుగులలోనుంచే చూస్తున్నారు. మరికొందరు ఆ మేలిముసుగులు పక్కకు తొలగించి ధైర్యంగా చూస్తున్నారు.

నదీతీరంలో కొన్ని చెట్లు, పొదలు వున్నాయి. అవి తమను వెనకనే విడచి ముందుకుపోదామని ఆశించిన స్టీమరు దురవస్థను ఎగతాళిగా చూస్తున్నాయి.

సూర్యుడు అస్తమించాడు. రమేష్ డెక్ మీదనే నిలబడి పశ్చిమాద్రివంక చూస్తున్నాడు. కమల వంటగదిగా అమర్చ

కున్న భాగంనుంచి యివతలకు వచ్చి, కాబిన్ తలుపుదగ్గర ఆగి రమేష్‌ను తనవైపుకు తిప్పుకోడానికి ఒకమారు పొడిగా దగ్గింది. అతను వెనక్కు తిరగకపోవడంతో ఆమె అతని తాళంచెవులు తీసుకుని తలుపుమీద చప్పుడుచేసింది. పెద్ద చప్పుడుచేస్తే తప్ప అతను వెనక్కు తిరిగాడు కాదు. ఆమెను చూడడంతోటే దగ్గరగావచ్చి నిలబడ్డాడు

"అయితే నన్ను పిలిచేమార్గం యిదన్నమాట," అన్నాడు.

'మరి వేరేమార్గమేమీ కనిపించలేదు.'

'ఏం! నా తల్లిదండ్రులు నాకు రమేష్‌బాబు అని పేరు ఎందుకు పెట్టారంటావు? అందరూ పిలవడానికేగా? నన్నెప్పుడయినా పిలవవలసి వచ్చినప్పుడు ఆ పేరు ఉపయోగించవచ్చుకదా!" అన్నాడు రమేష్.

మళ్ళీ మరొక సందిగ్ధమైన పరిస్థితి! హిందూస్త్రీ భర్తను పేరుతో ఎలాపిలుస్తుంది? కళ్ళలచెంపలు ఎర్రగా కెంపుల్లా అయినాయి. ముఖం కిందికివంచుకుని 'మీరేమంటున్నారో నాకు అర్థం కావడంలేదు. చూడండి. మీ భోజనం తయారయింది. వెంటనే భోజనం చేయడం మంచిది! ఇవాళ పొద్దున్నకూడా మీరు సరిగ్గా భోజనం చేయలేదు' అంది.

నదిమీదుగా వచ్చేగాలి, రమేష్‌లో ఆకలిని కల్పిస్తోంది. అయినా ఈ విషయం ఆమెతో చెప్పలేదు. ఏమంటే ఆమె వండినదంతా తనకేబోర్లించి తినేదాకా వేధించుకు తింటుందని! ఏమయినప్పటికీ, తను అడగకుండానే ఆమె భోజనానికి పిలవడం అతనికి అమితానందాన్ని కలిగించింది. ఈ

ఆనందంలో ఒకపాలు యేమిటంటే, కడుపుకు కావలసిన భోజనం తేలిగ్గా దొరకడం! రెండవపాలు యేమిటంటే, తనను గురించి మరెవరో శ్రద్ధతీసుకోవడం! తనకు కావలసినవి మరెవరో సమకూర్చిపెట్టడం! ఈ విషయాన్ని అతను మరచిపోలేక పోతున్నాడు. కాని, తనయేకాంతపు ఆలోచనలన్నీ ఒక్కసారి ముసురుకువచ్చి అతన్ని బాధపెడుతున్నాయి. ఇందులో ఎంతో అనాహ్లాదం వున్నది. దీన్ని రమేష్ కాదనలేడు. ఇదంతా యేదో పెద్దగందరగోళంగా తయారయ్యేట్లు వుంది. గాఢంగా ఒక్క నిట్టూర్పు విడిచి, నీరసంగా కాబిన్‌లోకి నడిచాడు.

అతని హావభావాలు కమల గమనించకపోలేదు. 'ఏం, మీకు భోజనం కావాలనేట్లులేదే మీరు. ఎంతో ఆకలిగా వుంటారనుకున్నాను. మీ యిష్టంలేకుండా లోపలికి లాక్కు వచ్చాను కాబోలు! అంది.

రమేష్ వెంటనే ముఖంలో సంతోషం కనపరచాడు. 'నీవుకాదు. నా ఆకలే నన్ను లాక్కువచ్చింది. ఇంతకూ యేం భోజనం! నాకు అజీర్తిచేసేట్లుంది. ఏమిటో ఈ పడవ ప్రయాణం!' అన్నాడు.

కమల విరగబడి నవ్వసాగింది. నవ్వడం అయిన తరువాత, 'ఏమిటి, ఒక్క నిమిషమైనా ఆగలేరేం! సూర్యాస్తమయంపంక చూస్తున్నప్పుడు, మీకు ఆకలి అవుతున్నట్లే కనిపించలేదు. కాని, తీరా నేను పిలిచేసరికి, మీకు ఎక్కడలేని ఆకలి పుట్టుకవచ్చింది. సరే, ఉండండి, ఒక్క నిముషంలో భోజనం అమరుస్తాను.

'త్వరగా! నువ్వు ఆలస్యంచేస్తే, నేను యీ పక్క బట్టలనే మింగివేస్తానేమో!" అన్నాడు రమేష్

అతనిమాటలకు కమలకు మళ్ళీ నవ్వువచ్చింది. విపరీతంగా నవ్వనారంభించింది. ఆ మెనవ్వు కాబిన్ అంతటా ప్రతిధ్వనిస్తోంది. ఆమె లోనికి వెళ్ళడంతోటే రమేష్ ఆనందమంతా విచారంగా మారింది.

కమల చేతిలో ఆకుకప్పిన పళ్ళెం తీసుకుని తొందరగానే తిరిగివచ్చింది. స్థలంశుద్ధిచేసి వాటిని అక్కడవుంచింది. ఆమె ఆపూట భోజనంలోకి రొట్టెలు, కూరలు తయారు చేసింది.

"ఈ రొట్టెలు ఎక్కడ సంపాదించావు?"

కమలకు యీరహస్యం అతనికి తెలిసేట్లు చేయడం యిష్టంలేదు. అందుకని, కవ్విస్తూ "మీరే చెప్పుకోండి" అంది కొంటెగా.

రమేష్ ఎన్నో మార్గాలు చెప్పాడు. కమల అన్నింటికీ తల అడ్డంగా ఊపుతోంది. చివరకు రమేష్ దాదాపు విసుగ్గా "అల్లాఉద్దీన్ అద్భుతదీపంలోనుంచి యీ రొట్టెలు రాలిపడి వుంటాయి!" అన్నాడు.

అప్పుడు కమల "మీరలా చిలిపిగామాట్లాడేట్లయితే, నేనసలు యివి ఎలావచ్చాయో చెప్పనేచెప్పను" అంది.

"సరే. నువ్వేచెప్పు. ఈనదిమధ్య యిసుకలో కూరుకుపోయిన పడవమీద కూర్చొని నీవు రొట్టెలు ఎలా సంపాదించావో నేను కనిపెట్టలేను. కాని యివెంతో బాగున్నాయి సుమా!" అంటూ అతను ఆమెను పొగడసాగాడు.

ఇంతవరకూ నిజం యిది. స్టీమర్ ఆగిపోయినప్పుడు కమల ఉమేష్‌ను పక్కనున్న పల్లెటూరుకు పంపింది. రమేష్ బడిదగ్గర విడిచి వెళ్ళినప్పుడు యిచ్చిన డబ్బులోయింకా కొంత ఆమెదగ్గర నిలవవుంది. ఆడబ్బు అతనికి యిచ్చి, పిండి-నెయ్యి తెప్పించింది ఉమేష్‌ద్వారా. ఆ కుర్రవాడితో—"నీవేం తెచ్చుకుంటావు?" అనడిగింది.

ఊర్లో మంచి పెరుగు దొరుకుతుంది కాబిన్‌లో చాలా అరటిపళ్ళువున్నాయి. మీరో పిడికెడుబియ్యం పెడితే అన్నం వొండుకు తింటాను." అన్నాడు ఉమేష్.

కమల అతని మాటలకు ఎంతో జాలిపడింది. "మర యితే నీదగ్గరేమైనా డబ్బు వుందా?" అనడిగింది.

"నాదగ్గరేంలేదు. అమ్మగారూ!" అన్నాడు వాడు.

మళ్ళీ సమస్య, కమల నేరుగా రమేష్‌దగ్గరకు వెళ్ళి డబ్బు అడగడానికి బిడియపడింది, కొంతసేపు యోచించి "సరే, యివ్వాల్టికి నీవు వండుకోవద్దులే. నారొట్టెలే యిస్తాను. తొందరగా పిండిపట్టుకురా!" అంది.

"మరి పెరుగుమాట యేమంటావు. అమ్మగారూ!" అన్నాడు ఉమేష్.

"చూడు. ఉమేష్. మీ అయ్యగారు భోజనానికి కూర్చున్నాక, బజారుసరుకులు తేవడానికి డబ్బుకావాలని అడుగు" అంది కమల.

రమేష్ భోజనంమధ్యలో వుండగా ఉమేష్ మెల్లిగా అక్కడికి వచ్చాడు. నెత్తిగోక్కుంటూ కొంతసేపు కూర్చు న్నాడు. రమేష్ తలపైకెత్తి చూచినప్పుడు "బజారుసరుకులకు

డబ్బు—అమ్మగారూ!" అన్నాడు.

అప్పుడుగాని రమేష్‌కు, ఎవరికిగానీ సుష్టుగా భోజనం కావాలంటే సుష్టుగా డబ్బు ఖర్చవుతుందనీ-తనదగ్గర అద్భుత దీపం అంటూ యేదీ లేదు గనుక తనుకూడా అందరిమాదిరే నన్ీ తెలిసిరాలేదు.

"ఏం, నీదగ్గరేం డబ్బులేదా—కమలా ?"

కమల యుక్తిగా తనదగ్గర యేమీలేదని చెప్పింది. భోజనం అయిపోక రమేష్ ఆమెకో డబ్బుపెట్టె అందించాడు. "నీడబ్బు—యింకా యితర విలువైన వస్తువులు ప్రస్తుతానికి యిందులో పెట్టుకో" అన్నాడు.

పరిస్థితులు ఎలా సమీకరణపొందుతున్నాయో గమనిస్తూ రమేష్ మెల్లిగా మళ్ళీ పడవమీదికి వెళ్ళి పడమటి దిక్కుచూస్తూ నిలుచున్నాడు.

ఉమేష్ అన్నం, పెరుగు, అరటిపళ్ళు అన్నీ వేసుకొని సుష్టుగా భోజనం చేస్తున్నాడు. కమల అతని పక్కనే నిలుచుని అతన్ని గురించి ప్రశ్నలు వేస్తోంది; జీవితవివరాలు సేకరిస్తోంది.

సవతితల్లి పాలనకింద—ఎవరికి అక్కరలేని ఒక పిల్లవాడుగావుండి, విసుగుపుట్టి ఉమేష్ కాశీకి పారిపోయివస్తున్నాడట. అక్కడ అతని తల్లితాలూకు బంధువులు వున్నారట.

"మీరు నన్ను మీతోనే వుండిపొమ్మంటే, అమ్మగారూ యింకెక్కడికీ వెళ్ళను" అన్నాడు.

కమల హృదయం మాతృత్వం ఉబికింది. ఉమేష్ తనను అమ్మగారూ !" అని సంబోధించడం ఆమెను పులకింప జేస్తోంది.

"అలాగే, ఉమేష్. నువ్వు మాతోనే ఉండిపో!" అంది ఉత్సాహంగా.

## 25

క్రమక్రమంగా చీకటి ఆవరించింది. బాతులు ఎక్కడెక్కడ తిరుగుతున్నవీ, క్రమంగా తమ యిసుకగూళ్ళకు చేరుకున్నాయి. కాకులు తమతమ చెట్లకొమ్మలకు చేరుకుని గందరగోళం ఆపివేశాయి. అన్నిపడవలూ తీరంలో విడిశాయి. ఒక పడవమాత్రం ముందుకుపోతోంది. దాని నీడ నీటిమీద నల్లగా పడుతోంది.

రమేష్ ఒక పేముకుర్చీ యివతలకు లాక్కుని దానిమీద కూర్చుని చంద్రుని శీతకాంతులను పరిశీలిస్తున్నాడు. ఆకాశంలో పడమర వెక్కున చీకటినీడలు బంగారువర్ణపు కాంతిని ఆకొన్నాయి. చంద్రుని కాంతి భూమిని పొగమంచులా ఆవరిస్తోంది. రమేష్ తనలోతాను "హేమా! హేమా!" అనుకున్నాడు. ప్రియమైన యీ పేరు అతని హృదయాన్ని మధురాతి మధురమైనరీతిని పెనవేసుకుపోయింది. ఆ పేరు తలుచుకుంటే చాలు, అతనికి ఏదో విపరీతదృశ్యం అగుపడుతోంది. శరీరమంతా ఒకవిధంగా పులకరించి, కన్నీళ్ళుకూడా కారుతున్నాయి.

గడచిన రెండుసంవత్సరాలుగా నడచిన తన జీవితమంతా ఒక్కమాటుగా అతనిముందు పురివిప్పుకు నిలిచింది. హేమాళినిని మొదటిమారు కలుసుకున్న సన్నివేశం మననకు తెచ్చుకున్నాడు. ఆరోజు తన కెంత దౌర్భాగ్యపు దినమో

అతనికి తెలిసిరావడంలేదు, జోగేంద్ర అతన్ని యింటికి తీసుకువెళ్ళాడు. టీ టేబుల్ ముందు ప్రథమస్థానంలో హేమా లిని ఆసీనురాలై వుండడం చూచి, యీ యువకుడు ఎంతో సిగ్గుపడిపోయాడు. క్రమక్రమంగా అతని బెరుకుతనం వాడి ంది. ఆమె సన్నిధిలో మామూలుగా మెలగడం అల వాటయింది. వారి పరిచయం అనేకం అయినకొద్దీ అతనిలో గీతాలు ఉద్భవించసాగినాయి. తాను చదివిన ప్రేమకవిత్వం లోని విషయాలన్నీ అతనికి హేమాలినిలో కనిపించాయి. తాను ప్రేమిస్తూవున్నందుకు తనలో తాను గర్వపడుతూ వుండేవాడు. పరీక్షలకోసం ప్రేమపద్యాలు కంఠస్థం చేస్తూ వుంటే తనతోటి విద్యార్థులను చూచి జాలిపడుతూ ఉండే వాడు. ప్రేమ అతనిపట్ల యదార్థానుభవదృశ్యం అయింది.

అతనిలా ఆలోచిస్తూవుండగా, ఆ గోష్ఠిల్లో తాను కేవలం ప్రేమభవనం బహిర్ద్వారాలవద్దనే నిలబడివుండినట్లు తోచింది. కమల అకస్మాత్తుగా రంగస్థలంలో ప్రవేశించి తన ఉనికిని ఉక్కిరిబిక్కిరిచేసి, అయోమయంలో ముంచి నప్పుడు, ఆ సుడిగుండంలో పడి కొట్టుకులాడి - హేమాలిని పట్ల అతనిప్రేమ నిజమైన ఒక ఆకారాన్ని దాల్చింది. అప్పు డది సజీవమైన పదార్థంలా తయారయింది.

రమేష్ ఇలా ఆలోచిస్తూ తల చేతులమీదకు వాల్చు కున్నాడు. జీవితం అతనిముందు తివాచీలా పరుచుకుంది. హృదయతాపం ఎన్నటికీ తృప్తి అనిపించని హృదయతాపం, వలలో చిక్కిన జంతువులా, అక్కడనుంచి తప్పించుకు యివతల పడటానికి యమయాతనపడుతూ ఏవిధంలాభం కని

పించక బెంబేలు పడడం - ఇవీ యీ జీవితస్వరూపం. ఈ వలనుచింపి, తనశక్తినంతా ఉపయోగపరిచి తాను యివతల పడలేడా ?

అతడు దృఢనిశ్చయంతో తల విసిరేశాడు. ఇలాచేయడంలో, కమల తనపక్కనే నిలబడివున్నదని తెలిసివచ్చింది. మరో పేముకుర్చీమీద చేతులు ఆనించుకుని నిలువబడివుంది అతని కదలిక ఆమెను ఉలిక్కిపడేట్టు చేసింది. "మీరు నిద్రపోయారనుకుంటాను. నా గొడవతో మీకు మెలుకువ వచ్చింది" అంది. ఇలా అని వెనక్కు తిరిగింది. వెళ్ళిపోవడానికని - కాని అత నామెను పిలిచాడు. "అబ్బే లేదుకమలా! నేనింకా నిద్రపోవడంలేదు. వచ్చి యిలా కూర్చో, నీకో కథ చెబుతాను" అన్నాడు.

కథ పేరు వినడంతోటే కమలకు సంతోషం అయింది. అతని కుర్చీపక్కకు తనకుర్చీకూడా లాక్కుని ఎదురుగా అందులో కూలబడింది. రమేష్ ఆమెకు యథార్థమంతా చెప్పివేయాలనుకున్నాడు. కాని ముందుగా కొంత వాతావరణం తయారుచేసి వుంచితే తప్ప, కమలకు యీ కథ కలవరం కలిగించుతుందనికూడా అనుకున్నాడు. అంచేతనే కథ చెబుతాను రమ్మంటూ యిలా ఆహ్వానించాడు.

"అనగా అనగా—" అంటూ ఆరంభించాడు 'రాజపుత్రుల వంశం ఒకటివుంది. వాళ్ళు—'

"ఎన్నాళ్ళక్రితం ? బాగా చాలా ఏళ్ళకిందటనా ?" అని అడిగింది కమల.

"అవును. చాల సంవత్సరాల క్రితం. అప్పటికి నువ్వింకా

పుట్టలేదు—''

"ఓహో! మీకు మాత్ర మున్నారన్నమాట! చిన్న పాపలా వున్నారా? సరే, చెప్పండి—''

''ఈ రాజపుత్రులకు తమాషా అయిన ఆచారాలు వున్నాయి. వాటిలో ఒకటేమిటంటే, ఏ రాజకుమారుడయినా వివాహ సమయంలో తాను అత్తవారింటికి వెళ్ళకుండా తన కత్తినిమటుకే పంపుతాడు. పెళ్ళికూతురు కత్తితోనే వివాహపు తంతంతా జరుగుతుంది. తరువాత పెళ్ళికూతురు అత్త వారియింటికి వస్తుంది. అక్కడ వారిద్దరికీ యథావిధిని వివాహం జరుగుతుంది. మళ్ళీ.''

కమల—''ఓహో! యేం విచిత్రంగా వున్నదీ పద్ధతి'' అని ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

''సరే. ఆ విషయం అలా వుంచు. కథలో సంగతి అది. ఈ రాజపుత్రులు, వివాహానికని తమంత తాము పిల్ల యింటికి వెళ్ళడం యేదో తక్కువపనిగా భావిస్తారు. మన కథలో రాజు, ఇటువంటి వంశానికి చెందినవాడు. ఒకరోజు ఆయన—''

"ఆయన యే దేశానికి రాజు చెప్పలేదు'' అంది కమల మధ్యలో అందుకుని.

"మధుర దేశపు రాజు. ఒకరోజు ఆ రాజు—''

"ముందు ఆయనపేరు యేమిటో చెప్పండి'' అని ప్రశ్నించింది కమల. ఆమెకు అన్నీ యథావిధిగా వుండాలి గాని, ఏదో ఒకటి అనుకోవడం అంటే రుచించదు. రమేష్‌కు యీ విషయం గనుక తెలిసివున్నట్లయితే ముందుగానే

తయారయివచ్చి వుండేవాడు. ఇంతకూ ఆమె కథ వినడానికి ఉత్సుకత చూపిస్తూ వున్నది గనుక, అతన్ని యేకొద్ది వివరాలుకూడా చెప్పందీ ముందుకు వెళ్ళనివ్వదు.

రమేష్ ఒక్కక్షణం "ఆలోచించి అతనిపేరు రంజిత్ సింగ్!" అన్నాడు.

కమల తనలో తాను "మధురదేశపురాజు రంజిత్ సింగ్–" అనుకుని "సరే. చెప్పండి" అంది.

"ఒకరోజు ఆ రాజు ఎవరి నోటివెంటనో ఒకవిషయం విన్నాడు. అదేమిటంటే, యిదేవంశానికి చెందిన మరొక రాజుదగ్గర బంగారుభరిణలాంటి కుమార్తె వున్నది–అని!"

"ఏ దేశపురాజు?"

"కంజీవరపుదేశరాజు అనుకుందాం, పోనీ" అన్నాడు రమేష్.

"అనుకోవడం ఏమిటి? అతను నిజంగా కంజీవరం దేశపురాజు కాదా ఏం?" అని అడిగింది కమల నిక్కచ్చిగా.

"అవును. కంజీవరందేశపురాజే. నీకు అతనిపేరు కూడా తెలుసుకోవాలని ఉందా? అయితే విను. అమర సింగు!"

"ఆ బంగారుభరిణెపేరు చెప్పారు కాదు"

"అరరె, మరిచిపోయాను. ఆమెపేరు...ఆమెపేరు... యేమిటంటే...ఆమెపేరు చంద్ర—"

"మీరు పేర్లవిషయం అలా మరచిపోతారేం? మీరు నా పేరే మరిచిపోయారామెను!"

"సరే, కథ విను. అయోధ్యరాజు యీ అందాలరాశిని

గురించి ఎవరినోటి వెంటో విన్నాడు."

"ఈ అయోధ్యరాజు ఎవరంటే మళ్ళీ? ముందు మధుర రాజు అన్నారుగదూ?"

"కమలా! అతను ఒకే ఒకదేశానికి రాజు అనుకుంటున్నావా యేమిటి? అతను అయోధ్యకు, మధురకు కూడా రాజు!"

"అవి పక్క-పక్క రాజ్యాలు కావును."

"అవును. ఒకదాని పక్కనే మరొకటి—"

అతనిలా చెప్పుకుంటూపోతూవుంటే, కమల మధ్య మధ్యలో తప్పులు ఎత్తిచూపుతోంది. ఎలాగయితేనేం వాటి నన్నిటినీ సరిచేసుకుంటూ పోతున్నాడు. అతను చెప్పిన కథంతా యిలా తయారయింది:

"మధురదేశపురాజు రంజితసింగు కంజీవరం రాజుకు రాయబారం పంపుతూ అతనికూతురును తన కిచ్చి వివాహం చేయవ సిందిగా కోరాడు. దీనికి కంజీవరంరాజు యీ కోరి కకు వెనువెంటనే ఆమోదం తెలియపరిచాడు.

"అప్పుడు, ఇంద్రజిత్తు—రంజితసింగు తమ్ముడు— సైన్యసహాకారాలతో కంజీవరం రాజధానిలో ప్రవేశించాడు. కంజీవరంనగరమంతా ఆయన గౌరవార్థం వేడుకలు, వినోదాలతో తేలియాడింది

"రాజజ్యోతిష్యులు అంచనాలువేశారు. లెక్కలు సమకూర్చుకున్నారు. వివాహానికి సుముహూర్తం నిర్ణయించారు. కృష్ణపక్షద్వాదశినాడు, తెల్లవారుజాము రెండు గంటలకు సుముహూర్తం. ఆ రాత్రి నగరంలోని యిళ్ళన్నీ పూలతోర

ణాలతో అలంకరించబడినాయి. నగరమంతా దేదీప్యమానంగా ఎన్నెన్నో వెలుతురులతో వైభవం వెదజల్లుతోంది. ఇదంతా రాకుమారి చంద్ర వివాహసన్నాహమే.

"అయినప్పటికీ రాకుమారికి తన కాబోయే భర్త ఎవరో తెలియదు. ఆమె పుట్టినప్పుడు పరమానందస్వామి, ఆమె తండ్రితో యిలా అన్నారు: "ఒక నక్షత్రప్రభావంవల్ల అమ్మాయికి కీడుకలుగుతుంది. దీనికి విరుగుడుగా-అమ్మాయి వివాహం అనుకున్నప్పుడు పెళ్ళికుమారునిపేరు ఆమెకు తెలపకుండా వుంచండి" అని

"సుముహూర్తంవేళకు రాకుమారి కత్తితో వివాహపు వేడుకలన్నీ జరిపించి. పెళ్ళికుమారుని తరపున ఇంద్రజిత్తు కానుకలన్నీ సమర్పించాడు. తన అన్నగారి భార్యకు వంగి నమస్కారం చేశాడు. ఇంద్రజిత్తు, రాముని తమ్ముడైన లక్ష్మణుడు ఎటువంటివాడో, తన అన్నపట్ల అటువంటివాడు. అతను ఎంతసేపూ ఆమె పాదకమలములవంక చూస్తూనే వుండిపోయాడు. కాని ఒక్కసారయినా తల పైకెత్తి ఆమె ముఖంలోనికి చూడలేదు.

ఔపోశ్యనకార్యం కేవనగా, ఇంద్రజిత్తు పెళ్ళికుమార్తెకు పల్లకీచేయించి ఆమెను తన ఊరికి ప్రయాణం చేయించాడు. రాకుమారి తండ్రిమదిలో పరమానంద స్వామి చెప్పిన వాక్కులు మెదిలాయి. గుండె దడదడ లాడింది అయినా సంబాళించుకుని, కుడిచేతిని అమ్మాయి శిరస్సుమీద వుంచి ఆమెను ఆశీర్వదించాడు. రాణి అమ్మాయిని పెదవులపై ముద్దాడుతూ కన్నీళ్లు ఆపుకోలేకపోయింది.

దేవాలయాల్లో వేలకొద్దీ పురోహితులు ఆదు తొలగి పోయేందుకు ఎన్నో మంత్రాలు వల్లిస్తున్నారు.

"కంజీవరం మధురకు చాలా దూరాన వున్నది. ప్రయాణం దాదాపు నెలరోజులపాటు పడుతుంది. రెండవ నాడు సాయంకాలం, రాజపుత్రులు వైత్యానదీతీరంలో గుడారాలు వేసుకుని ఆ రాత్రి అక్కడే మకాం వేయడానికి నిశ్చయించుకున్నారు. అప్పుడు వారికి పక్కనున్న అడవిలో నుంచి దివిటీలు తమవైపుగానే వస్తున్నట్లు అగుపించింది. ఒక దూతను పంపి అదేమిటో చూచిరమ్మన్నారు. ఆ దూత త్వరగానే తిరిగివచ్చాడు. ఎవరో వివాహంనుంచి తిరిగివస్తున్న వారి తాలూకు దివిటీలట అవి. వారుకూడా యిటువంటి రాజవంశానికి చెందినవారేనట. పెళ్ళికుమార్తెను సాయుధబలాలతో అత్తవారింటికి తీసుకువెడుతున్నారట. రోడ్డు క్షేమకరమైనదికాదు గనుక, వారు యీ రాకుమారుని రక్షణను కోరుతున్నట్లుగా దూత వర్తమానం తెచ్చాడు.

"ఈ వర్తమానం రాకుమారుడైన ఇంద్రజిత్తు యిలా అన్నాడు: "మనను సహాయం కోరినవారికి ఉచితరీతిని తోడ్పడడం మన కర్తవ్యం. మన శక్తి చాలినంతవరకూ వారికి సహాయంచేదాం!"

రెండు వివాహపుజట్లు కలసి ప్రయాణం సాగించాయి.

మూడవరాత్రి—అమావాస్య అయింది ముందుగా పర్వతపంక్తులు, వెనుక దట్టమైన అడవి. అలసిపోయిన సైనికులు తేలిగ్గా నిద్రకు పడ్డారు.

"ఉన్నట్టుండి వాళ్ళందరూ ఏదో గందరగోళం జరిగి

న్ని ఒక్కసారిగా మేల్కొంచారు. మధుర గుడారాలలో గుర్రాలన్నీ చెంగుచెంగున గంతులు వేస్తున్నాయి. ఎవరో వాటి కట్టుతాళ్ళను తెంపివేశారు. అక్కడక్కడ కొన్ని గుడారాలు తగలబడుతున్నాయి ఆ మంటల వెలుగులో ఆకాశం---చంద్రుడు లేని ఆకాశం - ఎర్రగా తయారయింది.

"యోధులు వెంటనే తమని బందిపోటు దొంగలు చుట్టుముట్టినట్లు తెలుసుకున్నారు. కొంతసేపు ద్వంద్వయుద్ధం సాగింది. చీకట్లో ఎవరుమిత్రులో, ఎవరుశత్రువులో తెలుసు కోడం కష్టం. అంతా ఎవరికీ అర్థంకాని గందరగోళం. దోపిడీ దొంగలు గర్జనలుచేస్తూ, తాము దోచుకున్న వస్తువు లతో కొండలవైపు పరుగెత్తుకు వెళ్ళారు.

"ఈ పోరాటం అయినతరువాత, రాకుమారి ఎక్కడ కనిపించలేదు. ఆమె యీ భయంకర వాతావరణంలో ఏమీ తెలుసుకోలేక కొంతదూరం పరుగెత్తి, పారిపోతున్న కొంద రినిచూచి, తనవారనుకొని వారితో కలిసి పోయింది."

"నిజానికి ఆ పారిపోతున్నవారు రెండవ వివాహపు జట్టుకు చెందినవారు. వాళ్ళు కాపాడుతూవున్న చంద్రను దోపిడీవాళ్ళు ఎత్తుకు వెళ్ళారు. ఈ గందరగోళం యీ మే తమ పెళ్ళికుమార్తె అయిన రాకుమారి అనుకుని పిక్కబలంకొద్దీ తమ రాజ్యంవైపు పరుగులు తీశారు.

"వాళ్ళు కర్నాటక ప్రాంతంలో చిన్న తెగకు చెందిన వాళ్ళు. రాకుమారి ఆ రాజును కలుసుకుంది. అతనిపేరు చేత సింగు, మరో పెళ్ళికుమార్తెను వివాహం చేసుకున్న వాడు!

"చేతసింగుతల్లి రాకుమారికి స్వాగతంచెప్పి కోటలోనికి తీసుకువెళ్ళింది. నగరంలోనివారంతా రాకుమారిని చూచి 'ఇంత అందగత్తెను మేమెన్నడూ చూడలేదు'' అనుకున్నారు.

"చేతసింగుకు తను ఒక బహుమానం గెల్చుకున్నట్లుగా వుంది. ఆమెను హృదయంలో ఆరాధిస్తున్నాడు. ఆమె ఆకారాన్ని పూజిస్తున్నాడు. రాకుమారికి భార్యగా తన విధులేమిటో బాగా తెలుసు. చేతసింగునే తన విజ్ఞుడైన భర్త అనుకుని తన జీవితమంతా అతని సేవకే వినియోగించడానికి నిశ్చయించుకుంది.

"కొన్ని రోజులకే యీ ముసుగు తొలగిపోయింది. తెర విడిపోయింది. వారి మాటలవల్ల చేతసింగు తాను భార్యగా తెచ్చుకున్నది. రాకుమారి చంద్రదేనని తెలుసుకున్నాడు."

## 26

"తరువాత ఏమయింది?" అనడిగింది కమల. ఆమె ఊపిరికూడా బిగబట్టి కథను శ్రద్ధగా వింటూంది.

"నాకు అంతవరకే తెలుసు. అంతకుమించి అక్షరం ముక్కకూడా ఎక్కువ తెలియదు. ఎమటుకు నీవే ఆలోచించి ఆ తరువాత ఏం జరిగివుంటుందో చెప్పు!" అన్నాడు రమేష్.

"ఊహు! అది న్యాయంకాదు. మిగతా కథకూడా మీరే చెప్పాలి."

"నిజం కమల! నేను యదార్థం చెబుతున్నాను. ఇంతవరకూ యీ కథలో మొదటిభాగంమటుకే ఒక పుస్త

కంగా అచ్చయింది. అది చదివే యీ కథ నీకు చెప్పాను. రెండవభాగంలో కథ ఎలా వుంటుందో నాకేమాత్రం తెలియదు."

"సరే పోనివ్వండి! మీరెప్పుడూ ఇంతే!" అంది కమల విసుగుతో.

"నన్ను కోప్పడి ఏం లాభం? రచయితను కోప్పడు. పోతే నిన్ను ఒక్కటే ప్రశ్న వేయాలి—చేతసింగు చంద్రను ఏం చేయాలంటావు?"

కమల చాలసేపు నదివంక చూస్తూ ఆలోచిస్తూ వుంది.

"ఏమో, నాకేం తెలియడంలేదు. నాకేం తోచడం లేదు." అంది కమల ఆఖరుకు.

రమేష్ ఒక నిమిషం ఆగాడు. తరువాత ఇలా అన్నాడు. "చేతసింగు చంద్రతో యదార్థం చెప్పా లంటావా ?"

"ఏం తమాషాగా అడుగుతారు ? అతను చెప్పక పోతే, అదంతా గందరగోళంగా తయారవదూ మరి ? ఎంతో గొడవగూడా అవుతుంది. అందుచేత యదార్థం చెప్పివేయ డమే మంచిపని !"

"మంచిపని !" అనుకున్నాడు రమేష్ తనలో తాను. తరువాత కొద్దిసేపు ఆగి—'అయితే, కమలా......మరి...' అన్నాడు.

"మరి...? యేమిటి ?"

"నేను చేతసింగునూ, నీవూ చంద్ర అయితే ?"

"నాతో అలాంటి విషయాలు చెప్పకండి. నాకు

బాగుండవు" అంది కమల.

"బాగుండక పోవచ్చు. కాని నేను చెప్పితీరాలి. అలా అయితే అప్పుడు నేను చేయవలసిందేమిటి, నీవు చేయవలసిందేమిటి...అది చెప్పు !"

కమల యీ ప్రశ్నకు జవాబు చెప్పలేదు. చెప్పక పోగా, హఠాత్తుగా కుర్చీలోనుంచి లేచి అక్కడినించి లోపలకు వెళ్ళింది. కాబిన్ తలుపుదగ్గర వొంటరిగా ఉమేష్ కూర్చునివున్నాడు.

"ఉమేష్, ఎప్పుడైనా దయ్యాల్ని చూచావా ?" అనడిగింది.

"చూచాను, అమ్మగారూ !" అన్నాడు వాడు.

"అది ఎటువంటి దయ్యం ? నాకు వివరంగా చెప్పు" అంటూ ఆమె పేముబల్ల అక్కడికి లాక్కుని ఉమేష్‌పక్కనే ఆసీనురాలయింది.

రమేష్ తనలో తాను తర్కించుకుని కమలను తిరిగి పిలవకూడదనుకున్నాడు. ఏమంటే ఆమె యిప్పటికే బాగా గాయపడింది. కొత్త చంద్రుడు వెదురుపొదలమాటుగా దాక్కున్నాడు. డెక్కుమీది దీపాలు ఆర్పివేశారు. పడవవాళ్ళు కింద భోజనాలకీ, నిద్రకీ, ఆయత్తమవుతున్నారు. కాబిన్‌లో మరెవరూ ప్రయాణీకులు లేరు. మూడవతరగతి ప్రయాణీకులు నదీతీరాన విడిసి తమతమ భోజనసదుపాయాలు చూచుకుంటున్నారు. పొదలమాటుగా అక్కడక్కడ ఊరులోని దీపాలు అగుపిస్తున్నాయి. గాలి విసురుగా వీస్తూండటాన, పడవ అప్పుడప్పుడూ కదులుతూన్నట్లు అనిపిస్తోంది.

ఇటువంటి ప్రత్యేక వాతావరణంలో, ఈ ఆకాశంకింద ఆరుబయట కూర్చుని, రమేష్ సాలెగూడువంటి యీ చిక్కని సమస్యను విడదీయటానికి ఎంతగానో ప్రయత్నిస్తున్నాడు. తేట తెల్లంగా తెలుస్తున్న దేమంటే తాను కమలనో, హేమా లినినో యిద్దరిలో ఒకరిని పోగొట్టుకోవాలి. తన జీవితంలో యేదో రాజీమార్గాన యిద్దరినీ తనవద్దనే వుంచుకునే పద్ధతి సాధ్యపడదు. ఏది విధాయకమో యింకా స్పష్టంగా తెలి యడంలేదు. హేమాలినికి తనుతప్ప వేరే మార్గాలు లేక పోలేదు. ఆమె తేలికగానే తనను మనస్సులోనుంచి తుడిచి వేసుకొని మరొక పురుషుడితో చేయి కలుపగలదు. కాని దిక్కూ మొక్కూలేని కమల పరిస్థితి అలాకాదు. ఆమెకు ప్రపంచంలో నా అన్నవారు ఎవరూ లేరు. కాని రమేష్‌లోని స్వార్థం బయటకు వచ్చింది. అతను హేమాలిని తనను మరిచిపోతుందనీ, ఆమెకు వేరే మార్గాలు వున్నాయనీ, ఆమె పూర్తిగా తననే నమ్ముకుని లేదనీ—అనుకుని తృప్తి పడలేకపోయినాడు. ఈ ఆలోచన ఆమెకోసం అతనుపడే తపనను యితోధికంచేసింది. ఆమె తనముందు అంగా గాలిలో తేలియాడుతున్నట్లు అనిపించింది. చేయిజాపితేచాలు, తనకు లభ్యం అవుతుందన్న దూరంలోనే తిరుగాడుతున్నట్లు అని పించింది.

అతనిలా ఆలోచిస్తూ చేతులమీదికి తల వాల్చు కున్నాడు. దూరంగా నక్కలు కూతలుపెడుతున్నాయి. ఆ కూతలువిని కుక్కలుకూడా మొరుగుతున్నాయి. ఈ ధ్వను లకు అతను తలపైకెత్తి చూచాడు. పక్కనే కమల నిలుచుని

వుండడం కనిపించింది. కుర్చీలోంచి లేచి "ఏం కమలా, యింకా నిద్రపోలేదా ? చాలా రాత్రి అయింది కదూ ?" అన్నాడు.

"మీరుమటుకు నిద్రపోరా యేం ?"

"ఇదుగో యిప్పుడే లేస్తున్నాను. నేను కాబిన్ యివతల పక్క వేసుకున్నానుగా ! నాకోసం నీవు వేచివుండ నక్కరలేదు."

కమల యింకేమీ మాట్లాడకుండా తాను పడుకోవ డానికి నిర్దేశించబడిన కాబిన్ వైపు నడిచింది. తాను యింత వరకూ దయ్యాపు కథలు వింటున్నాననీ అందుకనే తనకు ఒంటరిగా పడుకోవడం అంటే భయంగావున్నదనీ రమేష్‌కు చెప్పడం చేతనయిందికాదు ఆమెకు. ఆమె వాలకంచూస్తే, రమేష్‌కే ఎంతో జాలివేసింది.

"మరేం భయపడకు కమలా ! నా కాబిన్‌కూడా నీ పక్కనేగా ! మధ్య తలుపు తీసేవుంచుతానులే. హాయిగా నిద్రపో" అన్నాడు.

కమల తల ఊపుతూ "భయపడటానికేముంది ?" అంది.

రమేష్ తన కాబిన్‌లో దీపం ఆర్పివేసి నిద్రపోవటానికి ప్రయత్నించాడు.

తనలో తాను ఇలా అనుకున్నాడు : "నేను కమలను వొదలలేను. అందుచేత, హేమనళినినే వదులుకుంటాను. ఇదే నా తుది నిశ్చయం. ఇంక యీ విషయంలో ఆలో చించవలసిందేమీ లేదు. . ."

కాని అతని ఆలోచనలుమటుకు హేమాలినిని వదులు కున్నందువల్ల తనకు రాగల కష్టనష్టాలను గురించే అంచనాలు వేస్తున్నాయి. ఈ ఆలోచనలు భరింపరానివయినాయి. కాబిన్ వదలి పైకినడిచాడు. ఈ చీకటిరాత్రి, అనంతమైన ఆకాశము — అతనికి తన సిగ్గు హృదయభారము సర్వకాల సర్వావస్థలనూ నింపగలవిగా తోచలేదు. ఆకాశంలో మినుకుమినుకుమనే నక్షత్రాలు పరలోకానికి చెందినవి. రమేష్ హేమాలినిల విషాద ప్రణయగాథ వాటిస్తాయిని ఎన్న టికీ చేరుకోలేదు. ఈ జీవితాలు ఇంతతో ఇక్కడ అంతమై పోవచ్చునుగాని, యీ ప్రకృతి వాతావరణంమటుకు ఎన్నా ళ్ళయినా తనకేమీ సంబంధంలేనట్లు ఇలాగే వుంటుంది. తన జీవితం వున్నంతవరకూ తనకు యీ బాధలన్నీ తప్పవు.

# 27

కమల యింకా చీకటి వుండగానే మేల్కొంచింది. ఒక సారి చుట్టూ చూచి తాను ఒంటరిగా వున్నట్లు గమనించింది. ఆమెకు తాను ఎక్కడ వున్నదీ తెలుసుకోవడానికి ఒకటి రెండు నిమిషాలుపట్టింది. పక్కమీదినించి లేచి తలుపు తెరుచు కుని బయటికి చూచింది. కదలికలేని నదీజలంపైన పలచని పొగమంచుపొర ఆవరించింది. అంధకారానికి బూడిదరంగు తొడుగు యేర్పడింది. తూర్పువైపు ఆకాశంలో, చెట్లకొమ్మల చాటునుంచి ప్రభాత కాంతిచిహ్నాలు అగుపిస్తున్నాయి. ఆమె అలా చూస్తూవుండగానే, చేపలకోసం పడవలు నదిలో కద లాడుతున్నాయి.

కమల హృదయంలో యేదో చెప్పరాని బాధ. దీనికి మూలం యేమిటో ఆమెకు తెలియడంలేదు. ఈ ఉదయం యింత మందకొడిగా వున్న దెందుచేత? తన హృదయంలో నుంచి వస్తున్న నిట్టూర్పులు నోట మాటరాకుండా చేసి కళ్ళలో నీళ్ళుగూడా తెప్పించబోతున్నాయి. వీటికి కారణం యేమిటి? తన దుర్భరపరిస్థితిని గురించి యెందుకిలా ఆలోచనలు కలుగుతున్నాయి? ఇరవైనాలుగు గంటల క్రితం తను, తన భర్త అనాథలనే ఉద్దేశ్యంలోనే వుంది ఆమె. ఆమెకు తనవారని చెప్పుకోగల బంధువులుగాని, స్నేహితులుగాని లేరు. ఇప్పుడే యింతలో యేమయిందని తనకు యీ వంటరితనపు టూహాలు వస్తున్నాయి? రమేష్ ఒక్కడే తనకు యావదాస్తి కదా! ఈ విశాల విశ్వంలో తన ఉనికి ఎంతో అనామకమైనదనే ఊహ ఆమె కెందుకు కలగాలి?

అలా తెరిచివున్న తలుపుదగ్గర నిలబడివుండగా, నదీతలం ప్రవహిస్తున్న బంగారులా అగుపిస్తోంది. పనివాళ్ళు కార్యక్రమం ఆరంభంచేశారు. యంత్రాలు గొడవచేస్తున్నాయి.

రమేష్‌కు గూడా మెళుకువ వచ్చింది. కమలను వెదుక్కుంటూ కాబిన్ తలుపుదగ్గరకు వచ్చాడు. అతన్ని చూడగానే ఆమె దిగ్భ్రమ చెందింది. ముఖంమీదికి చీరకొంగు లాక్కుంది.

"కమలా! స్నానంచేశావా!" అనడిగాడు రమేష్.

ఇది అనూహ్యకమైన ప్రశ్నగా అనిపించింది అయినప్పటికీ ఆమెకు కోపం తెప్పించింది. లేదన్నట్లుగా తలఊపి వెనక్కు-

వెళ్ళబోయింది.

అత నిలా అన్నాడు "కాస్సేపట్లో జనం వచ్చేస్తారు. నువ్వు ముందుగానే తయారవడం మంచిది !" కమల బదులు చెప్పలేదు. కుర్చీమీదినించి తువ్వాలు లాక్కుని, అతన్ని దాటి స్నానాలగదివైపు వెళ్ళింది.

రమేష్ యిలా తనకంటే ముందుగానేలేచి తన అలంకారాలను గురించి అజమాయిషీచేయడం కమలకు అనవసరంగానేకాక, అసంబద్ధంగా కూడా అనిపించింది. అతనెప్పుడూ తనతో వ్యవహరించడంలో ఒక గిరి గీసుకున్నాడనీ దాన్నిదాటి ఎప్పుడూ పైకిరాడనీ ఆమెకు తెలుసు. ఎంత చనువు యేర్పడినా యింతేననికూడా తెలుసు. ఆమె పరిచయం, యెప్పుడూ అత్తగారి పాదసన్నిధిని కూర్చుని ఆదర్శమైన ఇల్లాలు యెలా మెలగవలసిందీ పాఠాలు నేర్చుకోలేదు. కాని యీ ఉదయం రమేష్‌నుచూడడంతోటే ఆమెకు యెక్కడలేని సిగ్గూ ముంచుకువచ్చింది.

కమల స్నానంచేసి తన కాబిన్‌కు తిరిగివచ్చినమీాదట, రోజువారి వసంతా ఆమెకోసం కనిపెట్టుకునివుంది. పమిట కొంగుకు ముడివేసుకున్న తాళంచెవులగుత్తి చేతిలోకి తీసుకుని ఆమె బట్టలపెట్టెదగ్గరకు వెళ్ళింది. పెట్టె తెరవడంతోటే రమేష్ తనకు బహూకరించిన "డబ్బులపెట్టె కనిపించిది. నిన్న ఆ పెట్టె ఆమెకు సరికొత్త ఆనందాన్ని, సంతోషాన్ని కలిగించింది. దాన్ని దగ్గర వుంచుకుంటే ఆమెకు సరికొత్త హక్కులు, అధికారాలు, స్వేచ్ఛ వచ్చినట్లయింది. అందుకనే దాన్ని భద్రంగా పెట్టెలోవుంచి, తాళంవేసింది. కాని,

ఇవాళ అలా అనిపించడంలేదు ఈ రోజు అంత సంతోషం కలగడంలేదు. ఈ పెట్టె యెట్టువచ్చి రమేష్‌ది. తనది కాదు. దీనికి హక్కుదారు తాను కాదు. దీన్ని తన యిష్టం వచ్చినట్లు చేయటానికి తనకు హక్కులేదు. పైగా యిది తనకు మరొక బాధ్యతనుకూడా కలిగిస్తోంది.

రమేష్ కాబిన్‌లోకి ప్రవేశిస్తూ "ఏం, అలా మూగగా ఉన్నావు. పెట్టె తెరవగానే రహస్యం కనిపించిందా యేం?" అన్నాడు.

కమల డబ్బుపెట్టె యివతలకుతీసి "ఇది మీది" అంది.

"అయితే యేం చేయమంటావు?"

"మీ కేమన్నా కావలసివస్తే చెప్పండి. ఈ డబ్బుతో తెప్పించిపెడతాను!"

"మరి నీ కేమీ అక్కర్లేదా?"

"నాకు డబ్బేం అక్కర్లేదు." అంది కమల తల ఒక పక్కకు వాంచుతూ.

రమేష్ నవ్వాడు: "చాలమంది మనుష్యులు ఇలా చెప్పలేరు. అయినా నీకు డబ్బు అంత విలువలేనిదిగా కనిపిస్తే పోనీ, ఎవరయినా కొత్తవాళ్ళకు బహుమతి ఇవ్వు. అందరిలోకీ నాకే ఎందుకు ఇస్తావు?" అన్నాడు.

కమల ఏమీ మాట్లాడకుండా డబ్బుపెట్టె నేలమీద ఉంచింది.

"సరే. నిజంచెప్పు కమలా! ఇంతకూ రాత్రి కథంతా పూర్తిగా చెప్పనందుకు నీకీ చికాకు కదూ?"

"నాకేం చికాకు లేదు" అంది కమల ఇంకా నేల వైపు చూస్తూనే.

"అలా అయితే, ఆ డబ్బు పెట్టె ముట్టుకుని చెప్పు. అప్పుడు నిజం అనుకుంటాను"

దానికీ దీనికీ ఏమి సంబంధం? ఇది మీ ఆస్తి. దీన్ని మీరే వుంచుకోవాలి!"

"కాదు-అది నాదికూడా కాదు. బహుమతులు ఇచ్చి తిరిగి వెనక్కి తీసుకున్నవాళ్ళు భూతాలై పుడతారట! నేను భూతాన్ని కావాలని వుందా ఏమిటి నీకు?"

కమలకు యీ మాటలు తమాషా అనిపించి నవ్వు ఆగింది కాదు.

"వొద్దు వొద్దు. నిజంగా, బహుమతులు యిచ్చి పుచ్చుకున్నవాళ్లు భూతాలు అవుతారా? నేనెప్పుడూ ఆవిషయం వినలేదు."

"నిజం తెలుసుకోవాలంటే ఒకటే మార్గం. ఈ సారి నువ్వు దయ్యాన్ని చూచినప్పుడు యీ విషయం అడుగు."

కమల ఉత్సుకత ఎక్కువయింది. "నిజంగా చెప్పండి. మీరు నిజంగా దయ్యాన్ని చూచారా?" అని అడిగింది.

"నిజం దయ్యాలు కాదు. నకిలీవాటిని చాలా చూచాను! నిజం దయ్యాలు అరుదుగా కాని కనిపించవు!"

"ఉ మేష్ అంటాడూ —"

"ఉ మేష్ ఎవరు?"

"ఎవరా? మనదగ్గర పనిచేస్తున్న కుర్రాడు, వాడు దయ్యాన్ని చూచాట్ట!"

చూస్తే చూసివుండవచ్చు!

ఇంతలో విశ్వప్రయత్నంమీద పడవవాళ్ళు పడవను నీళ్ళలోనికి తీసుకురాగలిగారు. పడవ అలా కొంతదూరం వెళ్ళిందో లేదో తీరంమీద ఒక కుర్రాడు పరుగెత్తుకు వస్తూ బిగ్గరంగా అరుస్తున్నాడు. అతని నెత్తిలో బుట్టవుంది. పడవ ఆపమని సైగచేస్తూ చేతులు ఊపుతున్నాడు. పడవవాళ్ళు అతన్నిగాని, అతని అరుపులనుగాని గమనించడం లేదు. రమేష్‌ను చూచి అతను "బాబుగారూ! బాబుగారూ!" అని అరవ సాగాడు.

"నన్ను టిక్కెట్లు ఇచ్చేమనిపి అనుకుంటున్నాడు" అంటూ రమేష్ పడవమీద తనకేమీ అజమాయిషీ లేదన్నట్లుగా అతనికి సైగచేశాడు.

"అదుగో! వాడు ఉమేష్. వాడిని వొదిలి మనం ఎలా వెళ్ళగలం! పడవ ఆపించండి. తొందరగా!" అంది కమల.

"నాకోసం పడవ ఆపుతారా!" అన్నాడు రమేష్.

"ఏమయినా సరే. ఆపమని చెప్పండి. తొందరగా చెప్పండి. ఇంకా తీరానికి చేరువలోనే ఉన్నాం" అంది కమల నిజంగా అనుర్ధాగా. రమేష్ ఆమె చెప్పినప్రకారం చేశాడు. కాని పడవ ఆసామి 'అది రూల్సుకు వ్యతిరేకం' అన్నాడు. కమలకూడా రమేష్ వెనకనే వెళ్ళి ఇలా అంది: 'అలా అతన్ని వదలటానికి వీల్లేదు. ఒక్కక్షణం ఆపండి. పాపం, ఉమేష్! వెర్రివాడు...'

మొతంమీద పడవ ఆగింది. ఉమేష్ ఎక్కాడు. కమల పాదాలదగ్గర బుట్టవుంచి తనకేమీ జరగనట్లే

కూర్చున్నాడు.

కమల ఇంకా పూర్తిగా తేరుకోలేదు. "ఇదేం నవ్వులాటకాదు. పడవ ఆగకపోయినట్లయితే ఏం చేసేవాడివి!" అంది.

ఆమెకు జవాబు చెప్పటానికి మారుగా ఉమేష్, బుట్టలో తాను తెచ్చిన పళ్ళు, కూరలు అన్నీ గుమ్మరిస్తున్నాడు.

'ఇవన్నీ ఎక్కడ తెచ్చావు' అంది కమల.

అతను చెప్పిన జవాబు పోలీసులుగనుక వింటే సంతృప్తికరంగా లేదంటారు. ముందురోజు, పెరుగూ కూరలు కొనడానికి ఊళ్ళోకి వెళ్ళినప్పుడు అక్కడ తోటల్లో యీ కూరగాయలు ఎదుగుతూవుండడం చూచాడట. అందుకని ఇవాళ తెల్లవారకముందే, పడవయింకా యిసుకలోనే కూరుకుపోయి వుంది. కనుక—ఎవరినీ అడక్కుండా వాటిని కోసుకు వచ్చాడు.

"వాళ్ళతోటల్లోంచి యిలా దొంగతనంగా తీసుకురావడమేమిటి? తప్పుకాదూ?" అన్నాడు రమేష్.

"దొంగతనంకాదు. ఒక్కొక్క తోటలోకొన్నికొన్ని మటుకే తీసుకున్నాను."

"ఎక్కువ తీసుకోనంత మాత్రాన అది దొంగతనం కాదంటావా? దొంగ వెధవా! నా ముందునుంచి వెళ్ళు. యివిగూడా తీసుకుపో!"

ఉమేష్ కమలవంక దీనంగా చూచాడు. ఆమెకు కూరగాయల గుణాలనుగురించి అభివర్ణించి చెబుతున్నాడు.

రమేష్ యింకా కోపంగా ముందుకొచ్చి బైటికి వెళ్ళు. మళ్ళీ మాట్లాడావంటే నీళ్ళలోకి తోస్తాను" అన్నాడు.

ఉమేష్ కమలవంక చూచాడు. ఆమె వాటినన్నిటినీ ఏరుకుని పక్కకు వెళ్ళమని సంజ్ఞచేసింది. దీన్ని బట్టి యింకా ఆమెహృదయంలో తనకు దయాపూరితమైన స్థానం వున్నదనే సంతృప్తితో కూరగాయలు బుట్టలోకి ఎత్తుకుని పక్కకు వెళ్ళాడు.

రమేష్ ఉత్తరాలు వ్రాసుకోవడానికి కాబిన్‌లోకి వెడుతూ "వాడు అలా దొంగతనం చేయవలసింది కాదు. నీవు వాడిని అలా ప్రోత్సహించగూడదు" అన్నాడు.

కమల ఒకమారు చుట్టూ చూచింది. ఉమేష్ రెండవ తరగతి గుమ్మందగ్గర కూలబడి వున్నాడు.

రెండవతరగతి ప్రయాణీకులు ఎవరూ లేరు. అందుకని కమల శాలువ తలపైకి సర్దుకుని అక్కడికి వెళ్ళింది. "అవన్నీ అవతల పారేశావా?" అనడిగింది.

'లేదమ్మగారూ, యిక్కడే వుంచాను' అన్నాడు ఉమేష్.

కమల కోపంగా కనిపించడానికి ప్రయత్నిస్తూ "నీవు చేసింది చాల అల్లరిపని, తెలుసా? యీ సారి ఎప్పుడూ అలా చేయకు. నీ వలా నదీతీరం మీాదనే దిగపడి పోయినట్లయితే యేమయేది—ఆలోచించు"

ఆమె డెక్—యింట్లోకి వెళ్ళి "కత్తిపీట తీసుకురా" అంది. ఉమేష్ తీసుకువచ్చాడు. ఆమె కూరగాయలు తరగ సాగింది. ఉమేష్ తీసుకవచ్చిన కూరగాయలన్నీ నిమిషంలో

తరిగిపోసింది. ఉమేష్ చేసిన చెడ్డపని ఎదురుగుండా కనిపించ కుండా చేయటానికి ఆమెకు యింతకంటే మార్గం కనబడ లేదు. నిజానికి ఉమేష్ దిక్కూ మొక్కూ లేక తిరుగాడటంతో పోల్చిచూస్తే, యీ తోటల దొంగతనం ఒక లెక్కలోనిది కాదనిపించింది ఆమెకు. ఆమెకు సంతోషం కలిగించే విషయ మల్లా యేమిటంటే, యీ కుర్రవాడు కేవలం తనకోసమనే పడవను వదలి, యిలా తోటలవెంట పడ్డాడు. తన వంటకు కూరగాయలు తీసుకువద్దామనే సదుద్దేశంతప్ప యిందులో మరే వింతభావమూ లేదు.

"నిన్నటి పెరుగు కొంత మిగిలిపోయింది. దాన్ని నీవు వుపయోగించవచ్చు. కాని గుర్తుంచుకో యిటువంటి పని మటుకు యికముందు యెప్పుడూ చేయకూడదు." అంది కమల.

"యేం అమ్మగారూ! నిన్న మీరు పెరుగు పోసుకో లేదా?" అన్నాడు ఉమేష్ బాధగా.

"నీలాగ నాకు అంతయిష్టం లేదు. పోనీ, యీపూట భోజనానికి చేపలుతప్ప తతిమ్మావన్నీ వున్నాయి. మీ అయ్యగారి భోజనంలోకి కొన్ని చేపలు సంపాదించటం ఎలా?"

"నేను తీసుకురాగలను అమ్మగారూ! కాని వాటికి ధర యివ్వాల్సి వుంటుంది."

ఆమె తన కనుబొమ్మలు అందంగాముడివేస్తూ "నీవంటి అల్లరి కుర్రవాడిని నేనెప్పుడూ చూడలేదు. నేనెప్పుడైనా యేవస్తువయినా ధర యివ్వకుండా తీసుకురమ్మన్నానా?" అంది. నిన్నటి అనుభవంవలన రమేష్‌నుంచి డబ్బు తీసుకోవ డం యీమెకు చాలా కష్టమయిన పనిగా అనిపించింది

ఉమేష్ బుర్రకు, ఈ అభిప్రాయంవల్ల, మరికొన్ని కారణాల వల్ల అతనికి యజమాని అంటే మనసులో కొంత అయిష్టం యేర్పడింది. కమల, తను ఒక పరిధిలో వున్నట్లు—రమేష్‌కు యిక్కడ చోటులేనట్లు తోచింది అతనికి.

కూరగాయల విషయం తేలికయినదేగాని చేపలసంగతి అలా కాదు. అవి అంత తేలికగా దొరకవు. ఈ ప్రపంచంలో చేపలు, పెరుగు, యిలాంటివి డబ్బు పెచ్చిస్తేగాని దొరకవు. ఈవిషయం తల్చుకుంటే కమల ఆరాధకుడికి యీ ప్రపంచం మీద కోపంకూడా వచ్చింది.

''అమ్మగారూ! అయ్యగారిదగ్గర్నుంచి అయిదుఅణాలు తెచ్చి యిచ్చారంటే, పెద్ద చేప పట్టుకువస్తాను'' అన్నాడు.

'ఆదేం లాభంలేదు. నీవు స్టీమరు వదలి పోవడానికి ఎంతమాత్రం వీల్లేదు. ఈ సారి వాళ్ళు వచ్చి గీపెట్టినా పడవ ఆపకు !" అంది కమల.

'పడవదిగి వెళ్ళక్కర్లేదు అమ్మగారూ" పడవవాళ్ళే ఇవాళ ఉదయం వలపన్ని కొన్నిచేపలు పట్టుకున్నారు. వాటిలో ఒకటి మనకు అమ్ముతారేమో కనుక్కుంటాను. అంతే! అన్నాడు ఉమేష్.

కమల వెంటనే ఒక రూపాయి తీసుకువచ్చి అతనికి ఇచ్చింది. 'మార్చి, చేపధర ఇచ్చి - చిల్లర తిరిగి తీసుకురా'' అంది.

ఉమేష్ అలాగే చేపను తీసుకవచ్చాడుగాని చిల్లర మాటకు తేలేదు. 'అమ్మగారూ! రూపాయికి నయాపైస కూడా తక్కువ తీసుకోం అన్నారు' అని చెప్పాడు.

కమల ఇది అక్షరాలా నిజంకాదని గ్రహించింది. నవ్వుతూ ఇలా అంది. 'యీసారి పడవ ఆగినప్పుడు, మనం కొన్ని రూపాయల చిల్లర తీసుకుందాం.'

ఉమేష్‌కూడా గంభీరంగా 'అలాగే అమ్మగారూ. ఒకమారు రూపాయికాసు వాళ్ళకు చూపించామంటే, దాంట్లో చిల్లరంటూ వెనక్కు తీసుకోవడం పెద్దపని" అన్నాడు.

తరువాత కమల చేపను మెచ్చుకుంటూ కొద్దిసేపు గడిపింది,

మొత్తంమీద ఆరోజుభోజనం చక్కగా పుందాగా అమరింది. రమేష్ సుష్టుగా భోజనంచేసి పడకకుర్చీలో మేనువాల్చి అన్నం జీర్ణం చేసుకుంటున్నాడు. ఇప్పుడు ఉమేష్‌వంతు. అతను భోజనం చేస్తుంటే కమలకు ఆనందం ఆశ్చర్యంకూడా కలుగుతున్నాయి. అతను చేపనుపొగుడుతూ ఊరికే తినేస్తున్నాడు. చివరకు ఆమె భయపడి 'ఎక్కువగా తినకు ఉమేష్. సాయంత్రానికికూడా వుంచుతానులే. అంతా ఇప్పుడే తింటే హారాయించుకోలేవు'' అంది.

దైనందిన కార్యక్రమం, ఊసుపోని పని, వినోద తరంగిత హృదయం అన్నీ ఆమెను ఉదయం ఎదుర్కొన్న భీభత్సం నుంచి దూరంగా తీసుకువెళ్ళాయి. పగలు గడచిపోతోంది. సూర్యుడు పడమరగా ప్రయాణం చేస్తున్నాడు. కమల మధ్యాహ్నంమంతా తీరికలేకుండా పనిచేస్తోంది. తమలపాకులు తయారుచేయడం, తలదువ్వుకోవడం, బట్టలు ఉతుక్కోవడం, మార్చుకోవడం— ఈ పనులతో సాయంత్రం అయింది,

సూర్యుడు వెదురుపొదల వెనకగా అస్తమిస్తున్నాడు.

నిన్నటిమాదిరిగానే స్టీమరు ఈ రాత్రికి కూడా అలవాటయిన రేవులోనే విడిసింది. కమల ఉదయం మిగిలిన కూరసారలే సాయంత్రానికూడా ఉపయోగిస్తాయనీ అందుచేత ఈ పూట వంట పెద్దపని కాదనీ అనుకుంది. రమేష్ ఇంతలో అటునైపువచ్చి, మధ్యాహ్నం తాను మృష్టాన్నం భుజించాననీ ఈ పూట తనకు భోజనమే అవసరం లేదనీ అన్నాడు.

'అసలేమీ తిననంటారా ?' అంది కమల విచారంగా.

"ఏమీవొద్దు నన్ను బలవంతం చేయకు" అంటూ రమేష్ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. అందుచేత కమల ఆ పూట ఆహార పదార్థాలన్నీ ఉమేష్ పళ్ళెంలో కుమ్మరించింది.

"అమ్మగారూ ! మీరేమీ ఉంచుకోలేదేం ?"

"నేను భోజనం చేశాను." ఇదీ ఆమె జవాబు. ఆ వేళకు వంటతతంగం అయిపోయినట్లే.

నదీతీరంమీద, నదీజలాలమీద చంద్రుని వెలుగు ప్రసరిస్తోంది. స్టీమర్ స్టేషనుకు దాపున గ్రామమేమీ లేదు. ఈ నిశ్శబ్ద నిశీథం ప్రియునికోసం యెదురుచూస్తున్న ఒంటరి స్త్రీలా ఉంది.

ఒడ్డున రేవుల మెట్లలో ఆఫీసు వుంది. అక్కడ ఓ బల్ల మీద గుమాస్తా కిరసనాయిలు దీపంముందు కూర్చుని లెక్కలు వ్రాసుకుంటున్నాడు. కూడికలు చేసుకుంటున్నాడు. రమేష్‌కు యీ గుమాస్తా తెరిచివున్న తలుపుగుండా కని

పిస్తాడు. "విధి నన్నుగూడా యిలా నియమితమైన కార్య క్రమాలకు అప్పచెబుతుందా? అటువంటి జీవితంలో యేం ప్రమాదం వుంది?—రోజంతా లెక్కలు వ్రాస్తూవుండడం. రోజూ యజమానిచేత చీవాట్లు తింటూవుండడం, రాత్రి బాగా చీకటిపడినతరువాత యింటికి చేరుకోవడం—ఇదీ దినచర్య.

క్రమక్రమంగా ఆఫీసులో వెలుతురు సన్నగిల్లింది. గుమాస్తా తలకు శాలువ చుట్టబెట్టుకుని ఆ చీకటిలో ఎటో వెళ్ళిపోయాడు.

కమల కొంతసేపటినుంచి రమేష్ వెనుకనే నిలబడి వుంది. కాని రమేష్ యీ విషయం గమనించలేదు. సాయంత్రం భోజనం అయినమీాదట, ఆమె అతనినుంచి పిలుపును ఆశించింది. ఇప్పుడామె పనంతా పూర్తయింది కాని పిలుపు రాలేదు. అందుచేత ఆమె తనంతట తానే డెక్ మీాదికి వచ్చేసింది.

తీరా రమేష్‌ను చూడడంతోటే, ఆమెకాళ్ళుముందుకు సాగలేదు. అకస్మాత్తుగా ఆగిపోయింది. అతని ముఖంమీాద చంద్రుని వెలుతురు పడుతోంది. అతని ముఖకవళికలు చూస్తూంటే, అతని మనస్సు యిక్కడికి ఎంతోదూరంగా వున్నట్లుంది. ఆమెనుంచి చాలాదూరంగా వున్నట్లుంది. అతని ఆలోచనలలో ఆమెకు స్థానం లేదు. అలా ధ్యాననిమగ్నుడైన రమేష్‌కు, తనకు మధ్య చంద్రకాంతి ధరించిన నిశి పెదవులపై వేళ్ళుంచుకుని నిలువబడినట్లు అనిపించింది ఆమెకు.

రమేష్ ముఖాన్ని చేతుల్లో కప్పుకుని, తల టేబుల్

టూదికి వాల్చుకున్నాడు. కమల తన కాబిన్‌కు పరుగెత్తింది. ఆమె కించిత్తయినా శబ్దం చేయకుండా వెళ్ళింది. ఏమంటే తను అతని వెతుక్కుంటూ వచ్చినట్లు రమేష్‌కు తెలియడం ఆమెకు యిష్టంలేదు.

ఆమె కాబిన్ చీకటిగావుంది. గుమ్మం దాటుతూనే ఆమె వణికింది. తన యేకాంతం ఆమెను ఒక్కమాటుగా వరదలో ముంచెత్తినట్లయింది. ఆ చీకట్లో ఆ గది ఏ రాక్షసుడిమాదిరో పంజా యెత్తుకుని తనమీదికివస్తున్నట్లు ఉంది. కాని యింతకంటే తనకు ఆశ్రయం యెక్కడుంది? తనదని చెప్పుకుని, హాయిగా మేనువాల్చి నిదురించడానికంటూ కొంత స్థలం ఆమెకు యెక్కడా లేదు!

ఆమె ఒక్కసారి తొంగిచూచింది. మళ్ళీ వెనక్కు వెళ్ళింది. ఆమె మళ్ళీ గుమ్మందాటుతూ వుండగా రమేష్ గొడుగు, ఆమె ట్రంకుపెట్టెకు తగిలి కిందపడి పెద్దచప్పుడు చేసింది.

ఈ చప్పుడుకు ఉలిక్కిపడి, రమేష్ పైకి చూచి కుర్చీలోనుంచి లేచాడు. 'నువ్వా కమలా!' అన్నాడు. ఆమె కాబిన్ తలుపుదగ్గర నిలిచివుండడం గమనించి 'ఇందాకనే వెనక్కు వెళ్ళిపోయావనుకున్నాను. నువ్వు నీరసంగా వున్నట్లున్నావే. చూడు, నేను ఇక్కడ ఎంతోసేపు వుండనులే. లేచి పక్క కాబిన్‌లోనే పడుకుంటాను. మధ్యతలుపు తెరిచే వుంచుతాను' అన్నాడు.

"నాకేమీ భయంలేదు" అంటూ కమల తన కాబిన్‌లోకి గబగబ అడుగులువేసి తలుపు మూసింది. ఈ తలుపునే

రమేష్ తెరిచివుంచాడు. తాను వొంటరిగా వున్నదన్న విషయం ఆమెకు స్ఫురణవున్నది. తోటి మానవునిస్నేహం, సన్నిహితత్వం ఆమెకు దూరంగా పోయినాయి. ఆమె అంతః కరణమంతా తిరుగుబాటుచేసినట్లయింది. తనకు రక్షకుడంటూ ఎవరూ లేకపోయినా, లేక తనంత తాను స్వతంత్రురాలు కాకపోయినా, యీ జీవితం దుస్సహం అవుతుంది.

కాలం గడచిపోతోంది. రమేష్ పక్క-కాబిన్‌లో నిద్రపోతున్నాడు. కమల అలా మందకొడిగా పడుకోలేక పోయింది. ఆమె వెంటనే లేచింది. బయటకు వెళ్ళి నదీతీరం వంక చూస్తూ నిలబడింది.

ఎక్కడా జీవరాసుల అలికిడిగాని, చప్పుడుగాని లేదు. చంద్రుడు అస్తమించబోతున్నాడు. పంటపొలాల నడుమ వున్న కాలిబాటలు యిప్పుడు కానరావడంలేదు. కాని కమల ఎంతో శ్రమించిచూస్తోంది. "ఈ బాటలవెంట ఎందరోస్త్రీలు నీళ్ళకడవలు మోసుకువెళ్ళివుంటారు! అందరూ తమయిళ్ళకు వెళ్ళివుంటారు" అనుకుంది. ఇల్లు! ఈ ఆలోచనతో ఆమె హృదయం ఎగిరి గంతువేసింది. తనకుకూడా ఎక్కడైనా చిన్న యిల్లువుంటే...కాని ఎక్కడ?

నదిబిడ్డు అంతుకనపడకుండా చాల విశాలంగా పరుచుకునివుంది. పైనఆకాశంకూడా అలాగే పరుచుకొనివుంది. ఇంత విశాలంగావున్న భూమి, ఆకాశంకూడా ఆమెకు ఎందుకూ పనికిరాకుండాపోయినాయి. మానవ అణువుకు యీ విశాల విశ్వం ఎంతమాత్రం చాలదు. ఏమంటే ఆమెకు కావలసిందల్లా—చిన్న యిల్లు!

కమల తన పక్కన యెవరో నిల్చొని వున్నట్లు గమనించి వులిక్కిపడింది.

"నేనే అమ్మగారూ !" అన్నాడు ఉమేష్.

కమల మాట్లాడలేదు.

"చాలా రాత్రి అయింది. ఇంకా నిద్రపోలేదేం ?" అని అడిగాడు.

చివరకు ఆమె కళ్ళలో అశ్రువులు చేరినాయి. వాటిని ఆమె ఆపుకోలేకపోయింది. అవిధారాపాతంగా వర్షిస్తున్నాయి. కమల, తన ముఖం ఉమేష్‌కు కనబడకుండా పక్కకు తిరిగింది.

నీటితో బరువెక్కిన మేఘం, గాలిరూపంలో వుండే తన సహాపథికుడికోసం వెదుకుతోంది. అప్పుడు అది తన భారాన్ని ఆపుకోలేదు. కమల పరిస్థితి కూడా యిప్పుడు అలాగే వుంది. ఇల్లువాకిలి లేని యీ పేదపిల్లవాడి నుంచి యీ సానుభూతివచనం వచ్చేసరికి, ఆమె తన హృదయంలో దాగివున్న శోకభారాన్ని ఆపుకోలేకపోయింది. ఆమె మాట్లాడటానికూడా ప్రయత్నించింది. కాని నిట్టూర్పులు ఆ ప్రయత్నాన్ని వమ్ముచేస్తున్నాయి.

ఈ దుర్భర పరిస్థితిలో ఉమేష్ ఆమెను ఓదార్చడానికి మార్గం వెదకసాగాడు. చాలసేపు నిశ్శబ్దంగా వున్నాక, అతను యిలా అన్నాడు: "మీరు మధ్యాహ్నం యిచ్చిన రూపాయిలలో యింకా యేడణాలు మిగిలివున్నాయి."

కమల అశ్రువులు ఆగిపోయినాయి. ఆమె నవ్వుతూ అతనివంక ఆప్యాయంగా చూచి, "డబ్బు ప్రస్తుతానికి నీదగ్గర వుంచు. చాలాసేపయింది. వెళ్ళిపడుకో—" అంది.

చంద్రుడు చెట్లనీడలచాటున అస్తమించాడు. ఈసారి కమల అలసినకన్నులు దిండుమీద తల ఉంచగానే నిదురతో మూతపడినాయి. ఉదయం చాలసేపటివరకు ఆమె నిద్ర పోతూనే వుంది.

# 28

కమలకు ఆ మరుసటిరోజు విసుగ్గా అనిపించింది. ఆరోజు సూర్యకాంతిలో తేజస్సు కనిపించడం లేదు. నది నీరసంగా ప్రవహిస్తోంది. నదివొడ్డున వున్న చెట్లు అలసిపోయిన బాట సారుల్లా వొంగివున్నాయి.

ఉమేష్ ఆమెకు సహాయం చేయడానికి వచ్చాడు. ఆమె విసుగ్గా 'ఇవాళ వెళ్ళిపో, ఉమేష్. నన్ను విసిగించకు' అంది. కాని ఉమేష్ తొందరగా వదిలిపెట్టలేదు.

"మిమ్మల్ని విసిగించడానికి రాలేదు అమ్మగారూ! మీరేమన్నా పనిచెపుతారేమో చేద్దామని వచ్చాను" అన్నాడు.

తరువాత ఆమె విసుగుదలచూచి రమేష్ ఇలా అన్నాడు: "నీకు ఖులాసాగా లేదా ఏం, కమలా?"

ఈ ప్రశ్నకు జవాబేమీ రాలేదు. అతనిప్రశ్న అనవసరమయినదన్న ధోరణిలో ఒకమారు తలఊపి వంటగదివైపు నడిచింది.

రమేష్ రోజురోజుకూ యీ సమస్య గడ్డుగా తయారవుతోందనీ, దీనికి వెంటనే తనొక పరిష్కారమార్గం కని పెట్టితీరాలని అనుకున్నాడు. హేమనళినితో తన హృదయ

మంతా విప్పిజెప్పితే, అప్పుడు తన విధియేమిటో తనంత తనకే తెలిసి వస్తుందనికూడా అనుకున్నాడు. ఇలా చాలా సేపు ఆలోచించుకుని, చివరకు హేమకు ఉత్తరం వ్రాయడానికి కూర్చున్నాడు.

కొంతసేపు వ్రాశాడు. వ్రాసింది కొట్టివేశాడు. ఇంతలో ఎవరిదో కొత్త కంఠం "మీపేరు ఏమిటో తెలుసుకోవచ్చునాండీ" అని వినిపించింది. రమేష్ ఆశ్చర్యంతో తల పైకెత్తాడు. అతనిముందు ఒక వయోధికుడు నిలబడి వున్నాడు.

రమేష్‌బుద్ధి యావత్తు వుత్తరంమీద కేంద్రీకృతమై వున్నది. తనంతతాను, తొందరగా యీ ప్రపంచంలోకి రాలేక పోయినాడు.

ఆ కొత్త వ్యక్తి యింకా యిలా చెప్పుకుపోతున్నాడు: "మీరు బ్రాహ్మలే అనుకుంటాను కదూ? మీ పేరు రమేష్‌బాబు కదూ! శుభోదయం. ఇంతవరకూ నాకు తెలుసును. మనదేశంలో మీరు గమనించారో లేదో ఒక మనిషి పేరు అడగడమే పరిచయానికి నాంది. కాని యీ రోజుల్లో యిలా అడిగితే కొంతమందికి కోపంకూడా వస్తోంది. మీకు కోపం వచ్చిందంటే, దాన్ని వడ్డీతోసహా మళ్ళీ వెళ్ళగక్కాలి గద! మీరు నన్ను అడిగితే చాలు— నా పేరు, మా నాన్న పేరుకూడా చెబుతాను. నిజానికి మా తాతపేరుకూడా చెప్పడానికి నాకేం అభ్యంతరం లేదు!"

రమేష్ నవ్వాడు "నాకేం కోపం రాలేదు. మీ పేరు చెబితే చాలు—ఇంకేమీ వివరాలు అక్కర్లేదు."

"నా పేరు త్రైలోక్య చక్రవర్తి. నన్ను యీ నది

ఎగువప్రాంతంలో అందరూ 'బాబాయి' అని పిలుస్తారు. మీరు చరిత్ర చదువుకున్నా రనుకుంటాను చిన్నప్పుడు. భరతుడు మన దేశానికి చక్రవర్తి. అంటే సార్వభౌముడన్న మాట! భారతదేశానికి సార్వభౌముడు. అలాగే నేను యీ పశ్చిమతీరానికంతటికీ "చక్రవర్తి బాబాయిని." మీరు పశ్చిమంగా వెడితే నన్నుగురించి నిశ్చయంగా తెలుసుకొంటారు. ఇంతకూ, అడగడం మరిచేపోయాను. తమరు ఎంతవరకు ప్రయాణం చేస్తున్నారు."

"స్టీమరును ఎక్కడ వొదిలిపెట్టాలో నే నింతవరకూ నిర్ణయించుకోలేదు." అన్నాడు రమేష్.

"ఎక్కడ దిగడం అనే విషయం మీ రేమీ తొందర పడ నక్కర్లేదులెండి. ఎక్కడం అయితేనే సమస్య. గందర గోళం అంతాను" అన్నాడు త్రైలోక్యచక్రవర్తి.

"గోలుండాలో రైలు దిగడంతోటే స్టీమరుకూత విని పించింది. ఆలోచిస్తూ కూర్చుంటే లాభంలేదు. అని మన స్సును కట్టుచేసుకొని హడావడిగా స్టీమరులో ఎక్కి కూర్చు న్నాను. అత్యవసరం అయినచోట హడావడిని ప్రయోగించక తప్పదు."

"నాక్కావలసిన తరహామనిషే మీరు. మీరూ, నేను వ్యతిరిక్తమన స్తత్వాలు కలవాళ్ళం. నాకు నిశ్చయ మన స్తత్వం ఆలోచించవలసి వుంటుంది. ఎక్కేటప్పుడు అంటూ యేమీ వుండదుగనుక, పడవ యెక్కేటప్పుడు ఎంతో ఆలోచనలేకుండా, ఎక్కడదిగాలి అన్న విషయం మీద ఆలోచన చేసేవాళ్ళను చూస్తే నాకు విపరీతమైన

గౌరవం మీభార్యగూడా మీతోపాటు ప్రయాణంచేస్తోం దాండి?"

రమేష్ యీ ప్రశ్నకు అవునని జవాబు చెప్పడానికి చాలసేపు మధనపడ్డాడు.

చక్రవర్తి అతని సందియాన్ని గమనించి "క్షమించండి. ఆమెకూడా ఈ పడవలోనే ప్రయాణంచేస్తున్నారని చెప్పగా విన్నాను నేను ఆకలితో మాడిపోతూ మీ వంటగదివైపు వెళ్ళాను. అక్కడ ఆమె కనిపించింది. నేనామెతో, నన్ను చూచి నీవు సిగ్గుపడక్కర లేదమ్మా, నన్ను అందరూ చక్రవర్తిబాబాయి అంటారు అని చెప్పాను. ఆహా హా! ఆమె ఎంత చక్కటి యిల్లాలు. నేనామెతో, నాకెవరూ యిక్కడ అయినవాళ్ళు లేరనీ, తన వంటలో నాకూడా కొంత ప్రసాదం యిమ్మనీ అడిగాను. ఆమె మెల్లిగా మధురంగా నవ్వి, అలాగే అంది. అప్పుడు నా కడుపులో ఆకలి చల్లారి నట్లయింది. అమ్మయ్యా, బతికిపోయాను అనుకున్నాను. మీరు చూచారో లేదో, నేను ప్రయాణం అనుకున్నప్పుడల్లా పంచాంగంలో సుముహూర్తం చూసుకొని మరీ బయలుదేరుతాను. కాని యీసారి కలిగినంత అదృష్టం యింతకు ముందెప్పుడూ కలగ లేదు. సరే, మీ రేదో పనిలో వున్నట్లున్నారు. ఎక్కువసేపు మిమ్మల్ని బాధపెట్టను. మీరు అనుమతిస్తే నేను లోపలికివెళ్ళి అమ్మాయికి వంటలో సాయం చేస్తాను. నేనిక్కడ వుండగా ఆమె బండచాకిరీ చేయడం ఎందుకు? వొద్దు, మీరు లేవనక్కర్లేదు. మీ వ్రాతపని కానిచ్చుకోండి" అంటూ చక్రవర్తి, అక్కడ్నించి లేచి వంట

గదివైపు నడిచాడు.

వంటగదిలో ప్రవేశిస్తూ అత నిలా అన్నాడు. "ఓహో యిటువైపునుంచి కమ్మటి సువాసనవస్తోంది. రుచి చూడకుండానే వండుతున్న దేమిటో చెప్పేయవచ్చు. సరే, నేను యిప్పుడు మజ్జిగ చిలుకుతాను. తూర్పువైపువాళ్ళు మజ్జిగ చిలికే విద్యలో ప్రవీణులు. నువేం అనుకుంటున్నావో నాకు తెలుసు. నిమ్మకాయలు లేకుండా మజ్జిగతో యేంచేస్తాడా అని ఆలోచిస్తున్నావు. నేను యిక్కడుండగా నీ కా బెంగేం అక్కర్లేదు. ఒక్కనిమిషం ఆగిచూడు. నా యేర్పాట్లు ఎలా చేస్తానో—" అంటూ అతను కాగితం చుట్టిన చిన్న జాడీని పైకి తీశాడు. "నేను మజ్జిగ చేశాక, యివాల్టికి కావల్సింది తీసుకు వాడి, తతిమ్మా నాలుగురోజులవరకూ అట్టే వుంచు. అప్పుడు దాని రుచిచూడు, చక్రవర్తి బాబాయి అంటే యేమిటో తెలుస్తుంది. సరే, యిక నువ్వు వెళ్ళి చేతులు కడుక్కోనిరా. అప్పుడే భోజన సమయం అయింది. మిగిలి పోయిన వంటంతా నేను చేసేస్తాను. ఇక నీరసంగా కూర్చోకు. నాకు బోలెడంత అనుభవం వుంది. నా భార్యకు ఎప్పుడూ నేనే చల్లచేసిపెడుతూ వుంటాను. అమ్మగో, ఈ ముసలాడి మాటలకు నవ్వుతున్నావు కదూ? కాని ఇదంతా వేళాకోళం కాదు, పచ్చి నిజం!"

కమల నవ్వుతూ "అది ఎలా చేస్తారో నాకూడా బోధపరచండి" అంది.

"ఆగు. అంత తొందరగా విజ్ఞానాన్ని పంచియివ్వ గూడదు. చదువుల తల్లి, మొదటిరోజే—పరిచయమైనవారికి

యీ విద్యలు చెపితే నావైపు కోపంగా చూస్తుంది. ముందు ఈ ముసలాడిని నాలుగు మూడు రోజులు పొగడాలి. నన్ను ఎలా సంతృప్తి పరచాలో నీకు తెలియపరుస్తాను. నీ కా శ్రమేం అక్కరలేదు. మొదటి రూలు యేమిటంటే—నాకు తమలపాకులంటే చాల యిష్టం. కాని నేను వక్కలు పూర్తిగా నమలలేను. అందుచేత నీవు నన్ను జయించడం అతి తేలిక. ఇప్పటికే నీ సుందరవదనారవిందంతో నన్ను చాలవరకు జయించావు...ఎవరు...నీ పేరేమిటి?'' అన్నాడు ఉమేష్‌ను. అతను జవాబు చెప్పలేదు. అతనికి ఈ ముసలాడు యిలా చొరవగా వచ్చి చేరడం యిష్టంలేదు. ఏమంటే కమల దయను చూరగొనటానికి తనతో మరెవరో పోటీకిరావడం కదా !

"మంచి కుర్రాడు—" అంటూ తనధోరణి కొనసాగించాడు వృద్ధుడు. అతని మనస్సులో ఉన్నదంతా ఒకే మారు పైకి చెప్పడు. మొత్తంమీద యీ కుర్రవాడు, నేను ఎంతో సఖ్యంగా నెట్టుకు రాగలం. సరే, యిప్పుడు మాటలతో కాలం వృధాచేస్తే లాభంలేదు. వంటపని ముందు ముగించాలి."

ఈ వృద్ధుని వునికి, కమలకు కొంత ఉబుసుపోకగా ఉంది. రమేష్‌కుకూడా కొంతప్రశాంతత చిక్కినట్లుంది. కమల తన భార్యేనని అనుకున్న రోజుల్లోని రమేష్ ప్రవర్తనకు, యిప్పటి అతని ప్రవర్తనకు ఎంతో వ్యత్యాసంవుంది. ఈ వ్యత్యాసం ఆమె నెంతో బాధపెడుతోంది. వ్యథ పెడుతోంది. ఆమె ఆలోచనలు తననించి దూరంగా తీసుకు వెళ్ళగలవి

యేవయినా అతనికి సంతోషం కలిగిస్తాయి. అప్పుడు తన హృదయానికి తగిలిన గాయానికి మందు ఏమిటో ఉపశాంతి ఎలానో ఆలోచించుకోవడానికి అవకాశం దొరుకుతుంది.

ఇలా రమేష్ ఆలోచిస్తూ వుండగా, కమల ఆమె కాబిన్ తలుపు దగ్గరికి వచ్చింది. మధ్యాహ్నమంతా చక్రవర్తితో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ గడిపివేయాలని ఆమెసంకల్పం. కాని ఆయన 'అబ్బే, అది మంచిపనికాదు, అలా పిల్లేను' అన్నాడు. కమలకు ఈ మాటలు అర్థంకాలేదు. కాని ఆమెలో కొత్తఉత్సాహాన్ని కలిగించింది.

ఏమిటన్నట్లుగా చూస్తున్న కమలకు ముసలాయన యిలా జవాబు చెప్పాడు. "ఈ చెప్పులే, రమేష్‌బాబు— యిదంతా నీ పనే, నీవేమయినా చెప్పుగాని, నాకు యిలాంటివి నచ్చవు. తనపాదాలకు పవిత్రమైనభూమిని మధ్య మరో సాధకాన్ని ఉపయోగించేవారు తనదేశాన్ని అవమానపరుస్తున్నారన్నమాట. రామచంద్రుడు సీతమ్మవారికి సరికొత్త యూరోపు చెప్పులు తొడిగినట్లయితే లక్ష్మణుడు, వాటిని అడవిలోవున్న పధ్నాలుగు సంవత్సరాలు కాపాడుతూవుండే వారంటావా? నీవు నవ్వవచ్చు. రమేష్‌బాబు— కానీ... నీకిది అర్థంకాదు. కాని... ఇలా అవుతుందని నాకు ముందే తెలుసు- నాకేం ఆశ్చర్యం అగుపించడం లేదు స్టీమరుకూత విని యేమీ ఆలోచించుకోకుండా పైకి ఎక్కికూర్చునేవాళ్ళు యేమయినా చేయగలరు.

రమేష్ "సరే బాబాయి, నేం ఎక్కడ దిగాలో మీరే నిర్ణయించండి. మీ నిర్ణయం, స్టీమరు కూతంటే

విలువైనదిగా శిరస్సున తాలుస్తాను'' అన్నాడు.

నీ మనస్సును ఎలా దిటవు చేసుకోవాలో నేర్చుకున్నావు. మనకిద్దరికీ పరిచయం అయి యింకా కొన్ని గంటలే అయింది. మనం ఘజీపూర్‌లో దిగిపోదాం. ఏం, ఘజీపూర్ వస్తారా? అక్కడ చక్కటి గులాబీలు దొరుకుతాయి. ఈ ముసలిస్నేహితుడు వుండేదికూడా అక్కడే" అన్నాడు చక్రవర్తి.

రమేష్ కమలవంక చూచాడు. ఆమె వెంటనే ఈ ప్రతిపాదనను ఆమోదించినట్లు అతనికి సైగ చేసింది.

చక్రవర్తి, ఉమేష్ ఆ మధ్యాహ్నం కమల కాబిన్‌లోనే వుండిపోయారు. రమేష్ మాత్రం ఒక్కడూ యివతల ఉండిపోయాడు. స్టీమరు ముందుకు దూసుకుపోతోంది. రకరకాల ప్రకృతిదృశ్యాలు అగుపిస్తున్నాయి.

మధ్యమధ్య కమలనవ్వు రమేష్ చెవులలో దూసుకుపోతోంది. 'ఈ నవ్వు ఎంత మధురంగావుంది. ఎంత దూరంగా వుంది!'' అనుకున్నాడు.

# 29

కమల మనస్సులో అనుమానాలు, భయాలు, ఆందోళనలు యివేమీ ఆమె హృదయంలో అడుగుపెట్టటానికి వీల్లేదు. ఆమెకు యిప్పుడు కాలం గడపడం పెద్ద కష్టమైన పనిగా కనిపించడంలేదు. ఇప్పుడామె రమేష్ ప్రవర్తనను గురించి కూడా అంతగా పట్టించుకోవడంలేదు.

పడవప్రయాణం సాగుతోంది. కమలకు వంటపనితో

సరిపోతోంది. కళ లేని పద్యాల పుస్తకంలో పుటల్లాగ రోజులు ఒకదాని తరువాత మరొకటి గడిచిపోతున్నాయి.

ప్రతిరోజూ ఆమె నూతనోత్సాహంతో కార్య రంగంలోకి దిగుతోంది. ఉమేష్ మళ్ళీ స్టీమరును తప్పి పోలేదు. అయితే బుట్టలు నింపుకుని వస్తూనేవున్నాడు. ఈ బుట్టలోవున్న వస్తువులన్నీ యీ చిన్నకుటుంబానికి వేడుకగా ఆశ్చర్యకరంగా ఉన్నాయి. రమేష్ ఉంకేమటుకు ఉమేష్ యీ సరకులు ఎత్తుకువచ్చాడేమో అంటూ వుండేవాడు. అప్పుడు కమల "నేనే డబ్బు లెక్క బెట్టియిచ్చాను" అనేది.

"అలా అయితే ఉమేష్‌కు రెండువిధాల లాభం! ఇటు డబ్బులు మిగులుతాయి; అటు హాయిగా దొంగతనం చేయవచ్చును! రెండూ దొంగతనాలే" ఇలా అని ఉమేష్‌ను పిలిచి అతనే మేనేం ఖర్చు పెట్టాడో లెక్క అడిగేవాడు.

అయితే కుర్రవాడిలెక్క ఎప్పుడూ సరిపోయేదికాదు. అతను చెప్పినదాని ప్రకారం లెక్కవేసిచూస్తే, యిచ్చిన డబ్బుకంటె తెచ్చిన వస్తువుల విలువ ఎక్కువవుండేది. అయినా యీ విషయం ఉమేష్ నేమీ కలవర పెట్టినట్లులేదు. "నేను గనుక కరెక్టుగా లెక్కలు వ్రాయగలిగితే పెద్ద ఉద్యోగమే సంపాదించగలను ఏంతాతా!'' అనేవాడు.

అప్పుడు చక్రవర్తి 'యీకేసు భోజనానంతరం విచా రణకు వాయిదావేయండి. అప్పుడయితే నీవు మంచి తీర్పు ఇవ్వగలవు, రమేష్ బాబు. ఇప్పటిమటుకు ఇప్పుడు నాకు కుర్రవాడివైపునుంచి యివతలికి రావడం సాధ్యంకావడంలేదు. ఉమేష్, నీవిద్య ఎంతో విలువైనది. దీన్ని ఎరిగినవాళ్ళు

ఎక్కువమంది వుండరు. చాలామంది ప్రయత్నిస్తారు కాని కొందరుమటుకే జయిస్తారు రమేష్‌బాబు, నాకు ప్రజ్ఞ కనిపిస్తే దాన్ని ఎలా మెచ్చుకోవాలో తెలుసు!'

ఇలా వాళ్ళిద్దరూ ఉమేష్‌ను గురించి వాదించుకునే వాళ్ళు. రమేష్ ఉమేష్‌ను కొప్పడి చివాట్లు వేస్తూవచ్చిన కొద్దీ, అతను కమలకుదగ్గరగా వస్తున్నాడు. ఇప్పుడు చక్రవర్తి కూడా పొగడడంతో రమేష్ ఒక్కడే ఒకటయిపోయినాడు. రమేష్ ఒక్కడూ చలిలో కూచుని ఆలోచిస్తూవుంటే, ఉమేష్ చక్రవర్తి కమల ముగ్గురూ ఒకరొకరి సహాయ సహకారాలు పొందుతూ కులాసాగా కాలం గడిపేస్తున్నారు.

ఇప్పుడు పూర్ణచంద్రుడు అగుపిస్తున్నాడు. ఒకనాడు ఉదయం, ప్రయాణీకులు లేచేసరికి ఆకాశం నల్లని మేఘాలతో నిండివుంది. గాలి గోలగా వీస్తోంది. చుక్కాని పనిచేయడం ఆగిపోయింది. ఆ నదీమధ్యంలో మరోసాధనం లేదు. తీరంలో కొన్ని పడవలు, చిన్నవి కనుపిస్తున్నాయి. వాటికదలిక గందర గోళంగా ఉంది, నీళ్ళు నింపుకోవడానికి కడవలతో వచ్చిన స్త్రీలు తీరంలో ఎక్కువసేపు నిలబడి వుండడంలేదు. ఉండి ఉండి నదీతలం యీ వొడ్డునుంచి ఆ వొడ్డుకు కదల బారుతోంది.

ఈ స్టీమరు మామూలుగానే ముందుకు నడుస్తోంది. కమల వంటపనిలో ఎవరినీ సహాయం చేయనివ్వడంలేదు.

చక్రవర్తి ఆకాశంవంకచూచి "ఈసాయంత్రానికి వంట చేయడం మళ్ళీ కుదరదనుకుంటాను. ఆ పూటకు కావాల్సినవి కూడా ఇప్పుడే తయారుచేయి. కావాలంటే రొట్టెలకు పిండి

కలిపిపెడతాను" అన్నాడు.

వాళ్ళందరూ భోజనం ముగించేసరికి చాలా ఆలస్యం అయింది.

గాలిగోల మరీ ఎక్కువయింది. నది వెల్లువగా పొంగుతోంది. సూర్యుడు మేఘాలచాటున దాక్కున్నాడు. ఇంకా చీకటి పడేసమయం కాలేదు. అప్పటికి లంగరు వేశారు.

రాత్రి వచ్చింది. చంద్రుడు అడపదడప మేఘాల మధ్యనుంచి పైకివచ్చిచూస్తూ నవ్వుతున్నాడు. గాలి ఎక్కువై క్రమంగా వర్షంగూడా కురవసాగింది.

కమల ఒకమారు పడవమునకలో బాధపడింది. కనుక ఆమెకు యీ భీభత్సం మరింత భయావహంగావుంది. రమేష్ ఆమెకు ధైర్యం చెబుతూ "ఏం భయపడక్కరలేదు కమలా! ఈ స్టీమరుమీదవుంటే మనకేం ప్రమాదం లేదు. నిద్రపో హాయిగా. నీవేమీ బెంగపడనక్కరలేదు. నేను పక్క కాబిన్ లోనే పడుకుని వుంటాను. ఇప్పుడే నిద్రపోనులే" అన్నాడు.

చక్రవర్తికూడా ఆమె గదితలుపుదగ్గరకు వచ్చాడు. "మరేం భయపడకమ్మా! ఈ పాపిష్టితుఫాను తగ్గిపోతుంది లే!"

పాపిష్టితుఫాను తగ్గిపోయినా, దానిప్రభావం కమల మీాద వుండనేవుంది. ఆమె తలుపుదగ్గరకువచ్చి "లోపలకి వచ్చి నా దగ్గర కూచోండి బాబాయి'' అంది

చక్రవర్తి అనుమానించాడు ఒకక్షణం. "మీారు పడుకునే సమయింది—" అంటూ లోపలకు అడుగు పెట్టాడు. లోపల అతననుకున్న ప్రకారం రమేష్‌బాబు లేకపోవడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. 'ఏడీ రమేష్‌బాబు ఎక్కడ?'

అనడిగాడు. "ఈ చీకటి రాత్రిలో కూరగాయలు దొంగిలించ డానికి వెళ్ళాడా ఏమిటి?" అన్నాడు.

"ఎవరు! బాబాయా. నేను పక్కగదిలోనే వున్నాను బాబాయి. అన్నాడు రమేష్.

చక్రవర్తి పక్కకాబిన్‌లోకి తొంగిచూచి అక్కడ రమేష్ గుడ్డిదీపం వెలుగులో ఏదో పుస్తకం చదువుకుంటూ వుండడం గమనించాడు.

"చూడు రమేష్. మీ ఆవిడ తుఫానుకు భయపడు తోంది. నీవా పుస్తకం కట్టిపెట్టి, ఆమెదగ్గర కూర్చో" అన్నాడు.

ఏదో ఆపుకోలేని ఉద్రేకంతో కమల "వొద్దు, వొద్దు బాబాయి" అంటూ అతనిచేయి పట్టుకు వారించింది. కాని ఆ యీదురుగాలిలో ఆమెమాటలు రమేష్ చెవిని పడ లేదు. కాని చక్రవర్తిమటుకు విని సంభ్రమంలో వెనక్కు తిరిగాడు.

రమేష్ చదువుతున్న పుస్తకం మూసివేసి ఈ కాబిన్ లోకి వచ్చాడు. "యేమిటి చక్రవర్తి బాబాయ్, సంగ తేమిటి... కమల, మీకు..." అంటూవుండగానే కమల అతనివంక చూడకుండానే "లేదు, లేదు, నేను బాబాయిని ఊరికే కబుర్లకోసం పిలిచాను" అంది ఆమె. "లేదు, లేదు" అనడంలో యేవిషయం కాదు అంటుందో ఆమెకే తెలియదు. కాని ఆమె భావనమటుకు ఏమిటంటే, 'నా భయాలు పోగొట్ట టానికి ఎవరయినా కావాలని నీ వనుకుంటే, అది పొరపాటు. నా కెవరన్నా సాయం కావాలనుకున్నానని నీ ఉద్దేశ్యం

అయితే— అదిగూడా పొరపాటే!' అని!

"ఆలస్యం అవుతోంది బాబాయి. వెళ్ళి పడుకోండి. ఉమేష్ ఎలావున్నాడో చూడండి. ఈ తుఫానుకు వాడు ఎలా వున్నాడో" అంది.

ఆచీకట్లోనే బయటినుంచి ఉమేష్ గొంతుకూడా వినిపించింది! "నాకేంభయంలేదు అమ్మగారూ!" అతను కమల కాబిన్ తలుపుదగ్గరే పడుకున్నట్లున్నాడు.

అతని సేవాసక్తికి సంతోషించి కమల హృదయం ఉప్పొంగింది, "ఉమేష్, వానలో అలా తడిసిపోకు. జబ్బు చేస్తుంది. లేచివెళ్ళి బాబాయి కాబిన్‌లో పడుకోపో" అంది.

ఉమేష్ చక్రవర్తిబాబాయి వెనగ్గానడిచి వెళ్ళాడు. ఆమె కంఠధ్వని ఆప్యాయత వెలిబుచ్చుతున్నా, ఉమేష్ ఆమె మందలింపుకు భయపడ్డాడు.

రమేష్ ఆమెతో "నీకు నిద్రపట్టేంతవరకు మాట్లాడుతూ కూర్చోమంటావా ?" అన్నాడు.

"అక్కర్లేదు. నాకు నిద్రవస్తూనే వుంది."

రమేష్ కమల ఆలోచనలసరళి అర్థం చేసుకున్నాడు. కాని పైకేమీ అనలేదు. ఆమె మాటల్లో దెబ్బతిన్న అహం కనిపించడంతో, తన కాబిన్‌కి తిరిగి వెళ్ళిపోయాడు.

కమలకు నిద్రరావడంలేదు. కాని ప్రయత్నంమీద అలాగే పడుకుంది. తుఫాను మరీ ఎక్కువ దౌర్జన్యస్వరూపం పొందగానే తరంగాలుకూడా ఎత్తుగా ఎగిరిపడుతున్నాయి. స్టీమరును నిలిపివుంచటానికి లంగరొకటే సరిపోయేట్లు లేదు. యంత్రాలుకూడా పనిచేస్తున్నాయి.

కమల పక్కబట్టలు విదిలించుకుని డెక్కుమీదికి వెళ్ళింది. ఆ క్షణంలో వర్షం ఆగిపోయివుంది. గాలిమటుకు విపరీతంగా సాగుతోంది.

వెన్నెలకు ఆకసంలోని మేఘాలన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ వాతావరణంలో అవి వినాశపుటాయుధాల్లా వున్నాయి. నదిగట్లు తెగిపోయినాయి. నదీతలం కనిపించడం లేదు భూమ్యాకాశాలు, దూరతీరాలు, గోచరాగోచరాలు అన్నీ సుడిగాలిలో చిక్కుకుపోయి గందరగోళం కలుగ జేస్తున్నాయి.

కమలకు తన హృదయంలో వున్న భయాన్ని విప్పి చెప్పడం చేతకాదు. ఆకాశంవంక తేరిపారచూస్తూ నిలబడింది. ఇది భయమో, సంతోషమో కూడా చెప్పలేని వింత స్థితి!

ప్రకృతి తిరుగుబాటు చేస్తున్నట్లువుంది. కాని దేని మీాద తిరుగుబాటు? కమలకు యీా ప్రశ్నకు జవాబు దొరకలేదు. దీనికి జవాబు తన హృదయంలో తుఫాను లాగానే వుంది. ఇదంతా మోసాన్ని, భ్రమను, అయోమయాన్ని తెంచుకుని యివతల పడాలనే తాపత్రయం తప్ప మరేంకాదు.

"లేదు, లేదు. ఇదేమీా కాదు, కాదు" అంటే— ఈ మాటలకు అర్థం యేమిటి?

# 30

మరునాడు ఉదయం వాతావరణంలో మార్పు వచ్చింది. అయితే గాలిమాత్రం అలా విసురుగానే వీస్తోంది. పడవవాళ్ళు ముందుకు వెళ్ళడమూ లేక ఆగిపోవడమూ అన్న విషయం తేల్చుకోలేక ఆకాశంలోకి తేరిపారచూస్తున్నారు.

చక్రవర్తి పొద్దున్నే రమేష్‌దగ్గరకు వచ్చాడు. అతనింకా పడుకునేవున్నాడు. కాని చక్రవర్తిని, చూడడంతోనే లేచి కూర్చున్నాడు. చక్రవర్తి, యితనీ రాత్రంతా యిక్కడే గడిపివుంటాడని నిన్న జరిగిన సంఘటన ఆధారంగా ఊహించుకున్నాడు.

"రాత్రి యిక్కడే నిద్రపోయినట్లున్నారు కదూ ?" అనడిగాడు విషయం ధృవపరుచుకోవడానికి.

రమేష్ యీ ప్రశ్నకు జవాబుచెప్పకుండా తప్పించుకోవడానికి విషయం మార్చాడు: "అబ్బ, వాతావరణం యేం దుర్భరంగా వుంది. రాత్రి మీకు బాగా నిద్రపట్టిందా బాబాయ్" అనడిగాడు.

"రమేష్‌బాబూ! నా మాటలనుబట్టి నేనేదో తెలివి తక్కువ ముసలాడిని అనుకున్నావు కాబోలు. కాని నా జీవితంలో ఎన్నో సమస్యలు తీర్చాను, చిక్కు ప్రశ్నలు విడగొట్టాను. కాని నీ వాలకం నాకు యింకా అర్థంకాకుండా వుంది."

రమేష్‌కు అనుకోకుండా కోపం వచ్చింది. కాని మళ్ళీ సంబాళించుకుని ముఖంమీదికి చిరుమందహాసం తెచ్చు

కున్నాడు. "సమస్యకు జవాబు దొరక్కపోవడం యేమంత నేరంకాదులెండి బాబాయ్. తెలుగులాంటి జటిలభాష తీసు కోండి ఉదాహరణకి. దాని మూలసిద్ధాంతాలు కూడా మనకు అర్థంకావు. కాని అదే తెలుగువారి చిన్నకుర్రవా డయితే మంచినీళ్ళు తాగినట్లుగా గడగడ మాట్లాడేస్తాడు. అందుచేత మనకు అర్థంకానంతమాత్రాన, ప్రతి విషయాన్ని గురించీ ఊరికే విమర్శించి వితర్కించగూడదు. కొత్తచిహ్నాలు కనిపించినప్పుడు వాటిని అనుమానంతో చూడగూడదు. ఎప్పటికయినా వాటిని అర్థంచేసుకోగలమన్న ధీమాతో ప్రారం భించాలి."

ఆ వృద్ధుడు యిలా అన్నాడు: "క్షమించు, రమేష్ బాబూ. నాలో విశ్వాసం లేనిమనిషి లక్షణాలను అవగాహన చేసుకుని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించడం నాకు మరీ అసాధ్యం! కాని కొంతమంది ప్రథమ వీక్షణంలోనే పరి చయులు, సన్నిహితులు అవుతారు పరిస్థితులు యిలా వున్నప్పుడు తెలుగుభాషను గురించిన సమస్య తీసుకుని పోట్లాడడం కష్టమయినపని! సరే, రా బాబూ...నువ్వేం కోపం పెట్టుకోకు—

"నే నిదంతా ఆలోచించే పెట్టుకున్నానుగనుక నాకు కోపంరాలేదు. సరే నేను మీకు కోపం తెప్పించినా, తెప్పించకపోయినా-మీ ఊహాలను గాయపరిచినా, పరచక పోయినా—తెలుగుభాష సమస్యమటుకు అలాగే వుండి పోతుంది. అదే ప్రకృతి తాలూకు క్రూరమైన సమస్య" అంటూ రమేష్ గాఢంగా నిట్టూర్చాడు.

చివరకు ఘజీపూర్‌లో మకాం యేర్పరచుకోవడం బాగుంటుందా అని రమేష్ ఆలోచించసాగాడు. కొత్త ప్రదేశంలో కొత్తగా కాపురం పెట్టబోయేటప్పుడు యిటు వంటి పెద్దమనిషితో పరిచయం తప్పకుండా పనికివస్తుంది. కాని స్థానికంగా పరిచయస్తులు వుండడంలోకూడా కొంత ప్రమాదం లేకపోలేదు. కమలతో తన సంబంధం చర్చకు వచ్చి ఎవ్వరైనా నిలదీస్తే అది ఆమెకు పరీక్షాసమయం అవుతుంది. అందరూ తమకు కొత్తవాళ్ళు అయివుండి, ఎవరూ యేమీ ప్రశ్నలువేయని చోటుకు వెళ్ళి వుండడం శ్రేయ స్కరం అనిపించింది.

ఈ ప్రకారం నిశ్చయించుకుని, పడవ రేపు ఘజీపూర్ చేరుతుందనగా చక్రవర్తితో యిలా అన్నాడు: "బాబాయ్, మీ ఊరు నా వృత్తికి సరిపడదనుకుంటాను. అంచేత నేను నేరుగా బెనారస్‌వరకూ వెడదామనుకుంటున్నాను" అన్నాడు.

ఈ నిశ్చయం, ఇది చెప్పేతీరు ముసలాయనకు ఆశ్చర్యం కలిగించినాయి. "ఇలా నిమిషాని కొకరకంగా నిశ్చయించు కోవడం నిశ్చితమనిపించుకోదు. అది కేవలం అనిశ్చితం. అయితే ప్రస్తుతానికి నీవు బెనారస్ వెళ్ళటానికే దృఢంగా తీర్మానించుకున్నావన్నమాట!" అన్నాడు.

"అవును" అన్నాడు రమేష్ సూక్ష్మంగా.

వృద్ధుడు యింకేమీ అనకుండా సామాను సర్దు కోవడం ఆరంభించాడు

కమల నింపాదిగా "ఏం బాబాయ్, ఇవాళ నేనంటే అయిష్టం యేర్పడిందా యేమిటి?" అనడిగింది.

"ఉదయం లేచింది మొదలు రాత్రివరకూ పోట్లాడు కుంటూవుంటే యింతకంటే యేమవుతుంది? ఇంతవరకూ నీ సంగతేమిటో నాకు అర్థంకానేలేదు!"

"ఉదయంనుంచీ చూస్తున్నాను, నన్ను తప్పించుకు తిరుగుతున్నారేం బాబాయ్."

"పైగా నన్ను అంటున్నావా? నువ్వేగా ఎప్పటికీ నాకు దూరంగా వెళ్ళిపోతున్నావు" అన్నాడు చక్రవర్తి.

కమల అతనివంక తేరిపార జూచింది. ఆమెకేమీ అవగాహన కావడంలేదు. "రమేష్‌బాబు నీకేం చెప్పలేదా? మీరంతా బెనారస్ వెళ్ళడమే నని నిశ్చయం అయిపోయింది" అన్నాడు.

కమల ఇందుకు అవుననలేదు, కాదనలేదు. కొద్దివిరామం గడిచాక "ఈ సామానుసర్దటం మీ ఒక్కరివల్లాకాదు. నేనుకూడా సాయం చేస్తానుండండి!" అంది. ఘజీపూర్ ప్రయాణంపట్ల కమల నిర్లక్ష్యం ప్రకటించడం చక్రవర్తికి చాలా బాధగావుంది. "సరే ఎలాకావాలంటే అలాగే జరుగుతుంది. ఈ వయస్సులో జీవితంలో సరికొత్త బంధాలు ఏర్పరచుకుని ఏం లాభం?" అనుకొని తృప్తిపడ్డాడు.

రమేష్ యీ సమయంలోనే తన ప్లానులో వచ్చిన మార్పును కమలకు చెప్పడానికి అక్కడికి వచ్చాడు "నీకోసమే చూస్తున్నాను కమలా! ప్రస్తుతానికి మనం ఘజీపూర్‌లో మజిలీ చేయడంలేదు. నేను బెనారెస్‌లోనే వృత్తిప్రారంభిద్దామనుకుంటున్నాను. నీకూ అంగీకారమేగా!" అన్నాడు.

కమల చక్రవర్తి బట్టలు మడతపెడుతుంది. "లేను

నేను ఘజీపూర్‌కే వెడుతున్నాను. నా ప్రయాణ సన్నాహమంతా అయిపోయింది'' అంది ఆమె ట్రంకుపెట్టె మీదినుంచి దృష్టి మరల్చకుండానే.

కమల ఇలా కృతనిశ్చయురాలై వ్యతిరేకం ప్రకటించేటప్పటికి రమేష్ అదిరిపోయాడు. 'అయితే ఒక్కదానివే వెడతావా ఘజీపూర్?' అనడిగాడు.

'లేదు, బాబాయికూడా వుంటారుగా...' అంది కమల ముసలాయనవంక ఆప్యాయంగాచూస్తూ. చక్రవర్తి యీ పరిస్థితి ఎదుర్కొనలేక పోయాడు. 'అమ్మాయి! నాపట్ల అంతదయ కనబరుస్తే, రమేష్‌బాబు అసూయ పడతాడు'' అన్నాడు. కమలమటుకు 'నేను ఘజీపూర్‌కే వెడుతున్నాను' అని మళ్ళీ చెప్పింది. ఆమె కంఠధ్వని—తన విషయాలన్నీ తనే నిర్ణయించుకునే స్థాయిలోవుంది.

'సరే బాబాయి. ఘజీపూర్ వెడదాం' అన్నాడు రమేష్.

సాయంత్రానికి ఆకాశం నిర్మలంగా తయారయింది. వాన వెలిసిపోయింది. రమేష్ చంద్రుని వెన్నెలలో ఆలోచిస్తూ చాలసేపు కూర్చున్నాడు. ''ఈ విధంగా మేం ఎన్నాళ్ళయినా యీడ్చివేయలేం, కమల తిరుగబడిందంటే వాతావరణమంతా మరీ ప్రమాదకరంగా తయారవుతుంది. ఆమెతో కాపురంచేస్తూ, దూరంగావుండడం ఎలా? ఎన్నాళ్లు సాగుతుంది? ఇలా ఊరుకుంటే యేమీ ప్రయోజనం లేదు. ఏమయినా, కమల నిజంగా నా భార్య. మొదటినుంచీ ఆమెను నాభార్యగా పరిగణిస్తూ వచ్చాను. మేమిద్దరంకలిసి మంత్రాలు

వర్తించలేదుగనుక నాకేమీ అనుమానాలు, సందేహాలు వుండనవుసరం లేదు. మృత్యువే ఆమెను నాకు సమర్పించింది. ఆరోజు యిసుకతిన్నెమీద మా యిద్దరినీ ఒకటిగా చేసింది. మానవులకన్నా మన పురోహితులకన్నా, మృత్యువు మరింత పెద్ద పురోహితుడు !

అతనికీ హేమాలినికి నడుమ మహా ప్రవాహంలాగ సైన్యంవున్నది. ఆమె ముందుకు చేరుకోవాలంటే యీ సైన్యంతో యుద్ధంచేయవలసి వుంది. ఎన్నో అభ్యంతరాలు, అనుమానాలు, అవమానాలు అడ్డంకులు ఎదుర్కోవాలి. వాట న్నింటితో యుద్ధంచేసి జయిస్తేకాని తాను హేమాలినిముందు ముఖం పైకెత్తుకొని నిలుచోలేదు. ఇవన్నీ తలుచుకుంటే అత నికి భయం, వణుకు కలగసాగాయి. తాను జయిస్తాడని యేం నమ్మకం ? తన అమాయకత్వాన్ని నిరూపించుకోవడం మటుకు యెలా ? తాను అలా నిరూపించుకోగలిగినా సమా జం ఆమెను తననుంచి దూరంగా తీసుకుపోవచ్చును. ఇదంతా సత్యంగా జరిగినా; కమలకు అత్యంత విచారం, విషాదం! పిరికి తనాన్ని అనిశ్చితత్వాన్ని ఒక పక్కకు నెట్టాడు. ఇంక ఆలో చించ నవసరం లేదు. కమలను తనభార్యగా చేసుకుంటే యీ గొడవలన్నీ యేమీవుండవు. హేమాలినిమటుకు తానంటే అసహ్యించుకుంటుంది. ఈ అసహ్యంతో ఆమె మరో వరుణ్ని వెదుక్కుంటుంది. రమేష్ నిట్టూర్చి, హేమాలినిపట్ల తన ఆశలన్నీ గాలిలో ఎగురవేశాడు.

# 31

"ఎక్కడికి వెడుతున్నావు ఉమేష్" అని అడిగాడు రమేష్.

"అమ్మగారితో వెడుతున్నాను."

"కాని నీకు బెనారస్‌వరకు టికెట్ తీసుకున్నాను. ఇది ఘజీపూర్ యే కదా! మేం బెనారస్ వెళ్ళడంలేదు."

"నేనూ వెళ్ళడం లేదు-"

ఉమేష్ తను కుటుంబానికి శాశ్వతంగా అతుక్కుపోయి వుంటాడని రమేష్ అనుకోలేదు. కాని తాను నిమ్మకు నీరెత్తినట్లు అలా కూర్చొని వుండడం చూచి ఆశ్చర్యపోయాడు.

"అయితే ఉమేష్‌నుకూడా మనతో తీసుకు పోదామా?" అన్నాడు కమలతో.

"మరెక్కడికి వెడతాడు?"

"బెనారస్‌లో ఎవరో బంధువులు వున్నారన్నాడు కదూ?"

"మనతోనే వస్తానంటున్నాడుగా...చూడు, ఉమేష్, కొత్తచోటుకు వెడుతున్నాం. గుర్తుంచుకుని, బాబాయి చేయిపట్టుకునే నడువు, లేకపోతే మారుపడిపోతావు" అంది కమల.

కమల అన్నివిషయాలు తానే స్వయంగా నిర్ణయిస్తోంది. ఎక్కడికి వెళ్ళాలి, ఎందరు వెళ్ళాలి అన్న విషయంకూడా ఆమె పూర్తి బాధ్యత తీసుకుని మాట్లాడుతోంది. రమేష్

చెప్పినదానికల్లా నోరు మెదపకుండా తన అంగీకారం తెలిపి అలా ఆచరించేదశ మారిపోయింది. అందుచేత యీ విషయం మీద ఇంక వేరే తర్జనభర్జన జరగకుండానే, ఉమేష్ తన బట్టలమూటతో సహా వారితోనే ప్రయాణమైనాడు.

నగరానికి, యూరోపియన్ల బసలకు మధ్యనున్న పెద్ద బంగళాలో వుంటున్నాడు చక్రవర్తిబాబాయి. ఇంటిముందు రాళ్ళతో కట్టిన బావివుంది. ఇంటివెనక మామిడితోటవుంది. రోడ్డుకు యీ ఇంటి ఆవరణకు మధ్య పిట్టగోడవుంది. ఈ గోడకు ఇంటికి మధ్య ఇంటితోటవుంది. ఈ తోటకు బావిలో నుంచి నీళ్ళతోడి పోస్తూంటారు. రమేష్, కమల తమ కొక నూతన నివాసం ఏర్పరుచుకునేంతవరకూ ఇక్కడే వుండవచ్చు నన్నాడు చక్రవర్తిబాబాయి.

చక్రవర్తి భార్యపేరు హరిభవాని. ఆమె బలహీనంగా వుంటుందని భర్త ఎప్పుడూ చెబుతూ వుంటాడుగాని, ఆమె ఆకారం చూచిన వారెవరూ యీ విషయం అంగీకరించరు. ఆమె మధ్యవయసు దాటిన స్త్రీ. ఆమె ముఖం దృఢంగా వుంటుంది. వెంట్రుకలు అక్కడక్కడా నెరిశాయి. వయసు ఆమె శరీరంమీద డిక్రీ పొందిందిగాని ఇంకా అనులు జరపలేదు.

ఇంతకూ నిజం యేమిటంటే, వివాహం అయిన కొద్ది రోజులకే ఆమె మలేరియాజ్వరానికి గురిఅయింది. గాలి మార్పు ఒకటే యిందుకు సరియైన మందని భర్త నిర్ణయించాడు. అందుచేత ఆయన ఘజీపూర్‌లో స్కూలుమాస్టరు ఉద్యోగం సంపాదించి, సకుటుంబంగా అక్కడికి తరలివెళ్ళాడు.

ఆమె ఆరోగ్యం కొన్నాళ్ళకు కుదుటబడింది. కాని ఆమెను యెప్పుడూ పదిలంగా చూచుకుంటూ వుండడం మటుకు మానలేదు భర్త.

చక్రవర్తి అతిథులను ముందుగదిలో ప్రవేశపెట్టి తాను లోపలికి వెళ్ళాడు, హడావడిగా భార్యకోసం వెదుకుతూ. ఆమె దొడ్లో యింటిపనులు చూచుకుంటూవుంది.

"ఇక్కడున్నావా? ఇవాళ కాస్త చలిగావుందికదా! శాలువ కప్పుకోలేదేం?" అన్నాడు.

"ఏమిటి మీరనేది? చలా? ఎండవేడికి వెన్నంతా కాగుపోతూవుంటే!" అంది ఆమె.

"అదేం లాభంలేదు. ఒక గొడుగు కొనుక్కుందాం ఉండు—"

"సరేలెండి. ఆ విషయం అలావుంచండి. ఇన్నాళ్ళూ ఎక్కడికి వెళ్ళారు. అది చెప్పండి ముందు—"

"అదంతా పెద్దకథ. అది తరువాత చెబుతాను కాని, నాతోపాటు కొందరు అతిథులు వచ్చారు. ముందు వాళ్ళ సంగతి చూడు" అన్నాడు భార్యతో మెల్లిగా అసలు విషయం బయటపెడుతూ.

చక్రవర్తి యిలా ఎరగని వాళ్ళను, దారినిపోయే వాళ్ళను యింటికి తీసుకవస్తూ వుండడం యిప్పుడేం కొత్త కాదుగాని, హారిభవానికి — దంపతులను తీసుకురావడంతో కొంత చిక్కున పడినట్లయింది. "భగవంతుడా! వాళ్ళ గది ఎక్కడుంది?" అంది.

"ముందు వాళ్ళను పలకరించు. తరువాత గదివిషయం

చూచుకోవచ్చు. శైల ఎక్కడ ? కనబడదేం ?"

"పిల్లకు నీళ్ళుపోస్తోంది."

చక్రవర్తి కమలను భార్యదగ్గరకు తీసుకువచ్చాడు.

కమల, హారిభవానికి ఆమె వయస్సు తగినట్లుగా వందనం చేసింది. ఆమె కమల గడ్డం స్పృశించి, తనవేలిని ముద్దు పెట్టుకుని, "ఈమె అచ్చం మన బిందులాగ వుంది కదండి" అంది. బిందు అంటే వారి పెద్దఅమ్మాయి. ఆమె భర్తతో అలహాబాదులో కాపురం చేస్తోంది.

చక్రవర్తి యీ పోల్చటానికి తనలో తాను సంతోషపడ్డాడు. నిజానికి బిందుకు, కమలకు ఏ విషయంలోనూ— కనీసం కొద్దిగానైనా పోలికలేదు. కాని హారిభవాని, యే ఆడపిల్లకూడా తన కూతుళ్ళకంటే అందమైనదనీ, పనిమంతురాలనీ అంగీకరించదు. వాళ్ళ అమ్మాయి శైల యిక్కడే తల్లిదండ్రులదగ్గర ఉంటుంది. ఆమె చూడటానికి ఊలుదారంలా ఉంటుంది. అందుచేత తల్లి దగ్గరగాలేని బిందుతో పోల్చి తన ఆధిక్యతను నిలుపుకుంటూ వుంటుంది.

హారిభవాని యింకా యిలా అంది: "మీరు రావడం మాకెంతో సంతోషంగా వుంది. కాని యిక్కడ మీకు ఎక్కువ అనుకూలంగా ఉండదేమోనని భయంవేస్తోంది. మా కొత్త ఇల్లు యిప్పుడు మరమ్మత్తులలో వుంది. అందుచేత అందరం యిక్కడే సర్దుకోవాలి."

నిజమే. చక్రవర్తికి బజార్లో కొత్త ఇల్లు ఉన్నమాట యథార్థమే. కాని అది వాసయోగ్యమయినది కాదు. కనీసం దాన్లో మకాం పెడదామనికూడా వాళ్ళు ఎప్పుడూ అనుకో

లేదు. చక్రవర్తి భార్య చెప్పిన చిన్న అబద్ధాన్ని గమనించాడు. కాని ఆమెను బయటపడేయడం యిష్టంలేక ఊరుకున్నాడు "అనుకూలంగా వుండదేమోనని నీవు అభ్యంతరం చెప్పినట్లయితే-అసలు మిమ్మల్ని యిక్కడికి తీసుకువచ్చేవాడినేకాదు" అని కమలతో అని, భార్యతో యిలా అన్నాడు: "సరే యిక్కడ ఎక్కువసేపు నిలుచోవడం బాగుండదు. ఈ ఎండ మంచిదికాదు నీ వొంటికి. లోపలికిపద" అంటూ రమేష్‌కోసం వెళ్ళాడు.

కమలతో ఒంటరిగా మిగిలాక, హరిభవాని ఆమెను ప్రశ్నలవర్షంలో ముంచేసింది. "నీ భర్త లాయరు అన్నావు కదూ? ఎన్నాళ్ళుగా ప్రాక్టీసు చేస్తున్నారు? నెలసరి ఎంత ఆదాయం వస్తుంది? లేదూ? - ఇంకా ప్రాక్టీసు ఆరంభం చేయలేదంటావా? అలా అయితే యిన్నాళ్ళూ ఎలా గడుపుకువస్తున్నారు? మీ మామగారు బాగా డబ్బు పంపిస్తున్నారా? నీకు తెలియదా? ఏం వింతమనిషివి? నీభర్త తాలూకువాళ్ళను గురించి నీకేం తెలియనే తెలియదూ? ప్రతి నెలా యింటిఖర్చులకు మీ ఆయన నీ చేతికి కెంత పైకం యిస్తూవుంటాడు? నీఅంతట నువ్వే అన్నివిషయాలు చూచుకోవాలన్నమాట. మీ అత్తగారు లేరన్నావు గదూ! నీ వయస్సులోవున్న పిల్లకు ఎంతభారం! మా అమ్మాయి బిందు భర్త తన జీతమంతా దానిచేతుల్లోనే పోస్తాడు.''

ఇలా ప్రశ్నలవర్షం, వ్యాఖ్యానాల వరుస వదలి కమలకు ఆమె తన అసమర్థతంతా ప్రదర్శించింది. భర్త తరఫువాళ్ళను గురించి ఏమీ తెలీకపోవడం ఎంత అసాధా

రణమో, అసంబద్ధమో కమలకు తెలిసివచ్చింది. ఇంతవరకు ఆమె రమేష్‌తో హృదయానికి హృదయం యిచ్చి మాట్లాడింది లేదు కద! తన భర్తనుగురించి యింతవరకూ తనకేమీ తెలియదు కద! ఈ ప్రస్తావనలన్నీ తీసుకువచ్చే అవకాశమే లేకపోయింది! తన పరిస్థితి ఎంత విచిత్రంగా, ప్రత్యేకంగా వున్నదో ఆమె కొంతసేపు చింతించింది. ఆమెకు యిదంతా గందరగోళంగా, తన అప్రధాన్యతగా గోచరించింది.

హరిభవాని తిరిగి మొదలెట్టింది: "ఏదీ, నీ గాజులు చూడనీ. ఈ బంగారం అంత మంచిదికాదు కదూ? మీ పెళ్ళిసమయంలో మీ నాన్న నీకు బంగారం పెట్టలేదూ? ఓ! నీకు నాన్న లేడా? ఏమయినా నీ కేవో వస్తువులు ఉండలిగా. నీభర్త నీకేం కానుకలు యివ్వలేదూ? బిందు భర్త దానికి రెండునెలలకోసారి చిన్నగొలుసు చేయించి పెడుతూవుంటారు!"

— ఈ శల్యపరీక్ష శైల రావడంతో ఆగిపోయింది. శైల రెండుసంవత్సరాల కూతురు ఉమిని చేయిపుచ్చుకు నడిపిస్తూవచ్చింది. శైలజ నల్లగా ఉంటుంది. ఆమె ముఖ వర్చస్సు బాగుంటుంది. విశాలమైన నుదురు. గంభీరంగా, హుందాగా ఉంటుంది ఆమె వాలకం.

కమల కాస్సేపు ఎగాదిగా చూచాక, శైల కూతురు 'అత్తా...' అంది. ఆడవాళ్ళందర్నీ యీ పిల్ల కొత్త పాత లేకుండా 'అత్తా...!' అంటూనేవుంటుంది. కమల ఉమిని ముద్దాడుతూ ఎత్తుకుంది.

హరిభవాని కమలకు, శైలజకు యిలా పరిచయం

చేసింది: 'ఈమె భర్త లాయరు. మన ఊళ్ళో ప్రాక్టీస్ పెట్టడానికి వచ్చారు. దారిలో నాన్నగారికి కనిపించారు. నాన్నగారు మనయింటికి తీసుకువచ్చారు."

ఇద్దరి కళ్ళు కలుసుకున్నాయి. ఆ చూపే వాళ్ళిద్దరినీ స్నేహితులను చేసేసింది

హరిభవాని అతిథులకు యేర్పాట్లుచేయించడానికి వెళ్ళింది. శైలజ కమల చేయిపట్టుకుని ఆమె తన గదిలోకి తీసుకువెళ్ళింది.

అనతికాలంలోనే వాళ్ళు ఆప్యాయంగా మాట్లాడుకో సాగారు. ఇద్దరికీ వయస్సులోవున్న తేడా అంతగమనార్హంగా కనిపించదు

గాంభీర్యంలో కమల తన వయసుకంటే పెద్దది. ఎందుకంటే మొదటినించీ ఆమె జీవితం నడిచిన నడక అలాంటిది.

ఇద్దరు కొత్త స్నేహితురాండ్రు చాలసేపు మాట్లాడు కున్నారు. ఉమి పక్కనే అల్లరిచేస్తూ వాళ్ళ దృష్టిని తనవైపు ఆకర్షించుకోవటానికి ప్రయత్నిస్తోంది. సంభాషణలో కమలకు తన తక్కువతనం కనిపిస్తోనేవుంది. శైలజ ఎన్నో సంగతులు చెబుతోంది. తను యేమీా చెప్పలేకపోతోంది. తమ వైవాహిక జీవితాన్ని గురించి కమల చెప్పగలిగిందల్లా కేవలం పెన్సిలుగీతలు—ఇంకా సంపూర్తిగాని చిత్రం, కొన్ని కోణాలు అసలింకా మొదలెట్టనేలేదు. చిత్రం మొత్తంమీాద అసలు రంగులు వేయనేలేదు.

ఇంతవరకూ ఆమెకి విషయాలు తెలుసుకునే అవకాశం

లేకపోయింది ఏదో కొరత ఉన్నట్లు యిప్పుడు స్పష్టంగా తెలుస్తోంది. కాని అదేమిటో తెలియడంలేదు. శైలజ తన భర్తను గురించి చెబుతోంది. తన జీవిత మాధుర్యాన్ని గురించి మాటాడక తప్పదుకద ! కమలకు యీ తంత్రులు ఎక్కడున్నాయో తెలియదు ఆమె తన భర్తను గురించి చెప్పగలిగిందేమీ లేదు. ఆమెకు తెలిసింది యేమీలేదు, అసలు చెప్పాలన్న కాంక్షకూడ లేదు.

శైలజ భర్త బిపిన్ ఘజిపూర్‌లోని నల్లమందు కర్మాగారంలో ఉద్యోగం చేస్తున్నాడు. చక్రవర్తికి యిద్దరు కూతుళ్ళున్నారు. పెద్దమ్మాయి భర్తదగ్గర ఉంటోంది. చక్రవర్తికి రెండో అమ్మాయిని వదిలివుండడం యిష్టంలేకపోయింది. అందుచేత చక్రవర్తి తను చెప్పినమాట వింటూ, తను యిప్పించిన చిన్న ఉద్యోగంతో తృప్తిపడి, తన యింట్లోనే ఉండే అల్లుడిని వెదుక్కొన్నాడు.

శైలజ హఠాత్తుగా సంభాషణ ఆపేసింది. "క్షమించు కమలా. ఇప్పుడే వస్తాను. ఎక్కువసేపు ఉండనులే!" తరువాత ఆమె సగర్వంగా తన భర్త యిప్పుడే స్నానంచేసి బయటకు వచ్చాడనీ, ఆఫీసుకు వెళ్ళవలసిన సమయం అయింది కనక భోజనం పెట్టిరావాలనీ చెప్పింది.

"అతను వచ్చినట్లు నీ కెలా తెలిసింది ?" అంది కమల హృదయంలోని అమాయకత్వాన్ని బహిరంగ పరుస్తూ.

"మరీ వేళాకోళంగా మాట్లాడకు. నీకుమట్టుకు నీ భర్త పదధ్వని ఆనవాలు కాదా యేమిటి ?" అంది శైలజ

నవ్వుతో.

ఉమిని ఎత్తుకుని బొడ్లో తాకించెవుల గుత్తి సవరించు కుంటూ యింట్లోకి వెళ్ళింది.

కనులకు పదధ్వనుల భాష తెలుసుకోవడం యింత తేలికని యిదివరకు ఎరగదు ఆమె ఆలోచనగా కిటికీవంక చూస్తూ నిలబడిపోయింది.

# 32

రమేష్ గంగానది వొడ్డునవున్న ఒక ఒంటరి యిల్లు కుదుర్చుకోవడానికి మంతనాలు జరుపుతున్నాడు. తనసామాన్లు తెచ్చుకోవడానికి, ఘజిపూర్ బార్‌లో తనపేరు నమోదు చేయించుకునే కార్యకలాపంలోనికి దిగటానికి అతనోసారి కలకత్తా వెళ్ళి రావలసిన అవసరం వుంది. కాని— కలకత్తా నగరం వెళ్ళాలంటే భయం వేస్తోంది. ఆ నగరంలోని ఒకా నొక వీధిపేరు గుర్తుతెచ్చుకుంటే ఎంతోభయం, గుండెల మీద బరువు కలుగుతున్నాయి. ఇంకా అతను సంఘర్షణ నుంచి పూర్తిగా బయటపడలేదు. కమల భర్తగా తనస్థితిని గురించి ఇంక నిర్వివాదంగా ప్రవర్తించడంతప్ప మార్గంలేదు.

ఈ గందరగోళంలోపడి, ప్రయాణాన్ని సాధ్యమైనంత వరకు వాయిదా వేస్తూవచ్చాడు. ఈ చిన్న యింటిలో స్థలం తక్కువగనుక, కమల చక్రవర్తిగారి జనానాలోనే గడుపుతూ వచ్చింది. రమేష్ ముందుగదుల్లో వుంటున్నాడు. అతను, కమల ఒకళ్ళనొకళ్ళు చూచుకోవడంకూడా అరుదయి పోయింది తప్పనిసరి అయిన ఈ వియోగాన్ని గురించి కమ

లతో తాను చాలాసార్లు విచారిస్తున్నట్లుగా చెబుతూండేది శైలజ.

"దాన్ని గురించి యింతగొడవగా చెప్పడం దేనికి? అంత దారుణంగా అనుకోవలసిందేమీ లేదు" అంది కమల.

శైలజ నవ్వింది. "నువ్వెంత కర్కశహృదయురాలివి! ఈ విధమైన నటనతో నన్ను మోసంచేయలేవు. నువేం అనుకుంటున్నావో నాకు తెలియకపోలేదులే" అంది

"అయితే ఒకమాట చెప్పు. బిపిన్‌బాబు వరుసగా రెండురోజులపాటు నీదగ్గరకు రాకుండా వుంటారనుకో—"

"ఎందుకని? ఆయన నాకనిపించకుండా అలావుండనే వుండరు—" అంది శైలజ. అంటూ తన భర్తనుగురించి యేవేవో వివరాలు చెప్పబోయింది. వివాహం అయిన కొత్తలో తన్ను కలుసుకోవడానికి— యింట్లోనున్న ముసలి వాళ్ళకంట పడకుండా తనదగ్గరకు చేరుకోవడానికి ఆయన ఎంతెంత నాటకం ఆడేవాడో, అలా ఎన్నిసార్లు గెలుపు పొందాడో ఎన్నిసార్లు పట్టుబడిపోయాడో,— పెద్దవాళ్ళు అడ్డంగావుండి తామిద్దరూ బొత్తిగా కలుసుకోవడానికి వీల్లేని సందర్భాలలో ఎలా అద్దంలో ప్రతిబింబంచూచి సంతృప్తి పొందుతూ వుండేవాళ్ళో— అంతా చెప్పింది. ఇవి చెబుతున్నంతసేపూ ఆమె ముఖం పూర్వ జ్ఞాపకాలతో మరింత తేజోవంతంగా ప్రకాశించింది.

బిపిన్ రోజంతా ఆఫీసులోనే వుండవలసిన అవసరం వచ్చేది. అప్పుడు అతనెలా యుక్తిగా తప్పించుకు వచ్చేవాడో చెప్పింది.

ఒకసారి అతను, తండ్రిగారి పనిమీద పాట్నాలో కొన్నిరోజులు వుండవలసి వచ్చింది. శైలజ అతన్ని "మీరు పాట్నా వెళ్ళి వుండగలనని అనుకుంటున్నారా ?'' అనడిగింది. అతను సగర్వంగా ''ఆ! వుండగలను'' అన్నాడు. అతని జవాబు చెప్పేపద్ధతి, శైలజ అహంభావానికి ముల్లులా గుచ్చు కుంది. అనుకోకుండా వచ్చిన యీ వియోగానికి అతను మాటమాత్రంగానైనా విచారం వెలిబుచ్చలేదు. కాని ఆమెకు కన్నీరు మున్నీరుగా కారజొచ్చింది. మర్నాడు ప్రయాణానికి అంతా సిద్ధం అయినాక, బిపిన్‌కు అకస్మాత్తుగా తలనొప్పి యింకేవో అనిర్వచనీయమైన బాధలు వచ్చి ప్రయాణం మానుకోవలసి వచ్చింది. డాక్టరు వచ్చి మందు యిచ్చి వెళ్ళాడు. శైలజ, అతను రహస్యంగా యీ మందును మురికికాలవలో పోశారు. రోగి కొన్నాళ్ళకు అత్యద్భుతంగా తేరుకున్నాడు.

శైలజ మామూలుగా పరధ్యాసగా వుంటుంది ఏం జరుగుతున్నదీ గమనిస్తూ వుండదు. కాని ముందుగేటునుంచి ఒకవిధమైన చప్పుడు వచ్చినప్పుడుమటుకు ఎగిరిగంతు లేచేది. అప్పుడే బిపిన్‌బాబు ఆఫీసునుంచి తిరిగివస్తాడు. అతని పద ధ్వనిని ఆమె బహుచులాగ్గా చాకచక్యంగా కనిపెట్టగలదు.

శైలజయొక్క వైవాహిక జీవిత వైఖరి కేవలం పటా టోపం అనుకోవడంలేదు కమల. ఏమంటే ఇప్పుడిప్పుడే ఆమె క్కూడా యీ వైఖరిపట్ల ఆదరణ యేర్పడుతుంది. రమేష్‌ను కలుసుకొన్న మొదటినెలల్లో ఆమెలో ఏదో అనుబంధసరళి ఏర్పడినట్లయింది. తరువాత స్కూలుగొడవ వదలించుకొన్న

తరువాత ఆమె హృదయం ఏదో విచిత్ర నృత్యానికి కదం తొక్కుతున్నట్లుండేవి. రమేష్‌ను చూస్తూవుంటే, శైలజ చెబుతున్న కబుర్లన్నీ వింటూవుంటే ఇప్పుడా విషయాలన్నీ గుర్తొస్తున్నాయి. కాని ఆమెకు చెప్పుకోదగిన అనుభవాలుగాని మరుపురాని సంఘటనలుగాని ఏమీ లేవు. శైలజ, బిపిన్‌ల అనుబంధంవంటిది, ఆమెకు రమేష్‌కు మధ్య యేమీ లేదు. రమేష్‌తో ఇప్పుడు యేర్పడిన తాత్కాలిక వియోగం వల్ల ఆమెకు హృదయంలో యెక్కడా బాధ కనిపించడం లేదు. రమేష్‌కూడా, జనానాకు బయటి వరండాలో వుండి ఎలాగయినా తన ముఖాన్ని ఒకసారి చూడాలని తాపత్రయ పడుతున్నట్లు ఆమెకు అనిపించడం లేదు.

ఆదివారం వచ్చిందంటే కమలకు చాలా ఇబ్బందిగా వుండేది. అదేమంటే ఇవాళే వారానికి ఒకరోజుగా బిపిన్‌కు సెలవు. అందుచేత శైలజ ఆరోజల్లా అతనితోనే వుండి పోతుంది. బయటకురాదు. కమలకు రోజంతా ఆమెను చూడకుండా వుండాలంటే బాధగావుంది. తనకోసం వారానికి ఒక్కసారి వచ్చే సెలవుదినాన్ని త్యాగం చేయమనడం ఉచితంగా కనిపించదు! తను, రమేష్ ఒకే కప్పుకింద వుంటున్నా ఇద్దరికీ నడుమ అడ్డుగోడలు ఎలాగో ఒకలాగ ఒకసారి అతన్ని కలుసుకునే అవకాశం ఏర్పడితే ఎంత బాగుండును— అనిపించసాగింది కమలకు తన ఆలోచనలను గురించి పథకాలను గురించి, పెద్దవాళ్ళతో ఆలోచించడమే లేదు కాని చక్రవర్తి ఇలా ఒకళ్ళు ఆలోచనకువస్తేతప్ప కలుగజేసుకోని మనిషి కాడు. అతనొకనాడు తొందరపనిమీద ఊరువిడిచి

వెడుతున్నట్లూ, బయటివాళ్ళెవరూ ఆరోజుకు రారుగనుక నిద్రపోయేటప్పుడు ముందుగది తలుపు తాళం వేసుకోమని రమేష్‌కు నొక్కిచెప్పాడు. ఈ సూచన చేసేటప్పుడు తన కూతురు వింటోందిగదా అని నిశ్చయం చేసుకున్నారు! ఏమంటే, తన ఉద్దేశ్యం ఆమె గ్రహించాలి.

నదిలో స్నానం ఆచరించి వచ్చాక శైలజ, కమలతో "రా, నీతల ఆర్చి జడవేస్తాను—" అంది.

"ఏమిటంత తొందర, యివాళ!

"తరువాత చెప్తానులే. ముందు జడవేయనీ"అంది. తరువాత కమల ధరించవలసిన ఉడుపులను గురించి కొంత వాదోపవాదం జరిగింది. శైలజ బాగా కొట్టొచ్చేట్టు కనిపించే రంగుచీర కట్టుకోమంది. కమలకు ఆమె ఎందుకలా చెబుతోందో అర్థంకాలేదు. చివరకు ఎలాగయితేనేం, శైలజ చెప్పినట్లే చేసింది.

మధ్యాహ్నంభోజనం అయినాక, శైలజభర్త చెవిలో యేదో చెప్పి కొద్దిసేపు సెలవు మంజూరుచేయించుకుంది. తరువాత కమలను తీసుకుని మగవాళ్ళు కూర్చునే గదులు చూచివద్దామని బయలుదేరింది.

ఇదివరకటి సందర్భాలలో, కమల రమేష్‌ను కలుసుకోవడంకోసం యేమీ ఆదుర్దాపడలేదు. అలా చేయడంలో గాని చేయకబోవడంలో యేదో ఆచారం, అలవాటు ఉన్నదనికూడా ఆమెకు తెలియదు. రమేష్‌మటుకు అతను యెక్కడో దూరంగా ఉన్నాడు ఆమెకు తనలో అతన్ని ఆకర్షింపజేసే స్త్రీత్వం వున్నట్లే తెలియదు. ఈ సందర్భంలో

1

మటుకు, శైలజచెప్పిన మాటకు ఆమె గుడ్డిగా ఒప్పుకోలేదు. శైలజ తనభర్తదగ్గరకు యే అధికారంతో వెడుతోందో ఆమెకు తెలుసు. కాని యిలా వెళ్ళడం తనకు యిష్టంలేదు. తాను రమేష్ దగ్గరకు యేదో అభ్యర్థిలా వెళ్ళడం ఆమెకు యిష్టంలేదు.

శైలజ తనప్రయోగం కమలమీద పనిచేయలేదని నిర్ణయించుకున్న తరువాత, ఆమెకు అహంభావం ఎక్కువ అనుకుంది. బహుశ యీ భావనలన్నిటికీ అడుగున అహంభావంకూడా ఉండవచ్చును ఈ దంపతులు చాలా రోజులుగా విడివిడిగా ఉంటున్నారు. అయినప్పటికీ రమేష్ తన భార్యను చూడటానికి యే అవకాశమూ తీసుకోలేదు.

ఇంటి యజమానురాలు లోపలిగదిలో తలుపులు మూసుకుని నిద్రపోతోంది. శైలజ బిపిన్‌దగ్గరకు వెళ్ళి "మీరు రమేష్‌బాబుదగ్గరికి వెళ్ళి కమలచెప్పిన మాటలుగా అతన్ని ఆమెగదికి వెళ్ళమని చెప్పాలి. నాన్నగారికేమీ అభ్యంతరం ఉండదు. అమ్మకు తెలియదు!" అంది.

బిపిన్ తలవొంచుకు తనదారిని వెళ్ళిపోయే తత్వం కలవాడు. అతనికి యిటువంటి రాయబారాలంటే పడవు. అయినా ఆదివారంపూట భార్యచెప్పినమాట వినకుండా, ఆరోజు సుఖమంతా చంపుకోవడానికి అతను సిద్ధంగా లేడు. అందుకని అతను అంగీకరించాడు.

రమేష్ ముందుగదిలో తివాచీమీద పడుకుని ఉన్నాడు. ఒకకాలు వంగిఉంది. రెండోకాలు దానిమీద వేసుకున్నాడు. ఏదో పత్రిక చదువుతున్నాడు. ఆ నాటి

వార్తలన్నీ చదివేశాడు. కాని యింకా సమయం మిగిలి నందువల్ల ప్రకటనలుకూడా చదవడం మొదలెట్టాడు. సరిగ్గా ఈ సమయంలో బిపిన్‌గదిలో ప్రవేశించాడు. రమేష్ అతన్ని చూచి వెంటనే లేచి కూర్చున్నాడు. "లోపలికిరా, బిపిన్ బాబు, లోనికిరా" అన్నాడు. బిపిన్‌తో అతనికి అంత పరిచయం లేకపోయినా, మధ్యాహ్నంపూట కాలక్షేపానికి యేమీ ఫరవా లేదనుకున్నాడు.

లోపలికి వచ్చి కూర్చోవడానికి మారుగా బిపిన్ అక్కడే నిలబడిఉండి నెత్తిగోక్కుంటూ "ఆమె మిమ్మల్ని లోపలకు రమ్మంటూంది" అన్నాడు.

"ఎవరు ? కమలా ?"

"అవును ?"

రమేష్ నిర్ఘాంతపోయాడు. భవిష్యత్తులో కమల తనకు కేవలం పేరుకేకాకుండా ఆచరణలో గూడా భార్య అవవలసిందేనని నిశ్చయించుకున్న రమేష్, యీ కొద్ది రోజుల వియోగంలో తిరిగి అనిశ్చితత్వంలో పడిపోయాడు. కమలతో తాను ముందు ముందు పొందబోయే సుఖాలను గురించి తీయని దృశ్యాలు ఊహించుకుంటూ మురిసి పోతున్నాడు. కాని యీ విషయాన్ని ఆమెకు తెలియ జెప్పడం ఎలా ? ఇదే ఎంతగా తరచినా అర్థంకావడంలేదు. అందుచేతనే అతను ఇంటిని కుదుర్చుకోవడం కోసం అంత ఆదుర్దాపడశంలేదు.

బిపిన్ యీ వర్తమానం చెప్పింతర్వాత, బహుశః కమల తనతో ఏమో మామూలు విషయాలు మాట్లాడ

టానికే పిలిచివుంటుందనుకున్నాడు. అయినప్పటికీ అతని హృదయాన్ని ఏదో ఒక విధమైన ఉద్రేకం ఆవరించింది. చేతిలోని పత్రిక కిందపడేసి, బిపిన్‌బాబు వెంట లోపలకు నడిచాడు.

బిపిన్ ఒక గుమ్మంవంక చూపించి, తనదారిని తను వెళ్ళిపోయాడు.

శైలజ తన ప్రయోగాలన్నీ కట్టిపెట్టి, భర్తతో కులాసాగా గడపడానికి వెళ్ళివుంటుందనుకుంది కమల. అలా అనుకుని, బయటి గుమ్మం తలుపుదగ్గర కూర్చుని తోటవంక చూస్తోంది. శైలజ తనకు తెలియకుండానే కమలలో ప్రేమ రాగాలు పలికిస్తోంది. గాలికి చెట్ల ఆకులు కదిలి చప్పుడు చేస్తున్నట్లే, కమల హృదయంకూడా ఉండి ఉండి భారంగా మూలుగుతోంది.

అనుకోకుండా రమేష్ గదిలో ప్రవేశించి, ఆమె వెనగ్గా నిలబడి మెల్లిగా "కమలా!" అని పిలిచాడు''. ఆమె అదిరిపడింది. ఆమె రక్తనాళాలు వుబికినాయి. అతని సన్నిధిలో ఎన్నడూ సిగ్గుపడనిది, ఇప్పుడు అకస్మాత్తుగా తలకిందికి వాల్చుకుంది. అతన్ని ముఖాముఖి చూడలేకపోయింది. ఆమె ముఖం గులాబీరంగుగా తయారయింది.

ఆమెలో కొత్తగా కలిగిన ఆత్మవికాశం రమేష్‌కు స్పష్టంగా కనిపిస్తోంది. అతను ఆమె ఆకర్షణకు పూర్తిగా లొంగిపోయాడు. మెల్లగా ఆమెదగ్గరకు వెళ్ళి ఒకటి రెండు క్షణాలు ఆగి నింపాదిగా యిలా అన్నాడు: నా కోసం కబురంపావా, కమలా!

ఆమె యీ మాటలకు నివ్వెరపోయింది. "లేదు ఎంతమాత్రం కాదు. నేనలాంటి పనేమీ చేయలేదు. మీ కోసం కబురంపాల్సిన పనేముంది ?" అంది లేనిపోని ఉక్రోషంతో.

"నాకోసం కబురంపడం నేరంకాదులే కమలా !" అన్నాడు రమేష్.

"నే నెప్పుడూ మీకోసం కబురంపలేదు" అంది కమల ద్వంద్వం స్ఫురిస్తూ.

"అలా అయితే సరే. నేను ఆహ్వానింప బడకుండా వచ్చాననమాట. అంతమాత్రాన నాతో మాట్లాడకుండా పంపించివేయవుగా !"

"మీరిలా వచ్చినట్లు వాళ్ళందరికీ తెలుస్తుంది. కోప్పడతారు. వెంటనే వెళ్ళిపొండి. నేను పిలవలేదు."

రమేష్ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ "అలా అయితే నీవే నా గదిలోకిరా. అక్కడెవరూవుండరు" అన్నాడు.

కమల నిలువెల్లా వణికిపోతూ అతని పట్టులోనుంచి చేతిని విడిపించుకుంది. పక్కగదిలోకి పరుగెత్తి తలుపు బందు చేసుకుంది.

రమేష్ యిప్పుడు పరిస్థితిఅంతా అర్థంచేసుకున్నాడు. ఇదంతా ఆడవాళ్ళు పన్నిన పన్నాగం. మెల్లగా చప్పుడు చేయకుండా నడిచి తన గదికి చేరుకున్నాడు. తిరిగి పడుకుని పత్రిక చేతిలోకి తీసుకున్నాడు. ప్రకటనల పుటలు ఊరికే చూస్తున్నాడు. కాని అతని మనస్సుమటుకు అల్లకల్లోలంగా

వుంది. గాలివల్ల మేఘాలు కదలాడుతున్నట్లు, అతని మన స్సులో ఒక ఆలోచన తరువాత మరో ఆలోచన ప్రసారం అవుతూ వచ్చింది.

శైలజ కమలవున్న గదితలుపు తట్టింది. కాని జవాబు రాలేదు. ఆమె ఎలాగో లోపలకు చెయ్యిపోనిచ్చి తనంత తానే గడియ తీసింది. లోనికి వెళ్ళింది. కమల ముఖం చేతుల్లో కప్పుకుని బోర్లాపడుకుని ఏడుస్తూవుంది. శైలజ యీ దృశ్యంచూచి ఆశ్చర్య పోయింది. పరిస్థితి ఏమీ అర్థం కాక, కమలపక్కనే కూర్చుని "ఏమిటిది, చెప్పవూ ? ఎందుకు ఏడుస్తున్నావు ? ఏం జరిగింది ?" అంది.

"ఎందుకు వారికోసం కబురుచేశావు ? తప్పుపని చేశావు."

ఇంత అకస్మాత్తుగా యీ విచారం, విషాదం ఆమె కెందుకు కలిగాయో యితరులకు తెలియదు సరికదా ఆమెకే తెలియదు. గతంలో ఆమె భరిస్తూ వచ్చిన విచారాన్ని గురించి ఎవరూ ఎరగరు.

ఆమె అప్పుడే గాలిలో మేడలు కడుతోంది. రమేష్ లోపలికి వచ్చేసమయంలోనే చివరి సవరింపులు చేస్తోంది. అతనంతట అతనుగా వచ్చి నిలబడినా ఆమెకింత విచారం ఉండేది కాదేమో ! కాని యెందుకు కబురంపావట— అంటూవచ్చాడు. అప్పుడే ఆమె ఊహాసౌధాలన్నీ నేల పాలు అయినాయి. తనను బడిలో బంధీగా వుంచాలను కోవడం, స్త్రీమనులో తనపట్ల నిర్లక్ష్యం ప్రకటించడం— ఇటివంటివన్నీ ఆమెకు జ్ఞప్తికివచ్చాయి. ఆత్మీయత వేరు,

ఆజ్ఞాపాలన వేరు. ఈ రెంటికీ తేడా ఆమె యీ ఘజీపూర్ వచ్చిన తరువాతనే తెలుసుకో గలిగింది.

కాని శైలకు యీ పరిస్థితిఅంతా అర్థంకాదు. కాని రమేష్‌కు, కమలకు నిజంగా అడ్డుగోడలు ఉంటాయంటే ఆమె నమ్మలేకపోతోంది.

ఆమె కమల తలను తన ఒడిలోకి తీసుకుంది. "నాతో చెప్పు కమలా! రమేష్‌బాబు ఏమన్నా కఠినంగా మాట్లా డాడా? నాభర్త పిలుచుకువచ్చాడు గనుక ఆయనకు కోపం వచ్చిందేమో. అదంతా నేనే చేశానని చెప్పకపోయి నావా?" అంది.

"లేదు. లేదు. వారు యీ విషయమేమి ప్రస్తావించ లేదు. అయినా నువ్వు వారికోసం ఎందుకు కబురంపావు?"

"తప్పుచేశాను, క్షమించు" అంది శైలజ, విచార పడుతూన్నట్లు.

కమల చప్పునలేచి కూర్చుని శైలజ మెడచుట్టూ చేతులు వేసింది. 'ఇక వెళ్ళు. శైలా బిపిన్‌బాబు చిరాకు పడుతూ వుంటాడు' అంది.

ఇంతసేపూ రమేష్‌బాబు పత్రికలోని సమాచారాలే చూస్తూవున్నాడు. చివరకు దాన్ని మడిచిపెట్టి "ఇకచాలు. రేపే కలకత్తా వెళ్ళి అక్కడిపనిపూర్తిచేసుక వస్తాను. "కమలను భార్యగా చేసుకోకుండా ఎంత ఆలస్యం అయితే, నేనంత మూర్ఖుడినీ మూఢుడినీ అన్నమాట!" అనుకున్నాడు.

# 33

రమేష్ కలకత్తాలో తనపనిని సాధ్యమైనంత త్వరగా ముగించుకోవాలనీ, కాలటోలాలో అడుగుపెట్టరాదని తీర్మానించుకున్నాడు.

దర్జిపురాలోని తమ పాతమజిలీకి వెళ్ళాడు. కాని అతని పని రోజులో కొన్నిగంటలు మాత్రమే ఆక్రమిస్తోంది. తతిమ్మా కాలం గడవడం అసాధ్యమవుతోంది. తన పూర్వ మిత్రులెవరినీ కలుసుకోబుద్ధి కావడంలేదు. ఎవరన్నా బజారులో యాదృచ్ఛికంగా తగులుతారేమోనని అందుకు ప్రతిక్రియలుకూడా చేస్తున్నాడు.

పాతచోటుకి తిరిగి రావడంవల్ల తనలో యేదో తెలియనిమార్పు వచ్చిందని గ్రహించాడు. పల్లెటూరులో విశాల నీలాకాశంకింద, కమల సౌందర్యం అతన్ని మంత్రముగ్ధుణ్ని చేసింది. కాని యీ మహానగరంలో ఆ వైభవమంతా మాయమయింది. దర్జిపురా ఇంటిలో రమేష్ ఆ అమ్మాయి ఆకారాన్ని స్ఫురణకు తెచ్చుకుని కనులకు విందు చేసుకుందామనుకున్నాడు. కాని అతని ఊహాశక్తి పనిచేయలేదు. ఇక తాను హేమాలినినిగురించి ఆలోచించనని మనసులో ఒట్టు వేసుకున్నాడు. కాని ఆమె ఆకారం మటుకు అతని స్మృతిపథంలో పగలు రాత్రి అనే తేడాలేకుండా మెదలుతోంది. ఎంత తీవ్రంగా తాను మరిచిపోదామనుకుంటే, అంతజోరుగా ఆమెరూపం అగుపిస్తోంది.

నిజానికి, తలుచుకున్నట్లయితే రమేష్ తొందరగానే

తన కార్యకలాపాలు పూర్తిచేసుకొని తిరుగుప్రయాణం చేసే వాడే. కాని యీ మానసికవికారాలలో అతనికి పొద్దు తెలియడం లేదు. చివరకు ఎలాగయితేనేం అతను అలహాబాదు వెళ్ళి అక్కడినించి ఘజీపూరు వెళ్ళిపోదా మనుకున్నాడు. రేపుఉదయం ప్రయాణం. ఆత్మనిగ్రహమంతా చెల్లాచెదరయింది. అందువల్ల ప్రమాదమేమీ లేదనుకున్నాడు. అందు చేతనే రహస్యంగా కాంటోలాకు ఒకపర్యటన వేసుకున్నాడు.

ఇలా నిశ్చయించుకుని హేమాలినికి ఒకఉత్తరం వ్రాశాడు. కమలతో తన సంబంధమంతా పూర్తిగా సవివరంగా వ్రాశాడు. చివరకు యీ అమాయక దురదృష్ట బాలికను నిజంగానే తనభార్యగా చేసుకుందామనే సంకల్పంతో తాను ఘజీపూర్ వెళ్ళిపోయినట్లు వ్రాశాడు. ఇవి వీడ్కోలుసందేశం. ఆమెనించి పూర్తిగా చివరిసారిగా విడివడడంకోసం తన హృదయమంతా విప్పి తెలియపరుస్తున్నాడు.

ఉత్తరాన్ని ఒక కవరులో వుంచాడు. బయటకాని లోపలకాని ఉత్తరం ఎవరికి ఉద్దేశించబడిందో వ్రాయలేదు. ఆనందబాబు ఇంట్లో సేవకులు కనిపిస్తారనీ, వారిద్వారా ఈ వుత్తరాన్ని ఆమెకు అందజేయడం సులభమేననీ అనుకున్నాడు. తెల్లవారుజామునే అక్కడికి వెళ్ళి, వీలయితే ఒకమారు హేమాలినిని దూరపు చూపుగా చూడాలనికూడా అనుకున్నాడు. ఇదే తను ఇద్దరిజీవితాలకూ చివరి అనుబంధం అవుతుందనుకున్నాడు.

తెల్లవారుజామునే అతను, అనుకున్న ప్రకారం బయలుదేరాడు. కాళ్ళు తడబడుతున్నాయి. హృదయం

దడదడ లాడుతోంది. తలుపు మూసివుంది. పైకిచూచి కిటి కీలుగూడా మూసివుండడం గమనించాడు. ఇంట్లో ఎవరూ లేరు, అంధకారం తప్ప.

తలుపుతటాడు. మూడు నాలుగుసార్లు తట్టినమీదట ఒక సేవకుడు గడియతీసి బయటకు వచ్చాడు.

"సుఖన్ కదూ! అవునా?" అన్నాడు.

"అవునండీ. నేను సుఖన్ నే"

"మీ యజమాని ఎక్కడ?"

"అమ్మాయిగారిని తీసుకుని ఊరికి వెళ్లారండీ గాలి మార్పుకోసం—"

"ఏ ఊరు?"

"తెలియదు."

"వాళ్ళతో ఇంకెవరన్నా వెళ్ళారా?"

"ఆ! నళిన్ బాబు."

"నళిన్ బాబు ఎవరు?"

"ఏమో నాకు తెలియదండి."

సుఖన్ తో మాట్లాడినమీదట నళిన్ బాబు యీ ఇంటికి కొత్తగా పరిచయమైన యువకుడని తెలుసుకున్నాడు రమేష్. హేమాలినిపట్ల అన్నిమమకారాలు ఆశలు చంపుకున్నప్పటికీ, అతనికి నళిన్ బాబు అంటే అసూయ కలిగింది. "అమ్మాయి గారి ఆరోగ్యం బాగుందా?" అనడిగాడు.

"ఆమె కులాసాగానే వుంది"

ఈ జవాబు రమేష్ కు సంతృప్తికరంగానేఉంది. అయితే యిందులో ఎంత సత్యం వుందో ఆ దేవుడికే తెలియాలి!

"ఒకటి రెండు నిమిషాలు పైకి వెళ్ళాలి" అన్నాడు రమేష్. సేవకుడు పైకిదారిచూపుతూ ముందునడిచాడు

రమేష్ ఒకగదిలోనుంచి మరోగదిలోకి భూతంలాగ నడిచాడు. తనకు సుపరిచితమైన సోఫాలు, కుర్చీలలో ఒక మారు కూర్చుని లేస్తున్నాడు. ఫర్నిచరు, అలంకారాలు — అన్నీ యధావిధిగానే వున్నాయి—ఒక్క నళిన్‌బాబు అనే కొత్తవ్యక్తి తప్ప. ప్రకృతి ఎప్పుడూ ఖాళీలను భర్తీచేస్తూ వుంటుంది. ఎవరినీ ఎల్లకాలం బాధిస్తూవుండదు. రమేష్ తాను హేమాలినితో కలిసి కూర్చున్న కిటికీవంక దిగులుగా చూచాడు. గాయపడిన అహంభావం అతని హృదయంలో బుసలుకొట్టింది.

మరునాడు, అలహాబాదుకు వెళ్ళడానికి మారుగా నేరుగా ఘజీపూర్ వెళ్ళే రైలు ఎక్కాడు.

# 34

రమేష్ కలకత్తాలో మొత్తం నెలరోజులపాటు ఉన్నాడు. కమలలాంటి వయసులోవున్న అమ్మాయికి నెలరోజు లంటే సామాన్యంకాదు. ప్రభాతకాంతి సూర్యోదయంగా రూపొందినవిధంగానే, ఆమెలోని స్త్రీత్వం మేల్కొంచిందే తడవుగా పరిపూర్ణతనుకూడా పొందింది. శైలజలో పరిచయం లేకపోయినట్లయితేనూ, ఆమె వ్యక్తిత్వం ఈమెమీద ప్రభ వించకపోయినట్లయితేనూ, యీ మేలుకొలుపు కమలలో యింకా ఆలస్యంగా వచ్చివుండేది.

ఇంతలో, రమేష్ బద్ధకమూ శైలజ తొందర చేయు

డమూ—వస్తే చక్రవర్తిబాబాయి యింటికోసం వెదకవలసి వచ్చింది. చివరకు ఆయన పట్టణానికి అవలివైపు గంగానదీ తీరానవున్న ఓ చిన్న బంగళా కుదిర్చాడు. ఆ యింటికి కావలసిన సరంజామా అంతా సమకూరుస్తున్నాడు. అవసరమైన సేవకులను మాట్లాడుతున్నాడు.

రమేష్ ఘజిపూర్‌కు తిరగివచ్చేసరికే, కమలకు స్వంత యిల్లొకటి యేర్పడింది. ఇప్పుడీ యువదంపతులు చక్రవర్తి బాబాయి కృపారసంమీద ఆధారపడి లేరు

ఇంటిచుట్టూ తోటకు సరిపడ ఖాళీ స్థలం వుంది. పొడుగాటి 'శిసు' వృక్షాల వరుసల నడుమ సన్నని కాలిబాట వుంది. ఇంటినుంచి నదికి మధ్య ప్రత్యేకమైన మార్గంకూడా వుంది.

ఈ యిల్లు చాలాకాలంగా ఖాళీగా వుంది. ఇంటినీ ఆవరణనూ చాలాకాలంగా నిర్లక్ష్యం చేసినట్లు స్పష్టమైన చిహ్నాలు అగుపడుతున్నాయి. తోటంతా గందరగోళంగా ఉంది. గదులన్నీ ఊడవకుండా చెత్తపోగులతో ఉన్నాయి. కాని కమలకు యిదేమీ తోచలేదు. ఒక యింటికి యిల్లాలు అయిన సంతోషంతో ఆమె మునిసిపోతోంది. ఆమె కళ్ళకు అంతా వైభవంగా కనపడుతోంది. ఏగదిని ఎలా ఉపయోగించుకోవాలో ఏమూల ఏ పాదులు, మొక్కలు వేయాలో ఈ గొడవలతో ఆమెకు క్షణంతీరకుండా వుంది. చక్రవర్తిబాబాయితో యేమేమో సంప్రదించుతుంది. వంటింట్లో పొయ్యిలు–యితరం తను స్వయంగా యేర్పాటుచేయిస్తోంది. సామాన్లగదిలో అవసరమైన మార్పులు చేయిస్తోంది. ఆమెకు పగల్లా

యిళ్ళు ఊడవడం, కడగడం, అలంకరించడంతో సరిపోతోంది. అయినాగాని ఆమె నూతనశక్తికి యేదోపని అవసరంగానే అనిపిస్తోంది.

ఇంటిపని స్త్రీలకు సౌందర్యవైవిధ్యాన్ని ప్రసాదిస్తుంది. కమలను యిలా చూస్తూవుంటే, రమేష్‌కు పంజరంలోంచి విడిచిపెట్టబడిన చిలుక గుర్తుకువస్తోంది. ఆమె ముఖంలోని కాంతి చూస్తూవుంటే అతనికి ఆశ్చర్యము, సంతోషము కలుగుతున్నాయి.

ఆమెను శ్రద్ధగా చూడడం యిదే మొదటిసారి. ఆమె యిప్పుడే తన రాజ్యంలో ప్రవేశించినట్లుంది. ఆమె అందానికి ఒకవిధమైన హుందాతనంకూడా జతఅయింది.

"ఏం చేస్తున్నావు కమలా! అలసిపోతావు సుమా!" అనేవాడు.

కమల చేస్తున్న పనిలోంచి ఒకక్షణం ముఖంపైకెత్తి హాయిగా నవ్వుతూ "మరేం భయంలేదు, నేను బాగానే వున్నాను" అని మళ్ళీ ఆ పనిలో నిమగ్నమైపోయేది. తన పనిలో రమేష్‌కూడా ఉత్సాహం చూపుతున్నాడని ఆమెకు మరింత సంతోషం కలిగేది.

రమేష్ యేదో కల్పించుకు మాట్లాడటంకోసం "భోజనం చేశావా, కమలా?" అని అడిగేవాడు.

"అబ్బే చాలాసేపయింది-" అని జవాబు చెప్పేది.

రమేష్‌కు యిది ఆమెకెంత తెలుసో అంతా తెలుసు. ఇంకా సంభాషణను పొడిగించటానికి "ఇదంతా నీవే చేస్తున్నావేం కమలా! నాకూడా ఏదన్నా పని చెప్పు" అనేవాడు.

కమల నవ్వుతూ "ఉహుం. ఇది మగవాళ్ళ పనికాదు" అనేది.

"బాబాయికి పనులు చెబుతున్నావుగా! నేనేం తీసిపోయానా!"

"నాకు తెలీదు. కాని మీరు యీ వంటయింట్లో చెత్తంతా ఊడ్చిపోస్తుంటే, నాకు చూడటానికి నవ్వొస్తుంది. మీరు కాస్సేపు బయటికివెళ్ళండి. దుమ్మంతా పైకి లేస్తుంది."

సంభాషణ తెగిపోకుండా రమేష్ "దుమ్ముకు పెద్ద చిన్న యేంలేదు. నిన్నూ, నన్నూ ఒక్కమాదిరిగానే చూస్తుంది" అన్నాడు.

"నాకంటే తప్పదనుకోండి. మీకూ్కడా ఎందుకీ చెత్తపని?"

"చెత్తపని అవనీ, యేమయినా అవనీ-నీవు చేస్తున్న పని నాకూ్కడా చేద్దామని వుంటుంది" అన్నాడు రమేష్, తతిమ్మా పసివాళ్ళకు వినపడకుండా నింపాదిగా.

కమల చెక్కిళ్ళమీదికి రంగు వచ్చింది. అతనికి జవాబుచెప్పటానికిమారుగా బయటకు వచ్చి ఉమేష్‌ను కేక వేసింది.

"ఉమేష్. ఇక్కడ ఇంకొక చేదెడు నీళ్ళు పోయాలి. చూడు, దుమ్ము ఎంత ఎత్తుకు లేస్తోందో, ఇదిగో, నాకా చీపురు ఇవ్వు" అంటూ గట్టిగా ఊడవసాగింది.

రమేష్ ఆమె అలాంటి చౌకబారు పని చేయడం

చూస్తూ భరించలేక "ఏమిటి కమలా, ఆపని!" అన్నాడు.

వెనుకనించి అతనికో జవాబు వచ్చింది. 'ఏం. రమేష్. ఎవరిపని వాళ్ళు చేసుకోవడంలో తప్పేముంది? మీరు ఇంగ్లీషు చదువుకుని సమానత్వం అంటూ గొడవపెడతారు. ఊడవడం అంత నీచమైన పనయితే, సేవకులచేత ఎందుకా పని చేయిస్తున్నారు? నాకు నీ విద్యలేదనుకో - కాని నన్నడిగితే ఇలా జవాబు చెబుతాను! మంచి స్త్రీ ఎవరయినా చీపురుతో ఊడుస్తూవుంటే, దాంట్లో ప్రతిపుడకా సూర్యకిరణంలా నా కళ్ళలో మెలుగుతుంది. (కమలతో) నీవు చెప్పిన పని అయింది అమ్మాయి, ఇక కూరగాయల మొక్కలు ఎక్కడ నాటాలో చెప్పు?'

"ఒక్క నిమిషం ఆగండి బాబాయి. ఇంకా యీ గదిలో పని అవలేదు" అంది కమల.

గది శుభ్రం చేయడం అయిన తరువాత, ఆమె నడుముకు బిగించుకున్న కొంగువిప్పి నెత్తిమీద వేసుకుంది. తరువాత కూరగాయలతోట ఎక్కడవుంటే మంచిది అన్న విషయంమీద బాబాయితో చర్చించ సాగింది.

ఆ రోజు గడిచి పోయింది. అయితే ఇల్లు కమలస్థాయికి సరిపోయినంతగా శుభ్రంగా లేదు. ఎన్నాళ్ళనుంచో నిర్లక్ష్యంచేసిన యిల్లు ఒక్కమాసుగా ఎలా సరికొత్తదవుతుంది? అందుచేత రమేష్, కమల మరోరాత్రి బాబాయి ఇంట్లోనే గడపవలసి వచ్చింది. రమేష్‌కు నిరాశ ముంచెత్తింది. ఆ పగలంతా అతను కమలను గురించే ఊహించుకొంటూ కూర్చు

న్నాడు. అలహాబాదుకోర్టులో పేరు నమోదు చేసుకురావ డానికి వెళ్ళడం ఇంకా ఆలస్యంచేస్తే కుదరదు. అందుకని మరునటిరోజే ప్రయాణం అయ్యాడు.

# 35

ఒకటి రెండురోజులు గడిచాక, చక్రవర్తిబాబాయ్ పెద్దమ్మాయి బింనును చూచేందుకని అలహాబాద్ వెళ్లాడు

ఆయన ఊరికి వెళ్ళేనాటి ఉదయమే, కమల శైలజను తన కొత్తయింట్లో విందుకు పిలిచింది. శైలజ భర్తకు భోజనంపెట్టి ఆఫీసుకుపంపి తాను కమల యింటికి వెళ్ళింది.

ఇద్దరూ ఉమేష్ సహాయంతో ఆరుబయట చెట్లకింద వంటమొదలెట్టారు. చల్లనినీడ, సూర్యరశ్మి, నది కనిపించే తీరు-ఇవన్నీ కమలకు మంచివాతావరణాన్నికూర్చాయి. ఆమె హృదయం గాలిలో తేలిపోయే గాలిపటంలా తయారయింది.

మధ్యాహ్నం భర్త ఆఫీసునుంచి యింటికి వస్తాడని చెప్పి, శైలజ యింటికి వెడతానంటూ లేచింది.

"మామూలు అలవాటునుంచి - ఒక్కమారు తప్పిం చుకోలేవా ?" అనడిగింది కమల. శైల ఊరికే నవ్వింది. కమల గడ్డం పట్టుకుని బతిమాలింది. చీకటిపడకముందే వచ్చే యమని ధైర్యంచెప్పి వెళ్ళింది.

సూర్యుడు యింకా దిక్చక్రానికి పైనే వున్నాడు. కమల యింటిపనంతా పూర్తిచేసుకుంది. తలకు శాలువ చుట్టుకుంది. సూర్యుడినిచూస్తూ తోటలోనే కూర్చుంది.

ఉమేష్‌వచ్చి ఆమెను పలకరించాడు. "అమ్మగారూ

మీరు చాలరోజుల్నించి తమలపాకులు వేసుకోలేదు. ఆ ఇంట్లో నేను మీ కోసం కొన్ని సిద్ధంచేశాను. ఇక్కడికి పట్టుకు వచ్చాను—" అంటూ ఆమెకు తమలపాకుల పొట్లం అందించాడు,

కమల యీ లోకంలోకి వచ్చింది. చీకటి పడుతోందని గ్రహించి లేచి నిలుచుంది.

"చక్రవర్తి బాబాయిగారు మీ కోసం బగ్గీపంపించారు" అన్నాడు ఉమేష్.

ఇంటికి వెళ్ళడానికి ముందు, చివరిసారిగా బంగళా అంతా పర్యవేక్షణచేసింది కమల. తమలపాకుల పొట్లం ఇంట్లో భద్రపరచింది. ఇంట్లో ఒకమూల ఒకకాగితం కనిపించింది' దానిమీద రమేష్ దస్తూరిలో తనపేరు వ్రాసివుంది.

"ఎక్కడిదీ కాయితం ?" అనడిగింది ఉమేష్‌ని.

"అయ్యగారి గదిలో ఒకమూల పడివుంటే, ఇక్కడికి తీసుకువచ్చాను—"

కమల దాన్ని తీసుకుని చదవ నారంభించింది. అది రమేష్ హేమాలినికి తన హృదయాన్ని విప్పి, సవివరంగా వ్యాఖ్యానించి వ్రాసిన ఉత్తరం అశ్రద్ధగా ఎక్కడో ఒక మూలపడవేసి వుంటాడు.

ఆమె ఉత్తరమంతా సమగ్రంగా చదివింది.

"ఏం అమ్మగారూ! చీకటి పడిపోతోంది. ఇంకా అలాగే నుంచున్నారేం ?" అన్నాడు ఉమేష్.

ఆ గదిలో అప్పుడు సూదిరాలినా చప్పుడయేంత నిశ్శబ్దం ఆవరించుకుంది. కమల ఫాలకంచూచి ఉమేష్ బెదిరి

పోయాడు, "నేను చెప్పేది వినండి అమ్మగారూ! ఇంక ఇంటికి వెళ్ళిపోదాం, ఇప్పటికే ఆలస్యం అయింది—" అన్నాడు. కాని ఆమె కదలలేదు. ఇంతలో బాబాయి నౌకరు అక్కడికివచ్చి బగ్గీ చాలసేపటిగా నిలిచివుందని చెప్పాడు.

## 36

కమల తిరిగిరాగానే "ఏం, ఇవాళ కులాసాగా లేదా కమలా? తలనొప్పిగా వుందా?" అనడిగింది శైలజ.

"లేదు. కులాసాగానేవున్నాను. ఏం, బాబాయి కనిపించడంలేదేం?" అంది కమల.

"అక్కయ్యను చూచిరమ్మని అలహాబాదు పంపింది అమ్మ. అక్కయ్యకు ఈమధ్య ఒంట్లో బాగుండ లేదట."

"ఎప్పుడు తిరిగివస్తారు?"

"ఒకవారం రోజులయినా అక్కడుంటారు. నువ్వు రోజల్లా ఆ బంగళాలో పనిచేసి అలసిపోతున్నావు. ఇంత నీరసంగా కనిపిస్తున్నావేమిటి? తొందరగా భోజనంచేసి నిద్రపో. కొంత విశ్రాంతి చిక్కుతుంది."

ఈ స్థితిలో కమలకు ఒకే ముక్తిమార్గం యేమిటంటే, శైలజను తను విశ్వాసపాత్రంగా భావించి హృదయంలోని బాధనంతా విప్పిచెప్పడమే. కాని యిది అసాధ్యం అని తోచింది. తాను భర్త అనుకుంటున్న వ్యక్తి నిజంగా తన భర్త కాడని, అందరిలోకీ శైలజను నమ్మించడం, యీ విషయం ముందుగా ఆమెకు నివేదించడం ఎంతో అసంగతం అనిపించింది.

కమల తన గదిలోనే తలుపులు మూసుకుపడుకుని రమేష్ ఉత్తరాన్ని దీపపు వెలుగులో అనేకసార్లు చదువు కుంది.

ఈ ఉత్తరం ఎవరికి ఉద్దేశించి వుందో వారి చిరునామా యేమిటి ఇక్కడ ఎక్కడా వ్రాసిలేదు. కాని విషయాన్ని బట్టి చూస్తే యీ ఉత్తరం ఎవరో స్త్రీకి ఉద్దేశించి వున్నదనీ ఆమెకూ, రమేష్‌ను ప్రధానం అయిందని, కమలతో కలిగిన యీ సంబంధంవల్ల ఆ ప్రధానం విచ్ఛిన్నమైపోతోందనీ తెలుస్తోంది. అదీగాక ఆ స్త్రీని హృదయసాక్షిగా ప్రేమిస్తున్నానన్న విషయాన్ని రమేష్ తన ఉత్తరంలో దాచిపుంచలేదు. అదీగాక, విధివశంగా తన పాలిటపడిన కమలవలన తను సంబంధాలన్నీ తెంచుకుంటున్నాననీ కూడా వ్రాశాడు.

కమల ఒక్కొక్క విషయంగా తన జీవితమంతా నెమరుకు తెచ్చుకుంది. రమేష్‌ను మొదటిసారి ఆ ఇసుకతిన్నె మీద చూచింది లగాయితు — ఈ ఘజీపూర్ గ్రామం వచ్చేంతవరకు! ఇంతకుముందు అయోమయంగా వున్న విషయాలన్నీ యిప్పుడు మంచు విడినట్లు అర్థంఅవుతున్నాయి. రమేష్‌కు యిన్నాళ్ళు తాను అతని భార్యకాదని తెలుసును. ఆమెను యెలా వదిలించుకుందామా అని ఎన్నో ఉపాయాలు ఆలోచించాడు. తానుమాత్రం అతనే తన భర్త అనుకుని, అతనితో కాపురానికి సర్వసన్నాహాలు పూర్తిచేస్తోంది.

ఆమె హృదయానికి పరాభవం. ముల్లులా గుచ్చుకుంది. అనేక జ్ఞాపకాలు పుస్తకంలో పుటల్లా ఆమె మనస్సులో తిరుగాడాయి. ఆమె నేలమీద చతికిలపడిపోయింది. ఆమె జీవిత

మంతా అవమానంతో నిండిపోయింది. దీని బారినుండి తప్పించు కోవడానికి మార్గం లేదు

ఆమె తలుపు తెరచుకుని యింటి వెనుకనున్న తోట లోనికి పరుగెత్తింది. నల్లని ఆకాశం విశాలంగా పరుచుకుని వుంది. మేఘాలు లేదు. పొగమంచు లేదు. నక్షత్రాలు అగు పడుతున్నాయి. ఆమె మానసికతకు యిప్పట్లో విమోచన మార్గం అగుపడ లేదు. పచ్చికమీద కూర్చుంది. ఒక్క బొట్టు కన్నీరయినా కార్చకుండా, ఒక్క అక్షరమయినా పలకకుండా అక్కడే శిలాప్రతిమలా కూర్చుని వుండి పోయింది.

గడచిపోతున్న కాలం ఆమె కొరకు లెక్కలోకి రావడం లేదు. చలికి ఎముకలు గజగజలాడుతున్నాయి. ఆమె శరీర మంతా వణుకుపుడుతోంది. చంద్రుడు ఆకుల చాటుకు వచ్చాడు. కమల మెల్లిగా లేచింది. తనగదిలోకి వెళ్ళింది. తలుపు వేసుకుంది.

తెల్లవారి ఆమె కళ్ళు తెరచి చూచేటప్పటికి శైల ఆమె పక్కనవుంది. కమల వెంటనే పైకి లేచింది. ఇంత ఆలస్యంగా నిద్ర లేస్తున్నందుకు సిగ్గుపడింది.

"అప్పుడే లేవక్కర్లేదు లే. యింకా కొద్దిసేపు నిద్రపో నీకు వొంట్లో బాగున్నట్లు లేదు. నీ కళ్ళకింద నల్లటిగీతలు అగుపిస్తున్నాయి. అసలు, విషయం యేమిటో నాకు చెప్పు—" అంటూ శైలజ ఆమె సరసనే కూర్చుని ఆమె మెడచుట్టూ చేతులు వేసింది.

కమల హృదయంలోని దుఃఖమంతా ఒక్కసారి వెల్లు

వగా యివతలకు వచ్చింది. ఆమె అశ్రువులను ఆపుకోలేక పోయింది. శైలభుజంమీద తలదాచుకుంది. స్వేచ్ఛగా హాయిగా కొద్దిసేపు విలపించింది. శైల ఆమెను గట్టిగా కౌగలించుకుంది. ఓదార్చటానికి మాటలద్వారా వృథాప్రయత్నం చేయకుండా.

చివరకు కమల శైలకౌగలిలోంచి తప్పించుకుంది. కళ్ళుతుడుచుకుంది. ఇల్లు ఎగిరిపోయేట్లుగా నవ్వసాగింది.

"చాలు. చాలు. యికచాల్లే. నువ్వసలే తమాషా పిల్లవు. ఈ సంగతంతా యేమిటో నాకు తెలియదనుకుంటున్నావు కాబోలు. నాకు అంతా తెలుసు. నేనేం ముక్కుపచ్చలారని పసిదాన్ని కాదు అంతా చెప్పేయమంటావా? రమేష్‌బాబు అలహాబాదు వెళ్ళినదగ్గర్నుంచి నీకో ఉత్తరం ముక్కయినా వ్రాయలేదు. అందుకని నీకు భయంగా వుంది. అయితే యీ విషయం నీఅంతటనువ్వు చెప్పడానికి అహం అడ్డువస్తుంది. కాని ఆయనకు అక్కడ బోలెడంతపని వుంటుంది కదా! ఒకటి రెండురోజుల్లో తిరిగి వచ్చేస్తాడులే. ఉత్తరంరాయడానికి తీరుబడి, అవకాశం కుదరలేదేమో! నువ్వంత బెంగపెట్టుకోకూడదు. పిచ్చిపిల్లా! నీకిలా సలహాయిస్తున్నానన్న మాటేగాని నాకుమటుకు నేనే యిటువంటి పరిస్థితిలోవుంటే నీకంటే ఎక్కువగా బెంబేలెత్తిపోయేదాన్ని. ఆడవాళ్ళు యేమీ లేనివాటినిగురించి యేడుస్తారు. ఒక్కయేడుపు యేడిచి కళ్ళు తుడుచుకొని నవ్వుతూ కూర్చుంటే అంతా మరచి పోతారు!"

ఆమె కమలను తనకు దగ్గరగాతీసుకుని యింకా యిలా

అంది. "ఇప్పుడు, రమేష్‌బాబును ఎంతమాత్రం క్షమించరాను అనిపిస్తోంది కదూ! అవునా? నాకు నిజం చెప్పు—"

"అవును. నిజమే" అంది కమల.

శైల ఆమె చెంపమీద మృదువుగా తట్టింది. "నేనలాగే అనుకున్నాను. అంతేకూడా! సరేలే, చూదాం. మరీ అంత బాధపడకు" అంది.

ఆరోజే శైల అలహాబాదులో ఉన్న తండ్రికి ఒక ఉత్తరం వ్రాసింది. అందులో ఇలా వ్రాసింది: "కమల చాల బాధపడుతోంది. రమేష్‌బాబునుంచి ఇంతవరకు ఉత్తరమేనా లేదు. ఎక్కడో కొత్తచోటుకు తీసుకువచ్చి విడిచి, ఇల్లా తన ఇష్టంవచ్చినట్లు పలాయనం చిత్తగిస్తే చిన్నపిల్లకదా, ఎంత బాధపడుతుంది! ఇంకా అతని పనులన్నీ అక్కడ పూర్తి కాలేదా? పనులు చూచుకునేవాళ్ళు ఎందరో వున్నారు, వాళ్ళంతా ఉత్తరంముక్క వ్రాయడానికి తీరిక లేకుండా వుండరు."

—ఈ ఉత్తరం అందగానే చక్రవర్తి బాబాయి రమేష్‌కోసం వెదికి పట్టుకుని, తనకూతురు రాసిన మాటలు చదివి వినిపించి ఆ విషయంమీద చిన్న ఉపన్యాసంకూడా ఇచ్చాడు. ఇంతకూ నిజం ఏమిటంటే, కమల రమేష్ ఆలోచనల్లో చిన్న విషయంకాదు, అతను ఆమెను గురించే నిరంతరం ఆలోచిస్తున్నాడు. నిర్లక్ష్యంవల్లకాదు, అనిశ్చితంవల్లనే అతనిన్నాళ్ళు అలహాబాదులో వుండవలసి వచ్చింది. ఇంతలో పిడుగులా శైలజ ఉత్తరం వచ్చింది. కమల తనకోసం చాలా తపన పడుతోందన్నమాట. ఆమె తనంతట తానే వ్రాయ

లేక పోయింది. రమేష్ తన ఆలోచనలను కార్యరూపంలో పెట్టాలనుకున్నాడు. తన సుఖం ఒక్కటే కాకుండా, కమల తనపట్ల ప్రదర్శిస్తున్న ప్రేమనుకూడా లెక్కలోకి తీసుకోవా లనుకున్నాడు. విధి వాళ్ళ జీవితాలను కలపడమేకాదు, హృదయాలను గట్టిగా కుట్టివేసింది—ఆరోజే, ఇసుక తిన్నెల మీద.

అందుచేత అతను తీరుబడిగా కూర్చుని కమలకు యీ యీ క్రింది విధంగా వ్రాశాడు:

"ప్రియతమా!—ఈ విధమైన సంబోధనను కేవలం లాంఛన ప్రాయంగా వాడుతున్నాననుకో కమలా! ప్రపం చంలోకల్లా మిన్నగా ప్రేమించే వ్యక్తివి నీవు కాకపోతే నిన్ను ఇలా సంబోధించలేను. నీకేమయినా అనుమానంవుంటే ఎప్పుడైనా నీ భావాలను నేను గాయపరిచివుంటే, నిన్ని ప్పుడు 'ప్రియతమా' అని సంబోధిస్తున్నందువల్ల ఆ అను మానాలన్నీ అణగారిపోతాయి. గాయాలను శాశ్వతంగా మాన్పిస్తాయి.

"ఈ విషయాన్ని గురించి ప్రత్యేకించి చెప్పాల్సిందే ముంది? గతంలోని నా ప్రవర్తన చాలా భాగం నీకు బాధ కలిగించి వుంచవచ్చు. నీ హృదయంలో నీవు నన్ను ఇందుకు నిందిస్తే, తప్పు వొప్పుకోవడం తప్ప నాకు వేరే యేమీ మార్గంలేదు. నీవే నా ప్రేమ నిధానానివనీ, నిన్ను తప్ప యీ ప్రపంచంలో మరెవ్వరినీ ఇంత అనురాగంతో మమత్వంతో చూడననీ మరోసారి నిర్దేశించి చెబుతున్నాను. నా ప్రవర్త నకు ఇది పూర్తి సంజాయిషీ కాకపోవచ్చు. కాని ఇంతకంటే

నేను చేయగలదేం లేదు! కనుక, కమలా! నిన్ను ప్రియతమా అని సంబోధించి మన అనుమానాలగూడును విచ్ఛిన్నం చేస్తున్నాను. నీ వొకసారి యీ విషయాలు విశ్వసిస్తే, అనుమానాలు ప్రశ్నలు అన్నీ ఒకదరిని పడవేయవచ్చును.

"ఆపైన నిన్ను, నీ ప్రేమను నేను జయించానా లేదా అని అడగవచ్చు. కాని ఈ ప్రశ్న వేసే ధైర్యం నాకు లేదు. ప్రేమ ఈ ప్రశ్న వేయమంటూంది, కాని ఒకరోజు దీనికి జవాబు వస్తుందని నాకు నమ్మకమే. మాటలతో పని లేదు. హృదయాలే పరస్పరం మాటాడుకుంటాయి, నీ పట్ల నా ప్రేమే నాకీ విశ్వాసాన్ని కలిగిస్తోంది. నేనేమీ అతిశయోక్తులు చెప్పడంలేదు, కాని ఉన్నవిషయం ఇది!

"ఈ ఉత్తరం ఎంతో కష్టపడి వ్రాసినట్లు అగుపిస్తుంది. అందుకని దీన్ని చింపివేద్దామా అనుకుంటున్నాను. అయితే యింక సూక్ష్మంగా సులభంగా నా భావాలను ప్రదర్శించే ఉత్తరం వ్రాయడం నాకు చేతకాదు మళ్ళీ. ఏమయినా, ఉత్తరాలనేవి యిద్దరు మనుష్యులు పరిస్పరం పంపుకునే హావభావాలు! మొదటి ఉత్తరాల్లో ఒకవ్యక్తి తన హృదయాన్నిమటుకే పలికించగలడు. కాని, మన హృదయాలు చేరువకు వచ్చిన తరువాత, నీకు నిజమైన ఉత్తరాలంటూ వ్రాయగలుగుతాను. గదిలో రెండువైపులా తలుపులు తెరచుకుని వుంటేనే గాలి జోరుగా హాయిగా ప్రయాణం చేయగలదు.

"ప్రియతమా! కమలా! నీ హృదయకవాటం ఎప్పుడు చూడగలను?

"ఈ వ్యవహారమంతా మెల్లిగా కార్యరూపం తాలుస్తుంది. తొందరపడితే మంచిదిగాదు. నీకీ ఉత్తరం వచ్చిన మరుసటిరోజు ఉదయానికి నేను ఘుజిపూర్ వస్తున్నాను. నేను వచ్చేసరికి మన కొత్తయింట్లో నాకు దర్శనమిస్తావని ఆశిస్తున్నాను. మనం చాలకాలంగా యిల్లు వాకిలిలేకుండా గడిపాం. ఇప్పుడు ఇకముందు, నేను నీ కా హామీయిస్తున్నాను. ఇప్పుడు మన స్వంతయింటిలో హృదయరాణిని వీక్షిస్తాను. ఇది మన రెండవ పవిత్ర వీక్షణం అవుతుంది.

"మొదటిచూపు, ఆ యిసుకతిన్నెలమీద, చంద్రుని వెలుగులో – నీకింకా గుర్తువుందా లేదా? నెత్తిమీద ఆకాశం తప్ప యింకేం లేదు ఆ కలయికకు సాక్ష్యంగా పెద్ద వాళ్ళు, చుట్టుపక్కలు, బంధువులు లేరు.

అదంతా నాకు కలలా అసత్యంగా అగుపిస్తుంది. అందు చేతనే నేను మరో దివ్యవీక్షణంకోసం ఆకాంక్షిస్తున్నాను. మనయింటిలో నీ దివ్య సుందరవదనారవిందం నా హృదయంలో ఎప్పటికీ ముద్రపడి వుంటుంది. ఈచిత్రాన్ని నేను శాశ్వతంగా నిలుపుకుంటాను. ప్రియతమా! నేను నీహృదయ ద్వారంవద్ద నిలబడిన ఒక అభ్యర్థిని. నన్ను వొట్టిచేతులతో పంపివేయకు. ఎప్పుడూ నిన్నే ధ్యానిస్తూవుండే—

—రమేష్."

# 37

"మీా బంగాళాకు వెళ్ళడం లేదా?" అంది శైల మర్నాడు ఉదయం కమలతో.

"ఊహు. అక్కడింకేం పనిమిగిలిలేదు"

"గదులు తయారయినాయా?"

"ఆ! పూర్తిచేశాను"

శైల మళ్ళీ వచ్చింది. "నేను నీకో బహుమానంఇస్తే నువ్వు నాకేం యిస్తావు" అంది.

"నాదగ్గర నీకు యివ్వటానికి యేమీలేదు, అక్కా!" అంది కమల.

"యేమీ లేదా?"

"యేమీ లేదు"

శైల ఆమె చెంపలు నొక్కింది. "అదన్న మాట విషయం! నీ సర్వస్వం ఒకానొకమనిషికి ధారపోశావు. దీన్ని యేమంటావు!" అంటూ ఆమె చీర చెరగునుంచి ఓ కవరు బయటకు దీసింది.

కవరుమీద రమేష్ చేతివ్రాత చూచేసరికి కమల తెల్లబోయింది. ఓరగా పక్కకుతిరిగింది.

"నీ అహంభావాన్ని చాలావరకు ప్రదర్శించావు. ఇప్పుడిక చాలించు. ఈ ఉత్తరం నాదగ్గర్నించీ దొంగిలించాలని ప్రయత్నిస్తున్నావు కాబోలు. నీవు దానికోసం మర్యాదగా అడిగేంతవరకూ నీకు యివ్వను. ఎంతసేపు బిగబట్టుకు వుంటావో చూస్తాను? అంది శైలజ.

సరిగ్గా అప్పుడే ఉమి అత్తా, అత్తాఅంటూగదిలోకి పరుగెత్తుకువచ్చింది. కమల ఆపిల్లనుఎత్తుకుని ముద్దాడింది. ఉమిని తనగదిలోకితీసుకువెళ్ళి ఆడించింది. శైలకూడా ఆమె వెనుకనే వస్తూ "యీసారికూడా నేనే ఓడిపోయాను నీవే గెలిచావు.

ఇదిగో వుత్తరం. ముందెప్పుడూ యిలా చేయనులే” అంది.

కవరు అందించి. ఉమిని ఎత్తుకుని శైల గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది.

కమల కవరు నాలుగువైపులా తిప్పిచూచి, చించి ఉత్తరం బయటకు తీసింది. చదవడం మొదలెట్టింది. మొదటి పంక్తులు చదివేసరికే ఆమెకు విపరీతంగా కోపంవచ్చి ఉత్తరం పక్కన పడేసింది. ఎలాగో యీానిర్వేదాన్ని జయించి, ఉత్తరం మళ్ళీ తీసుకుని, ఆసాంతం చదివింది.

ఈమెకు యిదంతా అర్థమయిందా లేదా అన్న విషయం నిశ్చయంగా చెప్పడం కష్టం. కాని చేతిలో యేదో వెలితి పదార్థం వున్నట్లు బాధపడి, దాన్ని మళ్ళీకిందపడవేసింది. తన భర్తకాని వ్యక్తితో తాను కాపురంచేయాలని యీా ప్రతిపాదన! అన్ని విషయాలు ఎరిగివుండి, రమేష్ తనపై యీా నింద వేస్తున్నాడు. ఘజీపూరు వచ్చింతర్వాత అతనిపట్లతాను చనువు యేర్పరచు కుందంటే, ప్రేమ పెంపొందించుకున్నదంటే—అదంతా ఆతను రమేష్ అవడం వల్లనే అనుకున్నాడా? లేకతనభర్త అనుకుంటోంది గనుక అలా చేస్తోందనుకున్నాడా? రమేష్ త్వరగా ఒక నిర్ణయానికి వచ్చేవాడు. కాని యీాప్రేమలేఖ అందుకున్న వ్యక్తికుటుకు యీా నిర్ణయాలను హర్షించేస్థితిలో లేదు.

తన ప్రవర్తనకు అతనలా అర్థంచెప్పుకుంటే ఆమె యింకేంచెప్పగలదు? అవమానం, నిస్పృహ ఆమెకు జీవితంలో వ్రాసిపెట్టివున్నాయి. ఈ ప్రపంచంలోకి వచ్చింది లగాయతు, ఎవరికీ యే అపకారం చేయకపోయినప్పటికీ ఈ

విధి యిలా నడవక తప్పదు. ఇల్లు అంటే ఇప్పుడు తనను మింగివేసే భూతంలా అనిపిస్తోంది. తప్పించుకోడానికి దారి కోసం ప్రయత్నిస్తోంది. రెండుగోజులక్రితం రమేష్ యిటు వంటి రాక్షసుడిలా ఆమెకు అనిపించలేదు.

ఉమేష్ దగ్గడంతో ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగింది. అతను గుమ్మందగ్గర నిలబడిఉన్నాడు. కమల దగ్గర్నించి యేమీ కబురు రాకపోవడంతో అతనే "అమ్మ గారూ!" అని పిలిచాడు.

కమల గుమ్మందగ్గరికి వెళ్ళింది. ఉమేష్ నెత్తిగోక్కుం టూ 'అమ్మగారూ! పెద్దబాబుగారికూతురు వివాహానికి నాటకం కంపెనివాళ్ళను పిలిపించారు'' అన్నాడు.

''సరే వెళ్ళి నాటకం చూడు'' అంది కమల.

''ఉదయం మీకు ఏ పూలు తెమ్మంటారు ?''

''అక్కర్లేదులే.''

అతను వెళ్ళబోతూవుండగా కమల మళ్ళీ పిలిచింది. ''ఉండు, ఉమేష్. నాటకానికి వెడుతున్నావుగనుక. యీ అయిదురూపాయల కాగితం తీసుకో'' అంది.

ఉమేష్ అదిరిపోయాడు. ''నాటకానికి టిక్కెట్లంటూ యేమీలేదు. మీకేమైనా కొనుక్కురమ్మంటారా, అమ్మగారూ !'' అనడిగాడు.

''నాకేం అక్కర్లేదు. నీదగ్గరే ఉంచు – ఎందుకైనా పనికివస్తుంది'' అంది.

ఉమేష్ అలా అయోమయంలోపడి వెళ్ళబోతూవుం డగా ఆమె తిరిగి పిలిచింది. ''ఈ గుడ్డలతో నువ్వు నాట

కానికి వెడితే ఎవరన్నా చూచి యేమనుకుంటారు ?"
అనడిగింది.

ఎవరన్నా తననుగురించిగాని తన దుస్తులనుగురించి గాని యేమన్నా అనుకుంటారంటే ఉమేష్‌కు ఆశ్చర్యం వేసింది. అతని కీ విషయమే లెక్కలో లేదు. "ఇదిగో ఈ దుస్తులు తీసుకో" అంటూ కమల అతనికి కొన్ని ఉడుపులు ఇచ్చింది.

అతను వెళ్ళిపోయింతర్వాత కమల కన్నీటిబిందువు తుడుచుకుని కిటికీదగ్గర నిలబడింది.

"నీ ఉత్తరం చూపవూ. కమలా ?" అంటూ శైల గదిలోకి వచ్చింది. ఆమెకు, కమలకు కాని రహస్యాలు ఏమీ లేవు, అందుచేతనే ఆమె యిలా అడగగలిగింది.

"అదుగో అక్కడే వుంది. తీసుకో అక్కా" అంది కమల నేలమీద ఉత్తరాన్ని చూపుతూ.

శైల "ఇంకా యీామె మనలోకి రాలేదు" అనుకుంటూ ఉత్తరాన్ని తీసుకుంది. చదివింది. చాలా అప్యాయంగా వుంది, సందేహంలేదు. భార్యకు భర్త ఎంత విచిత్రంగా వ్రాశాడు! చాలా అసాధారణమైన భాష, చాతుర్యం.

"నీ భర్త నవలలు వ్రాస్తారా యేమిటి కమల ?"
అనడిగింది.

భర్త అన్నమాటకు అదిరిపడుతూ కమల "ఏమో నాకు తెలీదు" అంది.

"ఇవాళ నీ బంగళాకు వెడుతున్నావా ?"

కమల జవాబుగా తలఊపింది.

"ఈ రోజు సీతో వచ్చేదాన్నే. కాని నర్సింగబాబు గారి యింట్లో పెండ్లి వేడుకలకు వెళ్ళాలి. అందుకని అమ్మ సీతో వస్తుందిలే!"

"అమ్మగారి కెందుకు శ్రమ! సేవకులు ఉన్నారుగా!" అంది కమల.

ఉమి గదిలో గందరగోళం చేస్తోంది.

ఆమెను కమల తన గదిలోకి ఎత్తుకు వెళ్ళింది. తన కష్టాలను మరచిపోయేంతవరకూ ఆ పసిపాపతో ఆడుకుంది. తనకు వాగ్దానంచేసిన బహుమతి యిమ్మని ఉమి అడిగేసరికి కమల తన పెట్టెలోంచి బంగారుగాజులు బయటకు తీసింది. ఉమి వాటిని చూచి ఉత్సాహంతో చేతులుముందుకుజాపింది. కమల గాజులను ఉమికి తొడిగింది. ఉమి ఉగ్రాతలూగుతూ తల్లికి చూపించడానికి వెళ్ళింది.

శైల వెంటనే బంగారుగాజులను ఊడదీసి కమలకు వప్పజెప్పటానికి వచ్చింది. "ఏమిటిది కమలా? ఇవి పిల్లదానికి పెట్టావెందుకు?" అంది.

"నేను ఉమికి బహూకరించాను" అంది.

"నీకేమన్నా వెర్రెత్తిందా యేమిటి?"

"అక్కా! నా కివి మళ్ళీయివ్వటానికి ప్రయత్నించకు. వీలయితే వాటిని చెడగొట్టి, అమ్మాయికి చిన్న నెక్లెస్ చేయించు" అంది కమల.

"అబ్బ, నిన్ను జయించేవాళ్ళులేరు" అంది శైల ఆమె మెడచుట్టూ చేతులువేస్తూ.

"ఇవాళ నీ దగ్గర సెలవుతీసుకోవాలి అక్కా! నేనిక్కడ క్షేమంగా, సుఖంగా, హాయిగా, సంతోషంగా వున్నాను. ఇంత హాయి యింకెక్కడా అనుభవించలేదు." ఆమె కళ్ళవెంట అశ్రువులు రాలుతున్నాయి.

శైలజ కన్నీరు ఆపుకోవడమే కష్టంగా బాధపడింది. "అలా మాట్లాడకు కమలా, ఎప్పటికీ రాకుండా ఏ ఊరో వెళ్ళిపోవడం లేదుగా. నీకిక్కడ నిజంగా సుఖంగా వుందంటే నాకు నమ్మకం లేదు. నీ స్వంత యింట్లోకి వెళ్ళాక నీకు నిజమైన సంతోషం ప్రారంభమవుతుంది. అప్పుడప్పుడూ నిన్ను చూచి వెడుతూవుంటాం లే. మేం వెళ్ళిపోవడంతోటే, అమ్మయ్య - ఎలాగయితేనేం లేచిపోయాను అనుకుంటావు అప్పుడు."

కమల తన యింటికి వెడుతూ అందరిదగ్గరా సెలవు తీసుకున్నమీదట శైల యిలా అంది: "రేపు మధ్యాహ్నం వచ్చి నిన్ను చూచివెడతాను." కమల యీ వాక్యానికి తన ఆమోదప్రమోదాలేమీ తెలుపలేదు.

బంగళాదగ్గర ఉమేష్ ఎదురుచూస్తూ నిలుచున్నాడు.

"ఇక్కడే వున్నావా? నాటకానికి వెళ్లావనుకున్నాను" అంది.

"వెడదామనుకున్నాను. కాని మీరు వస్తున్నారని-"

"నన్ను గురించి మానుకోకు. వెళ్ళినాటకం చూచిరా, విషణ్ ఇక్కడే వున్నాడుగా. తొందరగా వెళ్ళు లేకపోతే ఆలస్యం అవుతుంది."

"అప్పుడే మొదలెట్టరు లెండి"

"ఫరవాలేదు. పెళ్ళిఇంట్లో ఎందరో జనం వుంటారు.

ఎన్నో వేడుకలు జరుగుతాయి. త్వరగా వెళ్ళు!"

ఉమేష్‌ను ఎక్కువగా ప్రోత్సహించవలసి రాలేదు. అతను వెళ్ళబోతూవుండగా ఆమె అతన్ని పిలిచి ఇలా అంది: "ఒకవేళ బాబాయి నన్నే...నువ్వు—" ఆమె వాక్యం పూర్తి చేయలేక పోయింది. ఉమేష్ నోరు తెరుచుకుని ఆమె మొహంకే చూస్తూ కూర్చున్నాడు. ఒక క్షణం ఆగి ఆమె ఇలా అంది: "గుర్తుంచుకో, బాబాయి నమ్మదగిన స్నేహితుడు. నీకు ఎప్పుడు యే అవసరంవచ్చినా, నన్ను గుర్తుచేసి ఆయన్ను అడుగు. నీకేంకావలసింది యిస్తాడు. నన్ను, నా ప్రేమను గుర్తుచేయడం మటుకు మర్చిపోకు!

"అలాగే" అంటూ ఉమేష్ పరుగుతీశాడు.

అతనికి యీ మాటల్లోని అర్థం ఏమీ తెలియలేదు. వీటిల్లోనిభాష అర్థంకాలేదు.

"ఎక్కడికి వెడుతున్నారు, అమ్మగారూ!" అన్నాడు విషణ్, మధ్యాహ్నంపూట ఆమె ఎటో బయలుదేర బోతూండడం చూచి.

"గంగానదిలో స్నానం చేయడానికి వెడుతున్నాను."

"నన్నూ తోడురమ్మంటారా?"

"ఉహు, ఇల్లు కనిపెట్టుకుని వుండు." అంటూ అతనికో రూపాయి ఇచ్చింది. ఈ కానుకకు అవసరం, అర్థం లేవు. తరువాత ఆమె నదివైపు ప్రయాణం చేసింది.

# 38

ఒకరోజు మధ్యాహ్నం ఆనందబాబు హేమాలిని కోసరం మేడమీదికి వెళ్ళాడు, ఆమెతో కలిసి టీ తీసుకోవడంకోసం మేడమీద ముందుగదిలోను, ఆమె గదిలోను వెదికాడు. ఆమె రెండుగదుల్లోనూ లేదు. నౌకర్ను అడిగితే ఆమె యిల్లువదిలి ఎక్కడికీ వెళ్ళలేదన్నారు.

అలాగే డాబామీదికి వెళ్ళాడు. విశాలాకాశంకింద, కనుచూపుమేర వరకూ యింటి కప్పులు కనిపిస్తున్నాయి. సాయంకాలపు గాలి ఇటూ అటూ హోరుగా తిరుగుతోంది. హేమాలిని మెట్ల నీడదగ్గరే ఆలోచిస్తూ కూర్చునివుంది.

ఆనందబాబు ఆమెపక్కకు వెళ్ళి నిలుచున్నాడు. కాని ఆమె ఆయన్ను గమనించినట్లులేదు. చివరకు ఆనందబాబు ఆమె భుజంమీద చేయివేశాడు. ఆమె ఉలిక్కిపడింది. కంగారుపడింది. ఆమె లేవకముందే. ఆనందబాబు ఆమె పక్కన కూర్చున్నాడు. ఒకటి రెండు నిమిషాలు నిశ్శబ్దంగా వుండి, తరువాత గాఢంగా నిట్టూర్చి "హేమా! ఇప్పుడు మీ అమ్మే బ్రతికివుంటే ఎంత బాగుండేది! నేను నీ కెందుకూ ఉపయోగించకుండాపోతున్నాను కద!" అన్నాడు.

అతని మాటలు ఆమెను అగాథంలోనుంచి బయటకు తీసుకువచ్చినట్లున్నాయి. తండ్రికళ్ళలోకి లోతుగాచూచింది. ఆ కళ్ళలో ఎంతో అనురాగం, సానుభూతి, బాధ అగుపడుతున్నాయి. గడచిన కొన్ని రోజులుగా ఆయనలో విషాదకరమైన మార్పులు కొన్నివచ్చాయి. హేమాలినిపై తుఫాను

విరుచుకుపడినప్పుడు ఆ భారాన్ని వహించినవాడు తండ్రి. తన కూతురు దుర్భరమైన సంక్షోభంలో చిక్కుకునివుంటే దానినుంచి బయటకు లాగటానికి ఆయ నెప్పుడూ ప్రయత్నిస్తూనేవున్నాడు. కాని తాను ఎంత ఓదార్చినా, ఎంత శ్రమపడినా అదంతా వృధాఅవడంతో ఆయన ఆలోచనలు భార్యవైపు పోయినాయి. అప్పుడు అలా హృదయం అట్టడుగు నుంచి యీ పొలికేక వేశాడు. దీనినంతటినీ హేమాలిని ఒక్కసారిగా గ్రహించింది. ఇంతవరకూ కలలా అగుపిస్తూ వున్న ప్రపంచం, ఒక్కసారిగా నిజరూపం దాల్చినట్లు అయింది. ఒక్కక్షణంలో ఆమెను అవమానం ముంచెత్తినట్లయింది. అతి ప్రయత్నంమీద తన జ్ఞాపకాల మడతలను పక్కకు వత్తిగించి, "మీకు ఎలావుంది నాన్నగారూ!" అని అడిగింది.

ఆమె ఆయన ఆరోగ్యాన్నిగురించి వాకబుచేస్తోంది! గడిచిన కొన్ని రోజులుగా ఆరోగ్యం అనేది చర్చనీయాంశం కావడం ఆనందబాబుకు గుర్తులేదు.

"నాకేం? నాలో ఏమీ అనారోగ్యంలేదు. నిన్ను చూచి మటుకే బెంగపడుతున్నాను. నాలాంటి వృద్ధుడు ఎన్ని ఇబ్బందులకయినా ఎదురొడ్డి నిలువగలడు. కాని నీలాంటి చిన్నవాళ్ళే బేలలయిపోతారు." అంటూ ఆయన ఆమె బుజం మీద ఆప్యాయంగా తట్టాడు.

"నాన్నగారూ! అమ్మ చనిపోయేటప్పటికి నాకు ఎన్నేళ్ళు?"

"అప్పుడు నీకు మూడేళ్ళు. అప్పుడే మాట్లాడడం

ప్రారంభించావు. నువ్వు-అమ్మ ఎక్కడికి వెళ్ళింది అడగటం నేను వాళ్ళ నాన్న దగ్గరకు వెళ్ళింది అని జవాబు చెప్పడం ఇంకా నాకు గుర్తే నీ తల్లి తండ్రిగారు నీవు పుట్టకముందే చనిపోయారు. అయిన్నా నీవు ఎరగనే ఎరగవు. అందుచేత నామాటలు నీకేం అర్థంకాక, ఊరికేచూస్తూ అల్లే వుండే దానివి. నన్ను చేయిపట్టుకుని మీ అమ్మగదిలోకి లాక్కు వెళ్తూండేదానివి. గది ఖాళీగావున్నా, ఆమె ఎక్కడికి వెళ్ళిందో తెలుసుకోవడానికి అక్కడేమయినా ఆధారాలు దొరుకు తాయేమోనని నీ ఊహ. నీ తండ్రి ఎన్నోపనులు చేయగల డని నీ ఉద్దేశ్యం. కాని జనన మరణ సమస్యలు వచ్చినప్పుడు, ఇంత పెద్ద తండ్రికూడా పసిపాపకంటే కనాకష్టం అని నీ వెర గవు. ఇప్పుడు తెలుస్తోందిగా నేనెంత అసహాయుడినో, దేవుడు నాకు నిన్ను ఆప్యాయంగా చూచుకునే మమత్వాన్నే ఇచ్చారు గాని, నీకు సహాయం చేయగల సామర్థ్యాన్ని ఇవ్వలేదు." అంటూ ఆయన కూతురుతల నిమిరాడు.

హేమాలిని వణుకుతున్న తండ్రిచేతిని తన చేతుల్లోకి తీసుకుంది. ',నాకు ఎంత ప్రయత్నించినా అమ్మగుర్తు రావడం లేదు...ఆమె మధ్యాహ్నంపూట తన గదిలో పడుకుని ఏదో పుస్తకం చదువుతూవుండేది. నాకది ఇష్టముండేదికాదు. ఆ పుస్తకం అవతల పారవేయటానికి ప్రయత్నించేదాన్ని." అంటూ వాళ్ళు గతాన్ని గురించి సంభాషించ సాగారు.

హేమ తండ్రిని ప్రశ్నలతో ముంచెత్తింది. తల్లి ఎలా వుంటుంది ఆమె అలవాట్లు ఏమిటి, అభిరుచులేమిటి, వారి జీవితం ఎలాసాగేది. ఆరోజులు ఎలాగడిచేవి—యిటువంటి

ప్రశ్నలన్నీ వేసింది. చేతనయినంతవరకూ తండ్రి సమాధానం చెప్పాడు. వాళ్ళలా మాట్లాడుకుంటూ వుండగా సూర్యాస్తమయం అయింది, ఆకాశం రాగిరంగు తాల్చింది

ఇంతలో జోగేంద్ర అక్కడికివచ్చాడు. అతను రావడంతో తండ్రి కూతుళ్ళ సంభాషణ ఆగిపోయింది. ఇద్దరూ లేచి నిలబడ్డారు.

జోగేంద్ర ఇద్దరి ముఖాల్లోకి ఆతురతగా చూస్తూ, "హేమ యీ మధ్య డాబామీదనే యిష్టాగోష్ఠి జరుపుతున్నట్లుందే!" అన్నాడు.

జోగేంద్రకు యీ విషయ పరిణామాలకు చాలా చిరాగ్గా వుంది. పగలు, రాత్రి యింటిని నిస్తబ్ధత ఆవరించి వుంటోంది. ఇంటిదగ్గర గడపడం అతి దుర్భరంగా వుంది. అయినా, యితర సాంగత్యంఅంటే భయంగావుంది. ఏమంటే స్నేహితులను, తెలిసినవాళ్ళను ఎవరిని కలుసుకున్నా, వాళ్ళు ముందుగా హేమాలిని వివాహాన్ని గురించే లక్ష ప్రశ్నలు వేస్తున్నారు

ఇటువంటి సందర్భాలలో హేమాలిని విషయాలను చాలదూరం లాక్కెళుతోంది. "దీనికంతా మూలం ఆడపిల్లలు యింగ్లీషు నవలలు చదవడమే. హేమ ఉద్దేశ్యం ప్రకారం రమేష్ తనను వదలి వెళ్ళాడు గనుక, తాను భగ్న హృదయగా రూపొందాలని! అందుచేతనే ఆమె యిలా తయారవుతోంది. నవల చదివే యువతికి ప్రేమలో అగ్ని పరీక్ష రావడం ప్రత్యేకమైన సన్నివేశమే" అనుకున్నాడు జోగేంద్ర.

"హేమతో కాస్సేపు కులాసాగా గడపవచ్చునని పైకి వచ్చాడు" అన్నాడు ఆనందబాబు. ఆయనకు హేమను అన్న ఎత్తిపొడుపు మాటలనుంచి, వేళాకోళంనుంచి పరీక్షించాలని ఆకాంక్ష.

"టీ బల్లదగ్గరే కూర్చుని మాట్లాడుకోవచ్చునుగా, హేమను యిలా తెలివితక్కువగా తయారుచేస్తున్నది మీరే నాన్నగారు. ఇలా అయితే నేను యింట్లోంచి వెళ్లిపోతాను." అన్నాడు జోగేంద్ర.

హేమాలిని అప్పుడే ప్రపంచంలోకి వచ్చినట్లు "మీరు టీ తీసుకోలేదా, నాన్నగారూ ?" అంది.

"టీ అంటే కవిత్వంలాంటిదేంకాదు. అది దానంతటది అదే, సూర్యాస్తమయం ఆకాశంమీద రంగు గుమ్మరించినట్లు, ఉద్భవించదు. మీరు డాబామీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటుంటే, దానంతట అదే టీ కప్పులు నిండిపోవు" అన్నాడు జోగేంద్ర.

హేమాలిని గాభరాను తొలగించడానికి ఆనందబాబు తటాలున యిలా అన్నాడు: "నేను యివాళనుంచి టీ తాగడం మానేయాలనుకున్నాను."

"ఎందుకని నాన్నా ? క్రమంగా సన్యాసం కూడా పుచ్చుకుందామనుకున్నారా? అయితే నాగతేమిటి ? నేను గాలిలో బతకలేను" అన్నాడు జోగేంద్ర.

"సన్యాసం పుచ్చుకోవడంకాదు. రాత్రిళ్ళు నాకు నిద్ర పట్టడంలేదు. అందుకని టీ మానేద్దాం అనుకున్నాను."

నిజం చెప్పాలంటే, ఆనందబాబు యిదివరకు హేమా

లినితో మాట్లాడుతూవున్నప్పుడు టీ తాగాలన్న విషయం మదిలో మెదులుతూవుండేది. అయితే ఈ రోజు అలా జరగలేదు. ఏమంటే యివాళనే హేమాలిని, యీ డాబా మీద హృదయస్ఫూర్తిగా మామూలు స్థాయిలో మాట్లాడుతూవుంది. అందుచేత అక్కడినుంచి కదలబుద్ధికాలేదు.

అయితే హేమాలిని తండ్రి మాటలు నిజమని విశ్వసించలేదు. "రండి, నాన్నగారూ! మీరు టీ తీసుకోవలసిందే!" అంది.

ఆనందబాబు ఆమె వెనుకనే నడిచాడు.

ఆయన గదిలోకి ప్రవేశించేటప్పటికే, అక్షయబాబు అక్కడ కూర్చునివుండడం చూచి ఆశ్చర్యపోయాడు. ప్రస్తుతానికి హేమ పూర్వపుమనిషిగానే వుంది. కాని అక్షయ కనిపిస్తే కథ మళ్ళీ మొదటికి వస్తుంది అయితే హేమాలిని కూడా వెంటనే గదిలోకి అడుగుపెట్టేసింది గనుక యిప్పుడిక చేయగలిగిందేమీ లేదు. అక్షయ లేచినిలుచున్నాడు.

''జోగేంద్ర, నేనిక వెళ్ళిపోతాను'' అన్నాడు.

అందరూ నివ్వెరపోయేట్లు హేమాలిని యిలా జవాబు చెప్పింది: "ఏమిటి అక్షయబాబు ! అంత తొందరపడేంవుంది? ముందు ఒక కప్పు టీ తాగు" అంది.

అక్షయ తిరిగి కూర్చున్నాడు. "మీరు రాకముందు రెండుకప్పుల టీ తాగేశాను. నీవు కటాక్షిస్తే మరో కప్పు కూడా తాగుతాను''

హేమాలిని నవ్వింది. ''బలవంతం చేయడం యిదే మొదటిసారి.

"నిజం. మంచివస్తువు ఇస్తామన్నప్పుడు, నిరాకరించడం నాకెప్పుడూ చేతకాదు."

"అలాగే! నీవు స్వీకరిస్తానన్నప్పుడు మంచి వస్తువు కూడా అభ్యంతరపెట్టకులే. పురోహితుడు ఇంతకంటే మంచి ఆశీర్వాదం యివ్వగలడా?" అన్నాడు జోగేంద్ర.

ఇలాగే సంభాషణ జోరుగా సాగిపోయింది. ఆనంద బాబు టీ టేబులు యథాపూర్వంగా హుషారుగా తయారయింది. ఇన్నాళ్ళూ బిగ్గరగా నవ్వని, హేమాలిని యివాళ కప్పు ఎగిరి పోయేలా నవ్వుతోంది. ఆమె తండ్రితో ఇలా అంది: "అక్షయబాబు వళ్ళు మరిచిపోయాడు నాన్నగారూ! మీ మాత్రలు వేసుకోకపోయినా, అతను ఆరోగ్యంగానే వున్నాడు. వాటివల్ల యే మాత్రం ప్రయోజనంవున్నా, అతని కీపాటికి యే తలనొప్పో వచ్చేది."

ఆనందబాబు సుఖంగా నవ్వాడు. తనవాళ్ళు మళ్ళీ తన మాత్రలను గురించి వ్యాఖ్యానించడం ఆయనకు సంతోష దాయకంగావుంది. అంటే తన ఇంట్లో యిదివరకటి కులాసా వాతావరణం ఏర్పడుతోందన్నమాట.

"మీరేం చేస్తున్నారో నాకు తెలుసు. అతని విశ్వాసాన్ని హేళన చేస్తున్నారు." అన్నాడు.

అక్షయగూడా తను మాత్రలను తప్పకుండా వాడతానని హామీ ఇచ్చాడు.

ఈ సంభాషణ చాలావరకు సాగిపోయేదేగాని హేమాలిని తలదువ్వుకోవాలని చెప్పి వెళ్ళింది. అక్షయకూడా తనకేదో పనివున్నదని వెళ్ళిపోయాడు,

తండ్రిదగ్గర తను వక్కడే మిగిలాక, జోగేంద్ర "నాన్న గారూ! మనం ఇంకా ఆలస్యం చేయకూడదు. హేమ వివాహం చేసెయ్యాలి" అన్నాడు.

ఆనందబాబు అతనివంక తేరిపారచూశాడు. జోగేంద్ర యింకా యిలా అన్నాడు: "రమేష్‌కూ, హేమకూ వివాహాన్నిగురించి యింకా ఎన్నో గుసగుసలు వినబడుతున్నాయి. నే నొక్కడినే ఇంకా ఎన్నాళ్ళు అవస్థపడను? నిజం బయట పెట్టేద్దామా అంటే హేమనుచూచి ఆ పని చేయలేను. అందుచేత నేను నోరుమూసుకుని పోట్లాడాలి. ఆ రోజు చూచారుగా, అఖిల్‌ను తీసుకు వెళ్లాల్సివచ్చింది. అతను యిదంతా యంక్వైరీచేస్తున్నట్లు విన్నాను. హేమకు సాధ్యమైనంత త్వరగా వివాహం అయిందనిపిస్తే, ఈ లేనిపోని గొడవన్నీ తగ్గిపోతాయి. వాటంతటవే అడుగున పడిపోతాయి. నా బాదరబందీ తప్పుతుంది. అందుచేత యీ ముహూర్తాన్ని వాయిదా వేయవద్దని మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను."

"అయితే ఆమె ఎవరిని వివాహం చేసుకుంటుం దంటావు?" అన్నాడు ఆనందబాబు.

"ఒకడే ఒకడున్నాడు. ఇప్పుడు జరుగుతున్న గొడవంతా చూస్తే వేరే ఒక మనిషిని తీసుకురావడం యేమంత తేలికయిన పనికాదుకూడా. పాపం, అక్షయ మొదటినుంచీ కనిపెట్టుకువున్నాడు. చెప్పినమాట వింటాడు. మాత్ర వేసుకోమంటే, మాట్లాడకుండా గొంతులో వేసుకుంటాడు. అతన్ని వివాహం చేసుకోమని ఆజ్ఞాపించండి. తక్షణం అలా

చేస్తాడు."

"నీ కేమన్నా వెర్రెత్తిందా జోగేన్, హేమ అతన్ని వివాహం చేసుకుటుందనుకుంటున్నావా ?"

"మీరు జోక్యం కలిగించుకోకుండా వుంటే, దాని ఒప్పుదల నేను సంపాదిస్తాను."

"లేదు జోగేన్, అలా లాభంలేదు. నీ వల్ల ఆ పని కాదు. అనవసరంగా అమ్మాయికి కష్టం కల్గిస్తావు. అమ్మాయిని కొంతకాలం అలా వదిలెయ్యి. వెర్రిపిల్ల. అప్పుడే వివాహానికి తొందరేముంది ?"

"నేనేం బలవంతం చేయనులెండి. చాకచక్యంగా మెల్లిగా అడుగుతాను ఆమెతో పోట్లాడుతూతప్ప మాట్లాడ లేననుకుంటున్నారా యేమిటి ?"

జోగేంద్రది పాదాలకింద పచ్చికను పెరగనిచ్చే స్వభావం కాదు. వెంటనే హేమ గదిలోకి వెళ్ళి "చెల్లాయి, నీతో మాట్లాడాలి" అన్నాడు.

హేమ యేమిటో చెప్పమన్నట్లుగా చూచింది.

"నాన్నగారు చూచావా యెంత అనారోగ్యంగా వున్నారో" అన్నాడు జోగేంద్ర నాందిగా.

హేమాలిని యేమీ అనలేదు.

"నా మాటలు గుర్తుంచుకో. మనమేదో చేస్తేనే తప్ప, ఆయన విధిగా మంచాన పడిపోతాడు."

తండ్రి అనారోగ్యానికి పూర్తిబాధ్యత ఆమెదే అన్నట్లుగా వుంది అతని కంఠధ్వని.

"గడచిపోయిందేదో గడిచిపోయింది. గతాన్నిగురించి

ఆలోచించుకున్న కొద్దీ నీకు విచారమూ, మాకు అవమానమూను. నాన్నగారి ఆరోగ్యం కుదటపడి, ఆయన మనస్సుకు పరిపూర్ణ విశ్రాంతి చేకూర్చాలంటే నీవు తక్షణమే యీ గొడవనంతటినీ సర్దుబాటుచేయాలి." అని అతను జవాబు కోసం ఆమెవంకే చూస్తూ ఆగిపోయాడు.

"ఈ గొడవంతా తవ్వి నాన్నగారితో మాట్లాడి, ఆయనకు బాధకలిగించనులే" అంది హేమాలిని కంగారుగా.

"నీవలా చేయవని నాకు తెలుసనుకో. అయినా లోకంనోరు మూయించాలిగా!"

"అదెలా చేయడం ?" అనడిగింది హేమాలిని.

"ఈ గొడవంతా సర్దుబాటు చేయడానికి ఒకటే మార్గం వుంది."

జోగేంద్ర మనసులోని ఉద్దేశ్యం యేమిటో హేమాలినికి తెలుసు.. అందుచేతనే ఆమె త్వరగా యిలా జవాబు చెప్పింది: "గాలి మార్పుకోసం ఆయన్ను యేదన్నా ఊరు తీసుకెడితే మంచిదిగదూ! మూడునాలుగు నెలలు అక్కడ గడపవచ్చు. తిరిగి మనం వచ్చేసరికి యిదంతా సర్దుమణుగుతుంది" అంది.

"పూర్తి విరుగుడు యింతతో చాలదు. నీ మనస్సుకు విశ్రాంతి చిక్కిందని నాన్నగారిని నమ్మించాలి. అంతవరకూ ఆయన గాయం అలాగే వుంటుంది. ఆయన మళ్ళీ మామూలు మనిషి కారు."

హేమాలిని కళ్ళు అశ్రువులతో నిండినాయి. ఆమె కన్నీళ్ళు తుడుచుకుంది.

‘‘అయితే నన్నేం చేయమంటావు ?’’ అనడిగింది.

‘‘వినడానికి నీకు హాయిగా వుండదని తెలుసు. కాని అందరికీ హాయిగావుండేట్లు చేయాలంటే నీవు వెంటనే వివాహం చేసుకోవాలి.’’

హేమాలిని ఆశ్చర్యంలో మునిగిపోయింది. ఏమీ మాట్లాడలేకపోయింది. జోగేంద్ర ఇలా చెప్పాడు: ‘‘మీ ఆడపిల్లలు, పుట్టుమచ్చలలోనుంచి కొండలు తయారు చేయడానికి, పిచ్చిగా ప్రేమిస్తారు. యిదివరకు ఎందరికో ఇలా జరిగింది. వాళ్ళ పెళ్ళివిషయంలోనూ ఎంతో గొడవ జరిగింది. వాళ్ళందరూ ఇంకెవరినో పెళ్ళి చేసుకున్నారు. అంతతో గొడవలేకుండా నడిచిపోయింది. లేకపోతే నవలల్లో జరిగే సంగతులన్నీ యిళ్ళలో జరగడం మొదలెడితే సంసారాలు సర్వనాశం అవుతాయి. ఈ పరిస్థితిని నీవు సజావుగానే ఎదుర్కోవచ్చును. కాని యీ అవమానం, పరాభవం అంతా మావి. అందుచేత నీవుగూడా గతానికి స్వస్తిచెప్పి ఎవరినో ఒకరిని వివాహం చేసుకుని యీ గొడవంతా అంతం చేసేసి హాయిగా వుండు. మా ప్రాణాలకూడా కుదట పడతాయి.

జోగేంద్ర మాటలు ఆమె హృదయానికి ములుకుల్లా తగిలాయి.

“నేను మాత్రం యీ ప్రపంచాన్ని పరిత్యజిస్తాననీ, ఎన్నడూ వివాహం చేసుకోననీ చెప్పానా ?’ అంది.

“అలా అయితే మంచిదేగా ? వెంటనే వివాహం చేసుకో. అమ్మాయి, ఈ ప్రపంచంలో మనం అనుకున్నవన్నీ

అనుకున్నట్లుగా జరుగుతాయా, ఏదో మనం నర్దుకుపోవాలి గాని! మనకెంత ప్రాప్తో అంతే దక్కుతుంది అన్నాడు.

"నన్నెందుకిలా బాధపెడతావు! నీతో ప్రేమ విషయం ఎప్పుడైనా అన్నానా?"

"నీవేమీ అనలేదనుకో. కాని నేను మొదటనుంచి అన్నీ గమనిస్తూ వచ్చాగా. నీవు నీ శ్రేయోభిలాషు లెవరో తెలుసుకో లేకపోతున్నావు. నీకు పరమ మిత్రుడైన వ్యక్తిని గుర్తించలేక పోతున్నావు. నీ సుఖాన్ని కోరే వ్యక్తినే వివాహం చేసుకోవాలనుకుంటే హాయిగా నేను చెప్పిన వ్యక్తిని చేసుకో-లేదంటావా—!"

హేమాలిని కూర్చున్నచోటునుంచి లేచింది. "నాతో ఇలా మాట్లాడకు. నాన్నగారు ఎవరిని వివాహం చేసుకో మంటే వారినే చేసుకుంటాను. ఆయన మాట కాదంటే, అప్పుడీ మాటలన్నీ చెప్పు. ఇప్పుడెందుకూ? అంది.

జోగేంద్ర కంఠస్వరం మృదువుగా మారింది, వెంటనే "హేమా! అలా కోప్పడకమ్మా! నాకు కాస్త చిరాకు కలిగిందంటే, పెద్దగా నోటికొచ్చినట్లల్లా మాట్లాడేస్తాను, నీకు తెలుసుగా! మనమిద్దరం చిన్నప్పటినుంచి ఒకచోట పెరిగినవాళ్ళం నీది ఎంత సున్నిత హృదయమో, నాన్న గారంటే నీకెంత ఆప్యాయతో నాకు తెలీదా!" అన్నాడు. అంటూనే తండ్రికోసం ఆయనగదికి వెళ్ళాడు.

ఆనందబాబుగదిలో కూర్చొనివున్నాడు. అన్న చెల్లెళ్ళ సంభాషణను గురించే ఆలోచిస్తూ వున్నాడు. జోగేంద్ర లోనికివచ్చేముందే, అక్కడికి వెళ్ళి ఏం జరుగుతోందో

చూద్దాం అనుకున్నాడు.

జోగేంద్ర లోపలకు వచ్చిరాడంతోటే "నాన్నగారూ! హేమ వివాహానికి వప్పుకుంది. మీరు నేనేం ఆమెను బల వంతం చేశాననుకుంటున్నారా? అలా ఏం చేయలేదు. ఇప్పుడు మీరువచ్చి అక్షయను వివాహం చేసుకో అంటే అలాగే చేసు కుంటుంది." అన్నాడు.

"నేనువచ్చి చెప్పవలసిందేనా?"

"అవునుమరి, లేకపోతే హేమే మీ దగ్గరికివచ్చి "నాన్నా ఫలానా అతన్ని వివాహం చేసుకుంటాను" అంటుందా? పోనీ, మీకుమాట్లాటం అంత అయిష్టంగా వుంటే ఆ చెప్పేదేదో నాద్వారా చెప్పించండి—"

"అలాం పిల్లేదు. నేనేచెప్తాలే. అయినా నీకింత తొందర కేమిటి? కొన్ని రోజులపాటు ఆగివుండడమే మంచిదనిపిస్తోంది. నాకు" అన్నాడు ఆనందబాబు వెంటనే.

"లేదు నాన్నగారూ మనం వేచివుంటే మళ్ళీ యేదో గొడవ జరుగుతుంది యిలా ఎన్నాళ్ళని!"

జోగేంద్ర యేదయినా పట్టుపట్టాడంటే కుటుంబంలో వాళ్ళు ఎవరూ ఎదురునిలవలేరు. అందుకనే తండ్రికూడా నింపాదిగా "సరే. అలాఅయితే మాట్లాడుతానులే" అన్నాడు.

"ఇదే మంచి సమయం నాన్నగారూ!" అన్నాడు జోగేంద్ర 'ఆమె మీకోసమే ఎదురుచూస్తోంది. ఈరోజే ఈ విషయం పరిష్కారం చేయండి"

సరే నువ్వుయిక్కడే వుండు. నేను అమ్మాయితో మాట్లాడివస్తాను."

"అలాగే!"

ఆనందబాబు వెళ్ళేసరికి ఆగది చీకటిగావుంది. ఎవరో కుర్చీలోంచి లేచిన అలికిడి అయింది. ఒకటి రెండు క్షణాల తరువాత "దీపం ఆరిపోయింది నాన్నగారూ! నౌకర్ని వెలిగించి తీసుకురమ్మని చెప్పనా" అన్నమాటలు వినిపిస్తున్న కంఠంలోనుంచి వినిపించాయి. అయితే ఆనందబాబుకు దీపం దానంతట అది ఆరిపోలేదని బాగా తెలుసు.

"ఫరవాలేదులే అమ్మాయీ, దీపం అక్కర్లేదులే—" అంటూ ఆయన కూతురుపక్కగా ఓ కుర్చీలోకి చేరాడు, "మీరు ఆరోగ్యం గురించి జాగ్రత్త తీసుకోవడంలేదు" అంది హేమ. "దానికీ కారణం వుంది. నా ఆరోగ్యం సలక్షణంగానే వుంది. అందుచేత నేను ప్రత్యేకించి శ్రద్ధతీసుకోవలసిందేమీ లేదు. నీ వేనీఆరోగ్యాన్ని గురించిశ్రద్ధతీసుకోవాలి. నన్నడిగితే!"

"ఎప్పుడూ యిలాగే అంటారు. నాకేం నిక్షేపంలా వున్నాను. అయినా మీరుయిచ్చిన మందు ఎప్పుడు పుచ్చుకో లేదు? మీరుచెప్పిన పని ఎప్పుడు చేయలేదు?"

కుమార్తెను ఓదార్చటానికి "అదికాదులేతల్లీ. నువ్వు చెప్పినట్లల్లా చేస్తూనేవున్నావు. నా మనస్సులో విషయం యేమిటో తల్లిలా యిట్టే కనిపెట్టేస్తావు." అన్నాడు.

"నన్నెప్పుడూ మీదగ్గరే వుండనీయండి."

"అలాగే"

"నేను లేకపోతే మీవిషయం ఎవరుచూస్తారు? గదిలో చీకటిగా వుంది నాన్నగారూ! దీపం తీసుకువస్తాను."— అంటూ ఆమె పక్కగదిలోంచి లాంతరు తీసుకువచ్చింది.

"మీరు యీమధ్య పత్రిక చదవడంలేదు. కాస్సేపు చదివి వినిపించ మంటారా ?"

"అలాగేతల్లీ, ఒక్కనిమిషంఆగు, యిప్పుడేవస్తాను" అంటూ ఆయన బయటకు వెళ్ళాడు. జోగేంద్రతో "యివాళ ఆ ప్రస్తావన తీసుకురాలేను, రేపటిదాకా ఆగుదాం" అని చెబుదామనుకున్నాడు. జోగేంద్ర తండ్రిని చూడగానే "యేమయింది" అనడిగాడు అదుర్దాగా.

"మాట్లాడాను"

"ఏమయింది? వివాహానికి అంగీకరించిందా ?"

"ఆ! ఒకరకంగా"

"అలాగయితే వెంటనే అక్షయతో చెబుతాను"

"వొద్దు. అప్పుడే అతనికేమీ చెప్పకు" అన్నాడు. మళ్ళీ ఆదుర్దాగా "నువ్వంతా నాశనంచేస్తావు. జోగేన్ నీది ఉడుకుతనం. ఎవరికీ యేమీచెప్పక్కర్లేదు. మనం ఊరికి వెళ్ళివచ్చేంతవరకూ అన్నీ యేర్పాట్లూ నిలిపి వుంచుదాం."

జోగేంద్ర జవాబు చెప్పకుండా వెళ్ళిపోయాడు. బుజంమీద శాలువ వేసుకుని అక్షయ యింటికి వెళ్ళాడు సరాసరి. అక్షయ ఆసనంలో యేదో పుస్తకం చదువు తున్నాడు. జోగేంద్ర పుస్తకం అవతలపారేసి "యిప్పుడా పాడుగొడవ ఎందుకు ? నీ వివాహానికి ముహూర్తం చూడాలి !" అన్నాడు.

"హరి—భగవంతుడా !" అని ఆశ్చర్యపోయాడు అక్షయ.

# 39

మరునాడు ఉదయం హేమాలిని మామూలు వేళకంటే ముందుగా లేచింది. తండ్రికోసం ఆయన పడకగదికి వెళ్ళింది. ఆయన గదిలో నిశ్శబ్దంగా ధ్యాన నిమగ్నుడై వున్నాడు.

గదిలో ఎక్కువసామానులు లేవు. మంచం, పరుపు. ఒక గోడకు హేమ తల్లిఫోటో వేలాడుతోంది, ఆ ఫోటో పురాతన వస్తుసంచయ కేంద్రానికి పంపడానికి అర్హంగా వుంది.

హేమ తండ్రిప్రక్కన కూర్చుంది. "నాన్నగారూ! ఇవాళ మనం యిప్పుడే టీ తాగేద్దాం. తరువాత మీరు నాకు పాతకాలపు కథలన్నీ చెప్పండి, వింటాను. అలాంటి కథలు వినడమంటే నా కెంతో యిష్టం—"

ఆనందబాబు అలాగే అంటూ టీ కోసం బయలు దేరాడు. ఇంకా కొంతసేపయితే అక్షయ తయారవుతాడు. సాధ్యమైనంత త్వరగా తండ్రిగారి ప్రైవేట్ గదిలోకి వెళ్ళిపోయి అక్షయ గొడవనుంచి తప్పించుకోవాలని హేమ తాపత్రయ పడుతోంది.

కూతురు తొందర చూస్తూంటే ఆయనకు ఎంతో చిరాకనిపించింది. ఆమె భయపడిన లేడిలా వుంది.

మెట్లుదిగివచ్చిచూస్తే, నీళ్ళు యింకా కాగినట్లు కనిపించలేదు. నౌకర్ను చివాట్లువేశాడు. మామూలు వేళకంటే ముందుగా టీ అడుగుతారని నాకేం తెలుసునంటూ వాడు గొల్లుమన్నాడు. ఈ రోజుల్లో నౌకర్లు తమ తమ సుఖాలే

చూచుకొంటారుగాని యితరవిషయాలలో శ్రద్ధ వహించరు. వాళ్ళకు అడుగడుగునా గుర్తుచేసే నౌకరు మరొకడు వుండాలి-అనుకున్నాడు ఆనందబాబు.

సరే, మొత్తంమీద టీ తయారయింది. ఆనందబాబు హడావిడిగా తాగడం మొదలెట్టాడు.

"యేమిటి యివాళ తొందర నాన్నగారూ!" అనడిగింది హేమ నివ్వెరపోయి.

"యేమీ లేదు, వాతావరణం చల్లగావుందికదూ, వేడివేడి టీ తాగితే వెచ్చగావుంటుంది." అన్నాడాయన.

ఇంతలోనే అక్షయను వెంటవేసుకుని జోగేంద్ర గదిలో ప్రవేశించాడు.

అక్షయ తన అలంకారంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నట్లున్నాడు. చేతిలో వెండిపొన్ను చేతికర్ర, అందమైన గడియారం గొలుసు, ఎడమ చేతిలో ఓ పుస్తకం పొట్లంకట్టి వుంది. తన మామూలు కుర్చీలో కూర్చోకుండా హేమాలిని ప్రక్కగా ఓ కుర్చీ లాక్కుని అక్కడ కూలబడ్డాడు. ఇవాళ మీ గడియారం పరుగెత్తుతున్నట్లుందే" అన్నాడు.

హేమాలిని అతనివంక చూడలేదు. జవాబేనా చెప్ప లేదు.

"హేమా! మేడమీదికి పోదాంపద. నా బట్టలు కొన్ని ఎండలో ఆరవేయాలి" అన్నాడు ఆనందబాబు.

"అంత తొందరేం నాన్నగారూ! ఎండేం పారిపోదు. హేమా! అక్షయకో కప్పు టీ పొయ్యి నాకూ కావాలి. కాని అతిథులకు ముందు" అన్నాడు జోగేంద్ర.

అక్షయ నవ్వుతూ హేమాలినివైపు తిరిగాడు. "ఎంత ఆత్మత్యాగమో చూచావా ? జోగేంద్ర సాక్షాత్తూ సర్ ఫిలిప్ సిడ్నీవంటివాడు" అన్నాడు.

అక్షయ మాటలనేం లెక్కకుతీసుకోకుండా హేమాలిని రెండు కప్పుల్లో టీ పోసింది. ఒకటి జోగేంద్రకు అందించి, రెండోది అక్షయ ముందుకు జరిపింది. తండ్రివంక చూసింది.

"ఆలస్యంచేస్తే డాబామీద ఎండ ఎక్కువ అవుతుంది- రా, హేమా, పైకి వెడదాం" అన్నాడాయన.

"అలా వుండనీయండి. అక్షయ యెందుకు వచ్చాడంటే—'' అంటూ జోగేంద్ర ప్రారంభించాడు.

ఆనందబాబు కోపం ప్రజ్వరిల్లింది. "మీరిద్దరూ మమ్మల్ని వేధించుకు తింటున్నారు. ఒక మనిషి మానసిక వ్యథతో చిక్కిశల్యమౌతూవుంటే నీ యిష్టం వచ్చినట్లు చేయమంటూ అలా వెంటబడతావేం ? అక్కడికీ ఎన్నో రోజులు భరించాను. ఇంక భరించలేను. హేమా! యికముందు టీ నువ్వూ నేనూ మేడమీదికే తెప్పించుకు తాగుదాం'' అన్నాడు.

ఆయన హేమను పైకి లాక్కువెళ్ళాలనుకున్నాడు. కాని ఆమె ప్రశాంతంగా యిలా అంది. ''అప్పుడే యేం తొందరనాన్నా; ఇంకా మీరు టీ తాగడం పూర్తికాలేదు-" అక్షయవైపు తిరిగి ''అక్షయబాబు, నీచేతిలో పుస్తకం పొట్లమేమిటో తెలుసుకోవచ్చునా ?" అనడిగింది.

''తెలుసుకోవడమేకాదు, అదేమిటో నీవే చూడు" అంటూ అక్షయ ఆమెకు ఆ పార్సిల్ అందించాడు. హేమ

దాన్ని విప్పి పుస్తకం పైకితీసింది. మొరాకో బైండు వున్న టెన్నీసన్ పుస్తకం! ఆమె ముఖం వివర్ణమయింది. ఇంతకు ముందు ఆమెకు యిటువంటి బహుమతి వచ్చింది. సరిగ్గా యిదేపుస్తకం! దాన్ని మేడమీద గదిలో పెన్నిధిలా దాచుకుని పూజిస్తూ వుంది.

జోగేంద్ర నవ్వాడు: "అప్పుడే పూర్తికాలేదు." అంటూ పుస్తకం అట్టతీసి ముందు పేజీమీద వ్రాసివున్న అక్షరాలు ఆమెకు చూపాడు "శ్రీమతి హేమాలినికి— అక్షయ గౌరవ పురస్సరంగా" అనివుంది,

ఆమె పుస్తకం కిందపడేసి పైకిలేచింది. "రండి, నాన్నగారూ" తండ్రిని తీసుకుని మేడమీదికి వెళ్ళింది.

జోగేంద్రకళ్ళు మండిపోయాయి—"ఇక ఈ యింట్లో ఒక్క—క్షణంవుండలేను. లేచిపోయి ఎక్కడో స్కూలుమాష్టరు ఉద్యోగం సంపాదించి నాపొట్ట నేను పోసుకుంటాను—" అన్నాడు.

అక్షయ "అలా గందరగోళపడకు, జోగేన్. నన్నడిగితే నువ్వు పొరపాటు చేశావంటాను. అయినా నువ్వు చెప్పినట్లే చేశాను ఇదంతా ముందే చెప్పానుగా. ఇప్పుడు స్పష్టం అయింది—హేమాలిని నేనంటే అసహ్యించుకుంటున్నదనేది తెలిసినా లక్ష్యం చేయదని! ఇక యీ విషయం నీబుర్రలోనుంచి తొలగించు, మనం ఇప్పుడేదయినా మంచిపని చేయాలనుకుంటే, అది ఆమె రమేష్‌ను మరచిపోయేట్లు చేయడమే!" అన్నాడు.

"అది నిజమే కాని ఏం చేయాలంటావు?"

"పెళ్ళిచేసుకోవడానికి యీ ప్రపంచంలో నేనొక్కడినే వరుడినా యేమిటి? ఆమెకు నచ్చే వరుణ్ణివెదికి సాధించాలి."

"వరులు దుకాణాల్లో దొరకరుగా!

"ఊరికే నిరుత్సాహ పడిపోతావు. నన కర్తవ్యం హేమకు వరుడిని చూడడమే అయినా, యీ విషయం వధూవరు లిద్దరికీ ముందుగా తెలియపరచగూడదు. ఇద్దరూ భయపడిపోతారు. వాళ్ళ పరిచయం క్రమంగా వృద్ధిచెంది, సమయంచూచి పనిచేయాలి."

"రా[illegible]క్తి కావాలంటావు! సరే, అంగీకరించాను. అతనిపేరు [illegible]—"

"నీవ[illegible] బాగా ఎరగవు. అయితే చూచివుంటావు-డాక్టర్ నళినా[illegible]!"

"నళినాక్ష!"

"ఏమిటి ఆశ్చర్యం" బ్రహ్మ సమాజంలో అతన్ని గురించి ఏదో పుకారు వున్నదనుకో. అదంతా మనం లెక్కలోకి తీసుకోనక్కర్లేదు."

"అతను తగినవాడనుకుంటే నాకిక ఇతర విషయా లేవీ గుర్తుకురావు. నళినాక్ష అంగీకరిస్తాడంటావా?"

"ఇవాళే యీ ప్రతిపాదన తీసుకువెడితే, వెంటనే అంగీకరిస్తాడని నేనూ అనుకోను. కాని కాలం తమాషా పనులుచేస్తూ వుంటుంది. నామాటవిను, జోగేన్ రేపు నళినాక్ష ఏదో ఉపన్యాసం యిస్తాడు. హేమానీ నీతో అక్కడకు తీసుకువెళ్ళు. అతను మంచివక్తలే. ఆడవాళ్ళను ఆకర్షించటానికి అటువంటివాళ్ళే కావాలి. కుర్రవాళ్ళు, చెప్పి

నట్టు వినే భర్తకంటే వట వట వాగే భర్తతే తనుకు ఎక్కువ సుఖం యిస్తారనుకుంటారు."

"సరే, ముందు నళినాక్ష చరిత్ర చెప్పు. అతన్ని గురించి పూర్తిగా తెలుసుకోవాలి."

"అలాగే చెబుతాను. కాని ఎక్కడన్నా ఏ లోట యినా కనిపిస్తే దాన్ని పట్టుకు ఆసలీ ప్రతిపాదనే తోసిపార వేయగూడదు!"

నళినాక్ష కథను అక్షయ చెప్పాడు. దాన్ని యీ కింది విధంగా సంక్షిప్తపరచవచ్చును.

ఆయన తండ్రి రాజవల్లభ్. ఫరిద్‌పూర్ ప్రాంతంలో భూస్వామి. ముప్పయిసంవత్సరాల వయసులో ఆయన బ్రహ్మ సమాజం స్వీకరించాడు. ఆయన భార్యమటుకు అందుకు వ్యతిరేకి. అందుచేత ఆమెమటుకు తన పూర్వవిశ్వాసాలే నిలుపుకుంటూ వస్తోంది. రాజవల్లబ్‌కు యిదంతా చిరాగ్గా అసహ్యంగా వుండేది. వారికొడుకు నళినాక్ష, చిన్న తనంలోనే బ్రహ్మసమాజంలో ప్రవేశం సంపాదించాడు. డాక్టరీ చదివి తర్వాత గవర్నమెంటు ఉద్యోగంపొందాడు. అతని సత్శీలమూ, వృత్తినైపుణ్యము అందరూ కొనియాడుతూ వుంటారు.

"ఇంతలో ఒక విపరీతం తటస్థించింది. రాజవల్లబ్ ముసలితనంలో ఒక విధవరాలిని వివాహమాడతానన్నాడు. ఎవరెన్ని చెప్పినా ఆయన నిశ్చయాన్ని కదపలేకపోయారు. ఆయన అనేదేమంటే—నా ప్రస్తుత భార్య నేను అనుస రిస్తున్న మతాన్ని, విశ్వాసాన్ని అవలంబించడం లేదు. అందు

చేత నేను నాకు తగిన మరోస్త్రీని చేసుకుంటాను—'' అని.

"అందరూ వద్దంటున్నా ఆయన యీ విధవరాలిని హిందూధర్మశాస్త్ర ప్రకారం వివాహమాడాడు.

''నళినాక్షతల్లి భర్తను వదలి కాశీకి ప్రయాణం అయింది. నళినాక్ష అప్పుడు రంగపూర్‌లో స్వంతంగా ప్రాక్టీసు చేస్తున్నాడు. ఆ ప్రాక్టీసు మానేసి తల్లివెంట కాశీ వస్తానన్నాడు.

"ఆ వృద్ధురాలు సజలనేత్రాలతో "నాయనా! మన వుద్దేశ్యాలు వేరు. నీ అంతట నువ్వు ఎందుకూ అనవసరంగా యాతనపడడం?" అంది.

"తల్లి సుఖాన్నే తనపరమార్థంగా భావించి నళినాక్ష ఆమెవెంట కాశీ వెళ్ళాడు. ఆమె అతన్ని ఒక మంచిరోజు చూచి, "నీవు పెళ్ళిచేసుకోవా యేం?" అనడిగింది.

"నాకు యిలానే బాగుంది."

తల్లి కుర్రవాడి బాగుకోరి "నామూలంగా నీ సుఖాలు పాడుచేసుకోవద్దు నాయనా! నీకు యిష్టం వచ్చిన పిల్లను పెళ్ళిచేసుకో. నాకేం అభ్యంతరంలేదు" అంది.

"నళినాక్ష యీ విషయం ఒకటిరెండు రోజులు ఆలోచించి, తల్లితో తన నిశ్చయం యిలా తెలిపాడు: ''అమ్మా, మీకు నచ్చిన కోడలును తీసుకువస్తాను. పనిపాటలు చేతయినదీ, నీకు సేవచేసేది, ఎన్నడూ కష్టపెట్టకుండా వుండేదీ అయిన మంచిపిల్లను తీసుకువస్తాను." ఇలా చెప్పి అతను వధువును వెదకటానికి బెంగాల్ వెళ్ళాడు.

"తరువాత యేంజరిగింది అన్నవిషయంమీద ఎన్నో

అభిప్రాయాలు వున్నాయి. ఒక అభిప్రాయం యేమిటంటే- అతనేదో పల్లెటూరుకు వెళ్ళాడనీ అక్కడ అనాథ బాలికను వివాహం చేసుకున్నాడనీ, ఆ అమ్మాయి కొద్దిరోజులకే చనిపోయిందని. అక్షయ అభిప్రాయం యేమిటంటే, అతను వివాహం చేసుకుందామనుకున్నాడనీ యింతలోనే మనసు మార్చుకున్నాడనీని !

ఏమయినప్పటికీ, అక్షయ ఉద్దేశ్యప్రకారం—అతను ఎలాంటి పిల్లను వివాహమాడినా తల్లికేమీ అభ్యంతరం లేదు. అదీగాక హేమనంటి సౌందర్యరాశిని, సద్గుణఖనిని చూచిందంటే ఆమె ఉబ్బితబ్బిబ్బవుతుందనీ, హేమతో కొద్ది పరిచయం అవుతే చాలు. నళినాక్షి ఆమెను మంచిభార్యగా కనిపెట్టగలడనీ !''

ఇంతకూ అక్షయ సలహా యేమిటంటే, ఆ యువతీ యువకులను పరస్పరం పరిచయం చేయమని !

## 40

అక్షయ వెళ్ళిపోవడంతోటే జోగేంద్ర మేడమీదికి వెళ్ళాడు. అక్కడ ఆనందబాబు, హేమ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. ఆనందబాబు కొడుకును ముఖాముఖి చూడలేకపోయినాడు. టీ బల్లదగ్గర సంభాషణ అయినా యింకా పరితపింపజేస్తూనేవుంది.

"రా, జోగేంద్ర. యిలా వచ్చి కూర్చో."

"నాన్నగారూ ! మీరు, హేమ యీమధ్య అసలు యిల్లువదలి కదలడమే లేదు. ఎప్పుడూ ఈ నాలుగ్గోడలమధ్య

అంటిపెట్టుకు వుండడం ఆరోగ్యానికంత మంచిదికాదు."

తండ్రి-కూతురు, దానిక తప్పు నీదంటే నీదని కాస్సేపు వాదులాడుకున్నారు. చివరకు హేమ బయటకు వెళ్ళడానికి తనకేమీ అభ్యంతరంలేదని చెప్పింది.

"అలాఅయితే మంచిదే. రేపు చిన్న సమావేశం వుంది. హేమను అక్కడికి తీసుకువెళ్ళండి—"

"సమావేశమా ! ఎవరు మాట్లాడతారు ?" అనడిగింది హేమ.

"డాక్టర్ నళినాక్ష."

"నళినాక్ష !" అన్నాడు ఆనందబాబు.

"చాలా బాగా మాట్లాడతాడు. అతన్ని గురించి ఎంతో ఉదాత్తచరిత్రవుంది, ఎంత ఆత్మత్యాగి, ఎంత గంభీర్యుడు ! అలాంటివాడు కోట్లల్లో ఒకడుంటాడు" అన్నాడు జోగేంద్ర. రెండుగంటల కిందటివరకు అతనికి నళినాక్షను గురించి యేదో పుకారుతప్ప యింకేం తెలియదు.

"సరే, అయితే-సమావేశానికి వెళ్ళి విందాం" అంది హేమ.

ఆమె యిలా ఉత్సాహం చూపడం ఆనందబాబుకు సంతోషంగావుంది. మళ్ళీ నలుగురిలో తిరిగితే ఆమె మామూలు మనిషి అవటానికి ఎక్కువసేపు పట్టదు.

"సరే మమ్మల్ని రేపు అక్కడికి తీసుకువెళ్ళు ముందు నళినాక్షను గురించి నీకు తెలిసిందంతా చెప్పు. అతన్ని గురించి చాలా కథలు వ్యాపకంలో వున్నాయి" అన్నాడు ఆనందబాబు.

జోగేంద్ర, లేనిపోని పుకార్లు సృష్టించేవాళ్ళను గురించి తిడుతూ మాట్లాడాడు. తరువాత నళినాక్షగురించి తనకు తెలిసిందంతా చెప్పాడు.

"తనతల్లిని సుఖపెట్టటానికి, నళినాక్షు కాశీ వెళ్ళాడు ఆమె వెంట. ఇక్కడివాళ్ళంతా అతన్నిగురించి కట్టుకథలు అల్లుతున్నారు. నామటుకు నేను అతను నిక్కచ్చయిన మనిషంటాను. నీవేమంటావు హేమా ?" అన్నాడు చివరకు.

"నేనూ నీలాగే అభిప్రాయ పడుతున్నాను" అంది హేమ.

"హేమ అతన్ని సమర్థిస్తుందని నాకు ముందే తెలుసు. అలాగే అవసరంవస్తే, తండ్రిని సుఖపెట్టటానికి, ఏం చేయమంటే అలా చేస్తుంది—"

ఆనందబాబు కూతురువంక ఆప్యాయంగా చూచాడు. హేమ ముఖం ఎర్రగా తయారయింది. ఆమె ఖంగారుగా కళ్ళు మూసుకుంది.

## 41

ఆనందబాబు, హేమాలిని మధ్యాహ్నంపూట సమావేశంనుంచి ఆలస్యంగా యింటికి తిరిగివచ్చారు.

ఆయన టీ టేబుల్‌దగ్గర కూచుని, మొత్తంమీద బాగానేవుంది" అన్నాడు. అంతకంటే యింకేం అనలేదు. ఆయన మనస్సు ఎంత తీవ్రంగా ఆలోచనలో మునిగివున్నదంటే, హేమాలిని అక్కడినుంచి పైకివెళ్ళడంగూడా ఆయన గమనించలేదు.

ఉపన్యాసకుడు నళినాక్ష - యువకుడు, అందగాడు. అతను పరిపూర్ణ వయస్కుడు అయినా, యింకా తన యవ్వనాన్ని అలాగే నిలబెట్టుకున్నాడు. అతని ఆత్మపరిపక్వం ముఖం మీద స్పష్టంగా కనిపిస్తున్నట్లువుంది.

అతను మాట్లాడినవిషయం 'నష్టము' అనేది. దాని అంతర్గతభావన ఏమిటంటే నష్టమంటూ ఏమీ వుండకపోతే న్యాయమైన లాభం అనేదే వుండదని! మనం ప్రయత్నం చేయకుండా లభించేది, నిజమైనదికాదు, మళ్ళీ త్యాగంవల్ల సంపాదించిందిమటుకే మనది, మన స్వంతం. నిజానికి మానవుని ఆత్మ, నష్టపోవడంలోనే అత్యధికశక్తితో, ఆ నష్టపోయిన దాన్ని కూడదీసుకోవడానికి ప్రయత్నంచేసి నెగ్గుతుంది.

మనం నష్టపడితే, తలవంచవచ్చు. చేతులు ముకిళించవచ్చు. దాన్ని కానుకగా భావించవచ్చు.

నళినాక్ష ఉపన్యాసం హేమాలినికి బాగా హత్తుకుంది. ఆమె డాబామీద కూచుని దాన్ని గురించే ఆలోచిస్తోంది. ఆమె హృదయం నిండుగా వుంది. ఆకాశం, భూమీ కేవలం ఖాళీగా వున్నట్లు అనిపించడంలేదు.

వాళ్ళు ఉపన్యాసంనుంచి తిరిగివస్తూవుండగా జోగేంద్ర అక్షయతో అన్నాడు: "నీవు చెప్పినట్లు నిజంగా గొప్పవాడే! ఏం తమాషావ్యక్తి. అతను చెప్పింది సగానికి సగం నాకు అర్థం కానేలేదు."

"రోగికి కావలసిన మందు నిర్ణయించటానికి ముందు, రోగవిధానం తెలుసుకోవాలి. హేమాలిని రమేష్ జ్ఞాపకాల నుంచి బాధపడుతోంది. ఆమె బాధ తొలగించాలంటే,

యిటువంటి తమాషా వాతావరణం సృష్టించాలి. నీ, నా వంటి సామాన్యులు యీ పని చేయలేరు. అతను మాట్లాడుతూవుండగా, హేమ ముఖంవంక చూచావా?'' అన్నాడు అక్షయ.

"చూచాను. హేమ ఉపన్యాసాన్ని బాగా జీర్ణించుకున్నట్లేవుంది. అంతమాత్రాన ఉపన్యాసకుడిని పాణిగ్రహణం చేసుకుంటుందంటావా ?"

"నీవూ నేనూ అలా ఉపన్యాసంయిచ్చి ఆడవాళ్ళను ఆకర్షించలేం. ఆడవాళ్ళను ఆకర్షించటానికి సన్యాసుల్లో చాల చక్కెంవుంది. అందుకనే నేను నళినాక్షను ఎన్నాను. రమేష్ కంటే అతను అనేకరెట్లు గొప్పవాడు ?"

ఇలా వాళ్ళిద్దరూ యీ విషయం మీాదే తర్కించుకుంటూవచ్చారు.

వాళ్ళు ఆనందబాబు గదిలోకి ప్రవేశించేసరికి హేమ అవతలి గుమ్మంలోంచి బయటకు వెళ్ళిపోయింది.

''ఆమె మనం వస్తూవున్నప్పుడే, యే కిటికీలోనుంచో చూచివుంటుంది" అన్నాడు అక్షయ అతను ఆనందబాబు పక్కనే కూర్చుంటూ ''నళినాక్ష చెప్పిన మాటలు నా హృదయానికి హత్తుకున్నాయి. ఎందుచేతనంటే అతను హృదయాంతరాళంనుంచి మాట్లాడుతున్నాడు."

''నళినాక్ష సమర్థుడే!" అన్నాడు ఆనందబాబు.

''సమర్థుడా ! అంత చిన్నమాట సరిపోతుందా ? అతను సాక్షాత్తూ భూమిమీాదనడిచే పరమగురువు !''అన్నాడు అక్షయ.

అలా వాళ్లుముగ్గురూ నళినాక్షు గుణగణాలనుగురించి గొప్పదనాన్ని గురించి మాట్లాడుకుంటూ కూర్చున్నారు. అతని ఆరోగ్యాన్ని గురించి కూడా సంభాషణ జరిగింది. చివరకు అక్షయ యిలా అన్నాడు: "చూడండి. ఒకరోజు అతన్ని తీసుకువచ్చి మీకు పరిచయంచేస్తాను. అతనితో మీరు యీ విషయాలన్నీ మాట్లాడండి. నాకు లోగడ చెప్పినట్లు, అతనికూ్కడా పళ్ళరసం ఆరోగ్యం చేకూరుస్తుందే ఆలోచించండి. నళినాక్షును పరీక్షచేసి—"

జోగేంద్ర లేచి "అక్షయ. నాకు వెర్రెత్తుతోంది. ఏమిటి నువ్వు మాట్లాడుతున్నచెత్త? నేనిక వినలేను—" అంటూ ఆ గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయాడు.

# 42

హేమాలినితో యీ గొడవలన్నీ రాకముందు ఆనందబాబు ఆరోగ్యం బాగానేవుండేది. అయినా ఆయన డాక్టర్లుయిచ్చిన మందులన్నీ మింగుతూవుండేవాడు. అయితే యిప్పుడు ఆయనకు మందులమీద ధ్యాస తగ్గిపోయింది. ఐహికసంబంధమైన బాధలు కేవలం ఊహాజనితమే అయినప్పుడు, వాటినిగురించి చర్చ హుషారుగా వుంటుంది. ఇప్పుడు నిజంగానే ఆరోగ్యం దెబ్బతినడంతో, ఆ విషయాన్ని గురించి ప్రత్యేకించి చెప్పవలసిందేమీ లేకుండా పోతోంది.

ఆయన గదిలో పడకకుర్చీలో పడుకుని నిద్రపోతున్నాడు. జోగేంద్ర అడుగుల చప్పుడు విన్న హేమాలిని తన

చేతిలోని కుట్టుపనిని కిందపడేసి తొందరగా అతనిదగ్గరకు వెళ్ళి నిద్రపోతున్న తండ్రిని మేలుకొల్పవద్దని చెప్పింది. జోగేంద్ర తనతోపాటు నళినాక్షను తీసుకురావడం ఆమెకు విస్మయం కలిగించింది. ఆమె పక్కగదిలోకి తప్పుకుందాం అను కుంటూ వుండగా జోగేంద్ర యిలా అన్నాడు: "హేమా! నళినాక్షబాబును తీసుకువచ్చాను. పరిచయంచేస్తాను, వుండు—"

హేమాలిని కంగారుగా అక్కడే నిలబడింది. నళి నాక్షబాబు మెల్లిగా ఆమె ముందుకువచ్చి వంచిన తలయెత్త కుండానే ఆమెకు అభివాదంచేశాడు.

ఇంతలో ఆనందబాబు నిద్రమేల్కొని కూతుకును పిలిచాడు. హేమ లోపలికివెళ్ళి తండ్రితో నింపాదిగా "నళి నాక్షబాబు వచ్చారు" అని చెప్పింది.

జోగేంద్ర అతిథిని లోపలకు తీసుకువచ్చాడు. ఆనంద బాబు అతనికి స్వాగతం చెప్పాడు.

"నిజంగా మా అదృష్టం అనే చెప్పాలి, మీరు మాకు దర్శనంయివ్వటం. హేమా! అలాస్తె పరుగెత్తకు, నింపాదిగా కూచో. నళినాక్షబాబు, మా అమ్మాయి హేమాలిని, మేమిద్దరం యిటీవల మీ ఉపన్యాసం వినడం తటస్థించింది. ఎంతగానో ఉప్పొంగిపోయాం, మీవాక్చా తుర్యానికి. మీరొక విషయం చెప్పారు. అదేమిటంటే, ఒక సారి మనం సంపాదించింది తిరిగి పోగొట్టుకోవడం అంటూ వుండదు. మరిన్నీ పూర్తిగా సాధనలోనికి మనకు నష్టమేఅవు తుంది-అని! దీనిలో ఎంతయినా నిజంవుంది. అంతేకాదు,

హేమా. నిజమైన పరీక్ష, ఒకవస్తువు మనదగ్గర్నుంచి వెళ్ళి పోయినప్పుడే ప్రారంభం అవుతుంది. అప్పుడుగాని నిజంగా అదిమనదేనా, కాదా అన్న ప్రశ్న రాదు. నళిన్ బాబు, నీకో విషయం చెప్పాలనుకుంటున్నాను.. మీకుతీరుబడిగా వున్న ప్పుడు, అప్పుడప్పుడు మాయింటికి వస్తూ వుండండి, ఇలాగే కులాసాగా కాలం గడుపుతూవుందాం. మాకు తరుచు బయటికివెళ్ళే అలవాటులేదు. మీకు తీరుబడిగావున్న సమ యంలో రావచ్చు. అమ్మాయి, నేను ఎప్పుడూ ఇంట్లోనే వుంటాం" అన్నాడు.

నళినాక్ష ఒకమారు గంభీరమైన హేమాలిని ముఖం వంకచూచి యిలా అన్నాడు: "ఉపన్యాస వేదికమీదినించి యేవేవో ఘాటుగా మాట్లాడాను గనుక, నేనేదో గొప్పవాడి నని అనుకోకండి. కుర్రవాళ్ళు బలవంతంచేశారుగదా అని ఉపన్యాసానికి ఒప్పుకున్నాను. అయితే నా ఉపన్యాసం ఘాటుగా పనిచేసింది. ఇక ముందెప్పుడూ వాళ్ళు నన్ను పిల వరు. నాకూ అదేకావాలి. జోగేన్, నువ్వుకూడా ఆవేళ ఉపన్యాసానికి వచ్చావుకదూ? ఎప్పుడు అయిపోతుందా అని గడియారంవంక చూస్తూకూర్చున్నావు. నేను గమ నించ లేదనుకోకు—"

"అదా! నిజంచెప్పద్దూ. నాకు ఉపన్యాసం అర్థం కాలేదు. అందుకు నా తెలివి తేటలను నిందించుకోవాలి. ఏమ యినా, జోగేన్, కొన్ని కొన్ని విషయాలు వున్నాయంటే అవి కొంత వయస్సువచ్చిన వాళ్ళకుతప్ప అర్థంకావు" అన్నాడు ఆనందబాబు.

"అవును. కొన్ని వయస్సులో, అందరూ అన్నివిష యాలూ అర్థంచేసుకోనక్కర్లేదు" అన్నాడునళినాక్షబాబు.

"అన్నట్లు, నళిన్, నీకోవిషయం చెబుదామను కున్నాను అదేమిటంటే దేవుడు నీబోటివాళ్ళను యీ ప్రపంచానికి కొంత ధర్మబోధచేయమని పంపించివుంటాడు. అంతమాత్రాన, నీవు నీ ఆరోగ్యాన్ని గురించి అజాగ్రత్తగా వుండడం మంచిదికాదు. ఒక విషయాన్నిగురించి ఎక్కువ కష్టపడి పనిచేసేవాళ్ళు, తతిమ్మా విషయాలలో యితరుల చేత చెప్పించుకోవలసిరావడం తప్పనిసరి అవుతూవుంటుంది. లేకపోతే, ఆ కష్టమైనపని నెరవేరదు!"

"నాతో మీకు పరిచయం వృద్ధిఅయినాక, నేను యీ ప్రపంచంలో దేన్నీ తక్కువగా, హేయంగా చూడనని తెలుసుకుంటారు. నేనీ ప్రపంచంలోకి వచ్చినప్పుడు యితరుల ఉదారతమీద పరిపూర్ణంగా ఆధారపడివున్నాను. నా శరీ రాన్ని, మనస్సును పరిపూర్ణతకు తీసుకు రావడానికి యెందరో పెద్దలు శ్రమపడవలసివచ్చింది. అందుచేత దేన్ని నేను అశ్ర ద్ధగా పరిగణించినా అది నా మొండితనమే అవుతుందను కుంటాను. మనం నిర్మించలేనిదాన్ని, నాశనంచేసే హక్కు మనకు లేదుకదా!"

"నిజమే నిజమే. నీఉపన్యాసంలోకూడా యిటువంటి విషయమే చెప్పావు."

"సరే. నేనిక వెళ్ళాలి. నాకు వేరేపనివుంది." అన్నాడు జోగేంద్ర.

"జోగేన్. మీరు వెళ్ళేముందు, ఒక క్షమాపణ

చెప్పకోవాలి నేను. నేను జనాన్ని ప్రశ్నలలో ముంచెత్తే రకం మనిషినికాను. నేనుకూడా తొందరగా వెళ్ళిపోవాలి. అందుచేత మన యిద్దరం సాధ్యమైనంతవరకు కలిసే వెడదాం" అన్నాడు నళినాక్ష.

"నన్ను వొదిలేయండి. మీరు అప్పుడే వెళ్ళడం యేమిటి? నాకు ఒకేచోట ఎక్కువసేపు కూర్చుంటే తోచదు" అన్నాడు జోగేంద్ర.

"ఫరవాలేదు, జోగేంద్రను వెళ్ళనీ నళిన్‌బాబు. వాడిని ఒకచోట కూర్చోబెట్టటం అంత తేలికయినపనికాదు. వాడికి తోచినప్పుడు వస్తూంటాడు, వెళుతూంటాడు, వాడి యిష్టం" అన్నాడు ఆనందబాబు.

జోగేంద్ర వెళ్ళిపోయింతర్వాత, ఆయన నళినాక్షను యెక్కడవుంటున్నావని అడిగాడు.

"ఒకచోటని నియామకంలేదు. నాకు చాలామంది స్నేహితులు వున్నారు. వాళ్ళు అనేకచోట్లకు తిప్పతూ వుంటారు. నాకూ అలావుండడమే సరదాగావుంటుంది. జోగేన్‌బాబు నాకోసమని పక్కయింట్లోగదులు మాట్లాడాడు. నిజంగా యీ సందు ఎంతో ప్రశాంతంగా వుంటుందనుకుంటాను."

ఆనందబాబు యీ విషయం తెలుసుకుని యెంతో సంతోషించాడు. కాని హేమాలిని ముఖంలోమటుకు బాధ వ్యక్తమవుతోంది. దీన్ని ఆయన గమనించలేదు. పక్కయిల్లు అంటే, పూర్వం రమేష్ వుంటూ వచ్చినదే!

టీ సమయం అయింది. అందరూ కిందికి వెళ్ళారు.

"హేమా! నళిన్‌బాబుకు ఒక కప్పు టీ యివ్వు" అన్నాడు ఆనందబాబు.

నళినాక్ష సవినయంగా వద్దన్నాడు.

"ఏమిటిది నళినాక్ష! నీవు నిజంగా టీ పుచ్చుకోవా? పోనీ, ఒక కేకయినా తీసుకో."

"వద్దు. క్షమించండి."

"నీవు డాక్టరువు. కనుక ఆహారవిషయంలో నిన్ను బలవంతం చేయలేను. నామటుకు నాకు టీ తాగడం జీర్ణశక్తిని వృద్ధిపరుస్తుందనిపిస్తుంది."

నళినాక్ష హేమాలిని ముఖంవంక చూచాడు. తను టీ వద్దన్నందుకు ఆమె బాధపడుతూన్నట్లు కనిపించింది. తనను వాళ్ళు అపార్థం చేసుకుంటారేమోనన్న భయంకొద్దీ యిలా అన్నాడు. "మీ ఆచారాలను, అలవాట్లను కాదన్నాననుకోకండి. నేను యిదివరకు, రోజుకు ఒక్కమారు మటుకే టీ తాగుతూ వుండేవాడిని. మా అమ్మగారి అభిప్రాయాలు, ఆలోచనలు అన్నీ వేరేమార్గంలో వుంటాయి. ప్రపంచంలో నేనుతప్ప ఆమెకు యింకెవరూ లేరు. ఆమె ఆత్మీయత కోలుపోయే పనేదీ నేను చేయలేను. అందుకనే టీ త్రాగడం పూర్తిగా మానివేశాను. మీరు టీ తాగడంలోనే ఆనందం వుందంటున్నారు గనుక, అలాగే కానివ్వండి!"

హేమాలిని యీ మాటలు విని దిగ్భ్రమ చెందింది. వాగ్ధోరణితో, చాకచక్యంతో యితరులు తన లక్షణాలను కనిపెట్టకుండా చేస్తున్నాడని భావించింది. ఆమె గమనించిందేమిటంటే, అతను కొత్తవాళ్ళతో మాట్లాడడానికి బిడియ

పడతాడు, సిగ్గుపడతాడు. అతని ఆలోచనలను వ్యక్తపరుస్తు న్నప్పుడుకూడా అంతే!

ఆనందబాబు, "యీ మాటలకు నీవు చెప్పింది అక్షరాలా నిజం! ఈ విషయం నాకు తెలిసివున్నట్లయితే టీకి ఆహ్వానించేవాడిని కాను. క్షమించు" అన్నాడు.

నళినాక్ష నవ్వుతూ "కేవలం నేను టీ తాగను కనుక, మీ ఆహ్వానాన్ని ఎందుకు మన్నించక పోవాలి? అన్నాడు.

అతిథి వెళ్ళిపోయిన తరువాత హేమాలిని తండ్రిని మేడమీదికి తీసుకువెళ్ళింది. ఆయనకు నిద్రవచ్చేంతవరకు బెంగాలీ వార్తాపత్రిక చదువుతూ వుంది. ఈ మధ్య ముసలాయనకు యిదొక అలవాటయింది.

# 43

నళినాక్ష పరిచయం క్రమంగా ఆత్మీయతగా మారింది. ముందు హేమాలిని అతన్నిగురించి ఒకవిధంగా ఊహించుకుంది. అదేమిటంటే అతను అన్నీ అధ్యాత్మిక విషయాలను గురించే మాట్లాడతాడనీ అందుచేత దైనందిన కార్యక్రమాలు, ప్రాపంచిక విషయాలను గురించి అంత ధారాళంగా మాట్లాడలేడనీ. కాని త్వరలోనే ఆమె, అతను ఎంత చిన్న విషయమైనా సమర్థంగానే మాట్లాడగలడని తెలుసుకుంది. అయితే కులాసా సంభాషణల సమయంలోకూడా అతను గంభీరంగానే ఉంటాడు.

ఒకరోజు ఆనందబాబు, హేమాలిని - నళినాక్షతో మాట్లాడుతూ వుండగా, జోగేంద్ర హడావడిగా వచ్చి

తండ్రితో యిలా అన్నాడు: "నాన్నగారూ, సమాజంలో వాళ్లు మనందర్నీ నళినాక్ష శిష్యులని పిలుస్తున్నారు. ఆ విషయం ఇప్పుడే ప్రకేష్‌తో ఘర్షణపడి వస్తున్నాను.

ఆనందబాబు నవ్వుతూ "అందులో కోపగించుకోవలసిందేముంది? అందరూ బోధకులై ఒక్కరూ శిష్యులుకాని సంఘంలో ఉన్నందుకు నేను సిగ్గుపడవలసివస్తోంది. అందరూ తమ గళమెత్తి ఉపన్యసిస్తూవుంటే నేర్చుకోవడానికంటూ యేమీ అవకాశం వుండదు" అన్నాడు.

నళినాక్ష "నేనుకూడా మీ అభిప్రాయాన్నే ఆమోదిస్తాను, ఆనందబాబు, మనందరం శిష్యులమే. మనం సంపూర్ణ యాత్రచేసి వద్దాం. నేర్చుకోవలసింది వుంటే అక్కడల్లా మజిలీ చేద్దాం" అన్నాడు.

జోగేంద్రకు యిదేం రుచించలేదు. "బాగానేవుంది కాని, నళినాక్ష, యిదంతా చాలా పెద్దవిషయం. నీ బంధువులు, మిత్రులే నీకు శిష్యులనే పేరులేకుండా నిన్ను సందర్శించలేరుగదా! ఇలాంటి అపనిందలకు కేవలం నవ్వి లాభం లేదు. నీ విలాంటి అభ్యాసాలన్నీ మానివేయాలి" అన్నాడు.

"ఏ అభ్యాసాలు?"

"ఇదివరకు చెప్పానుగా యోగిలాగ గాలి పీలుస్తావు. ఉదయించే సూర్యుడివంక చూచి నమస్కారాలు చేస్తావు. మంత్రాల పఠిస్తేతప్ప మంచినీళ్ళయినా గొంతుకలో పోసుకోవు. వీటన్నిటి మూలంగా నీవు మామూలు ప్రపంచానికి దూరం అయిపోతున్నావు —"

హేమాలిని, జోగేంద్ర అనుచిత ప్రవర్తనకు అయి

ష్టంగా తల కిందికి దించుకుంది నళినాక్ష మాత్రం నవ్వుతూ యిలా జవాబు చెప్పాడు, "సరే, జోగెన్ బాబు, మామూలు సంఘానికి దూరంగా ఉన్నవాడు యేదో తప్పుచేసినవాడే నని వప్పుకుంటారు కాని మనిషి ఎన్నాళ్ళని కవచంకింద వుంటాడు? పైపొరకంటే దానిలోపల దాగివున్న కత్తే ఎక్కువ ముఖ్యమైన ఆయుధం కదా! పై వేషభాషలు ఎవరికి అనుకూలంగా వున్నట్లు, ఎవరికి ఉచితమని తోచినట్లు వారు ధరిస్తారు, అలాగే యీ సంఘానికి దూరంగా వుందామని ప్రయత్నించే వాళ్ళకూ అలాంటి హక్కువున్నదికదా! నాకు ఆశ్చర్యం కలిగించేదేమిటంటే, నలుగురికి సంబంధించని విషయం నేను ఎలా చేసుకున్నా, దాన్నిగురించి బహిరంగ చర్చలు, వ్యాఖ్యానాలు ఎందుకు వస్తాయా అని!"

"ప్రపంచాన్ని మరమ్మత్తుచేద్దామనుకునే వాళ్ళందరూ పక్కవాళ్ళ యిళ్ళల్లో యేం జరుగుతుందో తొంగిచూడటం తమ ప్రథమ ప్రముఖ కర్తవ్యంగా భావిస్తారని తెలియనట్లా వుంది మీకు. ఒకవేళ యిలా తొంగి చూచినా వాళ్ళకు అవసరమైన విషయాలు దొరక్కపోతే, అందుకు మార్గాలు గూడా అవలంభిస్తారు. అదీగాక, నళిన్ బాబు, ఓ మనిషి అతిరహస్యపు కొన్ని అనాచారపుపనులు చేసినా, అటువంటి వాళ్ళు యిట్టే కనిపెట్టెయ్యగలరు. మామూలు దేశాచారాలు పాటిస్తే మనవంక ఎవరూ తేరిపార చూడరు ఎందుకూ, హేమ యిక్కడినుంచి, మీరు మీ డాబామీద యేం చేస్తున్నారో చూచింది. వెంటనే నాన్నదగ్గరకు వెళ్ళి చెప్పింది, మిమ్మల్ని మార్చటానికి తనచేత కాదని ఎరిగి

కూడా !" అన్నాడు జోగేంద్ర

హేమాలిని ముఖంలో ఆమె మనసులోని వికార మంతా కనిపించింది ఆమె యేదో చెప్పబోతూ వుండగా, నళినాక్ష ఆమెవంక తిరిగాడు.

"యిందులో సిగ్గుపడవలసిందేమీ లేదు. నేను ఉద యం, సాయంత్రం రెండుపూటలూ డాబామీద దైవప్రార్థన చేస్తాను. ఆ సమయంలోనే మీరు గాలికోసం పైకివచ్చి వుండవచ్చు. అప్పుడు నా చర్యలను గమనించడంలో యేమీ పొరపాటులేదు. ఏమంటే మీకు కళ్ళున్నందుకు మీ తప్పుకాదుగా !?

"అసలు విషయం, హేమ మీ దైనందిన ప్రార్థన లను హేళనంగా చూచిందేమీ లేదు. అతిథ భక్తితో గౌరవ ప్రపత్తులతో, మీ దైవధ్యానాన్ని గురించి అభ్యాసాలను గురించి కొన్ని ప్రశ్నలువేసింది. అంతే!" అన్నాడు ఆనంద బాబు.

"ఇంతకూ మీ వుద్దేశ్యమేమిటో నాకుఅర్థంకావడం లేదు. సాధారణమైన మానవజీవితంలోనూ, దాని ఆచారాల లోనూ నాకేమీ అనుకూలత అగుపించడంలేదు. అందు కోసం ప్రత్యేకించి రహస్యంగా కొన్ని అభ్యాసాలు చేయడం వల్ల లాభం యేమిటో నాకు తెలియడంలేదు. అలాచేస్తే మానసిక పరిస్థితిచే తలకిందయి పక్షపాతబుద్ధి యేర్పడ వచ్చును. నేనిలా చెబుతున్నందుకు కోపపడకండి. నేను అతి సాధారణమైన మనిషిని. ఈ ప్రపంచంలో అత్యంత అధమ మైన స్థానంలో కూర్చునివున్నాను. పైస్థాయిలో వాళ్ళతో

చేరాలంటే, వాళ్ళమీదికి రాళ్ళు వేయడంతప్ప మార్గం లేదు. నాలాంటివాళ్ళు యింకా లెక్కలేనంతమంది! కనుక మీరు అలాంటివాళ్ళనందర్నీ వెనకనే వదిలేసి, అవాస్తవిక ప్రపంచానికి ఎగబాకితే, మీకు ఎన్నో అడ్డంకులు దుర్ఘటనలు ఎదురవుతాయి" అన్నాడు జోగేంద్ర.

"ఈ అడ్డంకులు వుంటాయి, నిజమే. కొన్నిటివల్ల దెబ్బతగులుతుందికూడా! ఒకమనిషిని వెర్రివాడనీ, కుర్రకారువాడనీ పిలవండి. నష్టంలేదు. కాని మతోన్మాదిఅనీ నలుగురిని చుట్టూ పోగుచేసుకుని మతప్రవక్తగా పేరుపొందటానికి తాపత్రయపడుతున్నాడనీ అంటే, అంతకంటే వెర్రితనం లేదంటాను" అన్నాడు నళినాక్ష.

"అలా కోపగించుకోవద్దని మళ్ళీ ప్రార్థిస్తున్నాను, నళిన్‌బాబు. నీయింట్లో నీయిష్టంవచ్చినట్లుచేసుకో, నాకేం అభ్యంతరంలేదు. నేననేదేమిటంటే, ఎందుకుగానీ ఆచారాల పరిధిని దాటకుండావుంటే అతన్నిగురించి ఏ ప్రశ్నలూరావు. నామటుకు నేను నలుగురూ నడిచినదారిలోనే నడుస్తాను. ఒక్కఅడుగు పక్కగా వేశామంటే, చుట్టూ విపరీతంగా జనం పోగవుతారు. గుంపుమధ్య జీవితం అతి నిస్సహాయంగా వుంటుంది."

"బాగుంది జోగేన్. నన్ను మేడమీదినించి కిందికి తీసుకువచ్చి నీదారిన నువ్వు వెళ్ళిపోతానంటా వేమిటి? అలా కుదరదు"

"ఇవాళకు చాలు. నేను షికారు వెడుతున్నాను" అన్నాడు జోగేంద్ర.

అన్న వెళ్ళిన తరువాత, హేమ అవనత వదన అయి అక్కడే కూర్చుని వుంది. పరిశీలించిచూస్తే ఆమె కనుకొలకులలో అశ్రుబిందువులు అగుపిస్తాయి. దైనందిన పరిచయం వల్ల ఆమె నళినాక్ష చూపించే జీవిత ప్రక్రియలను అవలంబించాలనుకుంటూంది. అదీగాక విచారం అనేది కేవలం మానసికంగానే వుండిపోయే ఉద్రేకం కాదు. ఏదో కష్టసాధ్యమైన పనిని నెరవేస్తున్నప్పుడు అది బయటకు రావడానికి ప్రయత్నిస్తుంది. ఇటీవలి సంఘటనలతో ఆమె హృదయం నిండా విచారం స్తావరించుకునివుంది. నళినాక్ష అడుగుజాడలలో నడవాలని నిర్ణయించుకున్నతరువాత ఆమెకు యెంతో ఉపశాంతి చిక్కినట్లయింది. ఈ నిశ్చయానికి నాందిగా తన గదిలోని సరంజామా అంతా తీసివేయించింది. సోఫాలు, తివాసీలు సామాన్లగదిలోకి పంపింది. తన మంచానికి అడ్డంగా తెర కట్టించింది. ప్రతిరోజూ తనే స్వయంగా నీళ్ళు చల్లి శుభ్రంగా ఊడ్చుకునేది, పూలగుత్తి ఒక్కటే ఆమె మిగిల్చిన అలంకారం. స్నానానంతరం ధవళవస్త్రాలు ధరించి నేలమీద కూర్చునేది. సూర్యకాంతి కిటికీలోనుంచి చొచ్చుకువచ్చి గదిని నింపివేసేది.

ఆనందబాబు మతవిషయాలలో కూతురుతోపాటు అంతిఔన్నత్యానికి వెళ్ళలేకపోయినాడు. కాని ఆ తపోనిష్ట ఆమెముఖానికి కొత్త తేజస్సును కలిగించడంతో ఆయన సంబరపడ్డాడు. నళినాక్ష వారియింటికి వచ్చినప్పుడు, ముగ్గురూ నేలమీదనే కూర్చుని, గంటలతరబడి సంభాషించుకునేవారు.

జోగేంద్ర యిందుకు తన అనంగీకారాన్ని సుస్పష్టం

చేస్తూండేవాడు. "మీరందరూ యిలా అకస్మాత్తుగా యెందుకు మారిపోయారో నాకర్థంకాదు. మీ ముగ్గురిమధ్య, యీ యింటిని పరమ పవిత్రం చేసేసినట్లున్నారు. నాబోటివాడు అడుగుపెట్టటానికి సరిపోయే చోటుకూడా మిగిలివున్నట్లు లేదు"

ఒకప్పుడయితే, అన్నగారి మాటలకు హేమాలినికి విపరీతంగా కోపంవచ్చేదే. కాని యిప్పుడు ఆమె నళినాక్ష చూపించిన మార్గంలో ఒక్క చిరునవ్వుమటుకు విసిరి ఊరుకుంటూంది. ఇప్పుడు ఆమెలో పరిపూర్ణత ఆత్మవిశ్వాసము కలిగినాయి

ఒకనాడుఉదయం, ఆమె స్నానంచేసి ధ్యానంముగించి తనగదిలో యేకాంతంగా కూర్చునివుంది. అప్పుడు ఆనంద బాబు నళినాక్షతోసహా లోనికివచ్చాడు. హేమాలిని హృదయం పరిపూర్ణతతో పొంగిపోతోంది. పెద్దలయెడ చూపే సహజగౌరవంతో ఆమె వారికి పాదాభివందనంచేసి, వారి పాద ధూళిని స్వీకరించింది. నళినాక్ష ఖంగారుపడ్డాడు.

ఆనందబాబు అతనికి ధైర్యంచెప్తాడు "మరేం గందరగోళపడకు. అమ్మాయి సరయినపనే చేస్తోంది."

నళినాక్ష యింతవర కెప్పుడూ వారియింటికి యింత ఉదయాన రాలేదు. హేమాలిని అతని ముఖంవంక యేమిటన్నట్లు చూచింది. తనకు యిప్పుడే బెనారస్‌లో తన తల్లి సుస్తీగా వున్నట్లు వర్తమానం వచ్చిందనీ, అందుచేత రాత్రి రైలుకు తాను కలకత్తావదలి వెళ్ళవలసివుంటుందనీ, ప్రయాణ సన్నాహాలకు పగలంతా సరిపోతుంది గనుక వారివద్ద సెలవు

తీసుకోవడానికి ఈ వుదయమే వచ్చాననీ చెప్పాడు నళినాక్షు.

"మీా అమ్మగారి ఆరోగ్యం బాగాలేదంటే, నాకు విచారంగావుంది. ఆమె తొందరగానే తేరుకుంటుందని ఆశిస్తున్నాను. నీవు మాకుచేసిన సహాకారానికి నీకు ప్రత్యుపకారం చేసే సామర్థ్యం మాకులేదు'' అన్నాడు ఆనందబాబు.

నళినాక్షు ''లేదు. లేదు. మీా సహాకారానికి నేనే మీాకు ఋణపడివున్నాను. నాయందు యెంతో దయగా వున్నారు. మీానుంచి నేను అనేకం నేర్చుకున్నాను'' అన్నాడు.

'ఇంతకూ విచిత్రమైన విషయం యేమిటంటే, నీతో పరిచయం కాకముందు, మాకు మా జీవితాలలో యేదో కొరతవున్నట్లు అనిపించేది. కాని అదేమిటో స్పష్టంగా తెలిసేదికాదు. నీవు వచ్చింతర్వాత, మాకాచిక్కులన్నీ మంచులా విడిపోయినాయి. అందుకు నీ కెంతో కృతజ్ఞుణ్ణిం. ఇంతకూ మనను యీావిధంగా కలిపింది, విధే!''

''నన్ను కూడా కాస్త చెప్పనీయండి. ఇంతవరకూ నేను నా జీవితానికి సంబంధించిన అత్యంత రహస్యాలు మీాకు తప్ప యింకెవరికీ చెప్పలేదు. నాకు ఆవిధమైన ఉపశాంతి మీావల్ల లభ్యంఅయింది.''

హేమ యీా సంభాషణలో పాలుపంచుకోలేదు. నళినాక్షు సెలవు తీసుకోబోయేంతవరకూ అలాగే నిశ్శబ్దంగా గంభీరంగావుండి అప్పుడుమటుకు ''మీా తల్లిగారి ఆరోగ్యాన్ని గురించి మాకు ఉత్తరం వ్రాయడం మరువకండి'' అంది. సెలవు తీసుకునేముందు మరోసారి అతనికి పాదాభివందనం చేసింది.

# 44

అక్షయ యీమధ్య యీ యింటివైపు రావడంలేదు. కాని నళినాక్ష బెనారెస్ వెళ్ళిపోయిన తరువాత జోగేంద్ర అతన్ని తిరిగి టీ సమయానికి తీసుకువస్తున్నాడు. హేమాలిని ముఖకవళికలనుబట్టి ఆమె యింకా యేమాత్రం రమేష్‌ను గుర్తుపెట్టుకుని వున్నది. అనే విషయం అంచనా వేయడానికి ప్రయత్నిస్తున్నాడు అక్షయ. కాని నిజానికి ఆమె యెంతో నిశితంగా నిర్మలంగా అగుపిస్తోంది.

మామూలు ధోరణిలోనే "ఈమధ్య కనిపించడం లేదేం ?" అని అడిగింది.

"రోజూవచ్చి కనిపించాలా! ఆపాటి అవసరం వుందా నాతో ?" అని ఆక్రోశించాడు అక్షయ.

"అవసరంవుంటేతప్ప కనిపించగూడదనే నియమం నేర్పరచుకుంటే మనలో చాలామందిమి యేకాంతనివాసం చేస్తాం" అంది హేమ నవ్వుతూ.

జోగేంద్ర వారిద్దరికీ అనుకూలంగా వుండేట్లుగా కాస్సేపు మాట్లాడాడు. హేమ సంభాషణ పెంచకుండా కప్పుల్లో టీ పోసింది. ముగ్గురికీ అందించింది. "ఏం, నీవు టీ తాగవా ?" అనడిగాడు అన్న.

హేమాలిని అతను కోపపడతాడని గ్రహించింది. అయినా అతి గంభీరంగా "మానివేశాను" అని జవాబు చెప్పింది.

"అయితే నీవుకూడా సన్యాసం పుచ్చుకుంటున్నా

వన్నమాట! తేయాకు ఆధ్యాత్మిక సంపదను కూర్చదు కాబోలు! నీకు పుణ్యంవుంటుందికాని, హేమా! యిటు వంటి వెర్రిపనులు చేయకు. ఓ కప్పు టీ పుచ్చుకుంటే నీకేం తపోభంగంకాదులే. శాశ్వతమైనవే ఎంతోకాలం మన్నవు. ఇక యిటువంటి చిన్న విషయాలనుగురించి గొడవయెందుకు?" అన్నాడు జోగేంద్ర. అంటూనే ఒక కప్పులో టీ పోసి ఆమె ముందుకు నెట్టాడు.

ఆమె దాన్ని పుచ్చుకోకుండానే "యేం, నాన్న గారూ? టీతోపాటు యేమీ పుచ్చుకోవడలేదేం?" అనడి గింది.

జవాబు చెబుతూవుండగా, ఆయనచేతులు, కంఠము కూడా వణికాయి "నా కిప్పుడేం తినాలని లేదు. నేను కొన్నిరోజులుగా జోగేన్ కాఠిన్యానికి తలవంచి నడుద్దామని ప్రయత్నిస్తున్నాను. కాదని జవాబు చెబితే యేం ప్రయో జనం. అనవసరపుగొడవలు తప్ప! తరువాత విచారించడం కంటే ముందే జాగ్రత్తగా ఉండడం మంచిది!"

హేమాలిని తండ్రి కుర్చీదగ్గరకు వెళ్ళి నింపాదిగా యిలా అంది: "మరేం కొప్పడకండి నాన్నగారూ! జోగేన్ అన్నయ్య నాకు కప్పుటీ యివ్వడంలో తప్పేం వుంది?

మీరు ఉత్తి టీ తాగకండి, ఈ కేకులుకూడా పుచ్చు కోండి" అంటూ ఆమె అతనిచేత కేకుకూడా తినిపించింది.

హేమాలిని తన కుర్చీలో కూర్చుని టీ తాగబోతూ వుండగా అక్షయ హటాత్తుగా "ఆగు! ఆ కప్పు నాకివ్వు. నాకప్పు కాళీఅయిపోయింది" అన్నాడు.

జోగేంద్ర లేచి హేమాలిని దగ్గర్నుంచి కప్పు తీసుకుంటూ తండ్రితో "పొరపాటయింది. క్షమించండి" అన్నాడు. ఆనందబాబుకు జవాబు చెప్పడానికి గొంతుక పెగిలిరాలేదు. కళ్ళలో నీళ్ళు నిండాయి. జోగేంద్ర, అక్షయ మెల్లిగా గదిలోనుంచి జారుకున్నారు. ఆనందబాబుకూడా మరికొంత టీ పుచ్చుకుని కూతురుసాయంతో మేడమీదికి వెళ్ళాడు.

ఆ రాత్రి ఆయనకు ఏదో విపరీతమైన బాధ కలిగింది. డాక్టర్ వచ్చాడు. ఆయనకు శరీరంలో వేడి ఎక్కువైయీ బాధ కలిగిందని చెప్పాడు. ఒకసంవత్సరంపాటు — కనీసం ఆరు నెలలయినా — గాలి మార్పుకలిగితే గాని ఆయన ఆరోగ్యం కుదటపడదన్నాడు.

డాక్టర్ వెళ్ళిపోయి, బాధ కొంచెం నివృత్తించాక, ముసలాయన కుమార్తెతో "అమ్మాయి కొన్నాళ్ళపాటు బెనారస్ వెళ్ళి ఉందాం" అన్నాడు.

ఇదే ఆలోచన హేమాలిని బుర్రలోకూడా సరిగా యీ సమయంలోనే మెదులుతోంది.

నళినాక్ష వెళ్ళిపోయినప్పటినుంచి ఆమెకు దైనందిన ధ్యానాలలో ఏదో వెలితి కనిపిస్తోంది. శారీరకంగా, మానసికంగాకూడా ఆమె యాతన పడుతోంది ఈ సమయంలో తండ్రి యిలా ప్రతిపాదించడం ఆమెకు ఆనందం కలిగించి, తక్షణమే అందుకు అంగీకరించింది. 'అలాగే వెళదాం'" అంది. ప్రయాణ సన్నాహాలు జరుగుతూం వుండటంచూచి జోగేంద్ర యేమిటని అడిగాడు. ఆనందబాబు అతనికి తెలుపూ,

హేమా ఉత్తరప్రాంతానికి వెడుతున్నట్లు చెప్పాడు.

"ఎందాకా?"

"కొంతదూరం వెళ్ళికాని స్థిరపరుచుకోలేం" అన్నాడాయన కొడుకుతో, కాశీకి వెడుతున్నట్లు చెప్పలేక. జోగేంద్ర నేను మోహానో బాలేను. ఉద్యోగానికి దరఖాస్తు పంపాను. ఇవాళో రేపో జవాబు రావాలి" అన్నాడు విచారంగా.

## 45

ఒకనాడు తెల్లవారుఝామునే రమేష్ అలహాబాద్ నుంచి ఘజీపూరు తిరిగివచ్చాడు. ఇంకా బజారుల్లో జనం తిరుగాడడంలేదు. రమేష్ వడివడిగా తన బంగళావైపు వెడుతున్నాడు. అతనికి తన హృదయస్పందనంతప్ప యింకేం తెలియదు.

బంగళాముందు బగ్గీ ఆపించి దిగాడు. కమల యీపాటికి బగ్గీ చక్రాల చప్పుడువిని, తనకోసం వరండాలోకి వచ్చి నిలబడివుంటుంది. అతను అలహాబాదునుంచి ఆమెకోసం విలువైన నెక్లెస్ తెచ్చాడు. దాన్ని తనే స్వయంగా ఆమె కంఠసీమకు అలంకరిద్దామనుకున్నాడు. ఈ పెట్టెను కోటుజేబులోంచి తీసి పట్టుకున్నాడు. బంగళా దగ్గరకువచ్చి చూస్తే తలుపులన్నీ బిగించివున్నాయి. నౌకరు విషణ్ వరండాలో పడుకుని నిద్రపోతున్నాడు. అతనొక నిముషం ఏమీ తోచక అలాగే నిలబడ్డాడు. తరువాత విషణ్‌ను పేరుపెట్టి బిగ్గరగా పిలిచాడు. ఈ ధ్వని లోపలికికూడా వినిపించి కమల సైతం మేల్కొంటుందన్నంత బిగ్గరగా పిలిచాడు.

రాత్రంతా మేలుకునివున్న వ్యక్తికి యిదీ స్వాగతం !

ఎన్నిసార్లు అరిచినా విషణ్ లేవలేదు. ఆఖరుకు తట్టి లేపవలసివచ్చింది. నిద్రమత్తులోనే, వాడు లేచికూర్చుని ఒకటి రెండు క్షణాలు తేరిపార చూచాడు.

''అమ్మగారు యింట్లోవున్నారా ?'' అనడిగాడురమేష్.

ఒక్కక్షణం విషణ్ ఏమీ అర్థంకానట్లు చూచాడు.

"ఆ, ఉన్నారు" అన్నాడు నిద్రమత్తులోనే. మళ్ళీ వెనక్కు పడిపోయి నిద్రలో మునిగిపోయాడు.

నెట్టగానే తలుపు తెరుచుకుంది. రమేష్ లోపలకు వెళ్ళి గదులన్నీ కలయదిరిగాడు. కాని ఎవరూ లేరు.

"కమలా !'' అని బిగ్గరగా పిలిచాడు. కాని జవాబు రాలేదు.

తోటలోను, వంటింటిలోను వెదికాడు. ఎక్కడా కమల కనిపించలేదు. ఇంతలో సూర్యోదయం అయింది. కాకులు కావు కావు మంటూన్నాయి. ఇద్దరు ముగ్గురు పల్లె పిల్లలు నీళ్ళకడవలతో వెడుతూ కనిపించారు.

కొద్దిపాటి దూరంలోవున్న యిళ్ళలోని ఆడవాళ్లు పనిపాటలు చేసుకుంటూ వుండడం స్పష్టంగా కనిపిస్తోంది.

తిరిగి బంగళాకు చేరుకున్నాడు. విషణ్ యింకా నిద్రపోతూనే వున్నాడు. అతన్ని గట్టిగా కుదిపి లేపటానికి ప్రయత్నించాడు. అతనిదగ్గర కల్లుతాగిన వాసనవస్తోంది. చివరకు ఎలాగయితేనేం విషణ్ లేచి నిలుచున్నాడు.

"మీ అమ్మగారెక్కడ ?" అన్నాడు రమేష్. "ఆమె యింట్లోవుందిగా !'' "వెధవా ! ఆమె యింట్లో లేదు" ''ఆమె

నిన్న యిక్కడికి వచ్చింది" "తరువాత ఎక్కడికి వెళ్ళింది ?"

విపిన్ జవాబు చెప్పకుండా ముఖం తేలవేశాడు. సరీగా ఆ సమయంలోనే ఉమేష్ అక్కడికివచ్చాడు. నిద్రలేక వాడికళ్ళు ఎర్రగా వున్నాయి.

"అమ్మగారేరి ?" అన్నాడు రమేష్.

"అమ్మగారు నిన్నటినుంచి యిక్కడేవున్నారు."

"నువ్వెక్కడికి వెళ్ళావు ?"

"నన్ను సిద్ధుబాబు యింట్లో నాటకం చూడటానికి పంపించారు."

"నాకు బాడుగ యిచ్చి పంపించండి" అన్నాడు బగ్గీవాడు.

రమేష్ బగ్గీఎక్కి-బాబాయి యింటివైపు వెళ్ళాడు. అక్కడంతా ఖంగారుగావుంది. ముందు, కమలకు సుస్తీగా వుందేమో అనుకున్నాడు. కాని అది పొరపాటు. నిన్న సాయంత్రం ఉన్నట్లుండి ఉమి యేడుపుప్రారంభించింది. ముఖం రంగు మారింది. కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. పెద్దవాళ్ళం దరూ ఖంగారు పడ్డారు. రాత్రి అందరూ ఆపిల్లనే కనిపెట్టుకు వున్నారు. ఎవరికీ కంటిమీద కునుకన్నమాటలేదు. రమేష్ వెంటనే, కమల జబ్బుగావున్న అమ్మాయికి సేవచేస్తూ వుండి వుంటుంది అనుకున్నాడు. విపిన్‌తో ఉమికి యిలా సుస్తీ చేయడం, కమలకు ఎంతో విచారంగా వుండివుంటుంది." అన్నాడు. విపిన్‌కు కమల, రాత్రివూట యిక్కడికి వచ్చిందో లేదో తెలియదు. అయినా ఊరికే తలఊపి "అవును. ఆమెకు ఆమ్మాయి అంటే ఆపేక్ష ఎక్కువ. అందువల్లనే అద్దా.

అయినా, డాక్టరు భయంలేదని చెబుతున్నాడు" అన్నాడు.

కమలతో తన సమాగమనాన్ని ఏదో నిగూఢశక్తి అడగిస్తున్నట్లు అనిపించిది రమేష్‌కు.

ఉమేష్ బంగళానుండి వచ్చాడు. వాడికి జనానా లోపలికి ప్రవేశంవుంది. శైలజకు వీడంటే అభిమానంకూడాను.

శైలజ, ఉమేష్ తనగదిలోకి రావటంచూచి, పిల్లదానికి మెళుకువ వస్తుందేమో నన్న భయంతో యివతలకు వచ్చింది. ఉమేష్ కమలమ్మగారు ఎక్కడికి వెళ్లారు అని అడగడంతో ఆమెకు ఆశ్చర్యం వేసింది.

"నిన్న మీ రిద్దరూ కలిసే ఆ యింటికి వెళ్ళారుగా! నేను రాత్రి లక్ష్మయ్యను ఆమెకోసం పంపుదామనుకున్నాను. ఉమ గందరగోళంతో అలా చేయలేదు'' అంది.

"అయితే అమ్మగారు యిక్కడలేరా ?'' అన్నాడు ఉమేష్.

"యేమిటి నీ వనేది ? రాత్రంతా ఎక్కడికి వెళ్ళావు?"

"అమ్మగారు నాటకానికి పంపారు."

"విపిన్ ఎక్కడ ?''

"వాడికేం తెలీదు. రాత్రి విపరీతంగా కల్లుతాగాడు.''

"అయితే మా వారిని పిలువు తొందరగా'' అంది శైల ఆదుర్దాగా.

బిపిన్ రావడంతోటే "గందరగోళంగావుంది" అంది.

బిపిన్ తెల్లబోయి "ఏమిటది ?'' అన్నాడు.

కమల నిన్న బంగళాకు వెళ్ళింది. ఇప్పుడేమో కనిపించలేదంటున్నారు !"

"రాత్రి ఆమె యిక్కడికి రాలేదా ?"

"ఊహు, నేను కబురంపలేదు. రమేష్‌బాబు యిక్కడికి వచ్చాడా ?"

"ఆ ! అక్కడ చూచే, యిక్కడ ఉందనుకుని వచ్చాడు."

"వెంటనే వెళ్ళి అతనితో పాటు ఆమెకోసం వెదకండి. ఉమి నిద్రపోతోంది- మరేం భయం లేదు లెండి."

బిపిన్ రమేష్ మళ్ళీ బంగళాకు వెళ్ళి విషణ్‌ను ప్రశ్నలువేశారు. ఎన్నో ప్రశ్నలు వేసినమీదట వాడిదగ్గర నుంచి యీ క్రింది సమాచారం రాబట్టగలిగారు. మధ్యాహ్నం గడిచాక కమల ఒంటరిగా నదికి ప్రయాణమయింది. విషణ్ తనుకూడా తోడువస్తానన్నాడు.

ఆమె వద్దని, వాడికో రూపాయి యిచ్చింది. వాడు గేటుదగ్గర కాపలా కాస్తూ కూర్చున్నాడు. అక్కడ ఉండగా కల్లుగీతవాళ్ళు అప్పుడే గీసిన కల్లు ముంతలతో పట్టుకు వెడుతున్నారు. తరువాత యేం జరిగిందీ విషణ్‌కు సరీగ్గా గుర్తు లేదు."

కమల గంగానదికి వెళ్ళినదారిని మటుకు గుర్తు తెచ్చుకుని చెప్పాడు.

రమేష్, బిపిన్, ఉమేష్ ఆ దారివెంట కమలను వెదుకుతూ వెళ్ళారు. నదీతీరానికివచ్చాక ఆగారు. ఎక్కడా మనిషి కనబడడంలేదు. అంతా యిసుకతిన్నె. ఉమేష్ బిగ్గరగా "అమ్మగారూ ! ఎక్కడున్నారు ?" అని అరిచాడు. ప్రతిధ్వని తప్ప యింకేం జవాబు రాలేదు."

చుట్టూ చూచి ఉమేష్ ఏదో తెల్లనివస్తువు ఉన్నట్లు కనిపెట్టాడు. నదీతలానికి దాపున తాళంచెవులగుత్తి చేతి రుమాలులో కట్టి పడిఉంది

"యేమిటది ?" అన్నాడు రమేష్.

అది నిశ్చయింగా కమల తాళంచెవుల గుత్తే. ఆ తీరానే నీళ్ళలోకి వెడుతున్న అడుగుజాడలు రెండు కని పించాయి.

ఈ చిహ్నాలన్నీ చూచి ఉమేష్ గొల్లుమన్నాడు.

"అమ్మగారూ ! అమ్మగారూ !" అంటూ యేడుస్తూ నీళ్ళలో చేతులుపెట్టి గాలిస్తున్నాడు.

రమేష్‌కు నోటమాటరావడంలేదు. ఉమేష్‌ను అది లిస్తు బిపిన్ "ఏంచేస్తున్నావు, యిటురా" అన్నాడు.

"నేను రాను—" అంటూ ఉమేష్ యింకా లోతుకువెడుతూ "అమ్మగారూ ! నన్నిలా వదిలి ఎక్కడికి వెళ్ళారు ?" అని యేడుస్తున్నాడు.

చివరకు ఉమేష్ విసుగుపుట్టి నీళ్ళలోంచి బయటకు వచ్చి యిసుకమీదపడి యేడుస్తూ దొర్లుతున్నాడు.

అయోమయంనుంచి మేల్కొలపటానికి బిపిన్ రమేష్ బుజంమీద చేయివేసి తట్టాడు.

"రా, రమేష్‌బాబు' మనం యిక్కడ టైం వృథా చేస్తున్నాం. పోలీసులకు కబురుచేద్దాం పద. వాళ్ళు అన్ని చోట్లా వెదికిస్తారు."

శైలజ యింట్లో ఆరోజు ఎవరూ భోజనం చేయలేదు. ఇల్లంతా యేడుపులు పెడబొబ్బలతో మారుమోగుతోంది.

బెస్తవాళ్ళు నీళ్ళలో గాలిస్తున్నారు. పోలీసువాళ్ళు పల్లెల్లో వెదుకుతున్నారు. రైలుస్టేషన్‌లో ప్రత్యేకంగా విచారించారు. కాని ఆ రాత్రి రైలులో కమల వర్ణనకు సరిపోయే బెంగాలీయువతి ఎవరూ ప్రయాణం చేయలేదు.

ఆమధ్యాహ్నం బాబాయి వచ్చాడు. అదృశ్యమవడానికి ముందు కమల వింత ప్రవర్తన గురించి విని, ఆయన కమల నీళ్ళలోమునిగి ఆత్మహత్య చేసుకుందని నిర్ధారించుకున్నారు.

లక్ష్మయ్య "ఉమి నిన్నసాయంత్రం అలా అరిచి యెందుకు సుస్తీపడిందో నాకు యిప్పుడు అర్థం అవుతోంది" అన్నాడు.

రమేష్‌కు యేమీ తోచడంలేదు. "కమల నాకు గంగానదిలోనుంచి బయటకువచ్చినప్పుడే దొరికింది. మళ్ళీ పూజ అనంతరం పారవేసే పుష్పంలా, ఆమె అదేనదిలో కలిసిపోవడం ఎంతో ఆశ్చర్యంగా వుంది" అనుకున్నాడు.

సూర్యాస్తమయం అయినాక నదికి వెళ్ళాడు. తాళం చెవులగుత్తి దొరికినచోట నిలబడి, ఆ అడుగుజాడలవంక మళ్ళీ చూచాడు. తన చెప్పులు విడిచాడు, నీళ్ళలోకి నడిచాడు. జేబులోని పొట్లంతీసి, అలహాబాదునుంచి కమలకోసం తీసుకువచ్చిన నెక్లెస్‌ను నదిమధ్య వదిలేశాడు.

అతనిక ఎక్కువసేపు ఘజీపూర్‌లో లేడు. బాబాయి ఇంట్లో అందరూ ఈ విషాద సంఘటనకు కుమిలిపోతున్నారు. అందరూ ఆ కాస్సేపూ అతనిచుట్టూ మూగివున్నారు.

# 46

రమేష్ భవిష్యత్తులో పెద్ద ఖాళీ యేర్పడినట్లయింది. అతనికి ఎదురుచూచే కార్యక్రమం ఏమీలేదు. రోజువారీగా జరిగిపోయేపనిగాని, అలవాట్లుగాని లేవు. అతను పూర్తిగా హేమాలినిని మరచిపోయాడనుకోగూడదు ఆమెను గురించి ఆలోచనలు అవతలకు నెట్టివేయలేదుకూడా. తనలో తాను 'విధి విసరిన బాణాలవల్ల నాకు యీ ప్రపంచంలో ఎలాంటి స్థానమూ లేకుండపోయింది. విరిగిపోయిన మొక్కలకు తోటలో స్థానం లేదు'

ప్రయాణం చేయడంలో కొంత ఉపశాంతి దొరుకు తుందని భావించి అతను అదేపనిగా పర్యటన చేయసాగాడు. గంగానదిమీద పడవప్రయాణంచేసి బెనారస్‌లోని అన్ని ఘట్టాలు చూచాడు. ఢిల్లీ వెళ్ళి కుతుబ్ మినార్ ఎక్కాడు. ఆగ్రా వెళ్ళి తాజ్‌మహల్ సందర్శించాడు. అమృత్‌సర్ బంగారుగుడి చూచాడు. రాజపుతానా వెళ్ళి అక్కడినుంచి మౌంట్ అబూమీద గుళ్ళన్నీ సేవించాడు. ఈ యాత్ర లలో అతని శరీరానికిగాని, మనస్సుకుగాని విశ్రాంతి అన్నదే లేదు.

చివర కతనికి యింటిని గురించి బెంగపట్టుకుంది. చిన్న తనంలోని ప్రశాంతమైన యిల్లు, తను ఊహించుకున్న ఆదర్శగృహము అన్నీ తలుచుకున్నాడు. ఈ ఆలోచనలు రావడంతోనే యాత్రకు స్వస్తిచెప్పవలసివచ్చింది. కలకత్తా వెళ్ళే ఎక్స్‌ప్రెస్‌లో సీటు సంపాదించి అందులో తిరుగు

ప్రయాణం సమకట్టాడు.

కాలుటోలా చేసుకోవడానికి ముందు కొన్నిరోజులు రమేష్ కలకత్తాలో ఉన్నాడు. తాను నివసించిన యింటి సందువరకూ వెళ్ళాడు. ఒకరోజు, మరురోజు ఆనందబాబు యింటి ముందువరకూ వెళ్ళాడు తలుపులు అన్నీ మూసి వున్నాయి! ఎవరూ వున్న అలికిడి లేదు. కనీసం నౌకరు సుఖిన్ అన్నా ఏ మూలో వుంటాడనిపించింది. పిలిచాడు. తలుపు తట్టాడు. కాని జవాబు రాలేదు. పక్కయింటినుంచి చంద్ర మోహన్ రమేష్‌ను చూచి, గుర్తుపట్టి పలకరించి ఆనంద బాబు యింట్లో ఎవరూ ఊళ్ళో లేరని చెప్పాడు.

"వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో నీకు తెలుసా?"

"ఊహుఁ. ఉత్తరదేశం వెళ్ళారు అని మటుకే తెలుసు—"

"ఎవరెవరు వెళ్లారు?"

"ఆనందబాబు. ఆయన కూతురు."

"వాళ్ళతో యింకెవ్వరూ లేరని నీకు రూఢిగా తెలుసా?"

"ఆ! వాళ్ళు వెళ్ళడం నేను చూచాను."

"ఎవరో నాకు, వాళ్ళతోపాటు నళిన్‌బాబు అనే అతను కూడా వెళ్ళాడని చెప్పారు."

"నీకు సమాచారం చెప్పినవాళ్ళు పొరపడివుంటారు. నళిన్‌బాబు యిదివరకు నీవుఉంటూవచ్చిన యింట్లో ఉండే వాడు. కాని అతను ఆనందబాబువాళ్ళు వెళ్ళడానికి అనేక రోజులముందు బెనారస్ వెళ్ళాడు."

రమేష్ చంద్రమోహన్‌తో నళిన్ బాబునుగురించి ప్రస్తావించి పూర్తిపేరు నళినాక్ష చటోపాధ్యాయ అనీ. రంగపూర్‌లో డాక్టరీ ప్రాక్టీసు చేసేవాడనీ, యిప్పుడు మటుకు తల్లితో బెనారెస్‌లో వుంటున్నాడనీ తెలుసుకున్నారు. కొద్దిసేపు ఆగి రమేష్ చంద్రమోహన్‌తో "జోగేన్ ఎక్కడున్నాడో నీకు తెలుసా?" అని అడిగాడు.

జోగేంద్ర బిసియాపూర్ అనే ఊరు వెళ్ళాడనీ అక్కడ హైస్కూల్ హెడ్‌మాష్టర్ ఉద్యోగం చేస్తున్నాడనీ తెలుసుకున్నాడు

చంద్రమోహన్ యిక తను రమేష్‌ను ప్రశ్నలు వేయసాగాడు: "చాలాకాలంనుంచి కనిపించడంలేదు, రమేష్ బాబూ. ఇన్నాళ్ళు ఎక్కడున్నావు?" అనడిగాడు.

రమేష్‌కు తననుగురించి సమాచారం దాచుకోవడం అనవసరం అనిపించింది.

"ఘజీపూర్‌లో ప్రాక్టీసు చేయటానికి వెళ్లాను."

"అక్కడే స్థిరపడిపోతావా?"

"లేదు. మకాం ఎక్కడికి మార్చాలో యింకా నిర్ణయించుకోలేదు."

—రమేష్ అటు వెళ్ళగానే యిటు అక్షయ ప్రవేశించాడు. జోగేంద్ర కలకత్తానుంచి వెళ్ళిపోతూ అప్పుడప్పుడు అక్షయను తను ఇల్లు చూచిపోతూవుండమని చెప్పాడు. అక్షయ యెప్పుడూ తను భుజానవేసుకున్న బాధ్యతను విస్మరించడు.

చంద్రమోహన్ అతన్ని పలకరించి "రమేష్‌బాబు

యిప్పుడే వచ్చి వెళ్ళాడు" అన్నాడు.

"నిజం ? ఏమన్నాడు ?"

"నాకేం తెలియదు. ఆనందబాబు కుటుంబాన్ని గురించి నాకు తెలిసిన వివరాలన్నీ చెప్పాను. అతను గుర్తు పట్టటానిక్కూడా వీల్లేనంతగా మారిపోయాడు. అతను నౌకరును పిలవడం వినిపించి, నేను గుర్తుపట్టాను"

"అతనిప్పుడు యెక్కడ వుండున్నాడో కనుక్కున్నావా ?"

"ఇన్నాళ్ళూ ఘజీపూర్‌లో ఉన్నాడట. ఇప్పుడక్కడ నుంచి మకాం మార్చివేసి, యింకా ఎక్కడ చేరడమో నిర్ణయించుకోలేదట."

"అలాగా!" అంటూ అక్షయ తన పని చూచుకుంటానికి వెళ్ళిపోయాడు.

రమేష్ తన మకాముకు తిరిగివచ్చి యిలా ఆలోచించుకున్నాడు : "విధి నాతో చెలగాటం ఆడుతున్నట్లుంది. కమలతో నా సంబంధం ఒకవైపు, హేమాలినితో నాలినాక్షు సంబంధం మరొకవైపు, చక్కటి చిక్కని నవల వ్రాయటానికి తగినంత సామగ్రి అవుతుంది. విధి తప్ప మరే రచయిత కూడా యిటువంటి సన్నివేశాలను సృష్టించలేడు. ఏ నవలా కారుడు కూడా ఊహించి సృష్టించలేని సన్నివేశాలను విధి మటుకే కూర్చగలదు."

జోగేంద్ర తను బసచేసిన మేడమీద గదిలో కూర్చుని పత్రిక చదువుకుంటూవుండగా, ఒక నౌకరు చీటీ పట్టుకు వచ్చాడు. అది రమేష్‌నుంచి వచ్చింది. తాను బి[illegible]యూ

పూర్‌లో ఓ దుకాణందగ్గర వేచివున్నానసీ తొందరగా తనతో మాట్లాడవలసిందనీ వ్రాశాడు.

జోగేంద్ర తటాలున కుర్చీలోనుంచి లేచాడు. జోగేంద్రకు రమేష్ అంటే వున్న కోపం యిప్పుడిప్పుడే కొద్దిగా తగ్గుముఖం పడుతోంది. తన చిన్ననాటి స్నేహితుడు తనను కలుసుకోవడానికి వచ్చాడంటే కలిగే సంతోషం అతనికిప్పుడు కలుగసాగింది. అందుచేత అతను రమేష్‌ను కలుసుకోవడానికి ఉత్సాహపడ్డాడు. అతని మనస్సుకూడా జరుగనున్న విషయాలు తెలుసుకోవడానికి ఉర్రూతలూగుతోంది. హేమాలిని ఎలాగూ ఊళ్ళో లేదుగనుక, తను రమేష్‌ను కలుసుకున్నప్పటికీ యేమీ హాని వుండబోదు.

ఆ నౌకరువెంట జోగేంద్ర రమేష్‌ను కలుసుకోవడానికి వెళ్ళాడు.

"గుప్తపట్టటానికి వీల్లేకుండా మారిపోయావు రమేష్. తిన్నగా నా మకాముకు రాకుండా యిక్కడ యీ దుకాణంలో యెందుకు కూర్చున్నావు? అన్నాడు.

అతని మృదు భాషణకు రమేష్ అచ్చెరువొందాడు. నవ్వాడు.

ఇద్దరూ కొద్దిసేపు కులాసాగా మాట్లాడుకున్నారు. జోగేంద్ర అతన్ని యింటికి తీసుకువెళ్ళాడు.

ఇంటికి చేరుకోగానే రమేష్ ఒక కుర్చీలో కూలబడబోయాడు. జోగేంద్ర "అప్పుడే కూర్చోకు. నీ అలవాట్లు నేనింకా మర్చిపోలేను. వెళ్ళి స్నానం చేసిరా. నే నింతలో టీ తయారు చేస్తాను" అన్నాడు.

ఆ రోజంతా భోజనం, సంభాషణ విశ్రాంతితో సరిపోయింది. రమేష్‌కు తాను బిసియాపూర్ యెందుకు వచ్చాడో చెప్పే అవకాశమే మిగలలేదు.

రాత్రి భోజనం అయినాక, గదిలోనే దీపం వెలుగులో కూర్చున్నారు. అప్పుడు రమేష్ తను వచ్చిన పనిని ఇలా చెప్పాడు :

"జోగేన్, నేనెందుకు వచ్చానో చెబుతాను విను. నీవు, వెనక ఒకసారి నన్ను, నీ ప్రశ్నకు జవాబు ఎప్పుడు చెబుతావో అడిగావు. ఆ జవాబు ఇప్పుడు చెప్పడానికి ఏమీ అడ్డంకులు లేవు"

రమేష్ కాస్సేపు నిశ్శబ్దంగా వున్నాడు. కొన్ని క్షణాలు గడిచాక కమలతో తన సంబంధ బాంధవ్యాలను గురించిన కథ యావత్తూ అతనికి వినిపించాడు. మధ్య మధ్య అతనిగొంతు వణికింది. మాటలు తడబడినాయి. జోగేంద్ర నిశ్శబ్దంగా అంతా విన్నాడు.

అతడు చెప్పడం పూర్తయిన మీదట, జోగేంద్ర నిట్టూర్చాడు.

"ఆ రోజునే ఇదంతా నాకు చెప్పినట్లయితే, నేను నమ్మగలిగేవాడిని కాదు."

"ఇవాళ వరకు, పరిస్థితికూడా అలాగేవుంది. నీవు నాతోకూడా, నా వివాహమయిన గ్రామానికి రావాలి. అక్కడినుంచే నిన్ను కమల మామగారింటికికూడా తీసుకు వెడతాను.

"నే నొక్క అడుగుకూడా ముందుకు వేయను. నీవు

చెప్పిందంతా నిజమేనన్న పూర్తి విశ్వాసం నాకు వుంది. నే నెప్పుడూ నిన్ను అక్షరాలా నమ్ముతూనే వున్నాను. ఆ అలవాటు ఒక్కసారి దాటినందుకు మటుకు, నన్ను క్షమించాలి.''

జోగేంద్ర కుర్చీలోనుంచి లేచాడు. పాతస్నేహితులు ఇద్దరూ పరస్పరం కౌగలించుకున్నారు.

రమేష్ ఇంకా ఇలా అన్నాడు: "విధి నన్ను సాలె గూడులోనికి లాక్కుపోయింది. దాంట్లో ఇరుక్కోవడంతప్ప ఇంకేం చేయలేకపోయినాను. ఇప్పుడు విముక్తి పొందాను కనుక హాయిగా స్వేచ్ఛగా గాలి పీల్చుకోగలుగుతున్నాను. ఈ రోజువరకూ కమల యెందునిమిత్తం ఆత్మహత్య చేసు కుందో నాకు గోచరం కావడంలేదు. ఇక ముందుకూడా అర్థం అవుతుందనిపించడం లేదు. ఒక విషయంమటుకు రూఢి. ఆమెకు అంతకంటే సుగమ్మైన మార్గంలేదు! ఈ అనుబంధాన్ని ఆమె ఇలా తుంచివేయలేకపోయినట్లయితే మా ఇద్దరిగతి ఏమయేదో నాకు దురూహ్యంగావుంది. ఆమె అక స్మాత్తుగా, అనుకోకుండా మృత్యుముఖంనుండి తప్పించుకుని నాకు దొరికింది. అలాగే ముందు తెలియకుండా అర్థంకాని విధంగా అదృశ్యమైపోయింది.''

''కమల ఆత్మహత్య చేసుకున్నదనే అనుకోనక్కర్లేదు. ఏమయినా నీకు సంబంధించినంతవరకు, ఏమీ అడ్డంకులు లేకుండా పోయాయి. పోతే యిక నళినాక్షవిషయమే వుంది. అటువంటి మనిషి తత్వాన్ని నేను అర్థంచేసుకోలేక పోతు న్నాను. అందుకనే నాకు హేమనుగురించి భయంవేస్తోంది.

ఆమె టీ మానేసి శాకాహారమే భోజనం చేస్తోంది. ఆమె కళ్ళల్లో పూర్వపు కాంతి లేదు. ఏమయినా, నీ సహాయ సహకారాలువుంటే ఆమెను మళ్ళీ మామూలుమనిషిని చేయగలను అందుకు నీవు సిద్ధం అవక తప్పదు."

రమేష్ నక్వి, "అలాగే" అన్నాడు.

జోగేంద్ర "క్రిస్టమస్ సెలవులవరకు వేచివుందాం" అన్నాడు.

"ఇంకా చాలా విరామం వుందిగదా! అంతవరకూ నేనొక్కడినే ప్రయత్నించనా?"

"ఉహు, అలాకాదు మీ యిద్దరికీ ఎడబాటు కలిగించింది నేను. అందువల్ల మళ్ళీ యీ అపార్థాలు తొలగించి ఇద్దరినీ కలపవలసిన బాధ్యత నాది!"

"అయితే యీ లోపల నేను......"

"ఈ పదిరోజులు నీవు నా అతిథిగా వుండాలి. నేను నా పూర్వపు పద్ధతులన్నీ మార్చుకున్నాను. ఇప్పుడు నాకు నీ సహాయం ఎంతో అవసరం" అన్నాడు జోగేంద్ర.

## 47

చంద్రమోహన్‌నుంచి వచ్చినవార్త అక్షయ ఆలోచనలకు మంచి ఆహారంలా వుంది.

"దీనికంతటకీ మూలం యేమయివుంటుంది? అయితే రమేష్ ఘజీపూర్‌లో ప్రాక్టీసు చేస్తున్నాడన్నమాట! ఎంత నేర్పుగా తప్పించుకు వెళ్ళాడు! అయితే యిక్కడినుంచి ముఖం తప్పించుకు వెళ్ళడానికి కారణం యేదో వుండాలిగా.

అదేమయి వుంటుంది? నేడో రేపో ఆనందబాబు, హేమాలిని బెనారెస్‌లో వున్నారని అతనికీ తెలుస్తుంది. అప్పుడేం చేస్తాడో చూడాలి!" అనుకున్నాడు తనలో తాను.

అక్షయ యీ లోపల ఒకమారు ఘజీపూర్ వెళ్ళి అక్కడ దొరికినంతవరకూ వివరాలు సేకరించుకు వద్దామను కున్నాడు. తరువాత తాను బెనారెస్ వెళ్ళి ఆనందబాబుతో ముఖాముఖీ మాట్లాడి రావచ్చు.

డిసెంబరు నెలలో మధ్యాహ్నంపూట — ఒకనాడు. అక్షయ చేతిసంచితో సహా ఘజీపూర్ చేరుకున్నాడు.

ముందుగా దుకాణదారులను వాకబు చేశాడు. ఇక్కడ రమేష్‌బాబు అనే పేరుతో ఎవరయినా బెంగాలీబాబు, ప్లీడరు వృత్తి చేస్తున్నాడా ? అని అడిగాడు. కాని అతని ప్రయత్నం ఫలించలేదు. ఎవరూ తాము ఎరగమంటే తాము ఎరగ మన్నారు.

తరువాత అతను కోర్టులలో వాకబు చేశాడు. ఆరోజుకు కోర్టులు మూసేశారు. అప్పుడే బగ్గీలో ఎక్కబోతున్న ఒక బెంగాలీ వకీలును ఆపి అక్షయ "అయ్యా క్షమించండి. రమేష్‌చంద్ర చౌదరి అని యిక్కడో బెంగాలీప్లీడరు వుండాలి. వారికోసం వెదుకుతున్నాను. మీకు ఆయనబసు తెలుసునా?" అని అడిగాడు.

రమేష్ కొన్నాళ్ళు బాబాయియింట్లో వుండేవాడనీ. యిప్పుడు అక్కడ వుంటున్నాడో లేదో తనకు తెలియదనీ, యిటీవలనే ఆయనభార్య కనిపించకుండా పోయిం... నదిలోమునిగి చనిపోయిందనీ అనుకుంటున్నా...

ద్వారా తెలుసుకున్నాడు అక్షయ.

అక్షయ యిప్పుడు బాబాయియింటివైపు నడిచాడు.

"రమేష్‌నాటకం యేమిటో యిప్పుడు తెలుస్తూంది. అతనిభార్య చనిపోయిందన్నాడుకదూ! అయితే అతనిప్పుడు తిరిగి హేమాలినిదగ్గరకు చేరుతాడు. తనకు అసలుభార్యంటూ ఎవరూ లేరని నిరూపించడానికి ప్రయత్నిస్తాడు. ప్రస్తుతంవున్న స్థితినిబట్టి చూస్తే రమేష్ యేంచెబితే హేమాలిని దానినల్లా నమ్ముతూ వుంటుంది," అంటూ అక్షయ తనలోతానే తన చాకచక్యానికి, తెలివితేటలకు మురిసిపోతున్నాడు.

అక్షయవెళ్ళి రమేష్, కమలను గురించి అడిగే సరిగి బాబాయికి దుఃఖం ఆగిందికాదు. ఆయన కళ్ళవెంట నీళ్ళు జలజలరాలాయి

"మీరు రమేష్‌బాబుకు ప్రత్యేక స్నేహితుడినని చెబుతున్నారు గనుక, మీకు కమలను గురించి కూడా పూర్తిగా తెలిసేవుంటుంది కమలకూడ నా కూతుళ్ళలో ఒకతె అనుకున్నాను. కాని యిలా యీ దీనుడి గుండెలను దహించివేస్తుందని అనుకోలేదు."

అక్షయ సానుభూతి నటిస్తూ "యేమిటో అంతా గొడవగానే వుంది. అయితే రమేష్ ఆమెను సరిగ్గా చూడలేదన్నమాట!"

"రమేష్ మీకు బాగా స్నేహితుడు. నేనతన్ని యేమన్నా అంటే మీకు కోపగించుకోకండి. కాని నిజం చెప్పాలంటే, నాకతన్ని అర్థంచేసుకోవడమే తెలియలేదు. అతనితో మాట్లాడుతూవుంటే బాగానే వుంటుంది. కాని

అతని మనస్సులో యేమేం ఆలోచనలున్నాయో ఊహించడం కష్టం. కమలవంటి సౌందర్యరాశిని అతను నిర్లక్ష్యంగా చూచేవాడంటే అతన్నిగురించి యేమనుకోవాలో అర్థంకాదు. ఆమె ఎంత విశ్వాసపాత్రంగా వుండేది! ఆమె, మాఅమ్మాయి అంత స్నేహితులు అయినప్పటికీ ఎన్నడూ తన భర్తనుగురించి ఒక్కమాటయినా అనలేదు. అమ్మాయి ఎంతప్రయత్నించినా కూడా కమల నోరుజారి ఒక్కమాటయినా అనలేదుట! ఆ విషయం తలుచుకుంటే నాగుండె పగులుతుంది. అటువంటి అమ్మాయి చివరకుఎన్నికష్టాలుపడింది! సరిగా ఆ సమయంలో నేను అలహాబాదు వెళ్ళి వుండడంవచ్చింది అనర్థాని కంతకూ నేనే మూలం! నేను గనుక ఊళ్ళోనే వున్నట్లయితే నాముఖం చూచయినా, నన్ను విడిచిపెట్టి వెళ్ళడం యిష్టంలేకయినా, ఆమె అలా చేసి వుండేదికాదు."

మరునాడు ఉదయం బాబాయి అక్షయను రమేష్ బంగళాకు తీసుకువెళ్ళాడు. అక్కడవాళ్ళు కమల అంతర్థానం అయిన నడరేవును కూడా సందర్శించారు.

అక్షయ తిరిగి యింటికి వచ్చేంతవరకూ యేమీ మాట్లాడలేదు. చివరకు "మీరు, కమల గంగానదిలో మునిగి ఆత్మహత్యచేసుకున్నదని చెబుతున్నారుగాని నేనా విషయం విశ్వసించలేకుండా వున్నాను" అన్నాడు.

"అయితే మీ అభిప్రాయం యేమిటి?"

"ఆమె ఇంటిలోంచి పారిపోయిందేమో! ఆమెకోసం బాగా వెదికించడం మంచిపని!"

బాబాయి విసిగిపోయి అలసిపోయి కుర్చీలోంచి

లేచాడు.

"మీారు చెప్పింది నిజమే. అందులో అసంబద్ధం యేమీాలేదు."

"బెనారెస్ యిక్కడికి ఎక్కువదూరంకాదు. అక్కడ నాకు, రమేష్‌కుకూడా ఆత్మీయులైన ఒక కుటుంబంవుంది. బహుశ కమల అక్కడగాని తలదాచుకున్నదేమో!" అన్నాడు అక్షయ.

"రమేష్‌బాబు నాకు యీా విషయం యెన్నడూ చెప్పలేదే! నాకు తెలిసివున్నట్లయితే యీా విషయం ఆరా తీసి కనుక్కునేవాడిని!"

"అయితే మనమిద్దరం యిప్పుడు బెనారెస్ వెడదాం. మీాకు యీా ప్రాంతం బాగా తెలుసుగదా! అందుచేత సాధ్యమైనంతవరకూ అన్వేషించవచ్చు" అన్నాడు అక్షయ,

బాబాయి యీా ప్రతిపాదనకు వెంటనే అంగీకరించాడు. ఋజువు సాక్ష్యం లేకుండా తను ఎన్ని నిజమైన విషయాలు చెప్పినా హేమాలిని నమ్మదని అక్షయకు తెలుసు. ఇప్పుడు బాబాయి సహకారంతో, రమేష్ నిజస్వరూపం వాళ్ళకు తెలియజెప్పవచ్చును. ఈగొడవంతా ఏమీా తెలియకుండానే, అమాయకుడైన చక్రవర్తిబాబాయి బెనారస్ ప్రయాణం కట్టాడు.

# 48

ఆనందబాబు ఊరిబయట కంటోన్‌మెంటులో ఒక బంగళా అద్దెకు తీసుకున్నాడు. బెనారెస్ వచ్చింతర్వాత,

నళినాక్షుతల్లి ముందు కేవలం దగ్గుజ్వరంతో బాధపడుతున్న దల్లా "న్యుమోనియా" ప్రవేశించి మంచంమీదే వుందని తెలుసుకున్నాడు. ప్రస్తుత వాతావరణం యీ జబ్బుకు మంచిదికాదు. అయినా ఆమె తన మతాచారాల ప్రకారం ఉదయం గంగాస్నానం మానివేయటానికి నిరాకరించింది. అందుచేత ఆమె ఆరోగ్యం మరీ ఉపద్రవకరమైన పరిస్థితిలో వుంది. ఒకరకంగా, హేమాలిని ఆమెకు యేవిధంగానూ సేవ చేయలేక పోతోంది. ఏమంటే ఆమెకు మత ప్రాశస్త్యం ఎక్కువ. తన మందు మాకులు సైతం బ్రహ్మసమాజపు అమ్మాయి ముట్టుకుంటే పనికిరావు. స్వయంపాకం తప్ప ఆమె భోజనంచేయదు. ఇప్పుడు నళినాక్షు తానే స్వయంగా ఆమెకు వంటచేసి పెడుతున్నాడు. అతని తల్లికి యిది బాధాకరంగానే వుంది.

"దేవుడు నన్ను యింకా ఎందుకు తీసుకు పోకుండా వుండాలి? నిన్నిలా అవస్థ పెట్టటానికి తప్ప, నాకు యింకా ప్రాణం ఎందుకు—" అంటోంది క్షేమంకరి.

తన అన్నపానాదులలో ఆమెకు ఎంత ఆచారమో అలాగే తన పరిసరాలను శుభ్రంగా వుంచుకోవడంలోకూడా అంత శ్రద్ధ. ఈ విషయం నళినాక్షుద్వారా తెలుసుకుంది హేమ అందుచేత ఆమె ఇల్లు చక్కదిద్దడం, తను ఆమెకు ఎదురుపడేటప్పుడు చక్కగా అలంకరించుకోవడం శుభ్రమైన దుస్తులు ధరించడంచేస్తోంది. మంచి మంచి పూవులు తెప్పించి క్షేమంకరి జబ్బుమంచంచుట్టూ అందంగా అలంకరిస్తోంది హేమాలిని.

నళినాక్ష తల్లిసేవలకోసం దాసీదాన్ని తెచ్చిపెడతా నన్నాడు. కాని దాసీదాని సేవలను ఆమె అంగీకరించదు. ఇంటి నౌకర్ల చేతకూడా, ఆమె తనకు అవసరమైన సేవలు చేయించుకోదు.

ఆమెకు అందమైన చిన్నపిల్లలంటే ఎంతో యిష్టం. గంగా స్నానానికి వెళ్ళివచ్చేటప్పుడు దారిలో అందంగావుండే అబ్బాయిలను, అమ్మాయిలను తన యింటిదాకా తీసుకవచ్చి కానుకలుయిచ్చి పంపిస్తూ వుండేది. అందమైన వస్తువులు కని పించినప్పుడు వాటినికొని తనదగ్గర భద్రంగా వుంచుకుని అప్పు డప్పుడు ఎవరికైనా కానుకలుగా పంపుతూవుంటుంది. ఆమె తన కాబోయే కోడలుకోసం రకరకాల నగలు, దుస్తులు అప్పుడే సేకరించివుంచింది. నళినాక్ష వివాహంచేసుకోబోయే అమ్మాయి దివ్య సుందరవిగ్రహంలా వుంటుందనీ ఆమె ఉని కితో యిల్లు స్వర్గంగా మారిపోతుందనీ భావిస్తూ వుండేది. ఇవే ఆమెకు మధుర స్వప్నాలు!

క్షేమంకరి అలవాట్లు యోగినిఛాయాలో వుంటాయి. పగలు చాలసేపు ప్రార్థనలో గడుపుతుంది. ఒకపూట పాలు, ఫలాలు మటుకే పుచ్చుకుంటుంది. నళినాక్ష కఠినోపవాసాలు ఆమెకు యిష్టంలేవు. ఏ అలవాటయినా మితిమీరి పోగూడ దని ఆమెమతం.

క్షేమంకరి తనకుమాకుడి ధర్మబోధనలను హేమాలిని, ఆమెతండ్రి గాఢంగా విశ్వసించి ఆచరించ ప్రయత్నించడం చూచి ఆశ్చర్యపోయింది. ఒకరోజు హేమాలనితో నవ్వుతూ యిలా అంది "మీరు. నళినాక్ష తెలివితేటలు మరింత వృద్ధి

చేస్తున్నారు: వాడు మాట్లాడే ప్రతి కంటకూ యెందుకు ప్రాధాన్యమిస్తావు? నీ వయస్సులో వున్న వాళ్ళు జీవితాన్ని కులాసాగా హాయిగా గడిపేయాలి. మతాన్ని గురించి ఆలోచనే రాకూడదు. ఎంత సేపూ సరదాలు, వేడుకలు, వినోదాలు చర్చించుకోవాలి. ఇవన్నీ నేనెందుకు చేయడం లేదని నీకు అనుమానం రావచ్చు. కాని నా విషయం వేరు. నేను పెరిగిన వాతావరణం వేరు. ఈ వయస్సులో అలవాట్లు మార్చుకోవాలంటే తేలికయిన పనికాదు. కాని మీ పెరుగుదల వేరే విధమైనది. నీ ఆలోచనలను బలవంతంగా మార్చుకోవడానికి ప్రయత్నించడం అంత మంచిపని కాదు. నేను చెప్పేదేమిటంటే అందరూ ఎవరికి ఉచితం, అర్హం అని తోచింది వారు చేయాలి. ఉపవాసాలు, ప్రార్థనలు నీబోటి వాళ్ళకు సరిపడవు. వాటిని పరిత్యజించడం మంచిది నళినాక్ష యిటీవలనే, నాకోసంగా యిలా మత్తయిక విషయాలనుగురించి ఆలోచిస్తున్నాడు. వాడు కూడా యీ విషయానికి ఎక్కువ ప్రాధాన్యం యిస్తున్నాడు."

ఆమె యీ మాటలన్నీ హేమకు జడ వేస్తూ చెప్పింది.

"నేనేదో పాతకాలపు మనిషిననీ, నాకు యిప్పటి ఫాషన్లు, షోకులు తెలియవనీ అనుకోకు. నాకు వాటిని గురించి మీలాంటి వాళ్ళకంటే ఎక్కువగానే తెలుసు. నాకో ఇంగ్లీషు యువతి స్నేహితురాలు వుండేది. ఆమె నాకు కొత్త కొత్త అల్లికలు, షోకులు నేర్పుతూ వుండేది! అయితే ఆమె వచ్చి వెళ్ళినప్పుడల్లా నేను స్నానం చేసి దుస్తులు మార్చుకోవలసి వచ్చేది."

వృద్ధురాలు క్షేమంకరి, హేమాలినికి కొత్తరకంగా జడ వేసింది. తనకు యిష్టమైన దుస్తులు ధరింపజేసింది. అలంకారాలంటే ఆమెకు ఆప్యాయత ఎక్కువ. హేమాలిని ఆమెదగ్గర కుట్టుపని పాఠాలు కూడా నేర్చుకుంటోంది.

క్షేమంకరికి బెంగాలీ నవలలు చదవడం అంటే కూడా యిష్టమే. హేమాలిని తనదగ్గరవున్న పుస్తకాలన్నీ తీసుకు వచ్చి కూర్చుంది. కథలమీద, వ్యాసాలమీద క్షేమంకరి తన అభిప్రాయాలు చెబుతూవుండేది. మొత్తంమీద హేమాలిని ఆమెదగ్గర అనేక సంగతులు నేర్చుకుంద.

# 49

క్షేమంకరికి జ్వరం తిరుగబెట్టింది. కాని యీ మారు యిదివరలాగా ఉద్ధృతం కాలేదు.

ఉదయం నళినాక్షు వచ్చి ఆమెకు పాదాభివందనం చేశాడు. ఆమెను నిష్ఠనియమాలు వదులుకోమని, దేహారోగ్యం కుదుటబడేదాకా జపతపాదులు నిలుపమని ప్రార్థించాడు.

"అయితే నేను నా అలవాట్లనుమటుకు మానేయాలన్నమాట. నీవేమో యీ ప్రపంచాన్నే పరిత్యజిస్తావు. నళిన్, యిలా ఎంతకాలం నన్ను వేధిస్తావు. తల్లి చెప్పిన మాట విని హాయిగా వివాహం చేసుకో" అంది ఆమె.

నళినాక్షు యింకేమీ మాట్లాడలేకపోయాడు. తల్లే యిలా అంది: "నా శరీరం యింకా ఎన్నో రోజులు యీ భూప్రపంచంమీద వుండదు. నీకు వివాహం కానిదే నేను

హాయిగా ప్రశాంతంగా చచ్చిపోలేను. ఇన్నాళ్ళూ నీవు వివాహం చేసుకుంటావనీ, ఆ అమ్మాయిని నేను పనిలో తరిఫీదు చేయవచ్చుననీ, అనుకున్నాను. కాని యీ జబ్బుతో యిలా మంచానపడిపోయాను. ఇంకా ఎన్ని రోజులు వుంటానో తెలియదు. ఏదో నా తనువు ఉండగానే నిన్నో యింటివాడిని చేయాలనివుంది. నీకు యీడయే అమ్మాయిని చూచి వివాహం చేసుకో. నాకిక ఏ విచారమూ వుండదు.

"అయితే నాకు సరిపోయే అమ్మాయి ఎక్కడ దొరుకుతుందంటావు?" అన్నాడు నళినాక్షు.

"ఆ యిబ్బంది నీకేం అక్కర్లేదు. నువ్వు ఊ అను. నేను అన్ని యేర్పాట్లూ చేయించేస్తాను."

క్షేమం రి యింతవరకూ ఆనందబాబుతో ముఖాముఖ మాట్లాడలేదు. ఎందుచేతనంటే, రోజూ ఆయన వచ్చేసమయానికి యీమె యే పూజాపునస్కారాలలోనో మునిగి వుండేది. ఈ వేళముందు, సాయంత్రం ఆయన రావడం తోటే, తనతో మాట్లాడి వెళ్ళవలసిందిగా కబురు చేసింది.

"మీ అమ్మాయి అందమైనది, నాకు హేమంటే యిష్టం మీరిద్దరూ నళినను బాగా యెరుగుదురుకదా! వాడి ప్రవర్తన మంచిది. వృత్తివిద్యలో పేరు సంపాదించుకున్నాడు. అందుచేత మావాడికి మీ అమ్మాయిని యిస్తే బాగుంటుందని నాకనిపిస్తోంది. మీరేమంటారు?" అని అడిగింది సరాసరి.

"అంతకన్నానా! మీరు యింత దయచూపుతారని నేనెప్పుడూ అనుకోలేదు. నళినాక్షను అల్లుడుగాపొందే

భాగ్యంకంటే నాకింకేంకావాలి? కాని అతని వుద్దేశ్యం..."

"నళిన్‌కు యిష్టమే. తతిమ్మా కుర్రవాళ్ళలా కాకుండా, మావాడు తల్లిమాట జవదాటడు. వివాహం కూడా ఎంతత్వరగా జరిగితే అంతమంచిదని నా ఉద్దేశ్యం. ఎందుచేతనంటే, నేనింకా ఎక్కువరోజులు జీవించను—"

ఆనందబాబు ఉత్సాహంగా యింటికి వెళ్ళాడు. వెళ్ళి వెళ్ళడంతోటే, హేమకు కబురుచేశాడు.

"అమ్మాయి. నేను ముసలివాడనైపోయాను. నా ఆరోగ్యంయేమీ బాగులేదు. ముందునిన్ను ఓయింటిదాన్ని చేస్తేతప్ప, నాకు విశ్రాంతి వుండదు నీకు తల్లి లేదు కనుక నీబాధ్యతలన్నీ సంపూర్ణంగా నావే!"

హేమమాలిని తండ్రి చెప్పబోతున్న దేమిటా అని ఆలోచిస్తూ ఆయన ముఖంవంక తేరిపార చూస్తోంది.

"ఈ సంబంధంవిషయం వినగానే నాకు ఎంతో సంతోషం అనిపించింది. ఉండబట్టలేక పోతున్నాను. నా భయం యేమిటంటే, ఇది జరగకుండా ఏ దుష్టశక్తులన్నీ అడ్డువస్తాయేమోనని! ఇంతకూ విషయం, నళినాక్షు తల్లిగారు ఇవాళ నిన్ను వాళ్ళ అబ్బాయికి ఇచ్చి వివాహం చేయమని అడిగారు."

హేమమాలిని తడబడుతూ "నిజంగానా నాన్నా? అదెలా సాధ్యం?" అని అడిగింది. ఆమె నళినాక్షను తన కాబోయే భర్తగా ఎప్పుడూ ఊహించుకోలేదు. అందుకనే తండ్రి యీ మాట చెప్పడంతో కంగారు పడిపోయింది.

"ఎందుకని అసాధ్యం?" అన్నాడు ఆనందబాబు.

"నళినాక్ష! అదెలా సాధ్యం!" అంది ఆమె మరీ ఆశ్చర్యంగా.

ఆ ప్రశ్నకిది జవాబుకాదు. కాని అందులో ఆమె నిశ్చయం వ్యక్తమవుతోంది హేమాలిని వరండావైపు వెళ్లింది.

ఆనందబాబు ఆశలన్నీ హరించిపోయాయి. ఈ వ్యతిరేకత ఆయన ఆశించివుండలేదు. తన కుమార్తె నళినాక్షను వివాహ మాడడమంటే పరమానంద భరితురాలౌతుందని ఆశించాడు. ఈ నిరాశా వాతావరణానికి అచ్చెరువందుతూ స్త్రీ హృదయాన్ని గురించి ఆలోచిస్తూ అలాగే కూర్చుండిపోయాడు.

ఇంతలో హేమకూడా వరండాలో గంటలకొద్దీ కాలం గడిపేస్తోంది. చివరకామె తలయెత్తి గదిలోకి చూచేసరికి ఆలోచిస్తూ కూర్చున్న తండ్రి కనిపించాడు. హేమ తిరిగి యీ ప్రపంచంలోకి వచ్చింది. లోపలికివచ్చి, తండ్రిని తట్టి లేపుతూ "రండి, నాన్నగారూ! భోజనం ఎప్పుడో వడ్డించాను. ఈపాటికి చల్లారి పోయి వుంటుంది! అంది.

ఆనందబాబు యాంత్రికంగా లేచి భోజనాల గదివైపు నడిచాడు, కాని ఆకలి కావడంలేదు. హేమలిని జీవితాన్ని కమ్ముకున్న కారుమేఘాలు తొలిగిపోయినాయన్న ఆశలతో భవితవ్యాన్ని గురించి సంతోషపడుతున్న, ఆయనకు—కుమార్తె నిరసనతో చెప్పరాని దుఃఖం కలిగింది. "హేమ రమేష్‌ను మర్చిపోలేదన్నమాట!" అనుకుని గాఢంగా నిట్టూర్చాడు.

భోజనం కాగానే తన గదిలోకి తిరిగి వెళ్ళడం ఆయనకు అలవాటు. కాని ఈ వేళ అక్కడే ఉండిపోయాడు. కొద్ది సేపు ఆగి హేమ "ఇక వెళ్ళి నిద్రపొండి, నాన్నా. ఇక్కడ కూర్చుంటే జలుబుచేస్తుంది" అంది.

"నువ్వు వెళ్ళి పడుకోఅమ్మా! నేను తరువాత వస్తాను."

హేమాలిని వెళ్ళకుండా అక్కడే వుంది. కొన్ని నిమిషాలు గడిచాక తిరిగి ఆయనతో అదే మాటలు అంది.

చివరకు ఆనందబాబు తన గదిలోకి వెళ్ళి నిశ్శబ్దంగా పక్కమీద వాలాడు

హేమాలిని రమేష్ స్మృతులను మదిలోనుంచి చెరిపి వేసుకోవడానికి ఎంతో ప్రయత్నం చేసింది. ఆమె ఎప్పుడూ తన భవిష్యత్తును గురించి ఆలోచించలేదు. కాని యివాళ వివాహం ప్రస్తావన వచ్చేసరికి పాత జ్ఞాపకాలన్నీ ఒక్కమారుగా ముసురుకొన్నాయి. అదంతా మరిచిపోగలగడం ఎంత అసాధ్యమో తెలిసివచ్చింది. అందుచేతనే ఆమె మనో నిశ్చయంకూడా దృఢతరం అయింది.

# 50

క్షేమంకరి వెంటనే నళినాక్షును పిలిచి తను వివాహ విషయం ప్రస్తావించినట్లు, ఆనందబాబు అంగీకరించినట్లు చెప్పింది.

నళినాక్షు నవ్వాడు. "అప్పుడే అంతా యేర్పాటు చేసేశావా? ఎంత తొందరగా చేశావు!" అన్నాడు.

"అవును! నేనింక ఎంతో కాలం జీవించను. నాకు హేమాలిని అంటే ఎంతో యిష్టం. ఉత్తమురాలు. అయితే చూడటానికి అంత అందంగా వుండదనుకో—"

"కాదు. అమ్మా! నేను ఆమె అందాన్ని గురించి ఆలోచించడం లేదు. కాని ఆమెను వివాహం చేసుకోవడం అసాధ్యం. అది కానిపని!" అన్నాడు.

"తెలివితక్కువగా మాట్లాడకు. ఏమిటి నీవనేది?"

నళినాక్షుడు వివరించి చెప్పడం తేలికగాదు. ఒకరకంగా చెప్పాలంటే, ఆమె తనకు శిష్యురాలు. తాను ఆమెకు తండ్రితో సమానం. అటువంటప్పుడు యిక వివాహ ప్రస్తావన ఏమిటి?

నళినాక్ష ఏమీ మాట్లాడకపోవడంతో తల్లి ఇలా అంది: "ఈసారి నువ్వు ఏ అడ్డంకులు పెట్టినా నేను ఒప్పుకోను. నువ్వు చూడబోతే ప్రపంచాన్ని పరిత్యజించి నాకోసం బెనారస్ సన్యాసివి అవబోయేటట్లున్నావు. నీ వయస్సుకు అవేం ఆలోచనలు! ఈ అవకాశాన్ని జారవిడుమకోకు. సాధ్యమైనంత త్వరలోనే ముహూర్తం కూడాను."

కొద్దిసేపటితరువాతగాని నళినాక్ష గొంతు సరిచేసుకుని మాట్లాడలేకపోయాడు.

ఇప్పుడు నీకో విషయం చెప్పాలి అమ్మా! అయితే నువ్వు దానికోసం బెంగపెట్టుకోనని మాట యివ్వాలి."

"ఇప్పుడు నీకు చెప్పబోయే సంఘటన తొమ్మిది నెలల క్రితం జరిగింది. దాన్ని గురించి యిప్పుడు విచారించికూడా లాభంలేదు. అయినా నీ తత్త్వం తెలుసుగనుక, నీకు కష్టం

కలిగించడం యిష్టంలేక యీ విషయం యింతవరకూ చెప్ప లేదు—

క్షేమంకరికి యిదేమిటో అర్థంకాలేదు. "నీవేం చెప్ప బోతున్నావో నాకు తెలియదుగాని, యీ ఉపోద్ఘాతం మటుకు భయం పుట్టిస్తోంది. ప్రాపంచిక విషయాలనుంచి దూరంగా వుండడానికి ప్రయత్నించినందువల్ల లాభంలేదు. ఎవరుకానీ దురదృష్టంకోసం వెదుక్కుంటూ వెళ్ళనవసరం లేదు. దానంతట అదే వచ్చి మీదపడుతుంది. ఇక నీకథ యేమిటోచెప్పు, మంచో చెడో ఆ తర్కంయేమీ యిప్పుడూ వద్దు—" అంది.

నళినాక్ష యిలా చెప్పాడు: "ఫిబ్రవరినెలలో నేను రంగ్‌పూర్‌లోవున్న ఆస్తంతా అమ్మేసి, తోటయింటిని అద్దెకు యిచ్చి కలకత్తాకు బయలుదేరాను. "సారా" దగ్గర నదిదాటబోతూ వుండగా ముందు ప్రయాణమంతా రైలు మీద కాకుండా పడవమీద చేద్దామని కుతూహలం కలి గింది. అలాగేచేశాను. రెండురోజుల ప్రయాణం తరువాత, ఒక యిసుక తిన్నదగ్గర పడవలంగరువేశారు. నేను స్నానం చేస్తూవుండగా, నా పాతస్నేహితుడు భూపేన్ తుపాకి పట్టు కుని ఆ దారంటే నడిచివెడుతూ కనిపించాడు. నన్నుచూడ గానే ఎగిరిగంతువేశాడు. అతనక్కడ డిప్యూటీ మాజిస్ట్రే టుగా వుంటున్నారట. ఇక్కడికి యేదో తనిఖీనిమిత్తం వచ్చాడట. మేం కలుసుకుని ఎన్నోసంవత్సరాలు అయింది. కనుక అతను నన్ను వంటరిగా వదలలేదు. తనతోపాటు పర్యటనకు రమ్మన్నాడు. మేం ఒకరోజు ధోబాపుకూర

అనే గ్రామంలో మకాం చేశాం. సాయంత్రంపూట షికారుగా బయలుదేరాం. అది చాలా చిన్న గ్రామం. భూపేన్ నన్ను ఒక పూరిగుడిసెలోకి తీసుకువెళ్ళాడు. ఇంటి యజమాని బల్లలు తెచ్చివేసి మమ్మల్ని కూర్చోమన్నాడు. ఆ సమయంలో వరండా స్కూలుగదిగా వాడుతున్నాడు. స్కూలుమాష్టరు కుర్చీలో కునికిపాట్లు పడుతున్నాడు. కుర్ర వాళ్ళు గందరగోళం చేస్తున్నారు. ఇంటి యజమానిపేరు తరుణీచటర్జీ. అతను నన్ను గురించి భూపేన్‌ను అడిగి తెలుసు కున్నాడు. మేం తిరిగి వస్తూండగా భూపేన్ నాతో నీకు ఇవాళ మంచిరోజు. నీకో వివాహ ప్రస్తావన రాబోతోంది” అన్నాడు. అంటే ఏమిటని అడిగాను. అతనిలా అన్నాడు: ఆ తరుణీచటర్జీ వడ్డీవ్యాపారం చేస్తూవుంటాడు. అంత పిసిని గొట్టు మరి వుండడు. మేజిస్ట్రేట్ వచ్చినప్పుడు మటుకు ఇంట్లో స్కూలు పెట్టిస్తాడు. ఉత్తప్పుడు పిల్లలుండరు. మాష్టరుచేత తన స్వంత పనులన్నీ చేయించుకుంటాడు గవర్నమెంటు జీతంమీద. తరుణికి ఒక చెల్లెలుంది. ఆమె విధవ. మొగుడు పోయేటప్పటికి ఆమె గర్భిణి. ఆమె పోషణ భారమంతా ఆయనమీదే పడింది. పురుట్లోనే ఆమెకూడా పోయింది. అందుక్కారణం వైద్యలోపమే. అతని దగ్గర మరో విధవచెల్లెలు వుంది. ఈమె యింటెడు చాకిరీచేసి పెడుతుంది. అందుచేత అతనికి నౌకర్ల కర్చులేదు. పోతే, తల్లిలేని పిల్ల పోషణకూడా యీమెమీదే పడింది. ఈమె కూడా కొన్నిసంవత్సరాలకే చనిపోయింది. ఇప్పుడాఅమ్మాయి గతికుక్కకన్నా హీనంగావుంది. అత్తయ్యకు మామయ్యకు సేవ

చేస్తూ ప్రతిఫలంగాచివాట్లు, చెప్పుదెబ్బలుతింటూ వుంటుంది. ఆమెకు వివాహంవయస్సుకూడా దాటింది. కాని ఆమెవంటి అనాధకు భర్త దొరకడం తేలికయిన పనికాదు. అందులో ముఖ్యంగా, గ్రామస్థులకు ఆమె తల్లిదండ్రులను గురించి ఎక్కువగా తెలియదు. అదీగాక ఆమె తండ్రి చనిపోయిన తరువాత పుట్టింది గనుక తండ్రి ఎవరనే మీమాంస గూడా బయలుదేరింది. తరుణిచేటర్జీ డబ్బు ఉన్నవాడు. అందరూ అతనినుంచి కట్నం రాబట్టటానికి ప్రయత్నిస్తున్నారు. ఇప్ప టికి నాలుగు సంవత్సరాలనుంచి ఆమెకు పదేళ్ళని చెబు తున్నాడు. అంచేత ఆ అమ్మాయికి తేలిగ్గా పధ్నాలుగు సంవత్సరాలు వుంటాయి. కాని ఆ అమ్మాయి నిజం చెప్పా లంటే అందాలరాశి. ఆమె పేరు కమల. సాక్షాత్తు లక్ష్మీ స్వరూపంలా ఉంటుంది. యువక బ్రాహ్మణుడు కనిపించినప్పు డల్లా, తరుణి అతనికి మోకరించి తన మేనకోడలును వివాహం చేసుకోమని ప్రార్థిస్తూవుంటాడు. ఆ యువకుడు అంగీకరించినప్పటికీ గ్రామస్థులు ఆ సంబంధం చిట్లిపోయేట్లు చేస్తారు. ఇప్పుడు నీవంతు వచ్చింది—అని. విన్నావా, అమ్మా! అప్పుడు నేను ఒక్క నిమిషంకూడా యోచించ కుండా సరే, నేనా అమ్మాయిని వివాహం చేసుకుంటాను అన్నాను. సనాతన ధర్మశాస్త్రాలు అభ్యసించిన కోడలును వెంటబెట్టుకువచ్చి నీకు ఆశ్చర్యం కలుగజేద్దామనుకున్నాను. నేను నిజంగా, ఎదిగిన బ్రహ్మసమాజపు పిల్లను వివాహం చేసుకుంటే మన మెవరం కూడా సుఖపడలేమని నాకు తెలుసు. నా అంగీకారం తెలుసుకున్నాక భూపేన్‌కూడా

ఆశ్చర్యపోయాడు. తరుణీఛటర్జీ ఆ సాయంత్రం మా మకాంకు వచ్చి తన చిలుకపలుకులు చెప్పాడు. నేను పిల్లను గూడా చూడనవసరం లేదనీ వివాహముహూర్తం నిర్ణయించమనీ చెప్పేశాను తరుణీఛటర్జీ రేపు లేదు ఎల్లుండే అద్భుతంగా వుంది ముహూర్తం అన్నాడు. ఖర్చు తక్కువలో పోవడానికే యింత తొందరని నాకు తెలుసు. ఏమయితేనేం వివాహం సలక్షణంగా జరిగింది.”

క్షేమంకరి ఉన్నట్లుండి “వివాహం జరిగిందా? నిజంగానా” అంది!

“నిజంగానే అమ్మా! నేను వధువుతో పడవ యెక్కాను. మధ్యాహ్నంపూట ప్రయాణం ప్రారంభించాం. అదింకా మార్చినెల. మామూలుగా వాతావరణం అనుకూలంగానే వుంటుంది. ఆ సాయంత్రం, అంటే రెండు గంటలు గడిచీ గడవకముందే విపరీతమైన గాలి వీచి పడవ తల్లకిందులయింది.

“అయ్యయ్యో” అంది క్షేమంకరి,

“నాకు తెలివివచ్చేసరికి నేను యింకా నీళ్ళలోనే కొట్టుమిట్టులాడుతున్నాను. పడవగానీ, అందులో జనంగాని మచ్చుకైనా కనిపించడం లేదు. నేను పోలీసులకు ఫిర్యాదు చేశాను. వాళ్ళు దేశమంతా గాలించారు. కాని లాభం లేకపోయింది.”

క్షేమంకరిముఖం వివర్ణమయింది.

“అయ్యో! సరే, గడిచిపోయిందానికి మనమేం చేయలేం. ఈ విషయం నాకిక యెప్పుడూ చెప్పకు నేను

భరించలేను"

"అసలు నేను చెప్పివుండేవాడినే కాదు అమ్మా! నువ్వు నా వివాహ విషయం పట్టుపట్టకపోతే—"

"ఏం? వివాహానికి యీ సంఘటన అడ్డంకి ఎలా అవుతుందంటావు?"

"ఆ అమ్మాయి సజీవంగానే ఎక్కడయినా వున్నదేమో! అందుకనే పెళ్ళి చేసుకోవడమంటే నాకు అనుమానం—"

"నీకేమన్నా వెర్రె త్తిందా యేం! ఆమె బతికేవుంటే నీకీ పాటికి తెలిసేవుండేది!"

"ఆమెకు నన్ను గురించి ఏమీ తెలీదు. ఆమె నా ముఖంకూడా చూడలేదు. నేను బెనారెస్ వచ్చాక తరుణీ ఛటర్జీకి వుత్తరం వ్రాశాను. అందులో నా చిరునామా యిచ్చాను. కాని ఆ వుత్తరం అతనికి చేరకుండా తిరిగి నాకే వచ్చేసింది."

"అయితే—"

"అందుచేత ఒక సంవత్సరంపాటు ఆగి ఆమె బతికివుందా లేదా నిర్ధారణ చేసుకుందామనుకున్నాను."

"సంవత్సరం యెందుకు?"

"అయిపోవచ్చిందిగా అమ్మా. ఇది డిసెంబరు. వివాహాలకు ముహూర్తాలు లేవు. వచ్చేనెలకూడా అంతే. తరువాత ఫిబ్రవరి! మార్చికల్లా సంవత్సరం పూర్తవుతుంది."

"అయితే, వివాహప్రస్తావన జరిగిందనిమటుకు గుర్తుంచుకో. నేను హేమతండ్రికి చెప్పేశాను."

"మానవుడు సంకల్పించవచ్చు. కాని మరొకడు దాన్ని వికల్పమయేట్లు చేస్తాడు. అంతా ఈశ్వరేచ్ఛ!"

"అవునవును. కాని యీ కథ ఎంత ఘోరంగావుంది. తలుచుకుంటూవుంటే వణుకుపుడుతోంది.

"నాకూ భయంగావుంది, అమ్మా. నీ ఆరోగ్యం మరీ పాడవుతుందని నీకీవిషయం ముందుగానే చెప్పలేదు."

"ఏమో, నాకు యేంతల్చుకున్నా భయంగానేవుంది. ఎక్కడినించీ దుర్వార్తలు వస్తాయో అని ఒకటే భయం. ఇప్పటికీ నాకు యీ జీవితం ఎక్కువయినట్లుంది. లేకపోతే యెందుకీ భయాలన్నీ?" అంది క్షేమంకరి.

# 51

కమల గంగానదీతీరానికి వెళ్ళేసరికి, సూర్యుడప్పుడే పశ్చిమాద్రిని క్రుంగిపోయాడు. కమల అస్తమించిన సూర్యునికి అభివాదంచేసింది. తన తలమీద పవిత్ర గంగాజలం చల్లుకుంది. తరువాత దోసిలిలో నీళ్ళు తీసుకుని, దేవతలకు అర్ఘ్యం యిచ్చింది. ప్రవాహంలో పుష్పాలు వేసింది.

స్వర్గశక్తులన్నిటికీ వినయంగా తలపైకెత్తి తాను మరొకవ్యక్తికికూడా అభివాదం చేయవలసివున్నదని గ్రహించింది. కాని తాను ఆ వ్యక్తి ముఖం చూచేభాగ్యానికి నోచుకోలేకపోయింది. ఒక్కరాత్రిమటుకే ఆయన సరసనే కూర్చుంది. కనీసం ఆయన పాదాలవంక కన్నెత్తిచూచే ధైర్యమైనా లేకపోయింది.

"రమేష్ హేమాలినికి వ్రాసినవుత్తరం యింకా ఆమె

కొంగున కట్టుకునేవుంది. మళ్లీ దాన్ని తీసుకుని ఒడ్డునకూర్చుని ఒకమారు చదువుకుంది తనభర్తనుగురించి వున్న వాక్యాలు చదువుకుంది. దానిలో అతన్ని గురించి పెద్ద వివరాలేం లేవు, పేరు నళినాక్ష చటోపాధ్యాయ అనీ రంగపూర్‌లో డాక్టరనీ, అక్కడ అతనిజాడలేమీ తెలియలేదనీతప్ప, తతిమ్మా పేజీల కోసరం వెదికింది. కాని అవి కానరాలేదు.

నళినాక్ష ! ఆ పేరు తన గాయపడిన హృదయానికి ఔషధంలా వుంది. ఆ పేరు తలుచుకుంటే ఆమెహృదయం సంతోషంతో ఉబికిపోతోంది. ఆమెలోని అంతరాత్మ ఇలా పలికింది. "యిప్పుడు గాయం పూడింది. చీకటి అంతరించింది. నేనుకూడా సజీవ ప్రపంచంలో భాగాన్ని"

ఆమె పైకి యిలాఅంది: "నేనతనికి తగిన భార్యనైతే అతని పాదాలదగ్గర మోకరిల్లటానికే జీవించివుండాలి. ఇంత కంటే నాకు మోక్షంలేదు. ఈ జీవితంలో అతను నాకు దొరికేట్లులేడు. భగవంతుడు నన్ను అతని సేవకోసమే మృత్యుముఖంనుంచి తప్పించాడు.

ఆమె చేతిరుమాలులో చుట్టివుంచిన తాళంచెవుల గుత్తితీసి విసిరేసింది. రమేష్ యిచ్చిన ఉత్తరీయం ఒకటి తన దగ్గరవున్నట్లు గుర్తించి దాన్నికూడా విసిరివేసింది. తరువాత పడమరగా తిరిగి, ముందుకు నడచింది. ఎక్కడికి వెళ్ళాలో, ఎటువెడితే తన గమ్యస్థానం చేరువ అవుతుందో ఆమెకు తెలియదు. ఆమెకు ముందుకు పోవడం మటుకే తెలుసు. ఉన్న చోట క్షణమయినా నిలువలేదు.

బాగా చీకటిపడింది. ఆమె యింకేమీ ఆలోచించ

కుండా అలాగే ముందుకు నడిచి పోతోంది. నదీతీరానే నడిచివెళ్ళడానికి నిర్ణయించుకుంది. ఇలా వెళ్ళితే దారి అడుగవలసిన అవసరం వుండదు. ఏదయినా ప్రమాదం తట స్థించినా, వెంటనే గంగమ్మతల్లి వొడిలో దూకొచ్చు.

పొలాలనుంచి నక్కకూతలు వినిపిస్తున్నాయి. ఇంతలో ఒక గ్రామం అడ్డువచ్చింది. కమలగుండె దడదడ లాడింది. కాని గ్రామస్థులంతా హాయిగా నిద్రపోతున్నారు. ఆ రోజుకు యింక నడవలేక పోయేస్థితి రావడంతో ఆమె ఓ చెట్టుకింద విశ్రమించింది.

ఆమెకు మళ్ళీ మెలుకువవచ్చి చూచేసరికి, ఆమె పక్కన ఒక వయసు మళ్ళినస్త్రీ నిలబడివుంది. తనను ప్రశ్నలు వేస్తోంది. "ఎవరు నువ్వు ?... ఇక్కడేం చేస్తున్నావు ?... ఈ చలిరాత్రి యీ చెట్టుకింద ఎందుకు పడుకున్నావు—"

కమల భయపడి లేచింది. చూచేసరికి యీ రేవు లోనే రెండు పడవలు విడిచివున్నాయి.

ఈ వృద్ధురాలు అందులో ప్రయాణంచేస్తోంది. తెల్ల వారుజామునే స్నానానికని లేచింది, ఇంకా తతిమ్మావాళ్ళు యిప్పుడిప్పుడే లేస్తున్నారు.

"నువ్వు బెంగాలీ పిల్లలా వున్నావే!" అంది ఆమె.

''అవును. బెంగాలీనే.''

"ఇక్కడెందుకు పడుకున్నావు ?!"

బెనారెస్ వెడుతున్నాను. రాత్రిపూట యిక్కడ నిద్రిపోయాను.''

"ఎప్పుడన్నా యిటువంటి విషయం విన్నావా ? కాలి

నడకను కాశీకి వెళ్ళడమా ? నువ్వు ఆ పడవ ఎక్కు. నేను స్నానం చేసివస్తాను."

ఆమె స్నానం చేసింది.

ఆమె ఘజీపూర్‌లో జరిగిన సిద్ధుబాబుగారి యింట్లో పెళ్ళికి వెళ్ళివస్తోందట. ఆమె పేరు నవీన్‌కాళి. ఆమె భర్త పేరు ముకుందలాల్‌దత్త. కాయస్థులు. బెంగాల్ వాస్తవ్యులు. కొన్నాళ్ళుగా బెనారెస్‌లో వుంటున్నారు.

"నీ పేరేమిటి?"

"కమల."

"నీ చేతికి గాజులున్నాయి. నీ భర్త బతికేవున్నాడా!"

"ఆ! మా వివాహం అయిన మరురోజే మాయమై పోయాడు."

"పాపం! నువ్వు యింకా చిన్నపిల్లవి. నీకింకా పది హేనేళ్ళయినా దాటివుండవు" అంది ఆమె కమలను నఖశిఖ పర్యంతం పరిశీలిస్తూ.

"ఏమో నాకు తెలీదు. పదిహేనే నేమో!"

"మీరు బ్రాహ్మలన్నావు కదూ ?"

"అవును."

"మీవాళ్ళు ఎక్కడ వుంటారు ?"

"నా భర్తగారి యింటికి వెళ్ళలేదు. మా నాన్నగారి ఊరు బిసుకాలి."

ఆమె ఎన్నడూ అక్కడికి వెళ్ళకపోయినా తన తండ్రి జన్మస్థలం అదీ అని తెలుసుకుంది?

"అయితే నీ తల్లిదండ్రులు—"

"ఇద్దరూ చనిపోయారు."

"అయితే నువ్వేం చేస్తావు."

''నాకు ఉండటానికిచోటు, తినటానికి రెండుపూటలా భోజనం కావాలి. బెనారెస్‌లో ఎవరికయినా వంటమనిషి కావాలేమో కనుక్కుని, అక్కడ కుదిరిపోతాను.''

నళిన్‌కాళి, వంటచేసే బ్రాహ్మణపిల్ల ఊరికే దొరుకుతున్నందుకు మనసులో సంబరపడింది. కాని తన సంతోషాన్ని బయటకు కనిపించకుండా యిలా అంది: "ప్రస్తుతం మాకు వంటమనిషి ఉంది. కనుక వేరే అక్కర్లేదు. అయినా కష్టాలలో వున్నానంటున్నావు గనుక, నీవు గూడా మాతో రా. మాయింట్లో చాలమంది లేరులే. అమ్మాయిలందరికీ పెళ్ళిళ్ళు చేసి అత్తవారిళ్ళకు పంపేశాం. అబ్బాయి రెండు నెలలనుంచి సెరాజ్‌గంజ్‌లో మేజిస్ట్రేట్‌గా వుంటున్నాడు. అంచేత నీకు ఎక్కువ పనికూడా వుండదు—''

పడవలు బయలుదేరాయి. కొన్నిగంటల్లో బెనారెస్ చేరుకున్నారు. పడవలోనివాళ్ళంతా పట్టణం శివారులో వున్న రెండు అంతస్థుల మేడలో దిగారు. అక్కడ నవీన్‌కాళి యిందాక చెప్పినట్లు పధ్నాలుగేళ్ళ బ్రాహ్మణ వంటమనిషి లేదు. ఒరియా బ్రాహ్మడుమటుకు ఒకడున్నాడు. ఆ ప్రాంతం వాళ్ళంతా చౌకగా దొరుకుతారు. అంతేకాక, కమల వచ్చాక నవీన్‌కాళి అతన్ని జీతం యివ్వకుండా వెళ్ళగొట్టింది. అందుచేత కమల పూర్తి వంటింటి బాధ్యత అంతా స్వీకరించవలసివచ్చింది.

నవీన్‌కాళి ఆమెకు సలహాలు యిస్తూవుండేది.

"చూచావు, కమల. నీబోటి ఆడపిల్లలకు యీ బెనారస్‌వంటి అంత చెడ్డది మరొకటిలేదు. నీ వెప్పుడూ గంగాస్నానానికి ఒక్కత్తెవూ యిల్లుదాటి వెళ్ళగూడదు. నే నెప్పుడూ గంగాస్నానానికి వెళ్ళేటప్పుడు, విశ్వేశ్వరుని దర్శనానికి వెళ్ళేటప్పుడు నిన్నుకూడా తీసుకువెడతాను."

ఇలా ఆమె కమల తననుంచి తప్పించుకుపోవటానికి వీల్లేకుండా ఎన్నో బంధాలు విధించింది. ఆ అమ్మాయికి తన తోటివాళ్ళతో పరిచయం, స్నేహం లేకుండాపోయింది. ఇంటిపనులతో పగలంతా సరిపోయేది. సాయంత్రంపూట నవీన్‌కాళి వెండిబంగారాలను గురించి, నగానాణ్యాలను గురించి దొంగలు ఎత్తుకుపోతారనే భయంతో తను బెనారస్ తీసుకురాని ధనకనక వస్తువాహనాల గురించి మాట్లాడేది.

"మావారు ఎప్పుడూ ఇత్తడిపళ్ళెంలో తినరు. కొన్ని వస్తువులు పోతేమటుకేం. తీసుకురా - అన్నారు. కాని నాకు అలా యిష్టంలేదు. మా యింటిదగ్గర స్వగ్రామంలో ఎందరో నౌకర్లు, చాకర్లు..." ఇలా తమ ఆధిక్యతను చెప్పుకుంటూ పోతూండేది ఆవిడ.

# 52

నవీన్‌కాళి ఇంట్లో కమలజీవితం, బురద గుంటలో ఇరుక్కున్న చేపలా వుంది. ఆమెకు పారిపోవడంతప్ప వేరే దారిలేదు. కాని ఎక్కడికి పోవడం అనే ప్రశ్నతప్ప తప్పించుకుపోయే స్తోమతు లేదు.

నవీన్‌కాళికి కమల అంటే ఆప్యాయత. కాని యీ

ఆప్యాయతను కమల భరించలేక పోతోంది.

ఒకరోజు ఆమె కమలను పిలిపించి ఇలా చెప్పింది: "ఇవాళ వారికి వంట్లో తేలికగా లేదు. ఆయనకు ప్రత్యేకమైన భోజనం తయారు చేయాలి. నీవంత ఎక్కువ నెయ్యి వాడనక్కర్లేదు. నువ్వు వంట బాగానే చేస్తావు. కాని నెయ్యి అంతెందుకు ఖర్చవుతోందో నాకు అర్థంకాదు. ఆ ఒరియా బ్రాహ్మడే నయం. పొదుపుగా రుచికరంగా తయారు చేసేవాడు—"

కమల ఎప్పుడూ జవాబు చెప్పేదికాదు. తనకు చెప్పిన పని విని తలవంచుకు వెళ్ళిపోయేది. ఈ రోజు మాత్రం ఆమె యీ సంఘటనను గురించే ఆలోచించ సాగింది. మొత్తం ఆమె యీ సంఘటనను గురించే ఆలోచించసాగింది. మొత్తం మీద యీ ప్రపంచం సుఖప్రశాంతులు లేనిచోటుగా, బతుకు భారంగా తోచింది ఆమెకు. నవీన్ కాళి పక్కగదిలోకి నౌకరుకు చెబుతూన్న ఆజ్ఞ ఆమె చెవుల్లోపడింది..

"ఒరేయ్, వెంటనే ఊళ్ళోకి పరుగెత్తి, డాక్టర్ నళినాక్షను పిలుచుకురా! అయ్యగారికి సుస్తీగా వుంది."

డాక్టర్ నళినాక్ష! కమల కళ్ళముందు కాంతులు నాట్యం చేశాయి, చేతిలో పనివదలి, దొడ్లోకి పరుగెత్తి నౌకర్ను మధ్యలో ఆపింది.

"ఎక్కడికి వెడుతున్నావు?"

"నళినాక్షగార్ని పిలుచుకురావడానికి!"

"ఎవరాయన?"

"ఇక్కడ పెద్ద డాక్టరు—"

"దగ్గరేనా?"

"ఓ, మైలుదూరం—అంతే"

కమల, ఇంటివాళ్ళ భోజనాలు అయిన తర్వాత మిగిలిన పదార్థాలు నౌకర్లకు పంచిపెడుతూ వుండేది. అంచేతే వాళ్ళకు ఆమె అంటే యిష్టం. అమ్మగారు ఎంత కోప్పడినా ఆమె యీ అలవాటు మానలేదు. అదీగాక ఆ ఇంట్లో భోజనాలు ఆలస్యంగా అవుతాయి. అంతవరకూ నౌకర్లంతా వేచివుండాలి.

మేడమీదినించి నవీన్‌కాళి అరిచింది. "ఏమిరా, ఇంకా అక్కడే వున్నావు? వంటమనిషితో సంప్రదిస్తే తప్ప డాక్టర్ను పిలుచుకురావడం కుదరదా యేం? అందుకనే ఇంట్లో వస్తువులు మాయమవుతున్నాయి యీ మధ్య! చూడు అమ్మాయ్ – నిన్ను దిక్కులేనిదాన్ని తీసుకువచ్చి ఇంట్లో ఆశ్రయమిచ్చాను. నా ఋణం తీర్చుకునే విధం ఇది కాదు—"

నవీన్‌కాళికి ఇంట్లో నౌకర్లంతా కట్టుకట్టి తనను దోచుకుంటున్నట్లు అనిపించింది.

కమల నౌకరు తిరిగి రావడంకోసం దొడ్డిగుమ్మం దగ్గరే వేచివుంది. అతను రాగానే "డాక్టర్ వచ్చారా?" అనడిగింది.

"రాలేదు!"

"ఏమెంచేత?"

"ఆయన తల్లికి సుస్తీగావుందట"

"తల్లికా? ఆమెను కనిపెట్టుకు వుండటానికి యింకె

వరూ లేరూ ?"

"లేరు. ఆయన కింకా పెళ్ళి కాలేదు"

"నీ కెలా తెలుసు ?"

"ఆయనకు భార్య లేదని నౌకర్లు చెప్పారు."

"ఒక వేళ ఆయన భార్య చనిపోయిందేమో !"

"కావచ్చు. కాని వాళ్ళ నౌకరు, యిదివరకు ఆయన రంగపూర్‌లో వుండేవాడనీ అక్కడకూడా ఆయన భార్య లేదనీ అన్నాడు."

పైనించి నవకాళి పిలిచింది.

కమల వంటింట్లోకి పరుగెత్తింది. నౌకరు పైకి వెళ్లాడు.

నళినాక్షు—రంగపూర్‌లో వుండడం...కమల అనుమానాలన్నీ ఆగిపోయాయి నౌకరు తిరిగి కనిపించాక అతన్ని మళ్ళీ యిలా అడిగింది. "నాకు అలాంటి పేరున్న డాక్టరు చుట్టం ఒకాయన ఉన్నాడు. వాళ్ళు బ్రాహ్మలే అన్నావు కదూ ?"

"అవును. బ్రాహ్మలే. చటర్జీలు—"

కమల తనఇంటిపని పూర్తిచేసుకుని, అమ్మగారిదగ్గరకు వెళ్ళి, దశాశ్వమేధ ఘట్టంలో స్నానం చేసివస్తానని చెప్పింది.

"ఇప్పుడు వీల్లేదు. వారికి కులాసాగా లేదు. ఎప్పుడేం కావాలో. అయినా యివాళే ఎందుకు వెళ్ళాలి ?"

"నా బంధువు ఒకాయన బెనారెస్‌లోనే ఉన్నారని విన్నాను. ఆయన్ను అవసరంగా కలుసుకోవాలి."

"విన్నావా ? ఎవరు చెప్పారు నౌకరేనా ? వాణ్ని పని మానిపించేస్తాను. నీవు నా యింట్లో వున్నంతకాలం, యిలాఒంటరిగా స్నానాలకు షికార్లకు వెళ్ళటానికి వీల్లేదు.

నేనలా వప్పుకోను—"

నవీన్ కాళి వెంటనే నౌకర్ను పిలిచి పనిమానివేయమని చెప్పింది. తతిమ్మావాళ్ళు కమలతో మాట్లాడకుండా కట్టు దిట్టం చేసింది.

"చూడు అమ్మాయీ. నీ పద్ధతి నాకు అర్థం కావడం లేదు. అన్నమంతా యిలా చిమడగొట్టావేం? నీవు కావా లంటే యిలా ఉపవాసాలుచేయిగాని, మమ్మల్ని మటుకు ఆకలికి చంపకు. నువ్వు వండేది యేమాత్రం తినడానికి వీల్లే కుండా వుంది."

"మీ యింట్లో పనిచేయడం నావల్లకాదు. ఇక నేను పోతాను, నన్ను పోనీయండి."

"అలాగా! మంచిచేసినందుకు యీ రోజుల్లో యిదే ప్రత్యుపకారం. నీవుంటావని ఆ ఒరియా బ్రాహ్మడిని వెళ్ళ గొట్టాను. ఇప్పుడు అర్ధాంతరంగా వెళ్ళిపోతానంటావా? మా అబ్బాయి మాజిస్ట్రేటు ఉద్యోగం చేస్తున్నాడు. వాడు తల్చుకుంటే నిన్ను జైల్లో పడేయిస్తాడు. నాతో ఆటలాడు దామనుకున్నావేమో. అదేం కుదరదు, తెలుసా?"

తనసుఖం చేరువలోనేవుందని తెలుసుకున్నాక, కమల చేతులు కట్టుబడి పోయినట్టయింది. ఆమె పరధ్యాసగా ఆలో చిస్తూ ఒకచోట నిలబడిపోతుంది.

నవీన్ కాళి ఆమెతో యేదోరకంగా పోట్లాట పెంచు కుంటోంది. "నాపనిమీకు సంతృప్తికరంగా లేదు. నన్ను వెళ్ళ నివ్వండి" అంది కమల.

"అలాగే వెళ్ళనిస్తాను. నీకు బాగా బుద్ధిచెప్పి తన్ని

తగలేయిస్తాను.

కమల మనసులో యేడుస్తూ నీరసంగా తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం ముకుందబాబు షికారుకు వెళ్ళాడు. ఆయనవెంట యిద్దరు నౌకర్లు వెళ్ళారు. ఆయన వెళ్ళాక ముందు గుమ్మంలోపల గడియపెట్టారు. కను చీకటివడ్డాక ఎవరో తలుపు తట్టారు.

నవీన్ కాళీ పైనుంచి చూచింది.

నళినాక్ష! డాక్టరు నళినాక్ష వచ్చాడు... బుధియా, బుధియా" అంది. కాని నౌకరు బుధియాజాడ లేకపోవ డంతో కమలవైపు తిరిగి "కిందికివెళ్ళి తలుపు తెరువు. డాక్టరు గారితో వారు షికారుకు వెళ్ళారనీ యిప్పుడే వస్తారనీ చెప్పి కూర్చోమను" అంది.

కమల లాంతరు తీసుకుని కిందికి వెళ్ళింది. ఆమె నరాలు వణుకుతున్నాయి. గుండె దడదడలాడుతోంది. చేతులు చల్లబడిపోయినాయి. కళ్ళుమూసుకుపోతాయేమో నని భయపడింది.

ఆమె గడియతీసింది. ముఖంమీద ముసుగు వేసుకుంది. తలుపు తెరిచింది. నళినాక్ష కనిపించాడు, ఎదురుగా.

"ముకుందబాబు ఉన్నారా?"

"లేరు. లోపలకు రండి."

నళినాక్షలోనికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. బుధియావచ్చి కబురుచెప్పి వెళ్ళాడు.

కమల గుండె దహించుకుపోతోంది. వరండాలో

నిలుచుని నళినాక్షను తేరిపారచూస్తోంది. ఆమెకళ్ళు అశ్రు వులతో నిండినాయి. ఆమె యీ ప్రపంచాన్ని మరచి పోయింది.

ముకుందబాబు వచ్చి నళినాక్షతో మాట్లాడుతున్నాడు. వాళ్ళిద్దరూ వరండాలోకి రాబోతూవుండగా కమల వంటిం ట్లోకి పరుగెత్తింది.

కమల శరీరం మనస్సు ఉడికిపోతున్నాయి. అటు వంటివాడు తనబోటి దౌర్భాగ్యురాలికి భర్త ఎలా అవు తాడు? అతని ముఖంలో దైవత్వం కనిపిస్తోంది. తన కష్టాలు ఫలించబోతున్నాయని భగవంతుడికి సాగిలపడింది.

మెట్లమీద అడుగుల సవ్వడి వినిపిస్తోంది. కమల దీపంలేని గుమ్మందగ్గరకు వెళ్ళింది. బుధియా లాంతరుపట్టు కుని నళినాక్ష వెంటనడుస్తున్నాడు.

ముకుందబాబు భోజనానికి లోపలకు వెళ్ళాడు. కమల నళినాక్ష కూర్చున్న కుర్చీముందు మోకరిల్లి అక్కడి నేలకు నమస్కరించి, ఆ పాదధూళి తీసుకుంది. తనకు అత నికి సేవలుచేసే భాగ్యంలేదా? ఆమె హృదయం ధ్యానంతో నిండిపోయింది.

మరునాడు, నళినాక్ష ముకుందబాబుకు పడమర తీరంలో కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోవలసిందని సలహా యిచ్చినట్లు తెలిసింది. ప్రయాణానికి సన్నాహాలు జరుగు తున్నాయి.

కమల అమ్మగారి దగ్గరకు వెళ్ళి తాను రావడంలేదని చెప్పింది.

"ఎందుకని ?"

"నాకు బెనారెస్‌లోనే ఉండాలని వుంది!"

"అలాగా ! చూద్దాం లేం."

"నన్ను యిక్కడ్నించి తీసుకువెళ్ళకండి. నా ప్రార్థన వినండి !"

"నీతో పెద్దగొడవ వచ్చిపడింది. ప్రయాణానికి అంతా సిద్ధంచేసుకున్నాక, ఇదో పెటకం తెచ్చిపెట్టావు. ఇప్పుడు కావాలంటే వంటమనిషి ఎక్కడ దొరుకుతుంది ? నిన్ను వదిలి వెళ్ళడానికివీల్లేదు !"

కమల ప్రయత్నాలు యేమాత్రం ఫలించలేదు. ఆమె తన గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుని తనివితీర ఏడ్చింది. దైవాన్ని ప్రార్థించింది.

# 53

ఆ రోజు హేమాలినితో మాట్లాడి పడుకున్న తరువాత ఆనందబాబుకు కలకత్తాలో వచ్చినలాంటి నొప్పి వచ్చింది. ఆ రాత్రంతా ఆ బాధతోనే గడిపాడు. తెల్లవారింతరువాత కొంత ఉపశమించింది. తోటలో కుర్చీ వేసుకు కూర్చున్నాడు. హేమాలిని టీ తయారుచేసింది. ఆయన ముఖం పాలిపోయి విపన్నంగా ఉంది. కళ్ళచుట్టూ నల్లటి ఉంగరాలు తయారయినాయి. ఒక రాత్రిలో ఆయనకు ఎన్నో సంవత్సరాలు గడచిపోయి నట్లుంది.

తండ్రి విచారానికి హేమాలిని కారణం ఊహించు కుంది. మానసికమైన చింతలు ఆయన శరీర ఆరోగ్యాన్ని

పాడుచేస్తున్నందుకు ఆమెకు చాలా విచారం కలిగింది.

ఇంతలో అక్షయ, చక్రవర్తిబాబాయి రావడంతో ఆమెకు ఆశ్చర్యం ముంచెత్తుకొచ్చింది ఆమె అక్కడినుంచి వెళ్ళి పోబోతూవుండగా అక్షయ యిలా అన్నాడు.

"అలా వెళ్ళబోకు. ఈయన ఘజీపూర్ నివాసి. చక్రవర్తిగారని పెద్ద పేరుగల మనిషి. ఆయన నీతో కొన్ని విషయాలు చెప్పవలసివుంది"

ఆనందబాబు కుర్చీదగ్గరేవున్న రాతిబల్లమీద కొత్త వాళ్ళిద్దరూ ఆసీనులైనారు. చక్రవర్తిబాబాయి ముందర తనే యిలా ప్రారంభించాడు. "మీరు రమేష్‌బాబుకు చాల స్నేహితులని విన్నాను. అతని భార్యజాడ మీకేమయినా తెలుసునేమో కనుక్కుందామని వచ్చాను."

ఈ మాటలు వినడంతోనే ఆనందబాబుకు ఊపిరి బిగదీసినట్లయింది. "రమేష్ భార్యా?" అన్నాడు ఆశ్చర్య పోయి.

హేమాలిని కళ్ళు క్రిందికి దించుకుంది. బాబాయి ఇలా చెప్పుకుపోయాడు. "నేనేదో చాదస్తంగానూ, పూర్వ కాలపు ధోరణిలోనూ మాట్లాడుతున్నాననుకోకండి. దయ చేసి నేను చెప్పేది పూర్తిగా వింటే ఘజీపూర్‌నుంచి నేను కేవలం యితరుల విషయాల్లో జోక్యం కల్గించుకోవడానికే రాలేదని గ్రహిస్తారు.

"పూజ సెలవుల్లో నేను రమేష్‌బాబును కలుసు కున్నాను. అతను భార్యతోసహా స్టీమరుమీద ప్రయాణం చేస్తూవుండగా మాకిద్దరికీ ప్రథమ పరిచయం అయింది.

కమలనుచూస్తే ఎవరైనా అందగత్తే అంటారు. స్టీమరుమీద ఉన్నప్పుడుగూడా ఎక్కడికి వెళ్ళాలనే విషయం రమేష్ బాబు ఓ నిశ్చయానికి రాలేదు. రెండు రోజులలో కమలకు నాకు ఆత్మీయత ఏర్పడింది. ఆమె భర్తను బలవంతంచేసి మా ఘజీపూర్ వచ్చేటట్లు చేసింది. మా రెండో అమ్మాయి శైలకు కమల అంటే స్వంత చెల్లెలుకన్నా ఎక్కువ. ఆ తరువాత జరిగిన విషయాలు చెప్పడానికి నాకు నోరు రావడం లేదు. మమ్మల్నందర్నీ దుఃఖసముద్రంలో ముంచి ఆమె ఎక్కడికి అదృశ్యురాలైందో, ఎందుకు అలాచేసిందో నాకు ఇప్పటివరకూ అర్థంకావడం లేదు. శైల ఏకధారగా ఏడుస్తూనే ఉంది."

"అయితే ఆమె ఎక్కడికి వెళ్ళింది" అని అడిగాడు ఆనందబాబు అత్యాసక్తితో.

బాబాయి రుద్ధకంఠంతో "అక్షయబాబూ! అంతా నీవు విన్నావుగా. ఏం జరిగిందో వారికి చెప్పు. మళ్ళీ చెప్పాలంటే నాగుండె బద్దలైపోతోంది" అన్నాడు.

పూసగుచ్చినట్లు అక్షయబాబు కథంతా చెప్పాడు. తన స్వంత వ్యాఖ్యానం ఏమీ జోడించకుండానే రమేష్ ప్రవర్తనను అపార్థం చేసుకోవడానికి వీలుగా వివరించాడు.

అంతా విన్నమీదట ఆనందబాబు "ఇదంతా మాకు సరిక్రొత్తవార్త. రమేష్ ఆ రోజు కలకత్తా వదలి వెళ్ళినప్పటినుంచీ మాకు అతనిదగ్గరనుంచి ఉత్తరం ముక్కయినా లేదు."

"అవును. అతను కమలను వివాహం చేసుకున్న

విషయంకూడా నాకు తెలియదు. అయితే, అయ్యా! ఒక ప్రశ్న అడుగుతాను చెప్పండి. కమల నిజంగా అతని భార్యే నంటారా? అతని చెల్లెలో మరేబంధువో కాకూడదూ!'' అన్నాడు అక్షయబాబు.

"అదేం కాదు అక్షయబాబు! ఆమె నిశ్చయంగా రమేష్ భార్యే. సద్గుణ ఖని కూడాను."

''అంతమంచి భార్యకు ఇంత దారుణమైన ఆదరం. ఈ ప్రపంచంలో అన్ని కష్టాలూ మంచివాళ్ళకే వస్తాయి." అని వ్యాఖ్యానించాడు అక్షయబాబు

"ఈ కథ వినడానికి చాలా విచారంగాఉంది. సరే మనమేం చేయగలం. కన్నీళ్ళు వృథాపరచిమటుకు ప్రయోజనమేమిటి?" అన్నాడు ఆనందబాబు.

"ఇంతకూ నిజం ఏమిటంటే కమల ఆత్మహత్యచేసు కుందని నాకు అనిపించడంలేదు. ఆమె ఊరికే యింట్లోనించి పారిపోయిఉండవచ్చుగదా! అందుచేత నేనూ, ఈ పెద్దమనిషీ ఈ బెనారస్ అంతా గాలించడానికి వచ్చాము. ఈ విషయంతో మీకుకూడా సంబంధముండంది గనుక మీరూ ఏదైనా సలహాయివ్వగలరనే ఉద్దేశ్యంతో మీదగ్గరికి వచ్చాము. సరే! మీకేమీ తెలియదుగదా! కొన్నాళ్ళు ఈ ఊరు గాలిస్తాం'' అన్నాడు అక్షయబాబు.

"రమేష్ యిప్పుడెక్కడ ఉన్నాడు." అని అడిగాడు ఆనందబాబు.

''అతను మాకేమీ చిరునామా యివ్వకుండా వెళ్ళి పోయాడు." అన్నాడు బాబాయి. అక్షయ అందుకుని

"నేనైతే అతన్ని చూడలేనుగాని అతను కలకత్తా వచ్చినట్టు మటుకు తెలిసింది. బహుశ [illegible] మళ్ళీ కలకత్తాలో ప్రాక్టీసు పెడతాడేమో" అని చక్రవర్తితో "రండిపోదాం. ఇంకా ఊళ్ళో విచారించాలిగా'' అన్నాడు.

"నీవు మాతో ఉంటావా అక్షయా!" అన్నాడు ఆనందబాబు.

''ఏమో చెప్పలేను. ఈ విషయం పరిష్కార మైతేగాని నాకేమీ తోచదు. పాపం ఆ అమ్మాయి ఎక్కడ ఎలాంటి కడగళ్ళు పడుతుందో, రమేష్ ఆమె నలా వెదికి వదిలేశాడుగాని నేనలా చెయలేను."

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

ఆనందబాబు ఆదుర్దాగా హేమాలిని ముఖంవంక చూచాడు. తను బాధపడుతున్నట్లు కనిపిస్తే తండ్రి మరింత బాధపడతాడని ఆమె అతి ప్రయత్నంమీద మామూలుగా కూర్చుంది.

"నాన్నగారు! మీరు రివాళ మంచి డాక్టరు దగ్గరకి వెళ్ళి శరీరం పరీక్ష చేయించుకోవాలి. మీ ఆరోగ్యం ఏమీ బాగోలేదు.'

ఆనందబాబు ఉపశమనం పొందాడు. సాధారణ పరిస్థితుల్లో ఆయన ఈ విషయాన్ని అలా వదలగలిగేవాడు కాదు. రమేష్‌ను గురించి ఇంతచెడ్డగా విన్నతరువాతగూడ హేమాలిని తన ఆరోగ్యాన్ని గురించి ప్రశ్నించడం ఆయన హృదయ భారాన్ని తగ్గించినట్లయింది.

"సరే! డాక్టర్ నళినాక్షకోసం కబురు పంపించమం

టావా !'' అన్నాడు.

ఆ పేరు వినగానే ఆమె కొద్దిగా జంకింది. ఇదివరలాగా తండ్రి సమక్షంలో అతన్ని కలుసుకోవడం అంత తేలికైనపని కాదు. ఏమైనా తండ్రి "సరే. అలాగే చేయండి" అని జవాబు చెప్పక తప్పలేదు.

''అన్నట్లు హేమా ! ఈ రమేష్ విషయం...''

"ఇక్కడ ఎండ ఎక్కువగా ఉంది నాన్నగారూ! లోపలికి రండి." అంటూ హేమాలిని ఆయన్ను లోపలికి తీసుకు వెళ్ళింది. ఆయనకు శాలువకప్పి, వార్తాపత్రిక అందించి కళ్ళజోడు ధరింపజేసి, ''నాకు వేరేపనివుంది, మీరు పేపరు చదువుకోండి" అంటూ లోనికి వెళ్ళింది.

చిన్నపిల్లవాడిలాగా ఆనందబాబు ఆమె చెప్పినట్లల్లా చేశాడు, కానీ అతనికి పత్రికమీద ధ్యాస కుదరలేదు. అందుచేత ఆమెకోసం బయలుదేరాడు. ఆమె తలుపు లోపలిగడియ వేసుకుని పడుకుంది, ఆనందబాబు వరండాలో కూర్చున్నాడు. ఇంతలో నళినాక్ష వచ్చాడు.

ఆనందబాబుకు పరీక్షచేశాక ఆయనకు మందుమాకులు వ్రాసియిచ్చాక, డాక్టరు హేమవంక తిరిగి "రోగికి మానసిక బాధలేమైనా ఉన్నాయా ?" అని అడిగాడు.

ఆమె ఔనని తలఊపింది.

నళినాక్ష "ఆయనకు ఏమీ ఆదుర్దా లుండకూడదు.

మా అమ్మ విషయంకూడా యింతే. తనకు అక్కర్లేని చిన్న విషయాలకుకూడా ఆమె బాధపడుతూ ఉంటుంది. అందుకే ఆమె ఆరోగ్యం అలా ఉంది. ఆమెను ఎంత జాగ్ర

త్తగా చూడాలన్నా కుదరడం లేదు." అన్నాడు.

"ఇవాళ మీరు మామూలుగా లేరే" అంది హేమాలిని.

"రాత్రి చాలాసేపు మేల్కొన్నాను అందుచేత కాబోలు."

"మీ అమ్మగార్ని కనిపెట్టుకు ఉండటానికి ఎవరైనా ఆడవాళ్ళుంటే బావున్ను అంది హేమాలిని ఆమె ఏంమాట్లాడుతున్నదో తెలియకుండా, తన మాటల అర్థం తెలియగానే ఆమె ముఖం సిగ్గుతో ఎఱ్ఱబారింది. నళినాక్ష ఏమనుకుంటాడో అని కంగారు పడింది. ఆమెకంగారు గమనించి తనతల్లి ప్రతిపాదనను గుర్తు తెచ్చుకున్నాడు. హేమాలిని తనమాటలు సమర్థించుకోడానికి "మీ అమ్మగారి దగ్గర ఏదాసీనైనాఉంచక పోయారా?" అంది

"నేనూ అదే చెపుతూవచ్చాను. కాని ఆమెకు ఆచారా లెక్కువ. డబ్బుకు పనిచేసేవాళ్ళు సరిగ్గా చేయరంటుంది. పరిచర్యలు కొనుక్కోడానికి వీల్లేదంటుంది."

హేమాలిని ఈ చర్చను కొనసాగించలేదు. కొంత సేపయింతరువాత నళినాక్ష వెళ్ళిపోయాడు. ఆమెకు ఎన్నో ఆలోచనలు ముసురుకువచ్చాయి. క్షేమంకరిని గురించి ఆలోచించింది. రమేష్ కథనుగురించి తర్కించుకుంది. ఈ ఆలోచనలన్నిటినించీ తనను విముక్తురాలును చేయమని భగవంతుడిని ప్రార్థించింది.

ఆనందబాబు రమేష్, కమలల కథనుగురించి హేమ ఏమనుకుంటోందో తెలుసుకుందామనుకున్నాడు. కాని

ఆయన ఎంతప్రయత్నించినా ఆమె సాగనీయలేదు. చివరకు ఆయనే ఇలా అన్నాడు. "చూడు అమ్మాయీ! జీవితంలో ఏదో ఒక దెబ్బతిన్నాం గనక ఇక యీ జీవితాన్నే దుఃఖ భాజనం చేసుకుందాం అనుకోకూడదు. నాకు యీ జీవితంలో కావలసిందల్లా నీసుఖమే. నీకు సుఖమూ, సంక్షేమమూ ఎక్కడ లభిస్తాయో నాకు బాగా తెలుసు. నిన్న నేను చెప్పిన విషయాన్ని నీవు మళ్ళీ ఆలోచించు. నామాట కాదనకు."

హేమాలిని కనుబొమ్మలు ముడుచుకుని యిలా చెప్పింది. "అలా అనకండి నాన్నగారూ! మీ మాట నే నెప్పుడూ కాదనను. కాకపోతే కాస్తవిరామం యివ్వమంటున్నాను అంతే."

అనందబాబు ఆప్యాయంగా ఆమె శిరస్సు నిమిరాడు.

మరునాడు వాళ్ళిద్దరూ టీ బల్లదగ్గర కూర్చుని ఉండగా అక్షయ వచ్చాడు. ఆనందబాబు కళ్ళతో వేసిన ప్రశ్నకు "ఆమెజాడ యింకా దొరకలేదు" అని సమాధానంచెప్పి టీ కప్పు అందుకున్నాడు. "రమేష్‌బాబు, కమలకు సంబంధించిన కొన్ని వస్తువులు యింకా బాబాయిదగ్గరే ఉన్నాయట. వాటిని ఎక్కడకు పంపడమో ఆయనకు తెలియడంలేదు. రమేష్‌బాబు మీ మకాం తెలుసుకుంటే తప్పక మీ దగ్గరికి వస్తాడు. అందుచేత మీరు——"

"తెలివితక్కువగా మాట్లాడకు అక్షయా! రమేష్ యిక్కడి కెందుకు వస్తాడు. అతని సామాన్లు నే నెందుకు కాపాడుతూ కూచోవాలి" అన్నాడు ఆనందబాబు కోపంగా.

"రమేష్ ఎన్ని తప్పులు చేసినా ఎన్ని పొరపాట్లుచేసినా తమ పాతస్నేహితుడు కదా !"

"మాటిమాటికీ అతని పేరెత్తి మాకు చిరాకు కలిగిస్తున్నావు."

"అలా కోప్పడకండి నాన్నగారూ ! అక్షయ ఏం చెప్తాడో చెప్పనివ్వండి. అతనేం తప్పుచేయడంలేదు" అంది హేమనళిని నింపాదిగా.

"మళ్ళీ ఎప్పుడు అనను. క్షమించండి. నాకు అర్థంకాలేదు" అన్నాడు అక్షయ.

## 54

ముకుందబాబు మీరట్‌కు వెళ్ళిపోవలసిన సమయం ఆసన్నమయింది. ఇంట్లోవాళ్ళంతా ఆయన వెంట బయలుదేరుతున్నారు, కమల ఏదో సంఘటన జరిగి తన ప్రయాణం ఆగిపోతుందని ఎదురుచూస్తోంది.

కమల ఎక్కడ పారిపోతుందో అనే భయంతో నవీన్‌కాళి ఆమెను ఎంతసేపూ తన కనుచూపు మేరలోనే ఉంచుకుంటూంది. కమలను తనదగ్గరే పడుకోమంటోంది. తన బండిలోనే స్టేషనుకు తీసుకువెళ్ళింది. ముకుందబాబు రెండవతరగతి పెట్టెలోను, నవీన్‌కాళి కమల ఇంటర్‌తరగతి పెట్టెలోనూ ప్రయాణం చేయాలి.

రైలు బెనారెస్ వదిలింది. వినాశంచేసే మదపుటేనుగులా గర్జించింది. కమల దీనంగా కిటికీలోంచి చూస్తోంది. నవీన్‌కాళి ఆమెను తన తమలపాకుల పెట్టె ఇమ్మని అడిగింది.

కమల యిచ్చింది. తెరిచిచూడగానే ఆమె కోపం పరాకాష్టను అందుకుంది. "అనుకున్నంతా చేశావు. సున్నం డబ్బీ వేయలేదు, ఇప్పుడు నన్నేం చేయమంటావు? నా అంతట నేను చూచుకుంటే తప్ప అంతా అపసవ్యంగా చేస్తావు. కావాలని చిరాకు కల్పించాలని చేశావు. ఒకరోజు కూరలో ఉప్పు ఉండదు. ఇంకోరోజు పాలు మట్టివాసన వేస్తావుంటాయి నీ వేషాలు నాకు తెలియవనుకుంటు న్నావా? ఆగు, మీరట్ చేరుకోగానే నీ విషయం చెబు తాను—"

రైలు వంతెనమీదుగా వెళుతున్నప్పుడు కమల కిటికీలోనుంచి కిందికిచూచి చివరి దర్శనం చేసుకుంది.

నళినాక్షు ఎక్కడుంటాడో ఆమెకు తెలియదు. కాని ఆమె ఊహాపథంలో ఎక్కడ చూచినా అతనే అగుపిస్తు న్నాడు.

"ఏమిటలా మెడ నిక్కబెట్టుకుని చూస్తున్నావు? పక్షిలా రెక్కలు ఊపుకుంటూ పైకి ఎగిరిపోదామనుకుంటు న్నావా?"

బెనారస్ కనుచూపుమేర దాటిపోయింది. కమల తన స్థలంలో కూర్చుండిపోయింది.

మొగల్సరాయ్ చేరింది రైలు. జనం ఎక్కడం, దిగడం, గందరగోళం అంతా కమలకు కలలా కనిపించింది.

ఈ గందరగోళంలోనే ఆమె ఒక రైలుదిగి మరో రైలు ఎక్కింది. మీరటు వెళ్ళేరైలు బయలుదేరబోతూం డగా కమలను వెనుకనించీ ఎవరో పిలిచారు—"అమ్మ

గారూ!" అని. కమల ఆశ్చర్యపోయింది. ప్లాట్‌ఫారంవంక చూచి ఉమేష్‌ను గుర్తుపట్టింది.

"నువ్వా ఉమేష్?" అంది.

ఉమేష్ రైలుపెట్టె తలుపుతీశాడు. కమల కిందికిదిగి అతనిపక్కనే ప్లాట్‌ఫారమ్‌మీద నిలబడింది. ఉమేష్ ఆమెకు పాదాభివందనం చేశాడు.

మరునిమిషం గార్డు తలుపు వేశాడు.

నళిన్‌కాళి కమలను ఉద్దేశించి యిలా అరిచింది:

"కమలా! కమలా! ఏంచేస్తున్నావు. రైలు బయలు దేరుతుంది. ముందు లోపలికి రా..."

కాని యీ పిలుపులేమీ వినిపించడం లేదు.

రైలుస్టేషను దాటిపోయింది.

"ఎక్కడనుంచి వస్తున్నావు ఉమేష్" అని అడిగింది కమల.

"ఘజీపూర్‌నుంచి."

"అంతా కులాసాగా వున్నారా? బాబాయిగారింట్లో విశేషాలేమిటి?

"ఆయన కులాసాగానే వున్నాడు."

"శైలజ?"

"ఆమె మీ కోసం యేడుస్తోంది."

కమల కళ్ళు నీళ్ళతో నిండాయి.

"ఉమి ఎలావుంది? ఇంకా అత్తయ్యను మర్చిపో లేదా?"

అత్తయ్యకోసం మారాంచేస్తోంది. మీరు యిచ్చిన

గాజులు తొడిగితేతప్ప పాలుతాగడంలేదు."

"నువ్విక్కడికి ఎందుకువచ్చావు ?"

"ఘజిపూర్ అంటే విసుగుపుట్టింది. అందుకు వచ్చే శాను."

"ఎక్కడికి వెడుతున్నావు ?"

"మీతోపాటే—"

"నాకీ ప్రపంచంలో ఒక్క దమ్మిడీకూడా లేదు."

"ఫరవాలేదు. నాదగ్గర డబ్బువుంది."

"ఎక్కడిది ?"

"ఆరోజు మీరుయిచ్చిన అయిదురూపాయిలు నేను ఖర్చుచేయలేదు. అలాగేవున్నాయి" అంటూ ఉమేష్ ఆమెకు అందించాడు.

"అయితే, రా. బెనారెస్ వెడదాం. మనిద్దరికీ టిక్కెట్లు తీసుకురా."

అతను తీసుకువచ్చాడు—

రైలు స్టేషన్లో నిలిచివుంది. అతను కమలను ఒక కంపార్ట్మెంట్లో కూర్చోబెట్టి తను పక్క పెట్టెలో కూర్చుంటా నన్నాడు.

బెనారెస్లో దిగినతర్వాత "ఎక్కడికి వెడదాం ?" అనడిగింది.

"మరేం ఖంగారుపడకండి. మిమ్మల్ని సరైనచోటికే తీసుకువెడతాను."

"సరైనచోటా ? నీకు బెనారెస్ యేం తెలుసు ?"

"నాకంతా తెలుసు. చూస్తూవుండండి."

ఉమేష్ ఆమెను ఒక బగ్గీలో తీసుకువెళ్ళాడు. బగ్గీ ఒక యింటిముందు ఆగింది. "దిగండి అమ్మగారూ!" అన్నాడు.

ఉమేష్ 'తాతయ్యా' అని పిలుస్తూ యింట్లోపలికి వెళ్లాడు.

"నువ్వా ఉమేష్. ఎక్కడనుంచి ఊడిపడ్డావు?" అంటూ చక్రవర్తిబాబాయి హుక్కాగొట్టంతో సహా ప్రత్యక్షమైనాడు. ఉమేష్ నవ్వుతున్నాడు. కమల బాబాయికి అభివాదం చేసింది. ఆయన దిగ్భ్రమ చెందాడు. ఒకటి రెండు నిమిషాలతరువాత తేరుకుని "నా చిన్నారితల్లి నా దగ్గరకు తిరిగివచ్చేసింది. మేడ మీదికిరా అమ్మా—" అంటూ శైలను పిలిచి "ఎవరు వచ్చారో చూడు" అన్నాడు.

కమల ఆమెకు నమస్కారం చేసింది. శైల ఆమెను కౌగలించుకుని ముద్దాడింది. ఆమె చెక్కిళ్ళమీదుగా కన్నీరు కారుతోంది. "మమ్మల్ని వదిలి ఎక్కడికి వెళ్ళావు? మా గుండెలు బద్దలైపోతాయని ఎరుగవా?" అంది.

"ముందు అమ్మాయి భోజనవిషయం చూడు శైలా" అన్నాడు బాబాయి.

ఉమ లోపల్నుంచి బయటకు వచ్చింది. "అత్తా, అత్తా" అంటూ మీద దూకింది.

"రాత్రి నిద్రపోలేదా ఏమిటి? నీ కళ్లు చూడు ఎలా లోతుకు పోయినాయో! కాస్సేపు విశ్రాంతి తీసుకో. ఇంతలో నీ భోజనం ఏర్పాటుచేసి పిలుస్తాను."

"వొద్దక్కా. నేనుకూడా వంటింట్లోకే వస్తాను, నీతో

పాటు'' అంటూ కమల శైలవెనకనే నడిచివెళ్ళింది.

అక్షయ సలహా ప్రకారం బాబాయి బెనారెస్ వెళ్ళ డానికి ప్రయాణమైనప్పుడు శైలజ తనుకూడా వస్తానని పట్టు బట్టింది. ''కాని బిపిన్‌కు యింకా సెలవులు యివ్వలేదు'' అన్నాడు తండ్రి.

''మరేం ఫరవాలేదు. నే నొక్కదాన్ని వస్తాను. అమ్మ యిక్కడే ఉంటుంది గదా !—'' భర్తనుంచి మొదటిసారిగా వియోగం పొందటం యిదే శైలజకు.

బాబాయి అంగీకరించక తప్పలేదు. శైలజ కూడా ఆయనతో ప్రయాణం అయింది. బెనారెస్‌లో దిగి, ఉమేష్‌ను చూచారు. ఎందుకు వచ్చావని అడిగారు. అతనూ తమ లాంటి పనిమీదే వచ్చినట్లు తెలిసింది. తమతోనే ఉండి పొమ్మన్నారు.

కమల లేకుండా ఘజిపూర్‌లో జీవితం బాగుండక ఒకనాడు మార్కెట్టుకు వెళ్ళి కూరగాయలు తీసుకురమ్మ న్నప్పుడు, ఉమేష్ అలాగే ఉడాయించి, బెనారెస్ చేరు కున్నాడని పాఠకులు ఊహించే ఉంటారు.

# 55

ఆ రోజు అక్షయ చక్రవర్తి ఇంటికి వచ్చాడు కాని, అతనికి కమల రావడాన్ని గురించి ఎవరూ ఏమీ చెప్పలేదు. ఎందుచేతనంటే రమేష్‌కు అక్షయ అంటే అంత యిష్టంలేదని బాబాయికి యీ సరికి తెలిసిపోయింది.

కమల ఎందుకు పారిపోయింది అన్న విషయం ఎవరూ

ఆమెను ప్రశ్నించి బాధించడంలేదు. ఆమె తమతో పాటు బెనారెస్‌కు వచ్చినట్లు భావిస్తున్నారు, అంతే.

శైలజ, కమలను ఆ రాత్రి తనదగ్గరే పడుకోబెట్టుకుని ఆమెకు జో కొట్టింది. దీని అర్థమే తన కష్టాలకథను వినిపించమని ఆహ్వానం.

"నీవేం అనుకున్నావు అక్కా, నామీద కోపం వచ్చిందా ?" అని అడిగింది కమల.

"నీమీద కోపగించేంత క్రూరివాళ్ళంకాదు. నీకష్టానికి విచారించాం. అంతే."

"కథంతా చెప్పమంటావా అక్కా."

"అలాగే చెప్పు !"

"నీకు చెప్పటానికి నాకేం అభ్యంతరంలేదు, అప్పుడంటే నాకు వేరే ఆలోచన లేకపోయింది. మీ ముఖం ఇక ధైర్యంగా చూడలేననుకున్నాను. నాకు తల్లిగాని అక్కచెల్లెళ్ళుగాని లేరు, అక్కా. నువ్వే నాకు తల్లివి. అక్కవి. అందుకనే యీ కథంతా నీకు చెబుతానంటున్నాను. లేకపోతే మరొకళ్ళకు ఎన్నటికీ చెప్పను !"

కమల లేచికూర్చుంది. శైలజకూడా ఆమెకు ఎదురుగా కూర్చొంది. కమల తన వివాహం దగ్గర్నుంచి వరుసగా చెప్ప నారంభించిది.

వివాహానికి ముందుగాని, తరువాతగాని తాను భర్త ముఖం చూడలేదని చెప్పగా, శైలజ అడ్డువచ్చి ఇలా అంది: "నీలాంటిదాన్ని నేనెక్కడా చూడలేదు. నా పెళ్ళప్పటికి, నీకంటె చిన్నదాన్ని, నాభర్తవైపు చూడటానికి నాకేంసిగ్గని

పించలేదు."

"సిగ్గుకాదు అక్కా. నాకు పెళ్ళియీడు దాటి పోయింది. అకస్మాత్తుగా నా వివాహం నిశ్చయమయింది. నా స్నేహితురాళ్ళు నన్ను భయపెట్టారు. నా వయస్సులో అలాంటి భర్తను పొందగలిగినందుకు నేనే అదృష్టవంతురాలినని అనుకుంటున్నట్లు కనిపించకుండా వుండటానికి కళ్ళు పైకెత్తి చూడకుండా కూర్చున్నాను. కనీసం ఆలోచనలలోనైనా అతన్ని గురించి అనుకోవడం అనవసరం అనుకున్నాను. అందుకు ఇప్పుడు వడ్డీ చెల్లిస్తున్నాను."

కమల కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా వుండి మళ్ళీ ప్రారంభించింది.

"పడవ మునిగి, మేమిద్దరం రక్షింపబడ్డామని చెప్పాను కదూ! ఆ రక్షింపబడినప్పుడు, అతనెవరనే విషయం నాకు తెలియదు. అతనే నాభర్తఅనుకున్నాను. అంతేగాని, అతను నిజంగా నా భర్తకాదు!"

శైలజ నిర్ఘాంతపోయింది. కమల పక్కకుజరిగి ఆమె మెడచుట్టూ చేయివేసింది: "అలాగా ఇప్పుడర్థం అయింది నాకు... ఎంత దుర్ఘటన సంప్రాప్తించింది!"

"అవునక్కా. దుర్ఘటనే. మునిగిపోయి మళ్ళీ బతకటమంటే—"

"పోనీ రమేష్‌బాబుకయినా నిజం తెలియలేదా?"

"వివాహం జరిగిన కొన్ని రోజుల తరువాత, ఒకనాడు ఆయన నన్ను "సుశీలా" అని పిలిచారు. నాపేరు కమల, నన్ను సుశీలా అని ఎందుకు పిలుస్తారు? అన్నాను. బహుశ

ఆయన అప్పుడే తన తప్పు గ్రహించివుండాలి. కాని ఆరోజుల్లోకూడా నేను ఆయన ముఖంలోకి చూడలేదు. అక్కా —" అంటూ ఆమె నిశ్శబ్దంలోకి జరిగిపోయింది.

ఒక్కొక్క ముక్కగా, శైలజ ఆమెదగ్గర్నుంచి వివరాలు రాబట్టింది. అంతా విన్నతరువాత కమలతో "చాలా అవస్థపడ్డావు పాపం. కాని ఎవరిచేతుల్లోనూ పడకుండా వుండడంలో నువ్వు అదృష్టవంతురాలివి. నీవేమయినా అను, నాకు రమేష్‌బాబంటే విచారంవేస్తోంది."

"సరే, యిప్పుడు చాలా ఆలస్యం అయిపోయింది, యిక నిద్రపో, ఎన్నోరాత్రులనుంచి నిద్రలేక, నీ ఆరోగ్యం చెడిపోయింది. రేపు అంతా ఆలోచించి యేదో చేద్దాం."

కమలదగ్గర హేమాలినికి రమేష్ వ్రాసిన ఉత్తరం వుంది. మరునాడు ఉదయం, శైలజ తన తండ్రితో ఏకాంతంగా కొంతసేపు మాట్లాడింది. ఆయన కా వుత్తరంకూడా యిచ్చింది.

బాబాయి కళ్ళజోడు పెట్టుకుని దాన్ని మెల్లిగా చదివాడు. తరువాత దాన్ని కవరులో వుంచేశాడు.

"అయితే యేంచేద్దామంటావు?" అన్నాడు.

"ఉమికి రెండురోజులనుంచి జలుబు, దగ్గు - బాధగా వుంది. డాక్టర్ నళినాక్షను కబురుచేస్తాను. ఆయన్ను గురించి అందరూ వినడమేగాని ఎవరూ చూడలేదు" అంది శైల.

డాక్టర్ రోగిని చూడడానికి వచ్చాడు. శైల ఆయన్ను సునిశితంగా చూచింది.

"కమలా, రా" అంది. నవీన్ కాలి యింట్లో అతన్ని

చూడడానికి అత్యంత ఆసక్తిపడిన కమలకు యిప్పుడు సిగ్గుతో అడుగు ముందుకు పడడం లేదు.

"కమలా! నీకోసం సమయం వృథాచేయలేను. ఉమికి ప్రత్యేకించి జబ్బేమీలేదంటున్నారు డాక్టరు. ఆయన యిక్కడే ఎంతసేపు కూర్చుంటారు?—" అంటూ ఆమె కమలను గుమ్మందగ్గరకు లాక్కువచ్చింది.

నళినాక్ష ఉమిని పరీక్షచేసి యేదో మందురాసి యిచ్చి వెళ్ళిపోయాడు.

"నువ్వు అదృష్టవంతురాలవు కమలా. ఇన్నాళ్ళూ ఎన్ని అవస్థలుపడినా యికముందు నీ జీవితం సుఖవంతం అవుతుంది. ఒకటి రెండురోజులు వేచివుండు. మేం అన్ని యేర్పాట్లు చేస్తున్నాం. ఇంతలో ఉమికోసం డాక్టర్ని అనేక సార్లు పిలిపిస్తాం. అందుచేత నీ నాయనను దర్శిస్తూ వుండవచ్చు."

ఒకరోజు బాబాయే డాక్టర్ కోసం స్వయంగా వెళ్ళాడు. ఆయనయింట్లో వుండని సమయం యెంచుకునే వెళ్ళాడు. నౌకరు డాక్టరుగారు యింటిలో లేరని చెప్పాడు. అయితే, అమ్మగారితో మాట్లాడుతానంటూ చక్రవర్తి లోపలకు వెళ్ళాడు.

"బెనారెస్‌లో మిమ్మల్ని గురించి ఘనంగా చెప్పుకుంటారు. అందుచేత దర్శనం చేసుకుందామని వచ్చాను. మా మనవరాలుకు కొద్దిగా సుస్తీగా వుంది. అందుచేత డాక్టర్‌గారికోసం కూడా వచ్చాను."

"అబ్బాయి యిప్పుడే వచ్చేస్తాడు. కాస్సేపు కూచుని

వుండండి. ఆలస్యం అయినట్లుంది. మీకు ఫలహారం యేమయినా తెప్పించమంటారా ?"

ఫలహారం అయినాక "రేపు మధ్యాహ్నం మీరు మా యింట్లోనే భోజనం చేయాలి". అని ఆహ్వానించింది. క్షేమంకరి.

ఆవిధంగా బాబాయి నళినాక్షయింటికి పరిచయం అయినాడు.

ఒకరోజు క్షేమంకరి కొడుకును పిలిచి "నళిన్, నీవు చక్రవర్తిగారి మనమరాలికి వైద్యం చేస్తున్నావుకదూ! బిల్లు మాత్రం పంపకు, ఆయన మనకు స్నేహితుడు" అంది.

చక్రవర్తి నవ్వాడు.

తండ్రి, కూతురు ఎన్నో ఆలోచనలు చర్చించు కున్నారు. ఒకరోజు బాబాయి, కమలతో "రా అమ్మా! వెళ్ళి స్నానం చేసివద్దాం, ఇవాళ దశాశ్వమేధోత్సవం" అన్నాడు.

"నువ్వుకూడా రావాలి అక్కా" అంది కమల, శైలతో.

"ఒంటికి బాగులేదు. నేను రాను" అంది శైల.

దారిలో వారికి గంగాస్నానంచేసి తిరిగివస్తున్న వృద్ధు రాలు ఒకామె కనిపించింది. బాబాయి ఆమె కెదురుగా కమలను నిలబెట్టి, "ఈమె డాక్టరుగారి తల్లిగారు. ఈమెకు ప్రణామంచేయి" అన్నాడు. కమల అతనిమాటలకు నివ్వెర పోయి, తక్షణం అలాగే చేసింది.

"ఈ అమ్మాయి ఎవరు?" అంది క్షేమంకరి. "ఎంత అందమైనపిల్ల! అచ్చు లక్ష్మీదేవిలావుంది" కమలను

దగ్గరికి తీసుకుని ఆమె ముఖాన్ని పూర్తిగా చూసింది. "నీ పేరేమిటమ్మా?"

కమల జవాబుచెప్పటానికి ముందే, బాబాయి అందుకుని "ఈమె పేరు హరిదాసి. నాకు వరసకు కూతురవుతుంది. తల్లితండ్రిలేరు. నామీదే ఆధారపడివుంది" అన్నాడు.

"రండి, నాతోపాటు మాయింటికి రండి—" అంటూ ఆమె యిద్దరినీ యింటికి తీసుకువెళ్ళి నళినాక్షను పిలిచింది. కాని అతను యింటిలో లేడు. బాబాయి కుర్చీమీద కూర్చున్నాడు. కమల పీటమీద కూర్చుంది.

బాబాయి ప్రారంభించాడు, "ఈ అమ్మాయి చాలా దురదృష్టవంతురాలు. వివాహం అయిన మరునాడు భర్త సన్యాసి అయిపోయి రోడ్లమీద పడ్డాడు. అంచేత యీమె భర్త ముఖం చూచివుండలేదు. ఈమెకు పవిత్ర స్థలంలో మత ప్రాధాన్యమైన జీవితం గడపాలని కోరిక. మతం ఒక్కటే ఆమెకు కావల్సిన వస్తువు. కాని నేను యిక్కడవుండనుకదా! నాఉద్యోగం ఘజీపూర్‌లో. కుటుంబపోషణకోసం ఉద్యోగం కావాలి కనుక, యిక్కడ మకాం యేర్పరుచుకోవడానికి వీల్లేదు. అందుచేతనే మిమ్మల్ని ఒక కోరిక కోరాలనుకుంటున్నాను. ఈమెను మీదగ్గర వుంచుకుని, మీ కుమార్తెలా చూచుకుంటే, నాభారం తగ్గుతుంది. ఎప్పుడయినా, మీకు యీమెను పంపివేయాలని అనిపిస్తే, మా ఊరుకు—ఘజీపూర్‌కు—పంపివేయండి. రెండు రోజులపాటు మీ దగ్గర వుంచుకుచూస్తే, యీమె సద్గుణాలు మీకే తెలిసివస్తాయి. హరిదాసిని వదిలి వుండలేరు!"

"బాగా నేవుంది. ఇలాంటి అమ్మాయిని చేరదీయడం నాకూ ఎంతో యిష్టం. హరిదాసిని నాకు వప్పగించండి. ఆమెనుగురించి మీరిక యేమీ ఆదుర్దాపడనక్కరలేదు. మా అబ్బాయినిగురించి మీకు తెలుసుగా మా యింటిలో యిద్దరమే వుంటాం —" అంది

"నళినాక్షవిషయం నాకు తెలుసుగా! పాపం అతని భార్య వివాహంఅయినవెంటనే నీళ్ళలోమునిగి చనిపోయిందటకదూ! పాపం, అప్పటినుంచీ అతనికి వైరాగ్యం పట్టుకుంది."

"అదంతా దైవవిధి! దాన్నిగురించి మాట్లాడకండి. నాకు వణుకుపుడుతుంది."

"మీరు అనుమతిస్తే, హరిదాసిని యిప్పుడే మీ దగ్గర వదిలివెడతాను. నేను అప్పుడప్పుడు వచ్చి చూచివెడుతూ వుంటాను. నాకుమార్తెకూడా అప్పుడప్పుడువచ్చి మిమ్మల్ని చూచివెడుతుంది!"

బాబాయి వెళ్ళగానే, క్షేమంకరి కమలను దగ్గరకు తీసుకుని "ఏదీ, నీ ముఖం చూడనీ. నువ్వింకా చిన్నపిల్లవు. నిన్ను వదలివెళ్ళడం యెంత ఘాతుకమైనపని. ప్రపంచంలో యెంత లేనివాళ్ళయినా వుంటారు. నీ అందం వృధాగా పోవటానికి వీల్లేదు" అంటూ ఆమె గడ్డాన్ని ఎత్తిపట్టుకుని "ఇక్కడ నీ వయసు స్నేహితురాళ్ళు ఎవరూ లేరు. నాతోపాటు ఒంటరిగా వుంటావా?" అంది.

"అలాగే" అంది కమల.

"రోజంతా యేంచేస్తావు?"

"మీకు సేవ చేస్తాను"

"ఓహోహో. నీవు అచ్చం మా అబ్బాయిలాగే మాట్లాడుతున్నావు. వాడు విరాగి. వాడికేమీ అక్కరలేదు. అస్తమానం నా సేవచేస్తూ కూర్చుంటానంటాడు...ఇదుగో అమ్మాయ్, నాతో ఇరవైనాలుగ్గంటలూ కూర్చున్నావంటే, నళినాక్షుడి పొగడ్తలు తప్ప యింకేమీ వినలేవు. నీకు విసుగెత్తిపోతుంది."

కమల హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది.

"నీకేంపని యివ్వాలో తెలియడంలేదు. కుట్టుపని వచ్చా?"

"అంతగా రాదు."

"సరే. నీకు పాఠాలు చెబుతాను. పోనీ చదవడం వచ్చా?"

"ఆఁ. చదవగలను."

"బాగుంది. నాకు కళ్ళద్దాలు పెట్టుకుంటే తప్ప కనిపించదు. అయితే నాకు చదివి వినిపిస్తూవుండు."

"నాకు వంటపనీ, ఇంటిపనీ చేతనవును."

"అలాగే. ఇంతవరకూ వంటపని నేనే చేస్తున్నాను. నాకు సుస్తీ చేసినప్పుడు నళిని చేస్తాడు. ఇకనుంచి, ఎప్పుడన్నా అవసరంవస్తే నువ్వుచేసిపెడుదువుగాని!" అంది క్షేమంకరి.

కమల తన హృదయంలోని కోరిక వెలిబుచ్చటానికి యిదే మంచి అదనని గ్రహించింది. "ఇవాళ నేనే వంట చేస్తానండీ!" అంది.

క్షేమంకరినవ్వింది. "వంటయిల్లు స్త్రీసామ్రాజ్యం.

నేను నా జీవితంలో ఎన్నో పరిత్యజించానుగాని దీన్నిమటుకు వదలలేకుండా వున్నాను. సరే, యివాళ నీవే వంటచేయి. కావాలనుకుంటే యింకా రెండు మూడు రోజులు చేయి. కొన్నాళ్ళుపోతే, యింటిపనంతా నీవే తీసుకుంటావు, నాకు తెలుసు. అప్పుడు నాకు జపతపాలకు సమయం మిగులుతుంది. కొన్నిరోజులపాటు నా నిరంతర బాధ్యతలనుంచి నేను సెలవుతీసుకుంటాను. ఇల్లాలు సింహాసనం పూలపరుపుకాదు."

క్షేమంకరి తన ప్రార్థన మందిరానికి వెళ్ళింది. కమల వంటఅంతా పూర్తిచేసింది.

నళినాక్ష యింటికి రావడంతోటే చేసే మొదటిపని తల్లిని చూడడం. ఆమె ఆరోగ్యం అతని కిప్పుడు విడువని బెంగగా తయారయింది. ఆ రోజు అతను యింటికి రావడంతోటే, వంట జోరుగా సాగిపోతున్నట్లు సువాసనలు వేయసాగాయి. తల్లి వంటయింట్లో వున్నదని భావించి సరాసరి అక్కడికి వెళ్ళి గుమ్మందగ్గర నిలిచాడు.

అడుగుల చప్పుడు విని కమల వెనక్కు తిరిగింది. నళినాక్షను చూచింది. మరుక్షణంలోనే తల కిందికి దించుకుని నెత్తిమీది ముసుగు సవరించుకుంది. నళినాక్ష వెనక్కు వెళ్ళిపోయాడు.

క్షేమంకరి పూజ పూర్తిచేసుకుని కమల ఏంచేస్తోందో చూడడానికి వంటగదికి వచ్చింది. అప్పటికి కమల యిల్లు ఊడ్చి గదంతా శుభ్రం చేసివుంచింది. ఎక్కడా బొగ్గుతునకలుగానీ, కూరగాయ తొడిమలుగానీ లేవు.

"బాగుంది. నువ్వు అక్షరాలా బ్రాహ్మణ బాలికవే.

అందు కేమీ సందేహంలేదు'' అంది.

నళినాక్ష భోజనానికి కూర్చున్నాక, తల్లి అతనికి ఎదురుగా కూర్చుంది. కమలకు ఆ గదిలోకి తొంగిచూడటానికిగూడా ధైర్యం చాలిందికాదు.

"ఇవాళ వంట ఎలావుంది నళిన్?'' అనడిగింది. క్షేమంకరి.

అతనికి రుచులతో నిమిత్తం లేదు. అందువల్ల ఆమెకు అతన్ని అలా అడగడంకూడా యిష్టంలేదు. కాని యీసారి ఆమె కంఠస్వరంలో ఏదో ఉత్సాహంవుంది. నళినాక్షుకు వంట గదిలో ఇవాళ కొత్త అమ్మాయిచేరిన విషయం తెలియదనీ ఆమె వుద్దేశ్యం. అతను ఎన్నాళ్ళనుంచో వంటమనిషిని పెట్టుకోమని తల్లితో చెబుతున్నాడు. కాని ఆమె సాచివేస్తూ వచ్చింది. ఇవాళ కొత్తముఖం కనిపించడంతో నళినాక్ష సంతృప్తిపడ్డాడు. దీన్ని అతను ప్రత్యేక విషయంగా తీసుకోలేదు. రుచులతో నిమిత్తం లేకపోయినా "వంటబ్రహ్మాండంగా వుంది'' అన్నాడు.

ఈ పొగడ్తకు ఆగలేక కమల పక్కగదిలోకి పరుగెత్తింది. దడదడ లాడుతున్న గుండెలమీద చేతులతో హత్తుకుంది.

భోజనం అయినాక, నళినాక్ష తన గదిలోకి వెళ్ళి చదువుకుంటూ కూర్చున్నాడు. మధ్యాహ్నం క్షేమంకరి కమలనుదగ్గర కూర్చోబెట్టుకుంది. ఆమె తలదువ్వి పాపిడి పిండి నీలతో అలంకరించింది.

"ఆహా! నాకే ఇటువంటి కోడలు దొరికితేనా!'' అను

కుని నిట్టూర్చింది క్షేమంకరి.

ఆరాత్రి ఆమెకు మళ్ళీ జ్వరం తగిలింది నళినాక్ష చాల బాధపడ్డాడు.

"అమ్మా నాతో పాటు మరో ఊరికిపద. ఈ బెనారెస్ నీకు పడలేదు" అన్నాడు తల్లితో.

"జీవితాంతం బెనారెస్‌లోనే గడుపుదామను కుంటు న్నాను. కొత్తచోట ప్రాణాలు వదలడం నాకు ఇష్టంలేదు." అని కొడుక్కు సమాధానంచెప్పి, కమలతో "వెళ్ళు పిల్లా అలా గుమ్మానికి అంటపెట్టుకు నిలుచోకు వెళ్ళి నిద్రపో. మళ్ళీ నేను లేచి తిరిగేదాకా ఇంటిపనంతా నీదేలే. రాత్రి ళ్ళన్నా విశ్రాంతి లేకపోతే ఎలా ? నళిన్, నీవుకూడా వెళ్ళి పడుకో" అంది.

నళినాక్ష వెళ్ళిపోయాక, కమల క్షేమంకరి మంచం దగ్గర కూచుని పాదాలు వత్తసాగింది.

ఆ వృద్ధురాలు ఇలా అంది: "పూర్వజన్మలో ఎప్పుడో నీవు నా తల్లివయి వుంటావు. లేకపోతే ఇప్పుడీ పరిచర్యలన్నీ చేయవు. నా మాటవిని, వెళ్ళిపడుకో" అంటూ ఆమె చాల సేపు కబుర్లు చెప్పింది.

మరునాడు ఇంటిపనంత కమలదే. నళినాక్ష ఉదయం తనగదిలోకి వెళ్ళేసరికి అది శుభ్రంగా ఊడ్చివుంది. పుస్తకా లన్నీ అడ్డంగా పేర్చివున్నాయి. గుడ్డలన్నీ వంకీలకు తగిలించి వున్నాయి. గదిచూడడానికి ఎంతో ముచ్చటగావుంది. అప్పుడే స్నానంచేసి వచ్చిన అతనికి, యీ వాతావరణం ఎంతో ప్రోత్సాహకరంగా వుంది.

కమల పెందరాళే క్షేమంకరి దగ్గరికి, గంగాజలంతో సహా చేరుకుంది. ఆమె కమల పరిశుభ్రతనాన్ని చూచి "ఏమమ్మా! ఒక్కదానివే నదికి వెళ్ళావా ? నేను రాత్రంతా నీకు తోడు ఎవరువస్తారా అని ఆలోచిస్తూవున్నాను. ఒంటరిగా వెళ్ళడం అంటే—"

"రాత్రి మా బాబాయి ఇంటిదగ్గర్నుంచి ఒక నౌకరు నన్ను చూడటానికి వచ్చాడు అతన్ని తీసుకుని వెళ్ళివచ్చాను" అంది కమల.

"అలాగా! మీ పిన్నిగారు నిన్ను గురించి ఆదుర్దా పడి, అతన్ని పంపించిందన్నమాట మంచిదే. అతన్ని ఇక్కడే వుండమను. నీకు పనిలో సాయపడతాడు. ఏడీ అతను వొక నిమిషం నాదగ్గరకు పిలువు !"

కమల ఉమేష్‌ను పిలుచుకువచ్చింది. అతను క్షేమం కరిగి వంగి ప్రణామంచేశాడు. ఉమేష్ వైఖరికూడా ఆమె కెంతో నచ్చింది. అతనుకూడా యీ యింట్లో ఒకడయి పోయాడు.

అతని సహాయంతో కమల యింటిపనంతా తేలిగ్గా ముగించుకోగలిగింది. నళినాక్ష గదిని తానే ఊడుస్తోంది గదిని తానే సర్దుతోంది.

మధ్యాహ్నం ఆమె క్షేమంకరిదగ్గర కూర్చుని ఆమె పాదాలు వొత్తుతూవుండగా హేమాలిని వచ్చింది. ఆమె చేతిలో పుష్పగుచ్ఛం వుంది. ఆమె క్షేమంకరికి ప్రణామం చేసింది.

"రా, హేమా. కూర్చో. ఆనందబాబు కులాసాగా

తిరుగుతున్నారా ?" అనడిగింది క్షేమంకరి.

"నిన్న కలాసాగాలేక. అందుకనే యిక్కడికి రాలేక పోయారు. ఇవాళ కాస్తనయం."

క్షేమంకరి యిక కమలను పరిచయంచేయసాగింది. "నీకు తెలియదనుకుంటాను. నా చిన్నతనంలోనే మా అమ్మ చనిపోయింది. ఇప్పుడు యిన్నాళ్ళ తరువాత ఆమె మళ్ళీ బతికివచ్చి నిన్న రోడ్డుమీద నాకు కనిపించింది. మాఅమ్మ పేరు హరిభగిని. ఇప్పుడు ఆమె పేరు హరిదాసి. నువ్వు ఎప్పుడైనా యింత అందాన్ని చూచావా? నిజంచెప్పు—"

కమల సిగ్గుతో తలవేలాడేసింది. కొంతసేపటికిగాని హేమాలిని ముందు మామూలుగా కూర్చోలేకపోయింది.

హేమాలిని క్షేమంకరిని ఆమె ఆరోగ్యంగురించి అడిగింది: "ఈ వయస్సులో యింకా ఆరోగ్యం ఏమిటి లెద్దూ. అసలు యిన్నాళ్ళూ బతికివుండడమే ఆశ్చర్యం. రాత్రి మళ్ళీ జ్వరం తగిలింది. నేను చిన్నపిల్లగా వున్నప్పుడు పెళ్ళినిగురించి వింటే సిగ్గుతో కుదించుకుపోయేదాన్ని. కాని యీ రోజుల్లో పిల్లలు పెరిగిన విధంవేరు. మీరంతా చదువుకున్నారు. పెళ్ళిళ్ళనుగురించి స్వేచ్ఛగా మాట్లాడుకోగలరు. అన్నట్లు మీ నాన్న నీకు నా ప్రతిపాదన గురించి చెప్పారా ?"

"చెప్పారు" అంది హేమాలిని అవనత దృక్కులతో.

"అయితే నీకు అంత అంగీకారం కాదన్నమాట; ఏమంటే, నువ్వు ఒప్పుకున్నట్లయితే మీ నాన్న వెంటనే నాతోవచ్చి చెప్పివుండేవాడు. నీవు నళినాక్షను ఒక విరాగిగా చూచివుంటావు. అందుచేత అతనితో వివాహంయేమిటి

అనుకుని వుంటావు. హేమా నువ్వు చిన్నపిల్లవుకాదు. బాగా ఆలోచించుకో. నీవీ యింటికోడలుగావస్తే, నేను తృప్తిగా తనువు చాలిస్తాను. నేను కాస్తా దాటిపోతే వా డెప్పుడూ యిక పెళ్ళిచేసుకోడు. ఇలాగే బైరాగిలాతిరుగుతాడు. ఏమిటో చెప్పు, నీకు అభ్యంతరం యేమిటి?"

"ఏమీలేదండీ. వారికి నేను యోగ్యత అయినదానినవుతానా అని ఆలోచిస్తున్నాను" అంది హేమాలిని, యింకా కళ్ళు కిందికి దించుకునే.

క్షేమంకరి వెంటనే ఆమెను తన కౌగిట్లోకి తీసుకుని ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకుంది. వాళ్ళు యీ విషయాన్ని యింతకంటె తర్కించలేదు.

"హరిదాసి. ఈ పూలు తీసుకోమ్మా—" అంటూ క్షేమంకరి అటుతిరిగింది. హరిదాసి అక్కడలేదు. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూవుండగా యెప్పుడో చల్లగా జారుకుంది.

హేమాలిని కాస్సేపు కూచొని వెళ్ళిపోయింది. క్షేమంకరి కొడుకుని పిలిచి "నేనింక యెంతో కాలం వుండను" అంది.

"ఏమిటమ్మా!"

"హేమతో ఇప్పుడే మాట్లాడాను. ఆమె అంగీకరించింది. ఇక నీ విషయం ఏమిటి? మీ యిద్దరికీ వివాహం అయితేగాని నాకు శాంతిలేదు. రాత్రిళ్ళుకూడా నాకు యిదే ఆలోచన!"

"మంచిది, అమ్మా! దీన్నిగురించి పెద్దగా బెంగపెట్టుకోకు. హాయిగా నిద్రపో. నీవు చెప్పినట్లే చేస్తానులే!"

అతను వెళ్ళిపోగానే ఆమె కమలను పిలిచింది. కమల పక్కగదిలోనుంచి వచ్చింది. అప్పుడే చీకటి పడబోతుంది. "ఈ పూలను నీళ్ళలోవుంచి గదుల్లో అమర్చుతల్లీ!" అంటూ ఒక గులాబీ తాను వుంచుకుని తతిమ్మాపూలన్నీ హరిదాసికి యిచ్చింది.

కమల పూలు గుత్తులుగాచేసి నళినాక్ష పడకగదిలో చదువుకునేగదిలో, బీరువాలోవున్న అతని పాత పాదుకలకు అమర్చింది. అతని పాదుకలను పూజించే యోగ్యతకూడా తనకు లేకుండాపోతుందని ఊహించుకుంటే ఆమెకు కన్నీళ్ళు కారుతున్నాయి.

అడుగులచప్పుడు విని కమల అదిరిపడింది. పాదుకల దగ్గర్నుంచీ కదిలి, ఆమె నళినాక్షను చూచింది. గుమ్మంలో నిలుచుని వున్నాడు. ఇక పారిపోగల అవకాశం లేదు. ఆమెకు ఉన్నచోటే మంచులా కరిగిపోతే బాగుండుననిపించింది. కమలను చూడగానే నళినాక్ష గదిలోకిరాకుండా పక్కకు తప్పుకున్నాడు.

కమల వెళ్ళిపోయింతర్వాత నళినాక్ష మళ్ళీ గదిలోకి వచ్చి, యీ అమ్మాయి యిక్కడేంచేస్తుందో చూద్దామనే కుతూహలంతో అలమరతీసి అక్కడ తన పాదుకలకు పూజ జరిగివుండడం గమనించాడు. తలుపుమూసి కిటికీవంక చూచాడు. ఆకాశంవైపు చూస్తూవుండగానే, సూర్యాస్తమయం అయిపోయింది.

336

# 56

ఇప్పుడు తాను నళినాక్షను వివాహం చేసుకోవడానికి అంగీకారం తెలియపరిచిందికనుక, తాను అదృష్టవంతురాలి నని భావిస్తోంది హేమాలిని. తన పూర్వపు ప్రధానం విచ్చి పోయినట్లేననీ, తన జీవితాన్ని కమ్ముకున్న కారుమేఘాలు విడి పోయినాయనీ అనుకుంటోంది. ఆమెకిప్పుడు చాలా హాయిగా వుంది. మానసికంగా యెంతో శాంతి లభించినట్లయింది.

ఆ సాయంత్రం యింటికివచ్చాక తనలోతను యిలా అనుకుంది: ''అమ్మేగనుక బ్రతికివున్నట్లయితే, యిప్పుడు నేను చెప్పినమాటలు ఆమెచెప్పి ఎంత సంబరపడేది! ఈ విషయం నాన్నగారితో చెప్పడం ఎలా ?''

ఆనందబాబు అలసిపోయానన్న మిషమీద ఆపూట వెంటనే నిద్రపోయాడు. హేమాలిని తన గదిలోకి వెళ్ళింది. తనడైరీలో ఆనాటి అనుభూతిని వ్రాస్తూ చాలసేపు గడిపింది. "మానసికబంధాలన్నీ గడిచాయి. ప్రపంచానికి పనికిరాకుండా పోయాను. దేవుడు నాకు పునర్జన్మ ప్రసాదిస్తాడని నే నెన్నడు అనుకోలేదు. అదృష్టం నన్ను ఆశీర్వదించింది. ఇకనయినా నాజీవితం హాయగా సుఖంగా గడిచిపోవాలని ప్రార్థిస్తున్నాను"

పుస్తకంమూసి తోటలోనికి వెళ్ళింది. అక్కడ చాల సేపు ఆలోచిస్తూ గడిపింది.

మరునాడు మధ్యాహ్నం ఆనందబాబు, హేమాలిని, క్షేమంకరిని దర్శించడానికి వెడదామని సన్నిద్ధమవుతూ వుండగా వారియింటిముందు ఒకబగ్గీ ఆగింది. నళినాక్ష నౌకరు

దిగివచ్చి వాళ్ళఅమ్మగారు వచ్చారని చెప్పాడు. ఆనందబాబు క్షేమంకరికి స్వాగతం చెబుతూ "మేం అదృష్టవంతులం" అన్నాడు.

ఆమె లోనికివస్తూ "మీ అమ్మాయిని ఆశీర్వదించి పోదామని వచ్చాను." అంది. ఆనందబాబు ఆమెను లోపల సోఫాలో ఆసీనురాలిని చేసి హేమను పిలిచాడు.

ఆమెవచ్చి ప్రణామంచేసింది.

క్షేమంకరి ఆమెను ఆశీర్వదించి, ఆమె చేతులకు బంగారుగాజులు తొడిగింది.

హేమాలిని మళ్ళీ ఆమెకు ప్రణామంచేసింది. క్షేమంకరి ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దాడింది. హేమాలిని సంతోషంతో ముగ్ధురాలయింది.

"మీరు రేపుమధ్యాహ్నం మా యింటికి భోజనానికి రావాలి" అని చెప్పింది ఆనందబాబుకు.

మర్నాడు ఉదయం తండ్రి, కూతురు తోటలో టీ తాగి కూర్చున్నారు. వాళ్ళు బయలుదేరుదాం అనుకుంటూ వుండగా యింటిముందొక బగ్గీ ఆగింది.

"జోగేన్ వచ్చాడు" అంటూ హేమ గుమ్మందగ్గరకు వెళ్ళింది.

"నీతో యింకెవరన్నా వచ్చారా?" అనడిగింది హేమ.

అతను నవ్వుతూ "నాన్నగారికి పండుగ బహుమానం పట్టుకువచ్చాను."

ఈ సమయంలో రమేష్ బగ్గీలోంచి దిగాడు. అతన్ని చూడడంతోటే హేమ గిరుక వెనక్కు తిరిగి లోనికి

పోబోయింది.

"వెళ్ళకు హేమా! నేను నీ కో విషయం చెప్పాలి" అన్నాడు జోగేంద్ర. అయినా ఆమె ఆగలేదు.

రమేష్ ఒకటిరెండు క్షణాలు ఆమె ననుసరించడమా, ఆగిపోవడమా అని ఆలోచించాడు.

"రా, రమేష్. నాన్నగారు యీ పక్కనే వున్నారు" అంటూ జోగేంద్ర అతన్ని తీసుకుని ఆనందబాబు దగ్గరకు వెళ్ళాడు.

ఆనందబాబు రమేష్‌నుచూచి తన కళ్ళను తాను నమ్మలేకపోయినాడు. తలగోక్కుంటూ హేమ వివాహానికి మరో అడ్డంకి అనుకున్నాడు మనసులో.

రమేష్ ఆయనకు నమస్కారం చేశాడు. ఇద్దరూ కూర్చున్నాక ఆనందబాబు జోగేన్‌తో "నువ్వు సమయానికే వచ్చావు. ఇంకా టెలిగ్రాం యిచ్చి నిన్ను పిలిపించాలను కుంటున్నాను" అన్నాడు.

"ఏమిటంత తొందర ?"

"హేమకు, నళినాక్షుకు వివాహం నిశ్చయించాం. అతని తల్లి నిన్న వచ్చి పిల్లను ఆశీర్వదించి వెళ్ళింది."

"అయితే అదే ప్రధానం అంటారా ? నన్ను సంప్ర దించనవసరం లేదా ?"

"నీ ఉద్దేశం నాకు అర్థంకాదు నాకు నళినాక్ష అంటే ఎవరో తెలియనప్పటినుంచీ, నువ్వు వివాహాన్ని గురించి పని చేశావుగా !"

"కావచ్చు. అవునని అంగీకరిస్తాను. కాని నేను

చెప్పాల్సింది చాలా వుంది. ముందు నా మాట విని, ఆ తరు వాత మీకు ఉచితమని తోచినట్లు చేయండి—"

"తీరుబడి దొరకాక ఎప్పుడన్నా వింటాలే. ఇప్పుడు బయటికి వెళ్ళాలి."

"ఎక్కడికి ?"

"నళినాక్ష తల్లిగారు, ఈవేళ నన్ను, హేమను భోజ నానికి పిలిచారు. మీరిద్దరూ యిక్కడే భోజనంచేయండి. అయితే—"

"మా భోజనానికేం లెండి. బోలెడన్ని హోటళ్ళు న్నాయి. మీరు సాయంత్రానికి వచ్చేస్తారుగా. అప్పుడు మాట్లాడుకుందాం—"

ఆనందబాబు రమేష్‌వంక చూడలేకపోతున్నాడు. అతనితో మాట్లాడలేకపోతున్నాడు.

రమేష్ కూడా యేమీ పలకరించలేదు. నిశ్శబ్దంగా కూర్చుని, వెళ్ళిపోయేటప్పుడుమటుకు వంగి నమస్కారం చేశాడు.

# 57

అంతకు ముందురోజు క్షేమంకరి కమలతో "నేను రేపు హేమాలినిని వాళ్ళ నాన్నను భోజనానికి పిలిచాను. వాళ్ళకేం వంటకాలు చేద్దాం? మన విందుతో ఆనందబాబుకు మన అంతస్తేమిటో తెలిసిరావాలి! వంట వచ్చిన దానివి నువ్వు వుండడం నాకు ఎంతో లాభంగావుంది...ఏం, అలా నీరసంగా వున్నావేం ! కులాసాగా లేదా ?" అంది.

"బాగానే వున్నాను" అంది కమల బలవంతాన నవ్వు తెచ్చుకుంటూ.

క్షేమంకరి తలఊపింది. "నీవేదో విచారంతో బాధ పడుతున్నావనిపిస్తోంది. నాకు చెప్పటానికి భయమెందుకు? నన్ను కొత్తమనిషిలా భావించకు. నీ ఆప్తురాలిని నేను. నీవు నాకు కూతురుతో సమానం. ఇక్కడ నీకు ఇష్టంలేనిదని ఏమన్నా జరుగుతూవుంటే నాకు చెప్పు. లేక నీ బంధువుల నెవరినన్న చూడాలని వుందా?"

"మీ సేవలో తరించడం తప్ప నాకింకేమీ కోరికలు లేవు" అంది కమల అమాయకంగా. క్షేమంకరి యీ జవాబు విని విపించికోనట్లుగా "పోనీ మీ బాబాయి ఊరికి వెళ్ళి కొన్ని రోజులువుండిరా" అంది.

"అమ్మా! మీదగ్గర వున్నన్నాళ్ళూ నాకు ఇంకెవరినీ చూడాలని అనిపించదు. నేనేదన్నా తప్పుచేస్తే నన్ను శిక్షించండి. అంతేకాని నన్ను మీకు దూరంగా పంపకండి"

క్షేమంకరి ఆమె చెక్కిళ్ళను ముద్దాడింది. "అందు కనే నీవు నా తల్లివనిపిస్తుంది నాకు. లేకపోతే ప్రథమవీక్షణం లోనే మనకు ఎందుకింత సన్నిహితత్వం ఏర్పడుతుంది? వెళ్ళి పడుకో అమ్మాయ్"

కమల తన పడకగదికి వెళ్ళింది. తలుపు గడియవేసు కుంది. చీకట్లో నేలమీద కూర్చుని ఆలోచనల్లో మునిగి పోయింది. చాలసేపు ఆలోచించినమీదట ఆమెకు యీ సారం మిగిలింది: "దైవం వేరుగా తలచినప్పుడు, నాకు ఇక ఆయన్ను కనిపెట్టుకువుండే మార్గం లేదు. నేనాయన్ను పూర్తిగా మరచి

పోవాలి. మధ్యమధ్య యేమయినా చిన్న సేవలు చేయడం తప్ప, ఇంతకంటె నేనేం నోచుకోలేదు. దేవుడు నాకీ సేవలు చేయడానికి శక్తిని ప్రసాదించుగాక!"

ఇలా తన పరిస్థితిని సమాలోచించుకున్న తరువాత ఆమె యీ క్రింది నిశ్చయానికి వచ్చింది!'' రేపటినుండి నేనింక విచారభావాన్ని కలుగజేసుకోను. ఎప్పుడూ అసౌఖ్యంగా కనిపించను. నేను పొందలేని వాటికోసం నిట్టూర్పులు విడవను. జీవితమంతా సేవచేస్తూవుంటాను. అంతకంటె జీవితంలో ఇంకేమీ ఎక్కువ అడగను."

ఆమె నిద్రపోయింది. ఆ రాత్రి, మధ్యలో రెండు మూడుసార్లు లేచింది. ప్రతిసారీ తన నిశ్చయాన్ని పునశ్చరణ చేసుకుంది.

తెల్లవారుజామునే హడావడిగా యింటిపనిలో మునిగి పోయింది. నళినాక్షుగది ఊడ్చింది. తరువాత గంగానదికి స్నానానికి బయలుదేరింది.

తల్లి యెన్నోసార్లు చెప్పినమీదట నళినాక్షు సూర్యోదయం కాకముందే స్నానంచేయడం మానివేశాడు. ఉమేష్ కమలకు తోడు వెళ్ళాడు.

కమల తిరిగివచ్చి క్షేమంకరికి నవ్వు మొగంతో ప్రభాతవందనం చేసింది.

ఆమెకూడా అప్పుడే నదికి వెళ్ళబోతోంది. ''అంత తొందరగా యెందుకు వెళ్ళావు. నేనూ వచ్చేదాన్నిగా!'' అంది.

"ఇవాళ నింపాదిగా ఎలా కూర్చుంటాను. బోలెడంత

పని వుంది. కూరగాయలు తరగాలి. యింకా సరుకు లేమన్నా కావలసివస్తే, ఉమేష్‌ను బజారుకు పంపాలి—"

"నీకు బోలెడంత అనుభవం వున్నట్లు మాట్లాడుతున్నావు. ఏమయినా యివాళ మన అతిథికి మృష్టాన్న భోజనం!''

నళినాక్ష అక్కడికి రావడంతో కమల లోపలకు వెళ్ళిపోయింది.

''అప్పుడే స్నానానికి వెడుతున్నావా అమ్మా! మరో వారంరోజులదాకా ఆగితే ఆరోగ్యానికి మంచిదని చెప్పాను గదూ?''

''నువ్వు డాక్టరువన్న విషయం మరిచిపో. అన్ని రోగాలకూ గంగాస్నానం ఒకటేమందు. ఇవాళ బయటకు వెడుతున్నావా? తొందరగా యింటికి రా'' అంది.

''ఏం విశేషం!''

''నిన్న చెప్పడం మరిచిపోయాను. ఇవాళ ఆనంద బాబు నిన్ను ఆశీర్వదించటానికి వస్తున్నారు!''

''నన్ను ఆశీర్వదించడానికా? ఏమాకరుణ? రోజూ కనిపిస్తూనేవున్నాగా!''

''నిన్న నేను అక్కడికి వెళ్ళి, హేమను ఆశీర్వదించి ఆమెకు గాజులజత బహూకరించాను. అందుకని ఆనంద బాబు యివాళ వస్తున్నాడు. సరే, ఆలస్యంచేయకు. సరీగ్గా భోజనంవేళకు వచ్చేయి'' అంటూ ఆమె స్నానార్థం వెళ్ళిపోయింది.

నళినాక్ష తలవంచుకుని ఆలోచిస్తూ వెళ్ళిపోయినాడు.

# 58

రమేష్ కనపడగానే పారిపోయి, హేమాలిని తనగది లోకి వెళ్ళికూర్చుంది. ఆమెను సిగ్గు ఆవరించింది. "నేను రమేష్‌ను కలుసుకోలేను. అనుకోని విషయాలు జరిగినప్పుడు, నేనేమంత విచారం ప్రకటించాను ! ఉద్రేకాన్ని అణుచుకోవడానికి నా శక్తంతా ఖర్చయిపోతోంది. ఇటువంటి అస్థిరతలోని కెప్పుడూ అడుగు పెట్టగూడదు" అనుకుని ఆమె పక్కమీదనుంచి లేచి తలుపుతీసి రమేష్‌బాబుకోసం వెళ్ళింది. "ఈసారి నేను పారిపోను. నా ఉద్రేకాలను అణుచుకుంటాను" అనుకుంది.

కాని మళ్ళీ ఆకస్మికంగా యేదో జ్ఞాపకంవచ్చి తనగది లోకి వెళ్ళిపోయింది. క్షేమంకరి బహూకరించిన బంగారు గాజులు ధరించి, ధైర్యంగా తలఎత్తుకుని తోటవైపు నడిచింది.

తండ్రి కనిపించాడు.

"ఎక్కడికి వెళ్ళావమ్మాయ్ !" అన్నాడు.

"ఏమిటిది ? రమేష్‌బాబు యేడీ ? జోగేంద్ర ఏమయ్యాడు ?"

"వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు."

—ఇప్పుడు తన ఆత్మనిగ్రహం పరీక్షకు నిలబడనవసరంలేదు గనుక హేమాలిని కొంత ఉపశాంతి పొందింది.

"సరే, యిప్పుడు—"

"అవున్నాన్నా. నేను మీతో వస్తాను. ఎక్కువసేపు

స్నానం చేయను. మీరింతలో బగ్గీకోసం పంపండి.''

హేమాలిని యిలా తొందరపడడం చూచి ఆనంద బాబుకు మళ్ళీ యిదేమిటోనన్న చికాకు కలుగుతోంది.

''అప్పుడే యేం తొందర?'' అవడంతో ఆమె తోటలో కాసేపు తిరుగాడుదామని భావించింది.

పదిన్నర గంటలకు క్షేమంకరి యింటికి చేరుకున్నారు. డాక్టర్ యింకా యింటికి రాలేదు. అందుచేత అతిథులకు స్వాగతం చెప్పవలసినబాధ్యతకూడా క్షేమంకరిమీదే పడింది. ఆనందబాబుతో ఆయన ఆరోగ్యాన్ని గురించి, కుటుంబాన్ని గురించిసంభాషణలోకి దిగింది. హేమాలిని మామూలుకంటే అందంగా కులాసాగా కనిపించకపోవడంతో క్షేమంకరికూడా ఆశ్చర్యపోయింది.

''చాలామంది ఆడపిల్లలు కలినాక్షు భర్తగా దొరకడం అంటే సంబరపడతారు. కాని యీ అమ్మాయి చదువు కున్నది గనుక తను అతనికి దొరకడమే అదృష్టంగా భావి స్తున్నదేమో!'' అనుకుంది క్షేమంకరి. చివరకు ఆమె ''వివాహానికి తొందరపడవలసిన అవసరంలేదు. వాళ్ళిద్దరూ పెద్దవాళ్ళు. బుద్ధిమంతులు. ఏది ఎలాచేస్తే బాగుంటుందో ఆలోచించుకోగలరు'' అనుకుంది కూడాను.

క్షేమంకరి యింటికి చేరుకున్న లగాయితు హేమాలి నికి భావి జీవితమంతా చాపలా ముందుపరుచుకున్నట్లు దృశ్యం కనిపించసాగింది.

క్షేమంకరి తన కుమారుడినిగురించి, చెబుతోనేవుంది. విన్నవాళ్ళముఖాలు ఎలామారుతున్నాయా అని గమనిస్తోంది.

వంట యేమాత్రం అయిందో చూడాలని లోపలికి వెళ్ళింది. ఆమె వుద్దేశ్యం యేమిటంటే, హేమాలినిని కమలకు వప్పగిస్తే, తామిద్దరూ పెద్దవాళ్ళు. అత్యవసర విషయాలు మాట్లాడుకోవచ్చు.

వంటఅయిపోయింది. కమల గదిలో ఒకమూల ఆలోచిస్తూ కూర్చునివుంది. క్షేమంకరి తలవనితలంపుగా రావడంతో ఆమె అదిరిపడి లేచి నిలుచుని ముఖంమీదికి బలవంతంగా నవ్వు తెప్పించుకుంది.

"వంటంతా అయిపోతే యింకా యిక్కడే కూర్చున్నావేం ఆనందబాబు వృద్ధుడు ఆయనదగ్గర నువ్వు సిగ్గుపడనవసరంలేదు. పోతే హేమాలిని చిన్నదేగదా! ఆమెను నీగదికి తీసుకువెళ్ళి కులాసాగా కాలక్షేపం చేయి"

"కాని ఆమెతో నేనేం మాట్లాడగలను? ఆమె బాగా చదువుకున్నది! నాకేమీ తెలీదు."

"ఏమిటే నువ్వనేది? అంతా చదువుకున్నవాళ్ళే. పద పద ముందు దుస్తులు మార్చుకుని హేమాలినిదగ్గరకు వెళ్లు-"

హేమాలిని చెరిగిపోయిన అందాన్ని, యీ చదువురాని పిల్ల అందంతో సరిపోల్చి చూడసాగింది. క్షేమంకరి హేమ అహంభావాన్ని తగ్గించి వేయాలనుకుంది.

కమలకు క్రీమ్ రంగు సిల్కుచీర కట్టింది. సరికొత్త ఫాషన్‌లో జడవేసింది. అలంకారం అయ్యాక, చెక్కిళ్ళు ముద్దుపెట్టుకుని "నీకు రాణీకి సరిపోయే అందంవుంది" అంది.

"అమ్మా! వాళ్ళు వంటరిగాకూర్చున్నారు" అంటూవుంది కమల మధ్య మధ్య.

"ఫరవాలేదు, ముందు నీపోకు అవనీ !"

కమల చేయిపట్టుకుని "నాతోరా. నీవేం సిగ్గుపడక్కర్లేదు. కాలేజీ అమ్మాయి నీఅందాన్ని చూచి సిగ్గుపడాల్సిందే. తల పైకెత్తుకు కూర్చో—" అంటూ అతిథుల గదివైపు తీసుకువెళ్ళింది. నళినాక్ష అప్పటికి వచ్చి, వారితో సంభాషిస్తున్నాడు. అతన్ని చూడడంతోనే కమల వెనక్కు పోవడానికి ప్రయత్నించింది. క్షేమంకరి ఆమెను గట్టిగా పట్టుకుంది.

కమల ఇలా రావడం, వారందరికీ ఆశ్చర్యం అనిపించింది. హేమాలిని ఆమెనుచూచి విభ్రాంతపోయింది.

క్షేమంకరి తాను జయించాననుకుంది. కమలతో "హేమను నీగదికి తీసుకువెళ్ళు. మీరిద్దరూ మాట్లాడుకొంటూ కూర్చోండి. నేను భోజనం ఏర్పాట్లు చేస్తాను—" అంది.

గదిలోకి వెడుతూండగా కమల నరాలు వణికాయి.

"నిన్ను గురించి అమ్మగారు అన్నీ చెప్పారు. నన్ను నీ సోదరిగా భావించాలి. నీకు స్వంత అక్కచెల్లెళ్లు ఎవరన్నా వున్నారా ?" అంది హేమ మెల్లిగా.

"లేరు. కాని మా బాబాయి కూతురువుంది" అంది కమల హేమ గొంతులోని స్నేహ సౌహార్ద్రతకు ఉత్సాహపడుతూ.

"నాకూ చెల్లెళ్ళు లేరు. నా చిన్నతంలోనే మా అమ్మ చనిపోయింది—"అంటూ హేమాలిని తననుగురించి చెప్పుకబోతుంది.

"నేను తెలివితక్కువ మొద్దుని. నేనంటే నీకు యిష్టమేనా, అక్కా !" అంది కమల.

హేమ నవ్వింది. "నేనూ మొద్దునే, కాకపోతే కొన్ని పుస్తకాలు చదువుకున్నాను అంతే!" అంది.

ఇలా వాళ్ళిద్దరూ చాలసేపు సంభాషించుకుని పరమ మిత్రులయిపోయారు.

# 59

హేమాలిని క్షేమంకరి యింటినుండి తిరిగివచ్చినప్పుడు, ఆమె బల్లమీద పెద్దకవరు వుండటం గమనించింది. దస్తూరిని బట్టి అది రమేష్‌నుంచి వచ్చిందని తెలుసుకొంది. ఆమె గుండె తీవ్రంగా కొట్టుకుంటూంది. పడకగదికి వెళ్ళి, తలుపు మూసుకుని, ఉత్తరం పొంతం చదివింది

రమేష్ కమలతో తన సంబంధ బాంధవ్యాలను గురించి సవివరంగా వ్రాశాడు. చివరకి యిలా వ్రాశాడు: "స్వర్గం నీ జీవితాన్ని, నా జీవితాన్ని ముడివేసినాయి. విధి, పరిస్థితులు యీ ముడిని మరింత గట్టిచేశాయి ఇప్పుడు నీవు హృదయాన్ని మరొకరికో దత్తంచేశావు అందుకు నేనేం తప్పు పట్టను. కమల, నేను భార్యాభర్తలుగా ఒక రోజుకూడా గడపకపోయినా, నేను ఆమె అందచందాలకు ఆకర్షితుడై పోయాను. ఇప్పుడు నా భావనల రీతే నాకు అర్థం కావడం లేదు నన్నింకా మర్చిపోవనే భావనతో నీ దగ్గరికి వచ్చాను. కాని నీవు ముఖంచాటు చేశావు మరొకరిని వివాహానికి అంగీకరించారనికూడా విన్నాను.

"కమలను నేను మరిచిపోలేను. అయినా ఆ జ్ఞాపకాలతో నేను తప్ప యింకెవరూ బాధపడను. నేను మటుకు

ఎందుకు బాధపడాలి ! నా హృదయంలో స్థానం యేర్పరచుకున్న యిద్దరు యువతులను నే నెందుకు మరవాలి ?

"సరే నీ దగ్గర ఇప్పటికి సెలవు తీసుకుంటున్నాను: నీకు సుఖసంతోషాలు కలగాలని కోరుకుంటున్నాను. నన్ను గురించి కష్టపెట్టుకోకు—"

హేమమాలిని అకస్మాత్తుగా వచ్చేసరికి, ఆనందబాబు చదువుకు అంతరాయం కలిగింది.

"ఏం. హేమా ?"

"రమేష్‌బాబునుంచి ఉత్తరం వచ్చింది. ఇదుగో చదివి మళ్లీ నాకే యివ్వు—" అంటూ ఉత్తరం అందించి ఆమె తనగదిలోకి తుర్రుమంది.

ఆనందబాబు రెండుమార్లు చదివాడు.

"సరే ఫరవాలేదు. నళినాక్ష రమేష్‌కంటె తీసిపోయినవాడుకాడు. రమేష్ యిప్పటికయినా అదృశ్యమవడం మంచిదే !" అనుకున్నాడు.

మరుక్షణంలోనే నళినాక్ష వచ్చాడు. ఇతనెందుకు వచ్చాడా అని ఆనందబాబు ఆశ్చర్యపోయాడు. నళినాక్షకి నిజంగా తన హేమను ప్రేమిస్తున్నాడనుకుని, మనసులో మురిసిపోయాడు.

"ఆనందబాబు, నేను మీ అమ్మాయిని వివాహం చేసుకునేముందు, మీతో ఒక విషయం చెప్పవలసివుంది-"

"చెప్పు—"

"నాకు యింతకుముందే వివాహం అయిందని మీకు తెలీదు—"

"నాకు తెలుసు- కాని—"

"మీకు ముందే తెలుసా, ఆశ్చర్యంగావుంది. కాని నా ప్రథమ కళత్రం చనిపోయిందని మీరు భావించుకు వుంటారు. అది నిజం కాకపోవచ్చు. ఆమె యింకా జీవించే వుండివుంటుందని నా విశ్వాసం."

"నీ విశ్వాసం నిజం కావాలని ప్రార్థిస్తున్నాను. హేమా!... హేమా"

"ఏం, నాన్నగారూ!" అంటూ హేమ గదిలోకి వచ్చింది.

"ఎమేష్ నీకు వ్రాసిన వుత్తరంలో కొంతవిషయం—"

హేమాలిని ఉత్తరాన్ని నళినాక్షుకు అందించింది. "ఈ విషయాలు ఆయనకూడా తెలియడం మంచిది" అంటూ, తన గదిలోకి వెళ్ళిపోయింది.

నళినాక్ష ఉత్తరమంతా చదివాడు.

ఆశ్చర్యంలో మునిగిపోయి మాట్లాడలేక పోయాడు. ఒక్క వ్యాఖ్యానమన్నా యివ్వలేక పోయాడు.

"అది విషాదగాథ! ఉత్తరం చదవడం బాధగానే వుంటుంది. కాని యీ విషయం నీదగ్గర దాచడం మంచిది కాదనుకున్నాం" అన్నాడు ఆనందబాబు.

ఒకక్షణం నిశ్శబ్దంగా గడిపి వెళ్ళిపోయాడు నళినాక్ష. అతని మనసులో అనేక ఆలోచనలు ముసురు కున్నాయి.

అతను వెళ్ళగానే జోగేంద్ర వచ్చాడు.

"ఒంటరిగా వచ్చావేం? అన్నాడు తండ్రి.

"కూడా ఎవరు వస్తారు?"

"రమేష్ లేడూ ?"

''పొద్దున్న వచ్చాడు. మనంయిచ్చిన స్వాగతం చాలక మళ్లీ వస్తాడా ? సరే... నాకూ్కడా సమయం అయిపోయింది వెళ్ళిపోవాలి.''

"మరి హేమ విషయం యేమిటి ? మనం యేదో నిర్ణయించాలిగా''

''నేనేంచేయను ! నేనేం చేసినా మీ యిద్దరూ ప్రయత్నించి అందుకు వ్యతిరేకంగా చేస్తూ వచ్చారుగా. నన్నిక యీ గొడవలోనికి లాగకండి. నేను ఉదయం రైలులో వెళ్ళిపోతాను. దారిలో చాకీపూర్‌లో దిగాలి'' అంటూ అతను గదిలోంచి వెళ్ళాడు. ఆనందబాబు నెత్తిగోక్కోవడం తప్ప యింకేం చేయలేకపోయాడు. ఆయన మళ్లీ సమస్యల ప్రపంచంలో యిరుక్కుపోయాడు.

## 60

ఒకటి రెండురోజులు గడిచాక శైలజ ఆమె తండ్రి నళినాక్షుయింటికి వచ్చారు. శైల కమల పక్కగదిలో మాట్లాడుకుంటూ కూర్చున్నారు. బాబాయి క్షేమంకరితో ముందుగదిలో మాట్లాడుతున్నాడు.

"నా సెలవు అయిపోయింది. నేను ఘజీపూర్ వెళ్ళిపోవాలి. హరివాసి మీ కేమయినా చికాకు కలగిస్తే—"

''ఆమాటే అనవద్దన్నాను. మీ మేనగోడలను తీసుకు వెళ్ళటానికి, యిదో సాకా యేం ?

"అదికాదు. మీకు కానుకగా యిచ్చాక తీసుకు

వెళ్ళడం అనే ప్రశ్నే లేదు. మీకు యేమయినా యిబ్బంది-"

"మరేమీ యిబ్బంది లేదు. హరిదాసి యింటెడుపనీ ఒక్కత్తే చేసుకుపోతుంది అలాంటి మనిషితో ఎవరికీ యిబ్బంది రాదు—"

"సరే ఆ విషయం యిక మాట్లాడను. నళిన్ బాబుకు ఇబ్బందేం లేదుకద!"

"వాడికేం ఇబ్బంది? పైగా సంతోషిస్తున్నాడు కూడా?"

"సరే, నా మనసులోని మాట చెబుతాను వినండి. నళినాక్ష వివాహం చేసుకోబోతున్నాడని విన్నాను. ఆమె చదువుకున్న పిల్ల అనికూడా విన్నాను. అప్పుడు హరిదాసి కేమయినా—"

"మీ అనుమానం బాగానేవుంది. కాని ఆ వివాహం జరుగదు!"

"ఏం! ప్రధానం రద్దుచేసుకున్నారా?"

"అసలు ప్రధానమంటూ జరిగితేగా! నళిన్‌కు మొదట్నించీ యిష్టం లేదు. నేనే బలవంతం చేస్తూవచ్చాను. ఇటువంటి విషయాలు రెండోవాళ్ళు రుద్దుతూవుంటే ఏం లాభం లేదు. వాడికి పెళ్ళికాకుండానే నేను చనిపోతానేమో? ఎవరికి తెలుసు దైవసంకల్పం!"

"మీ రలా అనగూడదు. మీ స్నేహితులంతా యేమయినారంటారు! మీకు తగిన కోడలును తీసుకురావాలని నామటుకు నాకే అనిపిస్తోంది!" అంటూ "ఇప్పుడే హరిదాసితో ఒక్క విషయం చెప్పివస్తాను. మీదగ్గరకు శైలను

పంపిస్తాను'' అన్నాడు.

"మీరు ముగ్గురూ కలిసి మాట్లాడుకోండి. నాకు వేరే పనివుంది'' అంది క్షేమంకరి.

చక్రవర్తి చిరునవ్వు నవ్వి "మీలాంటివాళ్ళు యీ యిహలోకంలో వుండడం నాలాంటివాళ్ళ అదృష్టం. నళినాక్ష బాబు పౌరోహితుడికి మిఠాయిలు తయారుచేస్తారనుకుంటాను'' అన్నాడు.

చక్రవర్తి కమల కళ్ళలో కన్నీళ్ళుతిరగడం చూచాడు. తనేమీ మాట్లాడకుండా కుమార్తెపక్కన కూర్చున్నాడు.

తరువాత శైల యిలా చెప్పసాగింది: "నాన్నా, నళినాక్షబాబుకు, హరిదాసికి ఈ కథ యావత్తూ వినిపించ వలసిన సమయం ఆసన్నమైంది.''

''అలా చెప్పడం నాకు యిష్టంలేదే అక్కా'' అన్నది కమల.

తరువాత చక్రవర్తికి, శైలకు యీ క్రింది సంభాషణ జరిగింది.

''నీవు ప్రస్తావిస్తున్న వివాహం తప్పకుండా జరిగే దేనా!'' అన్నాడు చక్రవర్తి.

''తప్పకుండా జరిగితీరుతుంది. నళినాక్ష తల్లి కూడా పెళ్ళికుమార్తెను ఆశీర్వదించింది."

"కాని ఆ ఆశీర్వాదం ఫలించితీరుతుందా ? కమలా, నీవేమీ భయపడకు.''

కమలకు ఆయన మాటల్లోని అంతరార్థం అవగతం కాలేదు విచ్ఛృతనయనాలతో ఆయనవంక చూచింది.

"నళినాక్ష ఈ వివాహానికి వొప్పుకోక పోవడం అలా వుంచి, అతని తల్లికూడా అంగీకరించడం లేదు" అన్నాడు చక్రవర్తి.

శైలజ ఆనందంతో "మనం బ్రతికి పోయాం నాన్న గారూ!" అన్నది.

"రాత్రంతా యీ ఆలోచనలతో నిద్రపట్టలేదు. కాని నన్ను ఒక చిన్న సందేహం బాధిస్తోంది. కమల తనకు స్వంతం కావలసిన గృహంలో అపరిచితంగా కాలం గడప వలసిందేనా? ఈ చిక్కు విడదీయడమెలా?" అంది.

"నీవేమీ బెంగపెట్టుకోకు. పరిస్థితులన్నీ అనుకూలిస్తాయి."

"పరిస్థితులు అనుకూలించవలసిన అవసరంలేదు. ఇప్పు డున్న పరిస్థితులే నాకెంతో ప్రీతికరంగా వున్నాయి. నాదోవన నన్ను తొలగిపోనివ్వండి. నన్ను మరచిపొండి అంత కన్నా నేకోరేదిలేదు" అంది కమల.

ఆమె కళ్ళవెంట కన్నీళ్ళు రాసాగాయి.

చక్రవర్తికి కమలను చూచి జాలికలిగింది. "ఏమి టమ్మా! నీశాంతి కెవరూ భంగం కలిగించరు. నీవేమీ భయ పడకు" అన్నాడు.

ఉమేష్‌కూడా అక్కడికివచ్చాడు. "రమేష్‌బాబు డాక్టరుగారికోసం ఎదురు చూస్తున్నాడు" అన్నాడు.

కమలముఖం వివర్ణమయింది. బాబాయి రమేష్‌ను ఒక పక్కకు తీసుకువెళ్ళి మాట్లాడసాగాడు.

వారు కొంతసేపు సంభాషించుకున్నారు. ఆక్షణంలో

అడుగులచప్పుడు వినిపించి కమలకళ్ళెత్తి చూచింది. నళినాక్ష ద్వారంవద్ద నిలచివున్నాడు. ఇరువురి చూపులు కలిశాయి. ఆ తర్వాత శైలజకూడా అక్కడేవుండడం అతను గమనించాడు. నళినాక్షబాబు వెనక్కు తిరిగి వెళ్ళబోతూవుండగా "వెళ్ళకు. ఈ అమ్మాయి శైల నాకూతురు" అన్నాడు బాబాయి. శైల నళినాక్షబాబుకు అభివందనం చేసింది. బాబాయి. నళినాక్షబాబును కూర్చుండబెట్టాడు. కాని తిరిగి చూచేసరికి కమల కనిపించలేదు. నళినాక్షబాబు చూపులకు చకితురాలయిన కమల తన్ను తాను నిభాయించుకోటానికి ఎక్కడికో వెళ్ళిపోయింది. తరువాత చక్రవర్తి నళినాక్షతో ఇలా చెప్ప సాగాడు: "అబ్బాయి! నీవు హరిదాసిని అపరిచితురాలి లాగ చూడవలసిన అవసరంలేదు. ఈ అనాథ బాలికను నీ యింట్లో నేవుంచుతున్నాను. నీవూ నీతల్లి యీఅమ్మాయిని మీ కుటుంబంలో ఒకవ్యక్తిలా చూచుకోవాలి."

"ఆవిషయాన్ని గురించి మీరేం బెంగపెట్టుకోకండి. హరిదాసి మాయింటి ఆడబడుచే అయింది" అంది క్షేమంకరి.

సమావేశమయిన పెద్దలంతా వెళ్ళిపోయింతర్వాత, నళినాక్ష వంటిగా తనగదిలోకి వెళ్ళాడు. ఉదయకాంతి వఘువులజ్జారునినిమిషలె గదిలోనికి ప్రసరిస్తూవుంది. కమలగదిలో రోజూ పువ్వులు అలంకరిస్తూవుంది. నళినాక్ష ఆ పూలవంక చూచాడు. ఎన్నో నయనాలు తనవంకచూస్తున్నట్లుగా వున్నాయాపూలు. నళినాక్షగదిలో ప్రవేశించగానే, కమల చకితురాలై అక్కడనుంచి వెళ్ళిపోవడానికి ప్రయత్నించింది. కమలవంకచూచి అతను "నాదగ్గరేనా నీకుసిగ్గు" అన్నాడు.

357

# 61

మరునాడు ఉదయం కమల బాబాయి యింటిదగ్గర ప్రత్యక్షం అయింది. శైలజను పక్కకు తీసుకువెళ్ళి ఆమెను గాఢంగా కౌగిలించుకుంది.

"ఇవాళ యింత సుఖంగా, హాయిగా వున్నావేం కమలా ? అంది శైల ఆమెను నిరుముతూ.

"నాకే తెలియదు అక్కా. నా కష్టాలన్నీ తొలగి పోయినాయనిపిస్తోంది'' అంది కమల.

''ఊం. అంతా వివరంగా చెప్పు. నిన్న సాయంత్రం వరకూ కలసేవున్నాంగా. తరువాత యేమయిందో చెప్పు."

''చెప్పదగిందేం లేదు. కాని అతను నావాడు అని పిస్తోంది. దైవం నన్ను యిన్నాళ్ళకు కరుణించారు'' అంది.

"మంచిదే కమలా ! కాని నాదగ్గర దాచడం ఎందుకు ? అంతా చెప్పు"

"నేనేమీ దాచడంలేదు అక్కా. నాకు చెప్పడానికి మాటలు రావడంలేదు, అంతే. ఇవాళ ఉదయం లేచిన దగ్గర్నుంచీ జీవితం నాకో కొత్తతోడుగు తొడిగినట్టుంది. నాకు ఎంతో ఉల్లాసంగా వుంది. పని తేలికగా అనిపించ సాగింది. నాకు యింతకంటే యింకేం అక్కర్లేదు. నా భయ మల్లా ఏమిటంటే, సాధించినదాన్ని తిరిగి పోగొట్టుకుంటా నేమోనని. విధి నా జీవితాన్నంతటినీ సమానంగా సుఖ వంతం చేస్తుందని నాకు నమ్మకం చిక్కడంలేదు."

''నీ అదృష్టం మారింది. ఇంక నిన్నెవ్వరూ మోసం

చేయలేరు. నీకు రావలసిన సుఖమంతా వడ్డీతో సహా వచ్చే స్తుంది'' అని హామీ యిచ్చింది శైలజ.

"నీ వలా అనకూడదు అక్కా. నాకు వడ్డీఅంతా ఇది వరకే ముట్టింది. నా అదృష్టాన్ని నిందించవలసిందేమీ లేదు. అంతకంటే నా క్కావలసిందేమీ లేదు—"

బాబాయి అక్కడికి వచ్చాడు.

''కమలతో. ఒకసారి నాతో రా, తల్లీ. రమేష్‌బాబు వచ్చాడు" అన్నాడు.

రమేష్‌తో బాబాయి యింతవరకూ మాట్లాడుతూ కూర్చున్నాడు.

''నీకు కమలతో వున్న సంబంధాన్నిగురించి యదార్థం నాకు తెలుసు. అందుచేత నా సలహా యేమిటంటే, ఆమెను వదిలేసి కొత్తజీవితం ప్రారంభించమని ! మీరిద్దరూ కొన్నాళ్లు కలిసివున్నందువల్ల యేదయినా సమస్యలు మొలకెత్తితే వాటిని విధికే వదలివేయడం మంచిది ! వాటిని విడదీయడానికి నీ అంతట నువ్వు ప్రయత్నించకూడదు."

రమేష్ యిలా జవాబు చెప్పాడు: "కమలను నా జీవితంలోనుంచి పక్కకు తొలగించడానికి ముందు, నళి నాక్షకు యదార్థమంతా చెప్పాలి. లేకపోతే నాకు సరి కొత్తగా జీవితం ప్రారంభించడం చేతకాదు. ఈ జీవితంలో తిరిగి కమలనుగురించి ఆలోచించడం అవసరంకావచ్చు. అనవసరం కావచ్చు. అవసరం అనిపించినా చెప్పవలసినదంతా చెప్పకుండా నా మనసును ఖాళీ చేసుకోలేను !

"మంచిదే యిక్కడే వేచివుండు. ఒక్క నిమిషంలో

వస్తాను" అన్నాడు బాబాయి.

రమేష్ కిటికీవంక చూస్తూ దారినపోయేవాళ్ళను గమనిస్తున్నాడు. ఇంతలో యేదో అడుగులచప్పుడు వినబడి ముందుకు తిరిగాడు. ఒక యువతి తనకు పాదాభివందనం చేస్తోంది. ఆమె తల పైకెత్తింది. రమేష్ ఆశ్చర్యంగా "కమలా!" అన్నాడు.

అతనిముందు నిశ్శబ్దంగా, అచేతనంగా నిలబడివున్నది సాక్షాత్తు కమలే!

ఆమెతోపాటు వచ్చిన బాబాయి—"రమేష్, కమల దురదృష్టం ఒక అంతుకువచ్చింది. ఇప్పుడు ఆమె అదృష్టం నిర్మలాకాశంలో పరుచుకువుంది. ఆమె పుట్టెడు కష్టాలలో వున్నప్పుడు నువ్వు కాపాడావు. అలాచేసి నీకు నీవే కష్టాలు కొని తెచ్చుకున్నావు. ఇప్పుడు మీరిద్దరూ విడిపోతున్నారు గనుక, ఆమె యిదివరకులా నిశ్శబ్దంగా వుండలేదు. ఆమె నీదగ్గర సెలవుతీసుకుని, నీ ఆశీర్వాదం పొందటానికివచ్చింది" అన్నాడు.

రమేష్ తడబడుతూ, యిలా అన్నాడు: "దేవుడు నిన్ను రక్షిస్తాడు కమలా! తెలిసో, తెలియకో నీకేదయినా తప్పుచేస్తే, నన్ను క్షమించు."

కమలకు నోటమాటరాక గోడకు ఆనుకుని నిలుచుంది.

రమేష్ మళ్ళీ యిలా అన్నాడు: "ఎవరికయినా యేదయినా కబురు చెప్పాలన్నా లేక యే అపార్థానన్నా తొలగించాలంటే, వెంటనే చెప్పు. అలాగేచేస్తాను."

కమల చేతులుకట్టుకు నిలబడి, "ఎవరికీ యేమాటా

చెప్పవద్దని ప్రార్థిస్తున్నాను" అంది.

"చాలాకాలంవరకూ ఎవరికీ నిన్ను గురించి యేమీ చెప్పలేదు. నాకు కష్టంకలుగుతూవున్నా, నిన్నుగురించి నిశ్శబ్దమే అవలంబించాను. కొద్దిరోజుల కిందటనే, నీ కేమీ ప్రమాదంలేదని రూఢిచేసుకున్నాక, నీ కథ అంతా చెప్పాను. అదీ ఒకేఒక కుటుంబంలోని సభ్యులతో. అందువల్ల నీకేమీ భయంలేదు. పైగా లాభంకూడాను! బాబాయికి అన్నీ తెలుసు. తరువాత ఆనందబాబు వున్నాడు—ఆయన కూతురు..."

"హేమాలిని విషయమేనా? వాళ్ళు యీ కథంతా విన్నారా?" అనడిగాడు బాబాయి.

"ఆ! వాళ్ళకు యింకేమన్నా చెప్పవలసివుంటే నాతో చెప్పు, కబురుచేరవేస్తాను. నామటుకు నాకు యింతకంటే యింకేం అక్కరలేదు. నా జీవితంలో యిప్పటికే చాలాభాగం వృథా అయిపోయింది. ఇప్పుడయినా నాకు కావలసింది స్వేచ్ఛ! ఉన్న బాకీలన్నీతీర్చి హాయిగా విశ్రాంతి తీసుకుంటాను."

బాబాయి అతనిచేతిని తనచేతిలోకి తీసుకున్నాడు.

"లేదు, రమేష్‌బాబు. ఇక నీవు చేయవలసిందేమీ లేదు. నీవు చాలాకష్టపడ్డావు. కనీసం యికముందయినా నీ జీవితం స్వేచ్ఛగా సుఖంగా యే యిబ్బందులూ లేకుండా గడచిపోతుంది."

రమేష్ కమలవంక తిరిగి "సరే, యిక నేను సెలవు

తీసుకుంటాను'' అన్నాడు. ఆమె నోరు మెదపలేదు. మళ్ళీ అతనికి పాదాభివందనం చేసింది.

రమేష్ స్వప్నమానసిలాగ రోడ్డుమీద నడుస్తున్నాడు. తనలోతాను యిలా అనుకుంటున్నాడు: ''కమలను కలుసుకోగలిగినందుకు ఎంతో సంతోషంగావుంది. దీనితో కథ సర్వంగా గడిచిపోతుంది ఆమె ఘజీపూర్‌లో ఆ యింటి నుంచి ఎందుకు పారిపోయిందోగాని ఒక విషయంమటుకు నాకు స్పష్టంగా తెలుస్తోంది. అదేమిటంటే యిప్పుడు నేను ఎవరికీ అక్కర్లేదు. నాకుతప్ప నాతో ఎవరికీ యేపనీలేదు. నేనిక ప్రపంచంలో నాయిష్టంవచ్చిన జీవితం సాగిస్తాను. వెనక్కు తిరిగి చూచుకోవలసిన అవసరం నాకేమీలేదు."

# 62

కమల యింటికి వెళ్ళేసరికి ఆనందబాబు, హేమాలిని, క్షేమంకరి ముగ్గురూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"అమ్మో, హరిదాసి—'' అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది క్షేమంకరి.

కమల, హేమాలిని మరోగదిలోకి వెళ్ళారు.

"కమలా! అంటూ హేమాలిని ఆమెను కౌగలించుకుంది. "నాపేరు నీకెలా కనుక్కోగలిగావు?" అని అడిగింది కమల అమాయకంగా.

"ఎవరో నీ చరిత్రంతా నాకు చెప్పారు. నిన్ను చూడగానే కమలేనని అనుకున్నాను. ఉన్న విషయమంతా నీభర్తకు

చెప్పివేయగూడదూ ? ఈ దాపరికం ఎందుకు ?" అన్నది హేమాలిని.

"కథంతా ఆయన కెలా చెప్పడం ?" అంది కమల.

తరువాత హేమాలిని "మనం మళ్ళీ కలుసుకుంటామో లేదో మేం కలకత్తాకు వెడుతూ ఇక్కడికి వచ్చాం" అంది.

"వెళ్ళింతరువాత తప్పకుండా ఉత్తరాలు వ్రాస్తావు కదూ ?" అంది కమల.

హేమాలిని చిరునవ్వు నవ్వింది.

ఆ నాటి ఉదయాన కమల తన హృదయాన్నంతా విప్పి చెప్పినప్పటికీ, హేమాలినిముఖం మటుకు ఎంచేతనో సంకుచితమైనట్లు కనిపించసాగింది.

హేమాలిని గురించి విషయం ఒక్కటిమటుకే కమలకు తెలుసు. అది ఆమె వివాహం నళినాక్షుతో తెగిపోయినదని ! ఆ మధ్యాహ్నం కమల పూలదండలు గుచ్చుతూ వుండగా క్షేమంకరి వచ్చి యిలా అంది: "హేమాలిని వెళ్ళిపోయే టప్పుడు నా హృదయం ఎంతో బాధపడింది. నిజంగా అది మంచిపిల్ల."

ఈ లోగా నళినాక్ష అక్కడికి వచ్చాడు. కమల త్వరత్వరగా పూలదండలు గుప్పిట్లో పట్టుకుని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

"హేమా, ఆనందబాబు వెళ్ళిపోయాను, చూచావా?" అన్నాడు.

కమల వంటరిగా కూర్చుని సుదీర్ఘమైన పూలదండ గుచ్చుతుంది.

పూలదండమీద నీళ్ళుచల్లి నళినాక్షగదిలో వుంచింది. తరువాత తనగదిలోనికి వచ్చి వంటరిగా కూచుని ఆలోచించ సాగింది.

ఎంతసేపు ఆలోచించినా ఆమె ఒక నిశ్చయానికి రాలేకపోయింది. కాని చివర కెలాగో తను మరునటిరోజు తన రహస్యాన్ని చెప్పి హృదయభారం దించుకోవాలని నిశ్చయించుకుంది.

ఆ మరునాడు పెందలకడనే నిద్రలేచి గంగానదిలో స్నానంచేసి వచ్చింది.

ఇంటికిరాగానే నళినాక్షగదిలోకి వెళ్ళింది. నళినాక్ష గదిలోకి ప్రవేశించగానే అతనికి పాదాభివందనంచేసి లేచి నించుని "నేనే కమలను" అన్నది. మెల్లిగా ఆమెచేతులను తనచేతుల్లోకి తీసుకుని "నాకావిషయం తెలుసు. నీవే కమలవు" అన్నాడు. పూలమాలను ఆమె మెడలో వేశాడు.

ఇంటి పనంతా ముగించుకుని కమల తన గదిలో కూర్చుంది. నళినాక్ష పూలు తీసుకునివచ్చాడు. "కమలా!

ఈ పూలు మాలగా గుచ్చు. సాయంకాలం మనం వెళ్ళి తల్లిగారి ఆశీర్వాదం పొందాలి" అన్నాడు.

"మీరు నా కథంతా యింకా వినలేదుగా" అంది కమల.

"ఇక నీవు నాకేమీ చెప్పనవసరంలేదు." అన్నాడు నళినాక్షు.

కమల ముఖాన్ని పైకెత్తి ముసుగు తొలిగించి "నా అమ్మ తన జీవితంలో యెన్నో తప్పులను క్షమించింది. చేయని తప్పు క్షమించడంలో ఆశ్చర్యమేముంది?" అన్నాడు.

సమాప్తం.



మనసు ఫౌండేషన్
పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RSK01316 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 19/06/23 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 369 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | C.I, 365 |
| లేని పేజీలు | లేవు |
| తయారు చేసినది | [illegible] |
| పేజీలు విడదీసినది | Shobha Rani |
| స్కాన్ చేసినది | JYOTHI |
| పరీక్ష చేసినది | [illegible] |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | |
| పరిస్థితి | |